వాసుదేవరావు, చలసాని

# భారత కమ్యూనిస్టు పార్టీ నిర్మాణ చరిత్ర

బెజవాడ, 1943

Record no. 76

Vāsudēvarāvu, Calasāni

Bhārata Kamyūnisṭu pārṭī nirmāṇa caritra

Bejavāḍa, 1943

Record no. 76

## Bibliographic Record Target

వాసుదేవరావు, చలసాని

భారత కమ్యూనిస్టు పార్టీ నిర్మాణ చరిత్ర / చలసాని వాసుదేవరావు. - బెజవాడ : ప్రజాశక్తి కార్యాలయం, 1943.

(1), iii, ii, 205 p. :port. ; 18 cm.

Record no. 76

Vāsudēvarāvu, Calasāni

Bhārata Kamyūnisṭu pārṭī nirmāṇa caritra / Calasāni Vāsudēvarāvu. - Bejavāḍa : Prajāśakti Kāryālayaṃ, 1943.

(1), iii, ii, 205 p. :port. ; 18 cm.

Record no. 76

# భారత కమ్యూనిస్టు పార్టీ
# నిర్మాణచరిత్ర



చలసాని వాసుదేవరావు



ప్రజాశక్తి కార్యాలయం
గవర్నరుపేట :: బెజవాడ

# పరిచయము

★

ఈ గ్రంథంలోని మొదటి ఆరుభాగాలు కామ్రేడ్ జి. అధికారి 1941 డిశెంబరులో సెంటరు పార్టీ స్కూలులో భారతకమ్యూనిస్టుపార్టీ నిర్మాణచరిత్రపై ఇచ్చిన వుపన్యాసాల నాధారంగా గొని వ్రాయబడ్డాయి. ఆఖరిభాగం (ఏడవ భాగం) 1942 సెప్టెంబరులో జరిగిన సెంట్రల్‌కమిటీప్లీనం సమావేశంలో కామ్రేడ్ పి. సి. జోషి యిచ్చిన రాజకీయ. నిర్మాణపు రిపోర్టుల నాధారంగా గొని వ్రాయబడింది.

బెజవాడ.<br>1—12—43.

రచయిత:

# విషయసూచిక

# ఉపోద్ఘాతము

స్వాతంత్ర్య వుద్యమమునకు, పార్టీనిర్మాణమునకువున్న సంబంధమును, దాన్ని తీవ్రపరచుటకు పార్టీ యెంతవరకు తోడ్పడినదో తెలుసుకొనేందుకు కమ్యూనిస్టుపార్టీ నిర్మాణచరిత్రను అధ్యయనం చేయడం అవసరం. జాతీయోద్యమాన్ని విప్లవపంథాను సంఘటిత పర్చుటకు యే యే ప్రయత్నాలను మనం పార్టీద్వారా చేయగల్గామో, అవి యెంతవరకు సఫలమైనాయో, ఎచ్చట అపజయం పొందామో, వాటిని తొలగించడానికి తిరిగి యే ప్రయత్నాలు చేశామో మున్నగు పార్టీ సంఘటనా ప్రయత్నాల గూర్చి అధ్యయనం గావించుటే యీ చరిత్రయొక్క ముఖ్యోద్దేశం.

జాతీయోద్యమమును అభివృద్ధి గావించుటకు కమ్యూనిస్టుపార్టీగావించిన ప్రయత్నాలను తెలుసుకోవడమేగాక, తదితర రాజకీయపార్టీలు అందుకు గావించిన ప్రయత్నాలు, అవలంబించిన రాజకీయ పోరాటపద్ధతులు తెలిసున్నప్పుడే కమ్యూనిస్టుపార్టీ రాజకీయ పోరాటపద్ధతులు అన్నిటికంటె ఉత్తమమైనవని తెలుసుకోగలుగుతాం. అందుచేత యీ పుస్తకంలో యితరరాజకీయ పార్టీలగూర్చి గూడ సందర్భానుసారంగా తెలుపబడింది.

జాతీయోద్యమము గత 20 సంవత్సరాలనుండీ విప్లవరూపం దాల్చుటకు ఘాతికావకాశాలున్నప్పటికిని, అలా జరగకపోవడానికి కారణం పార్టీని బలిష్ఠంగా నిర్మింపలేకపోవడమే. ఈ విషయాన్ని స్పష్టపరచడమే యీ పుస్తకంయొక్క వుద్దేశ్యం.

మనదేశంలో పార్టీ పుట్టకముందునుంచీ, జాతీయోద్యమము వుంది. యుద్ధానికిపూర్వం మన దేశంలో మార్క్సిస్టు అభిప్రాయములు ప్రవేశించనేలేదు; పార్టీ నిర్మింపబడకపోయినప్పటికీ యుద్ధ కాలంలో మార్క్సిస్టు అభిప్రాయములు మనదేశానికి రావడం ప్రారంభించాయి. అప్పటినుండీ పార్టీ నిర్మాణచరిత్ర ప్రారంభమౌతుంది. అందుచేత పార్టీ నిర్మాణచరిత్రకు సంబంధించినంతవరకు జాతీయోద్యమ చరిత్రను తెలుసుకోవడం అవసరంగాన యుద్ధంతో అభివృద్ధి అయిన జాతీయోద్యమమును క్లుప్తంగా యీ భాగంలో తెలుసుకుందాం.

## పార్టీ నిర్మాణచరిత్రలో వివిధదశలు

పార్టీ నిర్మాణ చరిత్రను సరిగా అర్థంజేసుకోడానికిగాను యిప్పటివరకూ పార్టీ నిర్మాణచరిత్రను ఐదుభాగాలుగా భాగించవచ్చును :

(1) పార్టీని సరియైన పంథాను నిర్మించుటకు చేయబడ్డ కృషికి పూర్వకాలం (1919-1926). కమ్యూనిస్టు యినిటర్నేషనల్ (కమ్యూనిస్టు అంతర్జాతీయ మహాసభ) 2వ కాంగ్రెసు (1920) కాలములో పార్టీని నిర్మించుటకు చేయబడ్డ ప్రయత్నాలు యీ కాలంలోనే చేయబడ్డాయి. ఈ కాలంలో పార్టీ యేర్పడడానికి పరిపక్వపరిస్థితులు ఉన్నప్పటికిని యమ్ యన్ రాయి, మార్క్సిస్టు వ్యతిరేక దృక్పథంవలన పార్టీ నిర్మింపబడలేదు. అంతేగాకుండా పార్టీనిర్మాణం జరగకుండా అనేక ఆటంకాలు కల్పించాడు. (1919-1926).

(2) పార్టీనిర్మాణంలో ప్రథమదశ (1926 - 1933) కమ్యూనిస్టు అంతర్జాతీయ మహాసభ ఆరవకాంగ్రెసు కాలంలో చేయబడ్డ పార్టీ నిర్మాణప్రయత్నాలు యీ కాలంలో వివరింపబడుతాయి. బ్రిటిషుకమ్యూనిస్టుపార్టీ సహాయంతో (ముఖ్యంగా బెన్ బ్రాడ్లీ, స్ప్రాట్ గారల సహాయంతో) కమ్యూనిస్టు అంతర్జాతీయ మహాసభ 6 వ కాంగ్రెసు రాజకీయ, నిర్మాణపు కార్యక్రమముతో పార్టీని నిర్మించుటకు ప్రయత్నాలు చేయబడ్డాయి. అ. భా. పార్టీ కేంద్రనాయకత్వపు స్వరూపం యేర్పరచడానికి ప్రథమ ప్రయత్నం జరిగింది.

(3) పార్టీ నిర్మాణములో ద్వితీయ దశ (1933-1939) కమ్యూనిస్టు అంతర్జాతీయ మహాసభ 7 వ కాంగ్రెసు కాలంలో పార్టీనిర్మాణ ప్రయత్నాలు యిచ్చట తెలుపబడ్డాయి. పార్టీ కేంద్రనాయకత్వం స్థాపించబడింది. పార్టీకి భారతదేశ వ్యాపితరూపం గలిగింది. పార్టీపాలసీ అన్నిచోట్ల అనుసరింపబడుతూ అన్నిప్రాంతాల్లోను పార్టీ యూనిట్లు (రాష్ట్ర, జిల్లా) యేర్పడ్డాయి.

(4) పార్టీనిర్మాణములో తృతీయ దశ. (1939-1941) సామ్రాజ్యవాదయుద్ధకాలంలో పార్టీ నిర్మాణప్రయత్నాలు యీ భాగంలో తెలుపబడ్డాయి. యుద్ధంద్వారా యేర్పడ్డ విప్లవ పరిస్థితుల కనుగుణ్యంగా పార్టీని పునః నిర్మించి నిజమైన బోల్షివిక్ పార్టీగా తయారుచేయుటకు చేయబడ్డ ప్రయత్నాలు పేర్కొనబడ్డాయి.

(5) ప్రజాయుద్ధకాలంలో పార్టీని ప్రజాపార్టీగా నిర్మించుటకు జరిగినప్రయత్నాలు ఈ భాగంలో యివ్వబడ్డాయి.

# మొదటి భాగం

## పార్టీ నిర్మాణమునకు పూర్వపుచరిత్ర

## (1919 – 1926)

### అప్పటి అంతర్జాతీయ పరిస్థితులు

మొదటి ప్రపంచ యుద్ధానికిపూర్వమే సామ్రాజ్యవాదమునకు రాజకీయ, ఆర్థిక దుస్థితి సంభవించింది. సామ్రాజ్యవాద దేశాలమధ్య వైరుధ్యం హెచ్చయింది: పెట్టుబడిదారులకు, కార్మికులకు వర్గకలహము వృద్ధిఅయింది. ఈ విధంగా ఆంతరంగికముగాను, అంతర్జాతీయముగాను సామ్రాజ్యవాద దేశాలకు గల్గిన వైరుధ్యాల ఫలితంగా ప్రథమ సామ్రాజ్యవాద యుద్ధం సంభవించింది.

సామ్రాజ్యవాద విధానంలోని వైరుధ్యాలను తొలగించడానికి యుద్ధం తేబడినను, అవి తొలగకపోవడమేగాక మరింత తీవ్రమై యుద్ధ ఫలితంగా ప్రపంచమంతటా విప్లవ పరిస్థితులు యేర్పడ్డాయి. తత్ఫలితంగా సామ్రాజ్యవాదపు బలహీన స్థానాలలో కార్మిక విప్లవాలు వచ్చాయి. రష్యాలో కార్మిక విప్లవము విజయమొంది సోవియట్ పరిపాలన యేర్పడింది. జర్మనీ, ఆస్ట్రియా, హంగేరీ, బల్గేరియా వగయిరా యూరప్ దేశాలలోని సామ్రాజ్యవాద ప్రభుత్వాలు కార్మికవిప్లవాలద్వారా పూర్తిగా బలహీనపడ్డాయి. వలసరాజ్యాలలో బ్రహ్మాండమైన, విప్లవకరమైన జాతీయోద్యమాలు చెలరేగాయి. సామ్రాజ్యవాదంయొక్క ఆంతరంగిక వైరుధ్యాలు అంతమొందక, సామ్రాజ్యవాదానికి యీవిధంగా క్రొత్త చిక్కులు యేర్పడ్డాయి; రష్యాలోని సోషలిస్టు ప్రభుత్వము అంతర్జాతీయ విప్లవోద్యమమునకు ఆశాజ్యోతిగా ప్రజ్వరిల్లుతోంది; ప్రపంచ విప్లవోద్యమాన్ని సంఘటితపర్చుటకు, కేంద్రీకృతమొనర్చుటకు 'కమ్యూనిస్టు ఇంటర్ నేషనల్' యేర్పడింది. యుద్ధములో గెలుపొందిన దేశాలమధ్య నూతనసామ్రాజ్యవాద స్పర్థలు బయలుదేరాయి. సామ్రాజ్యవాద దేశాలకు, వలసరాజ్యాలకు మధ్య తీవ్రసంఘర్షణలు, వైరుధ్యాలు యేర్పడ్డాయి. ఈ విధంగా యేర్పడ్డ పరిస్థితులవలన ప్రపంచసామ్రాజ్యవాదము పూర్తిగా బలహీనపడి శాశ్వతమైన దుస్థితి పాలైంది.

## సామ్రాజ్యవాద వైరుధ్యాలు

శాశ్వతదుస్థితికి, సామ్రాజ్యవాదాన్ని గురిచేసిన ప్రధాన సామ్రాజ్యవాద వైరుధ్యాలు యీక్రింది వని లెనిన్ వ్రాశాడు :—

(1) పెట్టుబడిదారుల - కార్మికులమధ్య నున్న వర్గకలహము.

(2) సామ్రాజ్యవాదమునకు - వలసదేశాల ప్రజలకూ మధ్యనున్న వైరుధ్యము.

(3) సామ్రాజ్యవాద దేశాలమధ్యనున్న పరస్పర వైరుధ్యాలు (యీ వైరుధ్యం కేపిటలిస్టు వుత్పత్తి విధానములోవున్న అసమానాభివృద్ధివలన వుదయించుతుంది).

(4) సామ్రాజ్యవాదానికి, సోషలిజానికి (సోవియట్ యూనియన్, ప్రపంచ సోషలిస్టు వుద్యమము) వున్న వైరుధ్యము. యుద్ధకాలంలో సోవియట్ యూనియన్ స్థాపించబడడంతో యీ వైరుధ్యము వచ్చినది. యుద్ధానంతరం సామ్రాజ్యవాద దేశాల విదేశాంగ నీతి యీ వైరుధ్యంపైననే ఆధారపడి నిర్ణయించబడింది. అందుచేత ప్రధాన వైరుధ్యమైనది).

## సోషల్ డెమాక్రటుల ద్రోహం

సోషల్ డెమాక్రటులచే ఆక్రమింపబడ్డ రెండవ అంతర్జాతీయపక్షం ద్రోహానుగావించినను, కమ్యూనిస్టు యింటర్ నేషనల్ యూరపులోని విప్లవోద్యమమునకు నాయకత్వము వహించి, వలస రాజ్యాల ప్రజా వుద్యమాలకు విప్లవ పంథానుచూపెట్టి, అంతర్జాతీయ విప్లవోద్యమాన్ని అభివృద్ధి పరచింది. ఈ సమయంలో రెండవ అంతర్జాతీయపక్షం, దానిపై పెత్తనం వహించిన సోషల్ డెమాక్రటులు కేపిటలిస్టు దేశాలలోను, వలస రాజ్యాలలోను విప్లవాలను అణచుచున్న సామ్రాజ్యవాద ప్రభుత్వములతో, విప్లవ ప్రతీఘాత బూర్జువావర్గంతో చేతులుకలిపి కార్మికులకు, వలస రాజ్యాల ప్రజలకు వ్యతిరేకముగా పనిజేశారు. వలస రాజ్యాలకు స్వాతంత్ర్యము యివ్వాలనేభావమే యీ సోషల్ డెమాక్రటులకు లేదు. వలసదేశాలలోని "అనాగరికత"ను రూపుమాపి, "నాగరికత"ను యేర్పరచుటకు సామ్రాజ్యవాద ప్రభుత్వాలు ప్రయత్నము చేస్తున్నాయనియు, అందుచేత వలస రాజ్యాలు సామ్రాజ్యవాద దేశాలనుండి విడిపోతే "నాగరిక" దేశాలవలె జీవించజాలవని సోషల్ డెమాక్రటుల వాదన. సామ్రాజ్యవాద దేశాలనుండి విడిపోయి, స్వతంత్ర దేశాలుగా యేర్పడుట అసంభవముగాన వలసదేశాలు సామ్రాజ్యవాదదేశాల నంటిపెట్టుకొనేవుండాలని వీరివాదన. ఈ వుద్దేశ్యంతో జాతీయ స్వయంనిర్ణయ హక్కుకొరకు కృషిచేస్తున్న వలసదేశాల స్వాతంత్ర్య వుద్యమాలను వీరు వ్యతిరేకించారు.

ఈ వాదనకు వ్యతిరేకముగా కమ్యూనిస్టు ఇన్ టర్ నేషనల్ విప్లవ పంథాను అనుసరించింది. వలసదేశాల ప్రజావుద్యమాలకు సహాయంచేసి వాటిని అభివృద్ధిచేయవలసిన బాధ్యత కేపిటలిస్టుదేశాలలోని కమ్యూనిస్టు పార్టీలపైన వుందనియు, సామ్రాజ్యవాద దేశాలనుండి వలసరాజ్యాలు విడిపోయి స్వతంత్ర ప్రభుత్వములను స్థాపించుకొనుటకు హక్కు వలస రాజ్యాలకు వున్నదనియు, అట్టి హక్కును కేపిటలిస్టు దేశాలలోని కమ్యూనిస్టులు బలపర్చి, దాని సఫలతకొరకు తమ దేశాలలో ఆందోళన గావించాలనియు కమ్యూనిస్టు ఇంటర్ నేషనల్ స్పష్టంగా చెప్పింది. రెండవ అంతర్జాతీయ



మహాసభ, దాని నాయకులైన సోషల్ డెమాక్రటుల విప్లవ ప్రతీఘాతక పంథాకు వ్యతిరేకంగా నూతన విప్లవమార్గాన్ని కమ్యూనిస్టు ఇంటర్ నేషనల్ యేర్పరచింది.

## ప్రధాన అంతర్జాతీయ ఫలితాలు

ఈ కాలంలో గమనించవలసిన ముఖ్యమైన అంతర్జాతీయ విషయాలు యివి.

1) సామ్రాజ్యవాదము యుద్ధానంతరము శాశ్వతమైన దుస్థితి పాలైంది.

(2) అంతర్జాతీయ కార్మికోద్యమమును, విప్లవ పంథాను నడపుటకు, రెండవ అంతర్జాతీయ పక్షాన్ని సంస్కరణవాద పంథానుండి తొలగించుటకు, వలసరాజ్యాల ప్రజా వుద్యమాలను విప్లవ మార్గమున నడిపించుటకు తగిన అంతర్జాతీయ విప్లవ సంస్థ యేర్పడ్డది. ఈ సంస్థే "మూడవ అంతర్జాతీయ మహాసభ" (కమ్యూనిస్టు యింటర్ నేషనల్).

(3) అక్టోబరు సోషలిస్టు విప్లవ ఫలితంగా రష్యాలో సోవియట్, సోషలిస్టు ప్రభుత్వము యేర్పడింది. ఈ ఒకే ఒక సోషలిస్టు ప్రభుత్వ స్థాపనయే అంతర్జాతీయ విప్లవ ప్రజా పోరాటాలకెంతో విప్లవ వుత్తేజాన్ని గల్గించింది.

(4) వలసరాజ్యాలలోని ప్రజా వుద్యమాలు, నూతన పంథాను, విప్లవపంథాను చేబట్టాయి.

## ఈకాలములో వలసరాజ్యాల ప్రజావుద్యమాలు - కమ్యూనిస్టు యింటర్ నేషనల్ యొక్క కృషి

యుద్ధానంతరం చెలరేగిన వలసరాజ్యాల ప్రజా వుద్యమాలలో నూతన శక మారంభమైంది. ఇదివరలో రెండవ అంతర్జాతీయపక్షం, దానిపై నాయకత్వం వహించిన "సోషల్ డెమాక్రటులు" వలస రాజ్యాల వుద్యమాలయెడల అవలంబించిన వైఖరివలన యుద్ధానికి పూర్వము వలసరాజ్యాల వుద్యమాలు ఆశయం సామ్రాజ్యవాదంతో విప్లవ పోరాటము జరపాలనేంతవరకూ పోలేదు. సామ్రాజ్యవాదము క్రిందనే యేవో కొద్ది స్వపరిపాలనా సంస్కరణలు పొందుటకు మాత్రమే అవి వుద్దేశింపబడ్డాయి. అంతేగాకుండా యుద్ధానికి పూర్వము వలసరాజ్యాలలో బూర్జువావర్గము యొక్క అభివృద్ధి అంతగా లేనందువలన ఆధునిక బూర్జువా ప్రజాతంత్ర విప్లవోద్యమమునకు అవసరమైన భౌతిక పరిస్థితులు (Objective conditions) అంతగా వుదయించలేదు. అందుచేత యుద్ధానికి పూర్వం వలసరాజ్యాల వుద్యమాలు విప్లవ పంథాను లేకపోవడమేగాక ప్రజా వుద్యమాలుగా గూడ లేవు. పట్టణాలలో వుండే యే కొద్దిమంది విద్యావంతులమధ్య, పెట్టీ బూర్జువావర్గములోను మాత్రమే రాజకీయాందోళన చేయబడుచుండేది.

యుద్ధానంతరం యీ పరిస్థితులు మారాయి.

**ఇందుకు కారణాలు**

(1) యుద్ధ ఫలితంగా వలసరాజ్యాలలో పారిశ్రామికాభివృద్ధి గల్గింది. దానితో ఆధునిక బూర్జువావర్గము, ఆధునిక కార్మికవర్గము వుత్పన్నమైనది. యుద్ధానంతరం యీ అభివృద్ధిని సామ్రాజ్యవాదం అరికట్టింది. యుద్ధానంతరం సామ్రాజ్యవాదమునకు కల్గిన ఆర్థిక దుస్థితివలన యుద్ధకాలములో తాత్కాలికముగా వలసరాజ్యాల బూర్జువావర్గములకు యివ్వగల్గిన ఆర్థిక సౌకర్యములను తనకు దుస్థితి రాగానే తొలగించింది. అందుచేత బూర్జువావర్గమునకు, సామ్రాజ్యవాదమునకు పూర్తి వైరుధ్యం పెరిగింది. వలసరాజ్యాల బూర్జువా అభివృద్ధికి, సామ్రాజ్యవాద దేశబూర్జువావర్గ అభివృద్ధికి యెచ్చటా సమన్వయము కుదరలేదు. అందుచేత యీ వైరుధ్యము శాశ్వతమైనది. ఈ వైరుధ్య ఫలితంగా వలసదేశాలలో సామ్రాజ్యవాద ఆర్థిక, రాజకీయ దోపిడీ హెచ్చింది; అన్ని రంగాలలోనూ సామ్రాజ్యవాదుల సర్వాధికారం స్థాపించబడింది. దీనితో అన్ని వర్గాలలోను పూర్తి అసంతృప్తి చెలరేగింది.

(2) సోవియట్ యూనియన్ తన దేశంలోని జాతీయ, వలసరాజ్యాలయెడల అవలంబించిన విప్లవ వైఖరి వలసరాజ్యాలలో యుద్ధానంతరం యేర్పడ్డ ఆందోళనకు అనేక రెట్లు వుత్సాహము కల్గించింది. పూర్వం జార్ చక్రవర్తి క్రిందవున్న వలసరాజ్యాలకు పూర్తి స్వాతంత్ర్య మివ్వడం, జార్ చక్రవర్తి టర్కీతోను, పర్షియా, ఆఫ్గనిస్థానములతో గావించుకున్న దానిస వడంబడికలను రద్దు గావించి, వాటిస్థానే వాటితో స్నేహపూర్వకమైన ఒడంబడికలను గావించుకుని, ఆదేశాలను పీడించుచున్న యితర సామ్రాజ్యవాద దేశాలతో పోరాడుటకు వాటికి ఆర్థిక సహాయం గావించడం - సోవియట్ యూనియన్ యీ విప్లవకర చర్యలవలన ప్రపంచములోని తదితర వలసరాజ్యాలలో అనేక రెట్లు వుత్సాహము ప్రబలింది. ఒకవైపున సోవియట్‌యూనియన్‌లోని వివిధజాతులు పరస్పర వైరుధ్యములులేకుండా పరస్పర స్నేహముతో మెలగడం, నిరంతర ఆర్థిక, రాజకీయాభివృద్ధి పొందడం, మరొకవైపున సామ్రాజ్యవాద దేశాలు- వలసరాజ్యాలమధ్య వైరుధ్యములు, వైషమ్యాలు ప్రబలడం, అల్పసంఖ్యాకులకు, అధికసంఖ్యాకులకు మధ్య నిరంతరం తగాదాలు చెలరేగడం, వలసరాజ్యాల ప్రజలు గ్రహించారు. అందుచేత సోవియట్‌యూనియన్ తనదేశములోని వివిధజాతుల, అల్పసంఖ్యాకుల యెడల అవలంబించిన వైఖరి, వలసరాజ్యాల పీడితప్రజల స్వాతంత్రోద్యమాలకు, నూతన మార్గమును విప్లవోత్తేజమును కల్గించింది.

(3) తన ఆచరణద్వారా సోవియట్ యూనియన్ వలసరాజ్యాల వుద్యమాలకు వుత్సాహమును కల్గించుతుంటే, కమ్యూనిస్టు యిన్‌టర్‌నేషనల్ యీ వుద్యమాలను నూతన విప్లవపంథాను నడిపించుటకు, వాటికి సిద్ధాంత పరిజ్ఞానమును కలుగచేయుటకు, అందులకు తగిన కమ్యూనిస్టు పార్టీలను స్థాపించుటకు తీవ్రకృషిచేసింది. అప్పటివరకు యూరప్‌దేశాల సోషల్ డెమాక్రట్లు వలసరాజ్యాల యెడల అవలంబిస్తున్న సంస్కరణవాద పంథాను వదిలివేసి తద్వ్యతిరేకమైన కమ్యూనిస్టులు అవలంబించే విప్లవపంథాను అవలంబించునట్లు కృషిజేసింది. వలసరాజ్యాలవిప్లవ ప్రజావుద్యమాలను యూరోపియన్ ప్రపంచ సోషలిస్టువుద్యమాలతో సమన్వయపర్చినప్పుడే తప్ప ప్రపంచ సామ్రాజ్యవాదం నాశనంగాదని స్పష్టపర్చింది. వలస రాజ్యాల విప్లవప్రజావుద్యమాలు అభివృద్ధిగానిదే. ప్రపంచసోషలిస్టు విప్లవము విజయమొందదనియు, అందుచేత యూరపులోని విప్లవ కార్మికోద్యమము వలసరాజ్యాల విప్లవ ప్రజావుద్యమాలకు పూర్తిసహాయము చేయాలనియు స్పష్టపర్చింది.



ఈ పై పరిస్థితులవలన వలసరాజ్యాల ప్రజావుద్యమాలలో నూతనశకము ఆరంభమైంది. పట్టణ విద్యావంతులలో మాత్రమే ఇదివరలో జరుపబడుచున్న రాజకీయాందోళన ప్రజలందరిలోనికి ప్రాకింది. వలసరాజ్యాల జాతీయోద్యమాలు నిజమైన ప్రజావుద్యమములుగా మారాయి.

## కమ్యూనిస్టు యిన్‌టర్‌నేషనల్ రెండవకాంగ్రెసు కలోనియల్, నేషనల్ థీసీస్సులు

1920 వ సంవత్సరములో లెనిన్ ఆధ్వర్యముక్రిందనే సమావేశమైన కమ్యూనిస్టు యిన్‌టర్‌నేషనల్ రెండ కాంగ్రెసు, వలసరాజ్యాలలో యుద్ధానంతరం యేర్పడ్డ విప్లవ పరిస్థితులు, విప్లవవుద్యమాలగూర్చియు, పెట్టుబడిదారీ దేశాలలోని కమ్యూనిస్టులు యీ వుద్యమాలయెడల ఏ వైఖరి అవలంబించవలసినదీ స్పష్టపర్చుచూ యొక థీసిస్సును తయారుచేసింది. దీనినే "కలోనియల్ థీసిస్" అంటారు. దీనిలోని ముఖ్యవిషయాలు యివి.

(1) వలసరాజ్యాలలోని ప్రజావుద్యమాలను బూర్జువా ప్రజాతంత్ర విప్లవోద్యమములుగా అభివృద్ధిచేయుటకు తక్షణమే పెట్టుబడిదారీదేశాల కమ్యూనిస్టులు పూనుకోవాలి. వలసరాజ్యాలు సామ్రాజ్యవాదమునుండి పూర్తిగా విడిపోయి స్వతంత్రరాజ్యములుగా యేర్పడేందులకు వలసరాజ్యాలకు హక్కుందనియు, పూర్తియైన రాజకీయ, ఆర్థికాధికారము లుండే సంపూర్ణస్వాతంత్ర్యం వాటికి తక్షణమే యివ్వవలయుననే ఆందోళన తమతమ దేశాలలో వెంటనే ప్రారంభించాలి.

(2) వలసరాజ్యాలలోని బూర్జువావర్గము ఆదేశాలవిప్లవోద్యమములను బలపర్చుతూ వున్నంతవరకు, బూర్జువా ప్రజాతంత్ర హక్కులకొరకు పోరాడుచున్నంతవరకు ఆ వర్గాన్ని ఆయాదేశముల కమ్యూనిస్టులు, కేపిటలిస్టు దేశాలలోని కమ్యూనిస్టులు పూర్తిగా బలపర్చి సహాయంచేయాలి.

(3) వలసరాజ్యాలలోగూడ ప్రత్యేక కమ్యూనిస్టుపార్టీలను (బూర్జువావర్గ రాజకీయ పార్టీలతో యెట్టి సంబంధము లేకుండా) నిర్మించాలి. ఇందులకు వలసరాజ్యాల కార్మికవర్గమునకు, విప్లవకారులకు మార్క్సిస్టు చైతన్యము యేర్పరచుటకు తగిన సహాయం పెట్టుబడిదారీ దేశాల కమ్యూనిస్టులు చేయాలి.

(4) ప్రత్యేక కమ్యూనిస్టు పార్టీలను వలసరాజ్యాలలో ఏర్పరచిననూ, వలసరాజ్యాల బూర్జువా ప్రజాతంత్ర వుద్యమాలను కేవలం కమ్యూనిస్టువుద్యమాలుగా తయారుచేయుటకు కమ్యూనిస్టులు ప్రయత్నించరాదు. బూర్జువాప్రజాతంత్ర విప్లవముయొక్క ఆశయాలను, కోర్కెలనుగడించుటే వలసరాజ్యాల కమ్యూనిస్టు వుద్యమాల ప్రస్తుత ఆశయాలుగా వుండాలి. అప్పుడే ప్రజావుద్యమాన్ని అభివృద్ధి పర్చగలుగుతాయి. దానితోపాటు స్వతంత్ర కమ్యూనిస్టు వుద్యమాన్నిగూడ అభివృద్ధి పర్చగలుగుతాయి. లేకపోయిన కమ్యూనిస్టులు బూర్జువా ప్రజాతంత్ర వుద్యమాలనుండి, ప్రజలనుండి వేరుబడిపోతారు. ఆ వుద్యమాలపై బూర్జువావర్గమునకున్న పలుకుబడి, నాయకత్వం స్థిరపడిపోతాయి.

(5) వలసరాజ్యాలలోని బూర్జువావర్గము అప్పటికే విప్లవ ప్రతీఘాతశక్తిగా తయారై వున్నట్టి దేశాలలోని (చైనాదేశం) కమ్యూనిస్టులు యేవిధంగా ప్రవర్తించాలో పై థీసీస్సుకు యొక సప్లిమెంటరీ థీసీస్సులో వివరింపబడింది.

(6) బూర్జువా ప్రజాతంత్ర విప్లవములో రైతుల సోవియట్లను స్థాపించవలసిన అవసరము గూర్చియు, అవి వహించే విప్లవపాత్రనుగూర్చి వివరింపబడింది. (ప్రథమమునుండే రైతుల సోవియట్లు నేర్పరచవలసినదని దీని అర్థంగాదు. విప్లవమువచ్చినప్పుడు, విప్లవము రానున్న సమయములో వీటిని యేర్పరచవలసిన అవసరమునుగూర్చి తెలియపర్చబడినది.)

## భారతదేశములోని పరిస్థితులు

ఈ అంతర్జాతీయ పరిస్థితులలో భారత దేశ స్థితిగతులను పరిశీలించుదాం. ఇచ్చటగూడ వలస రాజ్యాలన్నిటిలోవలెనే పూర్తి మార్పులు గల్గాయి. యుద్ధకాలములో పారిశ్రామికాభివృద్ధి కల్గింది. బ్రిటిష్ ప్రభుత్వము యుద్ధావసరములకొరకు ఈపారిశ్రామికాభివృద్ధిని కొనసాగనిచ్చింది. ముఖ్యంగా నేతపరిశ్రమ, వుక్కుపరిశ్రమ (కొన్ని యుద్ధపరికరాలను వుత్పత్తి చేసేంతవరకు) లను అభివృద్ధి కానిచ్చింది. విదేశబట్టలపైననూ, యినుము, ఉక్కుపై దిగుమతి పన్నులుచాలరెట్లు అధికంచేసింది.

పారిశ్రామికాభివృద్ధితో ఆధునిక బూర్జువావర్గము, బూర్జువా విజ్ఞానము, సాంఘికాభివృద్ధిగూడ యేర్పడింది. పారిశ్రామిక కార్మికుల సంఖ్య దాదాపు 20 లక్షలవరకూ పెరిగింది. వీటన్నిటితోపాటు రాజకీయోద్యమముగూడ అభివృద్ధి అయింది. కాని రాజకీయాందోళన యింకా ప్రజాసామాన్యములోకి పోలేదు. రాజకీయాందోళన ప్రజా వుద్యమముగాగాక, తీవ్ర ప్రభుత్వ వ్యతిరేక వుద్యమముగాగాక, సక్రమాందోళనగా మాత్రమే జరుపబడుతూవుంది. లిబరల్ బూర్జువావర్గమే రాజకీయ నాయకత్వం వహించివుంది. రాజకీయాందోళన చట్టబద్ధమైన (కాన్స్టిట్యూషనల్) పద్ధతులపైన జరుపుతోంది. బూర్జువావర్గము, రాజకీయ నాయకులు ప్రభుత్వ యుద్ధ ప్రయత్నాలకు సహాయమొనర్చుతున్నారు. యుద్ధ ప్రయత్నాలకు సహాయమొనర్చినందులకు ప్రభుత్వము, యుద్ధానంతరం, సంతృప్తికరమైన (డొమీనియన్ స్టేటస్) రాజకీయ సంస్కరణలు యిస్తుందనే ఆశ అప్పటి బూర్జువావర్గమునకు, రాజకీయ నాయకులకు పూర్తిగావుంది. అందుచేత ప్రభుత్వములో అప్పటి బూర్జువావర్గమునకు పూర్తియైన సంఘర్షణ వుద్భవించలేదు. ప్రజలకు ఆర్థిక కష్టాలు (ఆహారపదార్థాల, యితర వస్తువుల ధరలు హెచ్చుగావడం) హెచ్చిననూ, ప్రభుత్వంపై అసంతృప్తి పెరుగుచున్ననూ, ప్రజలలో తగిన చైతన్యం, సంఘటన లేకపోవడంవలన ప్రజావుద్యమమేమీ బయలుదేరలేదు.

### యుద్ధానంతర పరిస్థితులు

కాని యుద్ధానంతరం పైకి గాన్పించుతూవున్న శాంతి పరిస్థితులు పూర్తిగా తారుమారయ్యాయి. యుద్ధములో తాత్కాలికముగా అభివృద్ధి గాంచిన పారిశ్రామికాభివృద్ధి నిలిచిపోయింది. యుద్ధానంతరం బ్రిటిష్ సామ్రాజ్యము ఆర్థికంగా, పారిశ్రామికముగా ప్రపంచ మార్కెటులో బలహీన పడిపోయింది. ముఖ్యంగా అమెరికాదేశపు పోటీ అన్ని విధాల హెచ్చింది. అందుచేత ప్రపంచ మార్కెటులో



బలహీనపడ్డ తన స్థానాన్ని నిలబెట్టుకోడానికి, తన వలసదేశాల మార్కెటుల ద్వారా ప్రపంచ మార్కెటులో పోగొట్టుకున్న లాభాలను భర్తీచేసుకోవడానికి వలసదేశాలలో ఆర్థిక దోపిడీ హెచ్చుచేయడం ప్రారంభించింది. అందుచేత యుద్ధములో భారతదేశమునకు పారిశ్రామిక రంగంలో తాత్కాలికంగా యొసంగిన ఆర్థిక సౌకర్యములను ఒక్కపెట్టున లాగివేసింది. ముఖ్యంగా యీ క్రింది పారిశ్రామిక ఆర్థిక మార్పులు చేసింది.

(1) విదేశీ గుడ్డలపై దిగుమతి పన్నులను తగ్గించి, స్వదేశీ గుడ్డలపై భారమైన ఎక్సైజ్ పన్నును నూతనంగా విధించింది.

(2) రూపాయి మారకపు రేటును భారతదేశపు వర్తకమునకు హానికరంగా, బ్రిటన్‌కు అనుకూలంగా మార్చింది. (1 షిల్లింగు 4 పెన్నీలనుండి 2 షిల్లింగులవరకు గూడ పెంచింది)

(3) ఉక్కు, ఇనుము పరిశ్రమలకు ప్రభుత్వము యిదివరలో యిచ్చిన "బౌంటీస్" (ఆర్థిక ప్రోత్సాహం) మానివేయడమేగాక, విదేశ ఉక్కు, ఇనుము పరికరాలపై దిగుమతిపన్ను చాలభాగం తగ్గించింది. స్వదేశీ ఇనుము, ఉక్కుపైగూడ ఎక్సైజ్ పన్ను విధించింది.

ఇవిగాక యింకా స్వదేశీ పరిశ్రమలను నాశనముగావించే యితర ఆర్థిక చర్యలను ప్రభుత్వం గైకొంది.

ఈ చర్యలవలన అప్పుడప్పుడే అభివృద్ధి గాంచుతున్న బూర్జువా వర్గమునకు తీరని ఆర్థిక, పారిశ్రామిక దుస్థితి సంభవించింది. ఈ దెబ్బను తట్టుకోలేక అనేకమంది బూర్జువా పరిశ్రమదారులు, ముఖ్యంగా ప్రత్తి పరిశ్రమదారులు దివాళాలు తీశారు. తట్టుకోగల్గిన బూర్జువావర్గం యెంతో నష్టము పాలైంది. ఈ పారిశ్రామిక దుస్థితితో బూర్జువావర్గమునకు ప్రభుత్వముయెడల వున్న విశ్వాసము తొలగి తీవ్ర అసంతృప్తి గల్గింది.

తమకొచ్చిన యీదుస్థితిని తొలగించుటకొరకు భారతదేశ పరిశ్రమదారులు కార్మికులపై దోపిడీని హెచ్చుచేశారు. యుద్ధకాలములో యిచ్చిన యుద్ధ అలవెన్సులను (ధరలు యింకా పూర్తిగా హెచ్చుగానే వున్నప్పటికిని) - వీటినే అప్పుడు "యుద్ధ బోనస్సు"లు అని పిలిచారు - తొలగించారు.

దివాళా అయిన పరిశ్రమలనుండి అనేకమంది పనినుండి తొలగింపబడుటచేత జీవనోపాధిలేక అల్లాడుచున్నారు. ఈ అసంతృప్తివలన కార్మికులలో తీవ్ర సంచలనము గల్గింది. "బోనస్సు సమ్మెలు" అనేకం చేయబడ్డాయి. 1918 వ సంవత్సరమునుండి 1921 వ సంవత్సరమువరకు యీ సమ్మెలు జరుగుతూనే వున్నాయి. 1919 లో బొంబాయి ప్రత్తిమిల్లులలో జరుపబడిన సమ్మెలలో పాల్గొన్న కార్మికుల మొత్తం సంఖ్య లక్షపాతికవేలు. కాన్పూరు, కలకత్తా, రంగూన్, నాగ్‌పూర్, షోలాపూర్, వగైరా ప్రదేశాలలో అనేకవేలమంది కార్మికులు సమ్మెలు గావించారు. టాటా ఉక్కు పరిశ్రమలోగూడ సమ్మెలు జరిగాయి. బొంబాయి ఓడరేవు కార్మికులు, ఇండియన్ నావిగేషన్ కంపెనీ కార్మికులు, నావికులుగూడ యుద్ధ బోనస్సులకొరకు సమ్మెలు గావించారు.

కేవలం ఆర్థిక కోర్కెల కొరకేగాక, రాజకీయ కోర్కెలకొరకుగూడ యీ సమ్మెలు చేయబడ్డాయి. (రౌలట్ చట్టాలు రద్దుగావింపవలయునని బొంబాయిలో కార్మికుల ప్రదర్శనాలు, సమ్మెలు) ఈవిధంగా కార్మికులలో తీవ్ర అసంతృప్తి చెలరేగింది. బూర్జువావర్గమునకు వచ్చిన ఆర్థిక దుస్థితి, తద్వారా బూర్జువావర్గం కార్మికులను అధికంగా దోచుకోవడం, ప్రభుత్వం స్వదేశీ పరిశ్రమల

నాశనముగావించే పద్ధతి అవలంబించడం - యీ చర్యలు భారత దేశంలో పరిశ్రమలను పూర్తిగా స్తంభింపజేశాయి అందుచేత తీవ్ర పారిశ్రామిక దుస్థితి వచ్చింది.

### వ్యవసాయకుల దుస్థితి

యుద్ధానంతరం ఇతర దేశాలకు యెగుమతిచేసే వ్యాపార సంబంధమైన వ్యవసాయ సరుకుల ధరలు పూర్తిగా పడిపోయాయి (మన రాష్ట్రంలో నీలిమందు ధరలు యీకాలములోనే పూర్తిగా మందగించాయి). ఆహారపదార్థాల ధరలు కొంచెము గిరాకీగా యున్నను, పారిశ్రామిక వస్తువుల ధరలు అనేకరెట్లు పెరిగిపోవడంవలన జీవితావసరముల కవసరమైన వస్తువులను కొనుక్కోవడమే దుర్లభమైపోయింది. వ్యవసాయక ఆదాయము తగ్గిపోయింది. అందువలన అప్పులుతీరక పెరిగిపోయాయి. ఋణభారము హెచ్చి, చివరకు ఆస్తులు అమ్ముకొంటేనేగాని ఆ భారము తొలగని స్థితికొచ్చింది; ఈ విధంగా రైతాంగమంతా, కష్టజీవులంతా అతిదారిద్ర్య మనుభవించాల్సి వచ్చింది.

ఈ పరిస్థితులలోనే ప్రభుత్వము, రైతువారీప్రాంతాలలో శిస్తుల నధికముగావించింది. గోరుచుట్టుమీద రోకటిపోటు అన్నట్లుగా అప్పటికే ఆర్థికదుస్థితి ననుభవిస్తున్న రైతుల కిది మోయలేనంత భారమైంది.

ఈ అసంతృప్తిఫలితంగా తమంతటతామే, నాయకత్వము లేకుండా (Spontaneous) రైతులు దేశమంతటా తిరుగుబాట్లు చేశారు. (ముఖ్యంగా మనరాష్ట్రంలో గుంటూరుజిల్లాలోని పల్నాడురైతుల తిరుగుబాటు; కృష్ణా, గోదావరి జిల్లాలలో రైతువారీ రైతుల పన్నుల నిరాకరణ. 1921 వ సంవత్సరంలో)

మలబారు, కర్నాటకం, యు. పి., బెంగాల్ రాష్ట్రాలలోగూడ యీ కాలములో రైతుల తిరుగుబాట్లు వచ్చాయి. రంగూన్‌లో బ్రిటిష్ పెట్టుబడిదార్ల యెస్టేట్లలో రైతులు తిరుగుబాట్లు చేశారు.

## దేశమంతటా యీ అసంతృప్తి ప్రాకింది

రైతులలోను, కార్మికులలోను, బూర్జువావర్గములోను వచ్చిన యీ తీవ్రదుస్థితి దేశమంతటా అన్ని తరగతులలోనుగూడ వ్యాపించి జాతీయ దుస్థితిగా మారింది. యుద్ధానికి పూర్వము, యుద్ధంలో గలిగిన బూర్జువా వైజ్ఞానిక, పారిశ్రామిక, సాంఘికాభివృద్ధివలన మధ్యతరగతి, బూర్జువా వర్గములోని యువకులలో విద్యాభివృద్ధి యెక్కువైంది. కొందరు యీ విద్యకొరకై ఆస్తులనుగూడ అమ్ముకొని ఉద్యోగములకొరకు వేచుకొనియున్నారు. దేశములో వచ్చిన పారిశ్రామిక, ఆర్థిక దుస్థితులవలన వ్యాపారము, పరిశ్రమలు మందగించాయి. అందుచేత వుద్యోగములు దొరకకపోవడమేగాక, వున్న వుద్యోగాలు వూడిపోయాయి. సర్వత్రా నిరుద్యోగ మభివృద్ధి అయినది.

యుద్ధ సమీకరణనుండి వదిలివేయబడి భారత దేశానికి తిరిగి వచ్చిన (సమీకరణనుండి వదలివేసిన) సైనికులలో, అంతకుముందు సైన్యములో సంభవించిన తిరుగుబాట్లవలన, తెల్లసైనికులకు తమకు మధ్య సైనికోద్యోగులు చూపెట్టిన అసమానత్వము వలన "తెల్లప్రభుత్వ" మంటే పూర్తి ద్వేషము గలిగింది; వారిలో చైతన్యం గలిగింది. ఈ అభిప్రాయములతో నిండిన సైనికులు భారత



దేశమునకు తిరిగివచ్చారు. భారతదేశములో తమతోటి ప్రజలకష్టాలు కండ్లారచూశారు. అదివరకే తమలో 'తెల్లప్రభుత్వము' అంటే వున్న విద్వేషము మరింత పెరిగింది. దీనిఫలితంగా మలబారులో మోప్లాల తిరుగుబాటు, పంజాబులో సైనికతిరుగుబాట్లు సంభవించాయి.

ఇదే సమయములో మనరాష్ట్రములో అల్లూరి సీతారామరాజు నాయకత్వంక్రింద ఏజెన్సీ రైతుల తిరుగుబాట్లు వచ్చాయి.

### జాతీయోద్యమము

యుద్ధానంతరం యేర్పడ్డ పరిస్థితుల్లో రాజకీయరంగంలో మార్పులేమి వచ్చాయి ? జాతీయోద్యమము యెలా అభివృద్ధి అయినది; ఈ విషయాలు క్లుప్తంగా తెలుసుకుందాము.

యుద్ధానికి పూర్వం, యుద్ధకాలములోను భారతసైన్యములోవచ్చిన తిరుగుబాట్లను ప్రభుత్వము 1916 సంవత్సరాంతమునకు అణచివేసింది. కాని అంతటితోవూరుకోలేదు. బ్రిటిష్‌బూర్జువావర్గమునకు ప్రపంచానుభవము మెండగుటచేత, రష్యాలోని అక్టోబరు సోషలిస్టు విప్లవఫలితంగా ప్రపంచమంతటా గలిగిన విప్లవవెల్లువయొక్క ప్రభావమును భారతదేశమునకు రానీయకుండా చేయుటకూ, భారతప్రజా వుద్యమాన్ని విప్లవరూపము దాల్చకముందే అణచివేయుటకు దూరదృష్టితో, నిర్బంధచట్టాలను దేశమంతటా ప్రవేశపెట్టింది. కేవలం నిర్బంధముపైననే ఆధారపడియుండక భారతదేశములో అప్పటికి అన్నివర్గాల కన్నా రాజకీయచైతన్యం గల బూర్జువావర్గమును సంతృప్తిపర్చి ముందువచ్చే ప్రజాపోరాటాలలో తనపక్షాన వుంచుటకుగాను, భారతదేశముపై తన సామ్రాజ్యవాద ఆర్థిక, రాజకీయగుత్తకు భంగములేకుండా కొన్ని రాజకీయసంస్కరణలు (మాంటాగ్యు-చెమ్స్‌ఫర్డు) ప్రకటించింది. దీనితో కాంగ్రెసులోని లిబరల్ బూర్జువావర్గము సంతృప్తిపడి ప్రభుత్వముతో సహకారముచేయ నిశ్చయించుకుంది. అప్పటినుండి కాంగ్రెసును వదలి లిబరల్‌ఫెడరేషన్‌ను యేర్పరచింది. అంతటితో జాతీయోద్యమముపై లిబరల్ బూర్జువా నాయకత్వము అంతమొందింది. లిబరల్‌బూర్జువా రాజకీయాల దివాళాకోరుతనము అప్పటినుండి బయటపడిపోయింది.

కాని దానిస్థానే విప్లవకరమైన నాయకత్వమురాలేదు. జాతీయ బూర్జువా నాయకత్వము వహించింది. లిబరల్ బూర్జువా నాయకత్వానికి యిది నూతన రూపము మాత్రమే. ఈ నూతన రూపమే గాంధితత్వము. గాంధి తత్వముయొక్క నిజస్వరూపము లిబరల్ జాతీయవాదమే అయినప్పటికిని, అప్పటి బూర్జువావర్గముయొక్క రాజకీయ, ఆర్థికావసరాలనుబట్టి లిబరల్ పద్ధతులు అవలంబించకుండా, నూతన పద్ధతులు అవలంబించింది. భారతదేశ బూర్జువావర్గము అప్పుడు యెదుర్కోవలసిన రాజకీయార్థిక పరిస్థితులేమి ?

(1) బూర్జువావర్గమును యెంతవరకు సంతృప్తిచేద్దామని ప్రభుత్వం చూస్తున్నప్పటికిని, సామ్రాజ్యవాదమునకు యుద్ధానంతరం గల్గిన శాశ్వత దుస్థితివలన బూర్జువావర్గమును కనీససంతృప్తిని గూడ కల్గేటట్లు చేయలేనిస్థితికి సామ్రాజ్యవాదం వచ్చింది. ఎందుచేతనంటే బూర్జువావర్గమునకు యే చిన్న ఆర్థిక రాజకీయ హక్కులను యివ్వదామన్నను, భారతదేశముపై బ్రిటిష్ సామ్రాజ్యవాదమునకున్న ఆర్థిక, రాజకీయ గుత్తను కొంతవరకు సడలించవలసివస్తోంది. అలాచేస్తే యిదివరకే ప్రపంచ మార్కెటులో తన ఆర్థిక, రాజకీయ స్థానము బలహీనపడియున్న పరిస్థితులలో మరింత బలహీన

నడవలసివస్తుంది. అందుచేత భారతబూర్జువావర్గపు కవిస రాజకీయ, ఆర్థికాభివృద్ధికి, భారతదేశముపై బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వున్న ఆర్థిక రాజకీయ గుత్తకు యే మాత్రము సమన్వయము కుదురుట లేదు. ఈ స్పర్థ నానాటికి అభివృద్ధి అవుతోంది. బ్రిటిష్ సామ్రాజ్యవాదము ప్రకటించిన రాజకీయ సంస్కరణలు బూర్జువావర్గముయొక్క కనీసకోర్కెలనుగూడ తీర్చుటలేదు.

(2) యుద్ధానంతరం ప్రజలలో గల్గిన సంచలనమువలన (వాటంతటవే రైతులలోను, కార్మికులలోను, విద్యార్థులలోను వచ్చిన తిరుగుబాట్లు; అంతర్జాతీయ విప్లవవుద్యమ ప్రభావమువలన, రష్యాలోని సోషలిస్టు విప్లవమువలన భారతదేశ విద్యార్థులలోను, యువకులలోను గల్గిన విప్లవ భావాలు) జాతీయోద్యమము, ప్రజావుద్యమము ప్రాత లిబరల్ పద్ధతుల ప్రకారం నడపడం అసంభవమైపోయింది. ప్రభుత్వమును బెదరించి క్రమేణా హక్కులు పొందడానికి ప్రజలు విప్లవపంథాను పడకుండా వుండేందులకు ప్రజలపై నాయకత్వం నిలబెట్టుకొనివుండటం బూర్జువావర్గమున కవసరం. వెనుకటి లిబరల్ పద్ధతుల (ప్రభుత్వమునకు పిటీషన్లుపెట్టుట, ప్రభుత్వమును యే విధముగాను ధిక్కరించకుండా చట్టబద్ధమైన ఆందోళన గావించుట) ద్వారా అప్పటి జాతీయోద్యమమును నడుపుట అసంభవమైపోయింది. ఎందుచేతనంటే కార్మికులు తమంటతామే సమ్మెలు చేస్తున్నారు; రైతులు తిరుగుబాట్లు చేస్తున్నారు; విద్యార్థులలో విప్లవభావాలు చెలరేగాయి. ఇట్టి వుద్యమాన్ని జాతీయ బూర్జువా హద్దులలో యుండేటట్లు నడుపుటకు గాంధీజము వుద్భవించింది. లిబరల్ ఆందోళనా పద్ధతులుమార్చి ప్రత్యక్ష చర్యలకు గడంగుటవలన గాంధీ నాయకత్వముక్రింద జాతీయోద్యమము కొంత వరకు ముందుకు పోయినప్పటికిని, పోరాటతత్వములో లిబరల్ జాతీయవాదాన్ని పూర్తిగా గాంధీ తత్వముదాటి విప్లవపంథా అనుసరించలేదు; అందుచేత గాంధీతత్వముగూడ విప్లవ పంథాను అభివృద్ధి చేయలేదు.

బూర్జువావర్గం యెదుర్కోవలసిన పై రాజకీయ, ఆర్థిక పరిస్థితులబట్టి జాతీయబూర్జువావర్గము లిబరల్ పద్ధతులు మానివేసి మరో రూపంలో (గాంధి తత్వము రూపంలో) జాతీయోద్యమమునకు నాయకత్వము వహించింది విప్లవపంథాను జాతీయోద్యమముపోకుండా, బూర్జువాహద్దులలోనే వుండేటట్లు ప్రయత్నించింది.

## ప్రజాపోరాటాలు

1918 – 1920 సంవత్సరములమధ్య కార్మికవర్గము మొత్తంమీద 200 లకు పైగా సమ్మెలు గావించింది. సమ్మెలలో పాల్గొన్న మొత్తం కార్మికుల సంఖ్య యిరవైలక్షలకు పైగా పెరిగింది. రైతులు దేశమంతటా ప్రభుత్వము హెచ్చించిన పన్నులను రద్దుచేయాలనే పన్నుల నిరాకరణోద్యమమును తమంతటతామే యేవిధమైన నిర్మాణము, కేంద్ర నాయకత్వములేకుండా సాగిస్తున్నారు.

రాజకీయంగా ప్రభుత్వ నిర్బంధమునకు వ్యతిరేకముగా (రౌలట్‌చట్టాలకు వ్యతిరేకంగా) దేశమంతటా అసమ్మతి సభలు జరుగుచున్నాయి. ప్రభుత్వముపై సహాయ నిరాకరణోద్యమము సాగించాలనే ఆందోళన కాంగ్రెసులో బయలుదేరింది. హిందూ ముస్లిమ్ ఐక్యత పూర్తిగా యేర్పడింది. బ్రిటిష్ ప్రభుత్వంపై ముస్లిమ్ ప్రజాసామాన్యములోను, విద్యార్థులలోను టర్కీపై బ్రిటిష్ ప్రభుత్వ మొనర్చిన యుద్ధానికి అసమ్మతిగా పూర్తిద్వేషము ప్రబలింది. దీనితో ఖిలాఫతువుద్యమము బయలుదేరింది. హిందూ మహమ్మదీయ ఐక్యత యేర్పడింది. పంజాబులోని జలియన్ వాలాబాగ్ హత్య



లతో జాతీయోద్యమము వుచ్ఛదశకు పోయింది. పంజాబు హత్యల పదుపరి దేశమంతటా తీవ్ర నిర్బంధము హెచ్చయినది. అయినను జాతీయోద్యమ తీవ్రతతగ్గలేదు; హెచ్చిందికూడాను. పంజాబు హత్యలను, ప్రభుత్వ నిర్బంధమును నిరసించుటకుగాను దేశమంతటా అసమ్మతి సభలను యేర్పరచుటకు జాతీయవారము 1919 ఏప్రియల్ 6 వ తేదీనుండి 13 వ తేదీవరకు యేర్పరచబడింది. ఈ వారములో దేశమంతటా బ్రహ్మాండమైన వుత్సవాలు, రాజకీయ ప్రదర్శనాలు జరుపబడ్డాయి.

కాని గాంధి నాయకత్వముక్రింద జాతీయ బూర్జువావర్గము యేమిచేస్తోంది: దేశమంతటా ప్రభుత్వ నిర్బంధముయెడల తీవ్ర అసమ్మతిసభలు చేస్తూ దేశవ్యాపిత వుద్యమముకొరకు యెదురు చూస్తుంటే, అమృతసర్ హత్యల అనంతరం, పంజాబు రాష్ట్రమంతటా మార్షల్ లా ప్రకటించిన తరువాతనుగూడా గాంధిగారు ప్రభుత్వముతో సహకారం చేయుటకు ప్రయత్నించాడు. 1919 వ సంవత్సరములో యీ విషయాన్నిగూర్చి యిలా అన్నాడు; "రాజకీయ సంస్కరణలను జయప్రద మొనర్చుటకు ప్రయత్నం చేయుటకు మనం పూనుకోవాలి, ఇదే జాతీయోద్యమ ప్రధమ కర్తవ్యం" కాని 1920 లోను 21 వ సంవత్సరంలో యేర్పడ్డ ప్రజా అశాంతి, విప్లవవాతావరణము, పారిశ్రామిక దుస్థితి ప్రభుత్వముతో యేమాత్రము సహకారం చేయుటకు అనుకూలంగా లేవు. అందుచేత 1920వ సంవత్సరం సెప్టెంబరులో కలకత్తా ప్రత్యేక కాంగ్రెసు సమావేశంలో ప్రభుత్వముతో సహాయనిరాకరణోద్యమము చేయుటకు నిశ్చయించబడింది.. ఈ క్రింది కార్యక్రమము యేర్పరచబడింది.

(1) న్యాయస్థానములను, ప్రభుత్వవిద్యాలయములను, శాసనసభలను, బహిష్కరించుట.

(2) ప్రభుత్వోద్యోగములను, ప్రభుత్వబిరుదులను వదిలివేయుట.

(3) నిర్మాణ కార్యక్రమమును సాగించడం (ఖద్దరు కట్టడం; రాట్నాలు త్రిప్పడం; అస్పృశ్యతా నివారణకొరకు శాంతియుతముగా ప్రయత్నించడం.)

ఈ కార్యక్రమములోని పై రెండువిషయాలనుబట్టి తేలే విషయమేమంటే, బూర్జువా, పెట్టీ బూర్జువా (పట్టణ) వర్గములకు మొదటికార్యక్రమము, రెండవకార్యక్రమము గ్రామప్రజలకు కార్మికులకు యివ్వబడింది. దేశమంతా ముఖ్యంగా రైతులు, కార్మికులు విప్లవోద్యమమునకు సిద్ధంగా వున్నప్పుడు చేతులు ముందిడుకొని "గాంధీ" జపము చేయమని జాతీయబూర్జువావర్గము చెప్పుతోంది. శాంతియుతమైన ప్రభుత్వ వ్యతిరేక రాజకీయ ప్రదర్శనమునుగావించి ప్రభుత్వమును బెదిరించి కొన్ని బూర్జువా హక్కులను సంపాదించుట; విప్లవభావాలతోగూడి అసంతృప్తితో వున్న ప్రజలకు నాయకత్వం వహించి వుద్యమాన్ని విప్లవపంథాను గాకుండా, జాతీయ బూర్జువా పోరాటహద్దులలోనే వుంచుట - పై కార్యక్రమము వుద్దేశ్యం.

ఈ విధంగా ప్రజావుద్యమముయొక్క కోర్కెల అవసరాలప్రకారం గాక, బూర్జువావర్గ అవసరాలకొరకు అప్పుడున్న ప్రజా అశాంతిని, ఆందోళననూ వుపయోగించుకొంటూవుంది.

బూర్జువా నాయకత్వము యిలా ద్రోహము చేస్తున్నప్పటికిని ప్రజావుద్యమము నాయకత్వము లేకుండగనే దానంతట అదే అభివృద్ధి పొందుతూవుంది. 1921 వ సంవత్సరం నవంబరులో అప్పటి ప్రిన్స్ఆఫ్ వేల్సు భారతదేశానికి వచ్చినప్పుడు దేశమంతటా నవంబరు 17 వ తేదీన సంపూర్ణ బహిష్కార ప్రదర్శనాలు, హర్తాలులు జరిగాయి. యింతకుముందు బెంగాల్-అస్సామ్ రైల్వేలో బ్రహ్మాండమైన కార్మికులసమ్మె జరిగింది. బెంగాల్‌లోని మిడ్నపూర్ జిల్లాలో పన్నుల నిరాకరణ జరిగింది;

మలబారులో మోప్లా రైతుల తిరుగుబాటు, ధనవంతులైన మహంతుల (వీరిని ప్రభుత్వం కాపాడుతోంది అందుచేత యిదిగూడ ప్రభుత్వ వ్యతిరేక వుద్యమమే)కు వ్యతిరేకముగా పంజాబులో 'అకాలీ' వుద్యమము దానంతటవే చెలరేగాయి. ఈపరిస్థితులలో దేశమంతటా వాలంటీరు వుద్యమముగూడ వ్యాపించింది. ఈ వాలంటీరు వుద్యమము కాంగ్రెసులోను, ఖిలాఫత్‌వుద్యమములోను అభివృద్ధి పొందినది.

ప్రభుత్వ నిర్బంధము మరింత హెచ్చయింది. ముఖ్యంగా వాలంటీర్లపై ప్రయోగింపబడింది. 1921వ సంవత్సరము అఖరుకు దేశంమొత్తంమీద 30,000మంది జైళ్లకంపబడ్డారు. ఈ పరిస్థితులలో అహమ్మదాబాద్‌లో కాంగ్రెసు సమావేశమై గాంధిగారిని అహింసాత్మకమైన సహాయ నిరాకరణోద్యమము సాగించుటకు డిక్టేటరుగా నియమించింది. అసంతృప్తితోవున్న రైతులకు కూలీలకు భవిష్యత్‌లో పన్నుల నిరాకరోద్యమును సాగించుటకు వాగ్దానముగావించింది. కాని వాస్తవంగా వుద్యమాన్ని యెలాఆపివేయాలో గాంధీ యోచిస్తున్నాడు. ఆవుద్యమాన్ని సంఘటితపర్చి దేశవ్యాపిత వుద్యమముగా చేసిన జాతీయ బూర్జువా వర్గమునకే హానివాటిల్లుతుందనియు, తాను యేర్పరచిన హద్దులుదాటి విప్లవోద్యమముగా తయారవుతుందనే సంగతిగాంధికి తెలుసు. అందుచేత వుద్యమాన్ని ఆపుటకే, సాకుకు యెదురుచూస్తున్నాడు. ఆ సాకు బీహారులోని 'చౌరీచౌరా' హత్యల (1922 జనవరి)లో కనుగొన్నాడు. వుద్యమము హింసాపథము" పడుతోందనే కారణంతోను, దేశము 'అహింసాత్మక' సహాయ నిరాకరణోద్యమమునకు సిద్ధముగాలేదనేసాకు చూపెట్టి వుద్యమాన్ని ఆపివేశాడు. తనకు తప్పితే శాసనోల్లంఘనము చేయడానికి యింకెవరికీ హక్కులేదన్నాడు. ఈ విధంగా వుద్యమాన్ని సరియైన విప్లవోద్యమముగా మారే అవకాశములున్నప్పుడు ఆపివేసాడు. జాతీయ బూర్జువావర్గము జాతీయోద్యమమును విప్లవోద్యమముగా మారకుండా తనవర్గ అవసరాలకొరకు అణచివేసింది.

బూర్జువా జాతీయవాదం (గాంధీజము) ప్రజలను ప్రభుత్వమునకు వ్యతిరేకంగాకూడ గట్టి వారికిప్రాథమిక పోరాట పద్ధతులను నేర్పింది. ఇంతవరకూ గాంధివాదముఅప్పట్లో అభివృద్ధికరమైనదే. (ఎందుచేతనంటే యీ పద్ధతినిగూడ, నేర్పే జాతీయ నాయకత్వం అప్పట్లో యింకా అభివృద్ధిగాలేదు.) కాని యీ పద్ధతులు అప్పట్లో వృద్ధిఅయిన బూర్జువా ప్రజాతంత్ర వుద్యమాన్ని అభివృద్ధిపర్చి హెచ్చుస్థాయిలోనికి తీసుకుపోవడానికి పూర్తిగా అడ్డుపడ్డాయి. ఈవిధంగా విప్లవోద్యమాన్ని ఆటంకపర్చింది.

జాతీయోద్యమమును విప్లవ పంథాను నడిపించుట భారత కార్మిక వుద్యమముయొక్క రాజకీయ కర్తవ్యం. ఈ కర్తవ్యమును కార్మికవర్గం యీ కాలములో నెరవేర్చగల పరిపక్వ దశలోకి యింకా రాలేదు.

### కార్మికోద్యమము

దేశమంతటా కార్మిక సమ్మెలు ప్రారంభమయ్యాయి. కాని వీటికి సరియైన కేంద్ర నాయకత్వము యింకా యేర్పడలేదు. స్థానికంగా వాటంతటవే అచ్చటి ఆర్థిక యిబ్బందులను తీర్చుకోవడానికి సమ్మెలు చేయబడుతూవుండెను. [illegible] 22 సంవత్సరాల[illegible] తీవ్రమైన సమ్మెలు చెలరేగాయి. ముఖ్యంగా బొంబాయి, అహమ్మదాబాదు నేత పరిశ్రమ[illegible] సార్వజనిక సమ్మెలుగూడ వచ్చాయి. అప్పటికప్పుడు సమ్మెలను నడుపుటకు సమ్మె కమిటీలను యేర్పరచుకోవడం తప్ప తరువాత కార్మిక దైనిక, ఆర్థిక హక్కులను కాపాడుకొనుటకు గూడ కార్మికసంఘాలు యేర్పడలేదు. అందుచేత అప్పటి కార్మికోద్యమమునకు రాజకీయ చైతన్యము లేకపోవుటేగాక, ట్రేడ్ యూనియన్



చైతన్యముగూడ లేదు. ట్రేడ్ యూనియన్ వుద్యమములేదు. అప్పుడప్పుడే ట్రేడ్ యూనియన్, వర్గచైతన్యము వుద్భవించుతోంది. బలిష్ఠమైన ట్రేడ్ యూనియన్ వుద్యమాన్ని నిర్మించడానికి కార్మికోద్యమమునకు ట్రేడ్‌యూనియన్ చైతన్యమేగాకుండా, సోషలిష్టు చెతన్యంగూడ కలుగజేయడానికి తగినమార్క్సిస్టుపార్టీయే అప్పుడులేదు. మార్క్సిస్టుపార్టీ లేనందున కార్మికోద్యమముసంస్కరణవాద పంథాలో నడుపబడుచుండెను. తమతమ స్వప్రయోజనములకొరకు కార్మికోద్యమాన్ని వుపయోగించుకోవడానికి ప్రభుత్వము, జాతీయ బూర్జువావర్గము కార్మికరంగంలో ప్రవేశించాయి.

ప్రభుత్వమునకు విశ్వాసపాత్రులుగావున్న లిబరల్ బూర్జువావర్గ ప్రతినిధులు (యన్. యం. జోషీ, బి. శివరావు వగైరా) 1920 వ సంవత్సరములో బొంబాయిలో అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసును స్థాపించినప్పుడు, ప్రభుత్వం వారికి సహాయపడింది. ఇది కేవలం నామకః సంఘం మాత్రమే. ట్రేడు యూనియన్‌లను స్థాపించి రోజువారీ ట్రేడ్ యూనియన్ పనిచేయించడంగూడ లేదు. సభ్యత్వము చాల కొద్దిగానేవుంది. ఈ సంఘమును ప్రభుత్వము చేతిలోవుంచుకుని జాతీయ బూర్జువావర్గమునకు వ్యతిరేకంగా ప్రయోగించుతూ వుండేది.

1918 వ సంవత్సరములో జాతీయ బూర్జువావర్గముగూడ కార్మికోద్యమములో తన దృక్పథముతో (కార్మికోద్యమాన్ని విప్లవపంథా పట్టకుండాచేయుటకు ముందుగానే అడ్డంకులు కల్పించుటకు) ప్రవేశించింది. ఆ సంవత్సరముగానే అహమ్మదాబాద్‌లో గాంధి "మజదూర్ మహాజన్" అనే కార్మిక సంఘాన్ని స్థాపించాడు; ఆ సంఘముద్వారా యొక సమ్మెగూడ నడుపబడింది. కాని ఆ సంఘం వర్గకలహ సిద్ధాంతముపైగాక వర్గ సామరస్య సిద్ధాంతముమీద నడుపబడుచున్నది. ఇప్పటికిగూడ యీ సంఘం అఖిలభారత ట్రేడ్ యూనియన్ సంఘముతో కలసిలేదు. కార్మిక రాజకీయాలు అంగీకరించకపోయిననూ యజమానులకు, కూలీలకు వున్న ఆర్థిక స్పర్ధలుగూడ అంగీకరించదు. ఈ విధంగా 'మజదూర్ మహాజన సంఘం' కార్మిక వుద్యమాన్ని పెట్టుబడిదారీ హక్కులకు భంగముకలుగని పద్ధతిలో నడిపించుటకు యేర్పడింది.

అందుచేత అప్పటి కార్మికోద్యమము చాల (ట్రేడ్ యూనియన్ దృష్టిలోకూడ) శైశవావస్థలోనే వుండిపోయింది.

## పార్టీ నిర్మాణము - మార్క్సిస్టు భావాలుదయించుట

దేశీయ, అంతర్జాతీయ యీ పరిస్థితులలో పార్టీ నిర్మాణమును కొనసాగించుటకు, మార్క్సిజమును భారతదేశములోనికి గొనివచ్చుటకు యే ప్రయత్నాలు జరిగాయో తెలుసుకుందాం.

సహాయనిరాకరణోద్యమమును గాంధి ఆపివేసిన తదుపరి, కాంగ్రెసులోని, దేశములోని విప్లవభావాలుగల యువకులు, విద్యార్థులు గాంధి పోరాట పద్ధతులకు, అప్పటి ప్రజావుద్యమ అవసరాలకు వున్న పరస్పర వ్యతిరేకతను పూర్తిగా గ్రహించకపోయినప్పటికిని కొద్దిగానో గొప్పగానో గ్రహించగల్గుచున్నారు. గాంధి పోరాట పద్ధతులకన్నా, గాంధీ వాదానికన్నా విప్లవకరమైన పోరాట పద్ధతులకు యెదురు చూస్తున్నారు. కాని యే పద్ధతులు అవలంబించాలో వారంతటవారే కనుగొనజాలకపోతున్నారు.

కార్మికవర్గంగూడ తానంతటదే చేస్తున్న (spontaneous) సమ్మెల ద్వారానే, జాతీయ బూర్జువావర్గముయొక్క పోరాట పద్ధతులద్వారానే తమ హక్కులు రక్షింపబడవనే జ్ఞానమును అప్పు డప్పుడే తెలుసుకుంటోంది. కాని మరో పంథా యేది అవలంబించాలో తెలియక తడుములాడుతూ వుంది. యీ పైపరిస్థితులలో పార్టీని నిర్మించుటకు అప్పుడే ప్రయత్నాలు చేయబడ్డవో తెలుసుకుందాం.

## కమ్యూనిస్టు ఇన్‌టర్‌నేషనల్‌తో సంబంధం

కమ్యూనిస్టు యిన్‌టర్ నేషనల్‌తో అప్పట్లో సంబంధమున్నవారు మూడురకాలుగా వున్నారు.

(1) పంజాబులోని టెర్రరిస్టు వుద్యమము, సైన్యములోని తిరుగుబాట్లు (యుద్ధానికి పూర్వం) ప్రభుత్వం అణచివేసిన తదుపరి, అప్పటి విప్లవకారులు చాలమంది కెనడాచేరు కున్నారు, అచ్చట వున్న సిక్కువర్తకులను, భారతదేశవర్తకులను కెనడాప్రభుత్వం అవమాన పర్చినప్పుడు ప్రభుత్వ చర్యలనుండి రక్షించుకోడానికిగదరుపార్టీ స్థాపించబడింది. అప్పట్లో వీరికిటెర్రరిష్టు అభిప్రాయములే వుండినవి. వీరిలో కొందరితో కమ్యూనిస్టు ఇన్‌టర్ నేషనల్ సంబంధము పెట్టుకుని మార్క్సి జమును వీరిలో వ్యాపింపజేసింది. వీరిలో కొంతమంది భారత దేశానికి తిర్గివచ్చినప్పుడు కమ్యూ నిస్టులుగా మారివచ్చారు.

(2) ఖిలాఫత్ వుద్యమము బయలుదేరినప్పుడు ముస్లిమ్ విద్యార్థులు, యువకులు కొందరు బ్రిటన్‌కు వ్యతిరేకంగా టర్కీపక్షాన పోరాడుటకుగాను టర్కీదేశానికిబయలుదేరారు. వీరినే "హిజ్ర తీలు" అంటారు. అప్పట్లో టర్కీలోగూడ జాతీయోద్యమము తీవ్రంగావుంది. సోవియట్ యూనియన్ పలుకుబడి ఆదేశంలో బాగావుంది. ఇచ్చటనుండి టర్కీచేరిన యువకులలో కొందరు సోవియట్ యూనియన్ అభిమానులయ్యారు. వారు మాస్కోకువెళ్లారు. అచ్చటవారితో కమ్యూనిస్టు ఇన్ టర్ నేషనల్ సంబంధముంచుకొని వారికి మార్క్సిజమును నేర్పింది. వీరిలో కొందరు కమ్యూనిస్టు లుగా తయారైనారు.

(3) భారతదేశంలో టెర్రరిస్టులుగావున్న విప్లవకారులు కొందరు యూరపులో తలదాచుకోవ డానికి వెళ్ళారు. వీరిలో కొంతమందితో కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్ సంబంధముంచుకుంది. అట్టి వారిలో యమ్. యన్. రాయి ఒకడు.

ఈ పై మూడు విధములా "కమ్యూనిస్టు యింటర్‌నేషనల్" భారత దేశములో మార్క్సిజ మును వ్యాపింపజేయుటకు ప్రయత్నించినవి మొదటి రెండువిధముల ప్రయత్నములు హెచ్చుగా ఫలించలేదు. "గదరుపార్టీ" యేమీజేయలేకపోయింది. "హిజ్రతీల"లో కొందరు రష్యాలో మార్క్సి జము నేర్చుకొన్నప్పటికిని, మార్క్సిస్టులుగా కొందరు తయారైనప్పటికిని, వారు రష్యానుండి తిర్గి భారత దేశానికి వచ్చేటప్పుడు సరిహద్దు రాష్ట్రములోనే వారిని, వారు రష్యానుండి తెచ్చుచున్న మార్క్సిస్టు సాహిత్యమునుగూడ ప్రభుత్వము పట్టుకుంది. వారు, వారుతెచ్చే సాహిత్యమును ప్రజ లను చేర్పేముందే ప్రభుత్వము ఆ ప్రయత్నాలను మొగ్గలోనే తుంచివేసింది. అప్పుడే ప్రభుత్వం "పెషావరు కమ్యూనిస్టు కుట్రకేసు" వారిపైపెట్టింది.

యమ్. యన్. రాయిద్వారా చేయబడ్డ ప్రయత్నములుమాత్రం కొంతవరకు సాగాయి. కాని యీ ప్రయత్నాలద్వారా సరియైన మార్క్సిజము భారతదేశాన్ని ప్రవేశించలేదు. "తల్లకిందుల"



మార్క్సిజము వచ్చింది. దీనికి యమ్. యన్. రాయి పూర్తిగా బాధ్యుడు. కమ్యూనిస్టు యింటర్ నేషనల్ (2 వ కాంగ్రెసులో) అప్పటికే వలసరాజ్యాలలో యే విధముగా పనిచేయాలో తెల్పే "తీసీస్సు"ను తయారుచేసి, వలసరాజ్యాల వుద్యమాల నభివృద్ధిపర్చుటకు ధనమును, కాలమును కూడ వ్యయపరచుచున్నప్పటికిని భారత దేశమునకు మాత్రం సరియైన సహాయము, మార్క్సిస్టు సాహిత్యమురాలేదు. ఇది యెలా సంభవించిందో చూద్దాము.

వలసరాజ్యాల వుద్యమాలతో నేరుగా "కమ్యూనిస్టు ఇన్‌టర్‌నేషనల్" కార్యవర్గమే సంబం ధము పెట్టుకోలేదు. వలసరాజ్యాల వ్యవహారాలను నిర్వహించుటకు ప్రత్యేకంగా ఒక కమిటీని యేర్పరచి దానికి యమ్ యన్. రాయిని డైరెక్టరుగా నియమించింది. యీకమిటీయే "కలోనియల్ బ్యూరో". అందుచేత అప్పట్లో యమ్. యన్ రాయిద్వారానే భారతదేశానికి కమ్యూనిస్టు ఇన్‌టర్ నేషనల్‌తో సంబంధము వుండేది.

భారతదేశాన్నిగూర్చి, జాతీయోద్యమమునుగూర్చి అతనుకమ్యూనిస్టు ఇన్‌టర్‌నేషనల్‌కుపంపిన నివేదికలు మార్క్సిస్టు దృక్పథముతోగాక, జాతీయ బూర్జువా దృక్పథముతో, పెటీ బూర్జువా దృక్పథముతో వ్రాయబడ్డవి.

అతను వ్రాసి పంపిన సోషలిస్టు పుస్తకాలలో ముఖ్యమైనది "ఇండియా ఇన్ ట్రాన్‌సిషన్" (India in Transition) అనే పుస్తకం. ఈ పుస్తకం కార్మికవర్గ దృక్పథంతోగాక, అతివాద బూర్జువా దృక్పథముతో వ్రాయబడింది. అందులోని ముఖ్య నినాదం కార్మికవర్గ పార్టీని (మార్క్సిస్టు పార్టీని) నిర్మించడం ప్రథమ కర్తవ్యముగాగాక, కాంగ్రెసులోనే "పీపుల్సు పార్టీని" యేర్పరచడం కార్మికవర్గ ప్రథమ కర్తవ్యముగా తెలియపర్చాడు. కార్మికవర్గమునకంటే, ముందు పెటీ బూర్జువా యువకులను, మధ్యతరగతి యువకులను సంఘటితపర్చాలని అతని వాదన. కాంగ్రెసులో వీరందరితో కూడిన యొక విప్లవపార్టీని యేర్పరచాలనియు, తద్వారానే జాతీయోద్యమము అభివృద్ధి అవుతుంద నియు, మధ్యతరగతి, పెటీ బూర్జువావర్గముయొక్క నాయకత్వమును ప్రజావుద్యమముపై యేర్పరచా లనియు ప్రచారము చేశాడు, ఇందుకు కాంగ్రెసులో "పీపుల్సు పార్టీ"ని యేర్పరచడం ప్రథమ కర్త వ్యమని ప్రచారం సాగించాడు.

ఈ వుద్దేశ్యాలతో కూడియుండుటచేత కాంగ్రెసులోని అతివాదులుగా అప్పట్లోకనిపించే సి. ఆర్. దాసు వగైరాలతోనే ముందుగా సంబంధము పెట్టుకుని వారిద్వారా "పీపుల్సుపార్టీని" స్థాపించుదామని ప్రయత్నాలు చేశాడు. కార్మికవర్గముతోగాని, వేలకువేలుగాయున్న విప్లవ యువకులతోగాని సంబం ధము పెట్టుకుని వారికి మార్క్సిస్టు వాఙ్మయమును అందజేసే ప్రయత్నాలు చేయనేలేదు.

యమ్. యన్. రాయి 'జూరిచ్' నగరములో స్వతంత్ర ప్రకటనాలయా (కమ్యూనిస్టు ఇన్‌టర్ నేషనల్‌తో నిమిత్తం లేకుండా) న్ని అప్పట్లోయేర్పరచాడు. తానుస్వంతముగా కొన్ని పుస్తకాలు ప్రచురించాడు. అవి మార్క్సిస్టు దృక్పథములోలేవు వాటిని, యింకమరి కొన్ని కమ్యూనిస్టు యిన్‌టర్ నేషనల్ ప్రచురణలు కలపి భారత దేశానికి పంపుటకు ప్రయత్నించాడు. పంపేటప్పుడు సరియైన టెక్నికల్ బందోబస్తులు యేమీచేయకుండానే పంపుటచేత ఆ సాహిత్యమంతా ప్రభుత్వము 'కష్టమ్సు'లోనే పట్టుకుంది. యమ్. యన్. రాయి, సి. ఆర్. దాసు వగైరాలతో సంబంధముగాక బొంబాయిలో డాంగే, ఘాటే, ముజఫర్ అహమ్మద్‌లతో గూడ కొద్ది సంబంధము యేర్పరచు

కున్నాడు. నిజమైన విప్లవభావాలు గల్గి, కార్మిక వర్గముతో కొద్దిగానైనా సంబంధము గల్గియున్న వారితో వీరితోనే అతను సంబంధము పెట్టుకోగల్గాడు. వీరికైనా కమ్యూనిస్టు ఇన్‌టర్ నేషనల్ ప్రచురణలు సప్లైచేయలేదు. వీరితో రహస్య వుత్తర ప్రత్యుత్తరములు జరుపుటకు గూడ తగిన బందోబస్తు చేయలేదు. ఇతను భారత దేశానికి వ్రాసే జాబులన్నీ ప్రభుత్వము "సెన్సారు" చేయగల్గింది.

ఈ విధముగా యమ్. యస్. రాయి భారత దేశములో సరియైన మార్క్సిస్టు పార్టీ యేర్పరచుటకుగాని, మార్క్సిస్టు వాఙ్మయమును వ్యాపింపజేసి విప్లవ భావములతో గూడిన యువకులను సోషలిస్టులుగా తయారుచేయుటకుగాని సరియైన ప్రయత్నములు చేయలేదు. పైగా కమ్యూనిస్టు ఇంటర్ నేషనల్ "కలోనియనల్ బ్యూరో" డైరెక్టరుగావుండి సరియైన కమ్యూనిస్టు ఇన్‌టర్‌నేషనల్ ప్రచురణలు భారత దేశానికి రాకుండాగూడచేసి తన తప్పుడుభావాలు ప్రచారంచేశాడు. అందుచేత అప్పట్లో యితనిద్వారా భారత దేశానికివచ్చిన "మార్క్సిజము" 'తల్లక్రిందుల మార్క్సిజము'గాని, సరియైన మార్క్సిజముగాదు. "కమ్యూనిస్టు ఇంటర్ నేషనల్" సరియైన పాలసీ భారత దేశంలో తెలియడం, కార్మికవర్గమును సక్రమ పద్ధతులపై సంఘటితపర్చడం, సోషలిస్టు కేడర్లను తయారుచేయడం తరువాత బ్రిటిష్ కమ్యూనిస్టు పార్టీద్వారా జరిగింది.

## భారత దేశములో ప్రత్యేకంగా జరుపబడ్డ పార్టీనిర్మాణ ప్రయత్నాలు

బొంబాయిలో "డాంగే, ఘాటే, ముజాఫర్ అహమ్మద్"ల ద్వారా కొంత సోషలిస్టు ప్రచారం జరిగింది. బొంబాయిలో డాంగే ఆధ్వర్యముక్రింద "సోషలిస్టు వీక్లీ (Socialist weekly) అనే పత్రిక ప్రచురింపబడుతూవుండేది. (1922 - 1924 వ సంవత్సరములలో) భారత రాజకీయాలుగాని, కార్మిక సమస్యలుగాని హెచ్చుగా యిందులో చర్చించబడలేదు. హెచ్చుగా విదేశాలనుండి వచ్చే సోషలిస్టు సాహిత్యంయొక్క తర్జుమాలే ప్రకటించబడేవి. ఇవిగాక "డాంగే", "గాంధి - లెనిన్" "నూటికి నూరుపాళ్ళు భారతీయుడు" (100% Indian) (గాంధీ తత్వముపై విమర్శ) అను సోషలిస్టు గ్రంథములు ప్రచురించబడ్డాయి. "కమ్యూనిస్టు కరపత్రం" కాట్స్కీ వ్రాసిన "వర్గకలహము" పామీదత్తు "అభినవ భారత దేశము" (Modern india) యీ పుస్తకాలుగూడ "మరాఠీ"లో ప్రచురించబడ్డాయి. ఈ గ్రంథములు భారత దేశమంతటా పంచుటకుగాని, భారత దేశములోని విప్లవ భావములుగల వారందరిలో ప్రచారము గావించుటకుగాని తగిన ప్రయత్నములు యేమీ చేయబడలేదు. బొంబాయిలో మాత్రం నేతపరిశ్రమ కార్మికవర్గములో వీరు ప్రచారము చేస్తూవుండేవారు. అందుచేత వీరికి అప్పట్లో తెలిసినమార్క్సిస్టు అభిప్రాయములుగూడ విస్తారముగా వ్యాపింపజేయుటకు యేమీ ప్రయత్నాలు వీరు చేయలేదు. బొంబాయి కార్మికవర్గములోగూడ సోషలిస్టు ప్రచారముగాక, స్థానిక యిబ్బందులగూర్చి ప్రచారము చేస్తుండేవారు. అందుచేత యీ కాలములో కార్మికవర్గము సోషలిజం అంటే యేమో తెలుసుకొనే అవకాశమూ లేక పోయింది.

## కాన్పూరు కమ్యూనిస్టు కుట్రకేసు (1924)

పెషావరులో హిజ్రతీలు' మార్క్సిస్టు వాఙ్మయముతో పట్టుబడడం, యమ్. యస్. రాయి, విదేశాలనుండి యిచ్చటికి వ్రాసే జాబులు, పంపేసాహిత్యం పట్టుబడడం, బొంబాయినుండి సోషలిస్టు వీక్లీ' ప్రచురించబడడం వీటి ఆధారముతో సోషలిస్టు వుద్యమాన్ని శైశవావస్థ (Embryonic



orm ) లో వుండగానే అణచివేయుటకు, "సోషలిజ"మంటే భయోత్పాతము ప్రజలలోను, అభిమానులలోను గల్గించుటకు డాంగే, వగైరాలను ప్రోగుచేసి "కాన్పూరు కమ్యూనిస్టు కుట్రకేసు" 1924 లో ప్రభుత్వం పెట్టింది. అప్పట్లో భారతదేశములోను, విదేశాలలోనూ యీ దేశంలో పార్టీని నిర్మించుటకు చేస్తున్న అపరిపక్వ (అమోట్యూరిష్) పద్ధతులను యీ కేసుద్వారా ప్రభుత్వము సులభంగా అణగ గొట్టగల్గినది.

పై విషయాలనుబట్టి యీ కాలములో పార్టీనినిర్మించుటకు సరియైన ప్రయత్నములు జరుగలేదనే చెప్పవచ్చును. జరిగిన ప్రయత్నాలు 'అమోట్యూరిష్' పద్ధతులద్వారా జరుగుటచేత ఫలితం యేమీ దక్కలేదు. అందుచేత పార్టీనిర్మింపబడుటగాని, కార్మికవర్గములోను, అప్పుడు గాంధిజముతో అసంతృప్తిచెంది నూతన పద్ధతులకెదురు చూస్తున్న విప్లవ యువకులలోగాని సోషలిస్టు కేడర్లను తయారుచేయుటకు ప్రయత్నంజరుగలేదు. పైగా యమ్. యస్. రాయి ద్వారా తప్పుడు మార్క్సిస్టు భావాలుయువకుల్లో వ్యాపింపచేయబడ్డాయి.

## ముగింపు

పెటీబూర్జువా అసంతృప్తి (ప్రభుత్వమునకు వ్యతిరేకంగా.) అధికమైనది. అతివాద పెటీ బూర్జువా యువకులు గాంధీ తత్వముతో అసంతృప్తిచెంది, స్వాతంత్ర్య పోరాటమునకు యెదురు చూస్తున్నారు. కార్మికవర్గం దానంతటకదే సమ్మెలుగావిస్తూ, కార్మిక వుద్యమము సాగిస్తూవుంది; కాని యీ కార్మికోద్యమము అతిప్రాథమిక దశలోవుంది; సోషలిస్టు చైతన్యమే మాత్రములేదు. కార్మికవర్గమునకు సోషలిస్టు చైతన్యము నందచేయుటకు చేసిన ప్రయత్నములు 'అమోట్యూరిష్' ప్రయత్నాలగుటచేత ఫలించలేదు. కార్మిక వర్గం అందుచేత సోషలిజమునకు దూరముగా వుండి పోయింది.

# రెండవ భాగము

## పార్టీ నిర్మాణములో రెండవ దశ

## (1926—29)

ఈ కాలములోని పార్టీ నిర్మాణ చరిత్రను రెండు భాగాలుగా భాగించవచ్చును.

(1) ప్రపంచ ఆర్థిక దుస్థితి (1929) కి ముందున్న పార్టీ నిర్మాణచరిత్ర:

(2) అప్పటినుండి 1933 వ సంవత్సరంవరకు పార్టీని నిర్మించుటకు జరుపబడ్డ ప్రయత్నాలు.

## ప్రపంచ ఆర్థిక దుస్థితికి ముందు చరిత్ర (1926–1929)

### అంతర్జాతీయ పరిస్థితులు - ధనికవాదాన్ని స్థిరపర్చుటకు ప్రయత్నాలు

యుద్ధానంతరం బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి తీవ్రమైన శాశ్వతదుస్థితి వచ్చిందని వెనుకభాగంలో చూశాము. ఈ దుస్థితి తొలగించుకోవడానికి భారతదేశములాంటి వలసరాజ్యాలపై ఆర్థిక దోపిడీ హెచ్చుచేసిందనియు, అందువలన వలసరాజ్యాలలో యుద్ధకాలమందు తాత్కాలికముగా గల్గిన పారిశ్రామికాభివృద్ధి ఆగిపోయిందనియుగూడ చూశాము.

యుద్ధముద్వారా నాశనమైనట్టి పరిశ్రమలను పునఃస్థాపన గావించుటకు, పురాతనమైన మిల్లు పరికరాలను తొలగించి నవీన, ఆధునికమిల్లు పరికరాలను చేర్చుటకు 1925 వ సంవత్సరం తదువరి సర్వత్రా (కేపిటలిస్టు దేశాలలో) పారిశ్రామిక పునర్నిర్మాణము జరిగింది. అందుచేత పరిశ్రమలు, ముఖ్యంగా యినుము, బొగ్గు వగయిరా ముఖ్యపరిశ్రమలు చురుకుగా పనిచేయడం ప్రారంభమైనవి. సామ్రాజ్యవాదమునకు యుద్ధానంతరం సంభవించిన శాశ్వత దుస్థితిభారము కొంతవరకు తాత్కాలికముగా తగ్గింది. ధనికవాదం "స్థిరపడినట్లు" కనుపించినది. 1925 వ సంవత్సరమునుండి 1928 వ



సంవత్సరాంతమువరకు యీ కాలాన్ని ధనికవాదులు 'స్టెబిలైజేషన్ పిరీడ్' (స్థిమితపడ్డకాలం) అనిపిలిచారు.

పరిశ్రమలు, వుత్పత్తి అభివృద్ధి అయిన యీ కాలములో ధనిక వర్గమునకే లాభాలువచ్చాయి. గాని, కార్మికుల స్థితులేమీబాగుపడలేదు. పైగా 'రేషనలైజేషన్'(ఆధునికయంత్రాలతో ఉత్పత్తి ఎక్కువ చేయడం) పద్ధతివలన కార్మికులలో నిరుద్యోగం హెచ్చయింది. ఆధునిక వుత్పత్తియంత్రాలను పాత యంత్రాల స్థానేవుపయోగించుటచేత వుత్పత్తి హెచ్చిననూ, పనిజేసే కార్మికుల సంఖ్యతగ్గించబడెను. ఉత్పత్తి ఖర్చులు తగ్గుటకే యీ ఆధునికయంత్రాలు పయోగించారు. ఈ పద్ధతిని 'రేషనలైజేషన్' అనిపిలిచారు.

వలసరాజ్యాల ప్రజలస్థితిమరీ అధ్వాన్నమైనది. అచ్చట పారిశ్రామికాభివృద్ధిని అరికట్టుటచేత దేశీయ ఆదాయము, కార్మికుల, కర్షకుల కొనుగోలుశక్తి క్షీణించి దారుణమైన దారిద్ర్యము హెచ్చిపోయింది.

ఈ 'రేషనలైజేషన్' పద్ధతులను కమ్యూనిస్టులు. కార్మికులను దోపిడీచేసే పద్ధతులుగా పరిగణించి నిరోధించారు. ఈ పద్ధతిని నిరోధించే కార్మికుల చర్యలను పూర్తిగా బలపర్చారు. "సోషల్ డెమాక్రట్లు" మాత్రం యీ పద్ధతులను ప్రవేశపెట్టటకు సహాయపడ్డారు. అప్పట్లో కేపిటలిస్టు ప్రభుత్వ స్థానాల్లో హెచ్చుభాగం సోషల్‌డెమాక్రట్లేవుండి పరిపాలన చేస్తూ, కార్మికులను దోపిడీకి గురిచేసే 'రేషనలైజేషన్' పద్ధతులను ప్రవేశపెట్టుటలో ప్రభుత్వ మద్దతును కేపిటలిస్టుల కిచ్చారు. 'రేషనలైజేషన్' పద్ధతులవలన పారిశ్రామికాభివృద్ధి అవుతుందనియు, వుత్పత్తి హెచ్చుతుందని తద్వారా కార్మికవర్గముగూడ అభివృద్ధి అవుతుందనే తప్పుడువాదాన్ని ప్రచారంచేశారు. సోషల్‌డెమాక్రట్ల యీ ద్రోహానికి వ్యతిరేకంగా, కార్మికుల తరఫునవుండి కమ్యూనిస్టులు యీ పద్ధతులను ప్రతిఘటించారు.

## బ్రిటిష్‌సామ్రాజ్యవాదం - తన స్థితిని చక్కపర్చుకోడానికి ప్రయత్నాలు

### ఆర్థికంగా

బ్రిటిష్ సామ్రాజ్యవాదముగూడ యీ "రేషనలైజేషన్" పద్ధతులే అవలంబిస్తోంది. (స్థిమితపడటం) యుద్ధంద్వారా అంతర్జాతీయ మార్కెటులో బలహీనపడిన తన ఆర్థిక పరిస్థితులను చక్కబెట్టుకోవడానికి ప్రయత్నించడమంటే యుద్ధానికి పూర్వం బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి ప్రపంచ మార్కెటుపై వున్న ఆర్థిక, రాజకీయ పెత్తనాన్ని పునరుద్ధరించుకోవడానికి ప్రయత్నించడమన్నమాట. యూరప్‌లోను, అమెరికాలోను తనతో పోటీచేస్తున్న సామ్రాజ్యవాదాలతో జయప్రదంగా పోరాడుటకు తగిన బలముండాలంటే తన వలసరాజ్యాల్లోవున్న తన స్థానాన్ని మరింత బలపర్చుకోవాలి. యుద్ధానంతరం వలసరాజ్యాలలో జాతీయోద్యమ మభివృద్ధి చెందింది. సామ్రాజ్యవాదంకు తీవ్ర పరిస్థితులేర్పడ్డాయి. కాన బలహీనముగావున్న తన స్థానాన్ని రాజకీయంగాను, ఆర్థికంగాను బలపర్చుకోవాలి. ఈ దృష్టితో భారతదేశముపై ఆర్థిక, రాజకీయ వత్తిడి మరింత హెచ్చుచేసింది.

యుద్ధకాలములో భారతదేశములోని మార్కెట్టును భారతదేశ పెట్టుబడిదారులే హెచ్చుగా దోచుకున్నారు. అప్పుడు ప్రభుత్వము యుద్ధావసరములకొరకు తాత్కాలికంగా యీ పాలసీ అవలంబించినది. కాని యిప్పుడు మరల భారతదేశ మార్కెట్టును బ్రిటిష్ పెట్టుబడిదారులే అన్ని విధములా వుపయోగించుకొనేటట్లు పాలసీ మార్చబడింది. శైశవావస్థనుండి అభివృద్ధి గాంచుచున్న ప్రత్తి పరిశ్రమ, వుక్కు, ఇనుము పరిశ్రమల అభివృద్ధిని నిరోధించుటకుగాను, విదేశ (ముఖ్యంగా బ్రిటిష్) గుడ్డల దిగుమతులపైన సుంకాలు తగ్గించబడ్డాయి; స్వదేశీ గుడ్డల వుత్పత్తిపై ఎక్సైజు పన్ను హెచ్చించబడింది; బ్రిటిష్ ఉక్కు, ఇనుము దిగుమతులపై పూర్తిగా సుంకము తగ్గించబడింది; (ఇనుము, వుక్కు పరిశ్రమల రక్షణ చట్టములో మార్పులు) ఇంతకుముందు ప్రభుత్వం యీ పరిశ్రమకిచ్చే ఆర్థిక సహాయము ఆపుచేయబడింది. నూతన స్వదేశీ పరిశ్రమలకు రక్షణ యిచ్చుటకు నిరాకరించింది. రూపాయి మారకపు రేటును బ్రిటన్‌కు అనుకూలంగా మార్పుచేసింది. (ఒక షిల్లింగు నాల్గు పెన్నీలనుండి 1 షిల్లింగు 6 పెన్నీలకు).

### రాజకీయంగా

ఇక రాజకీయ చర్యలుచూద్దాం. ఈ కాలములో సంపూర్ణ స్వాతంత్ర్యము గావలెననే ప్రజా ఆందోళన హెచ్చయినది. "సంపూర్ణ స్వాతంత్ర్యము గావాలి" అనే ప్రజా కోర్కె తిరస్కరించబడింది. భారతదేశ రాజ్యాంగములో యే యే మార్పులు చేయాలో తెల్పు యొక స్కీము తయారు చేయుటకు "సైమన్ కమీషన్" నియమించబడినది. ఈ కమిటీలో ఒక్క భారతీయ ప్రతినిధిగూడ లేడు. అందరూ బ్రిటిషువారే; ప్రజాపుద్యమము ముఖ్యంగా కార్మిక చైతన్యము అంటే భయపడుతూవున్న జాతీయ బూర్జువావర్గమును సంతృప్తిపర్చుటకు, తద్వారా జాతీయ బూర్జువావర్గము, ప్రజలూ అందరూ కలిసి ఐక్యకంఠముతో స్వాతంత్ర్యోద్యమమును సాగించకుండా చేయడానికి, బూర్జువావర్గమును ప్రజలకు వ్యతిరేకంగా తనవైపుకు త్రిప్పుకొనుటకు "సైమన్ కమీషన్" నియామకంద్వారా ప్రభుత్వము ఆశించింది. కాని అసలు ఉద్దేశ్యము బ్రిటిష్ పరిపాలననూ ఆర్థికంగా, రాజకీయంగా స్థిరపర్చుకొనడం అవడంవలన, కేవలం "ఆశల"తో ప్రజలేగాకుండా చివరకు జాతీయ బూర్జువావర్గముగూడ యీ యెత్తువలన మోసపోలేదు. భారత దేశమంతటా "సైమన్ కమీషన్"కు వ్యతిరేకముగా బ్రహ్మాండమైన ప్రదర్శనములు, హర్తాలులు జరిగాయి. పూర్తిగా అది బహిష్కరించబడింది.

మరొకవైపున అభివృద్ధిగాంచుచున్న ప్రజా వుద్యమాన్ని ఏభత్సమొనర్చుటకు గూండా(రౌడీ)లను ప్రభుత్వము రేగగొట్టుచుండెను. ప్రభుత్వము అప్పట్లో భారతదేశములో అవలంబించుచున్న ఆర్థిక, రాజకీయ దోపిడీ పద్ధతులవలన పూర్తి అసంతృప్తి ప్రజల్లో కల్గుతుందని ప్రభుత్వానికి తెలుసు. కాని, ఆ అసంతృప్తి సరియైనరూపములోనికి రాలేదు. జాతీయ బూర్జువావర్గము ప్రభుత్వమునకు వ్యతిరేకముగావుండి, జాతీయోద్యమ నాయకత్వము వహించినను జాతీయోద్యమమును సక్రమమైన ప్రజావుద్యమముగా మార్చుటకు బూర్జువావర్గ బలహీనతగూర్చి (ప్రజలంటే బూర్జువావర్గమునకున్న భయము) ప్రభుత్వమునకు తెలుసు. సహాయనిరాకరణోద్యమ రోజుల్లో ప్రజా వుద్యమానికి నాయకత్వము వహించి చివరకు వుద్యమాన్ని యెలా విచ్ఛిన్నం గావించిందీ ప్రభుత్వమునకు తెలుసు. అందుచేత జాతీయోద్యమమును విప్లవ పంథాను నడపగల కార్మికవర్గము అట్టి స్థితికి



రాకముందే వుద్యమాన్ని అణచివేయుటకుగాను ప్రభుత్వ వ్యతిరేకశక్తులు తప్పుడు మార్గముపట్టుటకు దేశమంతటా "సాంఘిక కలహాలను, కొట్లాటలను" రెచ్చగొట్టింది. పోలీసుల ప్రోత్సాహంతో అప్పటి సాంఘిక కొట్లాటలు చెలరేగాయి. కార్మిక, రైతు వుద్యమాలు యే ప్రదేశాల్లో తీవ్రంగా వున్నాయో, అచ్చట కొట్లాటలు చెలరేగాయి. ఆ వుద్యమాలు అభివృద్ధి గాకముందే కొట్లాటల సాకుతో నిర్బంధ విధానము ప్రయోగించి, వుద్యమాలను అణచివేయడం వీటి వుద్దేశ్యం.

## జాతీయ పరిస్థితులు - జాతీయోద్యమము

### నిర్మాణకార్యక్రమము - "స్వరాజ్యపార్టీ" స్థాపన

సహాయ నిరాకరణోద్యమము ఆపుచేయబడ్డతదుపరి జాతీయ బూర్జువా వర్గములో రెండు భిన్నాభిప్రాయములు బయలుదేరాయి. గాంధినాయకత్వము క్రిందనే, నిర్మాణకార్యక్రమమును సాగిస్తూ ప్రజలలో ప్రచారము చేయాలనే వారు ఒకభాగము. దీనికి గాంధిగారే నాయకుడు. కేవలం నిర్మాణ కార్యక్రమములోనే ప్రజలనుకూడగట్ట జాలమనియు, ప్రజాపుద్యమము తగ్గుస్థాయిలోవున్నప్పుడు ప్రభుత్వముతోపోరాడుట కిదియొక్కటే సాధనముగాగాక శాసన సభలలో ప్రవేశించి చట్టబద్ధమైన పద్ధతులద్వారా గూడ ప్రభుత్వముతో పోరాటము సాగించాలనేవారు రెండవముఠా. బయట ప్రజాపుద్యమము క్షీణదశలోవున్నప్పుడు, ప్రభుత్వయంత్రము (ముఖ్యంగా క్రొత్తగాయేర్పడ్డ సంస్కరణల) గుట్టును ప్రజలకు తెల్పడానికి, ప్రభుత్వశాసన సభలలోను, ప్రభుత్వసంస్కరణలలోను ప్రజలకున్న విశ్వాసమునుపోగొట్టి వారిలో విప్లవభావాలనుగల్గించి, ప్రజావుద్యమము నభివృద్ధిపర్చేదృష్టితో శాసన సభలను ప్రవేశించుటను మార్క్సిస్టులు అంగీకరించుతారు. కాని యీ దృష్టిగాదు జాతీయబూర్జువా వర్గములో రెండవ పక్షంవారికి వున్నది. ప్రజాపుద్యమమును అభివృద్ధి పర్చుటకుగాదు వీరుశాసనసభలలో ప్రవేశించుచామనేది. విప్లవప్రజాపుద్యమమును వ్యతిరేకించుటలో వీరూగాంధివాదులతో కలుస్తారు. అందుచేత యీ పక్షముగూడ జాతీయబూర్జువావర్గ రక్షణ దృష్టితోనే యీ కార్యక్రమమును ప్రచారముచేసింది. ఈ పక్షమే "స్వరాజ్యపార్టీ" అనిపిలవబడ్డది. కాంగ్రెసు శాసనసభలలో ప్రవేశించడానికి అప్పుడు అంగీకరించనందున కాంగ్రెసునాయకులలో ముఖ్యులైన సి ఆర్. దాస్, మోతీలాల్ నెహ్రూల నాయకత్వముక్రింద వేరేపక్షంగా యిది స్థాపించబడింది. మాంటాగ్యూ, చెంస్ఫర్డు సంస్కరణల క్రింద ప్రవేశపెట్టబడ్డ రాష్ట్రీయ కౌన్సిళ్ళ, కేంద్ర శాసనసభా యెన్నికలలో (1925) యీ పక్షం పోటీచేసి, "స్వతంత్రపక్ష" సభ్యులతో కలసి, కేంద్రములోను, రాష్ట్రాలలోను మెజారిటీ సంపాదించింది.

ప్రజాపుద్యమము క్షీణదశయందున్నప్పుడు ప్రజావుద్యమాన్ని అభివృద్ధిపర్చుటకు [illegible] శాసన సభలలో ప్రవేశించడం, అప్పటి గాంధి "నిర్మాణ కార్యక్రమం" [illegible] అభివృద్ధికరమైనదే. కాని "స్వరాజ్యపార్టీ" 1925 వ సంవత్సరంనుండి 1929 వరకు శాసనసభలలో గావించిన పోరాట విధానము ప్రభుత్వమును బలహీనపర్చుటకు హెచ్చుగా తోడ్పడలేదు. [illegible] ప్రభుత్వముతో రాజీ దేరుటకు, తద్వారా సహకారం చేయడానికి తయారైంది. ముఖ్యంగా బూర్జువావర్గ హక్కులకొరకు తప్ప, కార్మిక, కర్షక, రాజకీయ హక్కులను కాపాడుటకు [illegible] లేదు. బైట చెలరేగుచున్న విప్లవ

యువజనోద్యమము, కార్మిక సమ్మెలకు వ్యతిరేకత చూపెట్టినది. అందుచేత "స్వరాజ్యపార్టీ" శాసన సభలద్వారా గావించిన పోరాటం బూర్జువావర్గ హద్దులను దాటిపోలేదు; పైగా ప్రభుత్వముతో సహకారమునకు ఆ పార్టీలోనివారు చాలమంది తయారయ్యారు.

ఈ కారణంచేత యీ కాలములో కాంగ్రెసులో యేర్పడ్డ రెండు పక్షాలు గాంధివాదులు (నో చేన్‌జర్సు) స్వరాజ్యిస్టులు గూడ జాతీయ బూర్జువా ప్రతినిధులే. సహాయనిరాకరణోద్యమములో గాంధితత్వముతో, అహింసా సిద్ధాంతముతో ప్రజావుద్యమముపై నాయకత్వం వహించి ప్రజావుద్యమము విప్లవోద్యమముగా మారకుండాను, వుద్యమముపై తమ నాయకత్వం పోకుండాను యెలా జాతీయ బూర్జువావర్గము ప్రయత్నించిందో, యిప్పుడుగూడ ప్రజావుద్యమము క్షీణదశలో వున్నప్పుడు ప్రజలపై తమ నాయకత్వమును నిలబెట్టుకోడానికి 'స్వరాజ్యపార్టీ' అసెంబ్లీ కార్యక్రమముద్వారా జాతీయ బూర్జువావర్గం కృషిచేసింది. అంతేగాకుండా అప్పటి శాసనసభలద్వారా ప్రభుత్వముతో పోరాడి తమవర్గ ఆర్థిక రాజకీయాభివృద్ధిని పెంపొందించుటకు యెంత అవకాశముందో - దాన్ని వుపయోగించుకొంది. కాని ప్రధానోద్దేశ్యము ప్రజలపై నాయకత్వము నిలబెట్టుకోవడానికి సాధనంగా జాతీయ బూర్జువావర్గానికి 'స్వరాజ్యపార్టీ' వుపయోగపడింది.

నాగపూరు కాంగ్రెసు తరువాత కాంగ్రెసు నిర్మాణములో ముఖ్య మార్పులు వచ్చాయి. అప్పటి నుండి కాంగ్రెసు గ్రామాల్లోకి గూడ చొరబడింది; కాంగ్రెసు ప్రాథమిక సంఘాలు యేర్పడ్డాయి. ఈ సంఘాలను స్థాపించడంతో కాంగ్రెసుసేవకులు, వాలంటీర్లు అనేకమంది తయారైనారు. ఆకాలంలోనే సోషలిస్టుభావాలు అప్పుడే దేశములో ప్రవేశించాయి. సోషలిస్టుభావాలు వీరిలో కలుగకుండాను, వీరిలో నిరుత్సాహం ప్రబలసంతా వుండుటకు వీరికి "నిర్మాణ కార్యక్రమము" యివ్వబడింది. మరల ప్రజా వుద్యమము వచ్చినప్పుడు దాన్ని గాంధిగారి నాయకత్వముక్రింద ఆయన విధించే హద్దులలో నడిపించుటకు "గాంధితత్వము"తో గాంధి భక్తితో అనుసరించే జాతీయసేవకులు అవసరం. బ్రహ్మాండమైన ప్రజావుద్యమము వచ్చేటట్లుంది. దానికి నాయకత్వం వహించకపోయినచో బూర్జువావర్గ నాయకత్వం ప్రజలపై నిలిచేటట్లేలేదు. దానంతటకదే బయలుదేరే ప్రజావుద్యమమునకు నాయకత్వం వహించి దాన్ని విప్లవపంథాను పోకుండాచేయడం సులభం. కాని చైతన్యముతో ప్రజలు రంగంలో ప్రవేశించినప్పుడు అంత సులభమైనపనికాదు. ఉత్తమ సంఘటితపద్ధతులు అనుసరించాలి. అందుచేత "నిర్మాణకార్యక్రమము" శాసనసభలద్వారా, చట్టబద్ధమైన ఆందోళనద్వారా ప్రజలను తన నాయకత్వముక్రింద ముందురానున్న ప్రజా పోరాటములో నడుపుటను, పోరాటాన్ని బూర్జువావర్గ హద్దులలోనే వుంచుటకు యీ కాలములో జాతీయబూర్జువా నాయకత్వం పై పద్ధతులద్వారా సిద్ధపడింది.

## "నిర్మాణకార్యక్రమం" శాసనసభా కార్యక్రమాలపట్ల అసంతృప్తి- విప్లభావా లుదయించుట

ప్రజాసామాన్యముపై, ముఖ్యంగా గ్రామీణులపై కాంగ్రెసునాయకత్వపు పలుకుబడి హెచ్చింది. కాంగ్రెసు ప్రజా సంస్థగా మారుతోంది. అంతేగాకుండా కాంగ్రెసు విద్యావంతులలోను, ముఖ్యంగా యువకులలో విప్లవభావాలు వుదయించుచున్నాయి. విప్లవభావాలు గల్గడానికి రెండు కారణాలు. (1) ఇంతవరకు, ప్రజా వుద్యమాన్ని అభివృద్ధిచేయుటకు బదులు గాంధి పద్ధతులు యెలా పోరాటాన్ని నిరోధించుచున్నాయో వీరికి అనుభవంద్వారా బోధపడుతోంది. (2) ఈ సమయములోనే గాంధి



పోరాట పద్ధతులను విమర్శించుచూ, నూతనంగా సోషలిస్టు అభిప్రాయాలు ప్రచారంలోకి వచ్చాయి. ప్రచారములోకి రావటమేగాకుండా, సోషలిస్టు పద్ధతులతో కార్మికులు బ్రహ్మాండమైన సమ్మెలు చేస్తూ ప్రభుత్వాన్ని స్తంభింపజేయడం వీరు చూస్తున్నారు.

ఈవిధంగా గాంధి తత్వముపైన అసంతృప్తి చెలరేగింది. కాంగ్రెసులోగూడా యొక అతివాద బృందము గాంధి తత్వాన్ని విమర్శిస్తూ స్వాతంత్ర్యము సంపాదించుటకు నిర్మాణ కార్యక్రమము వీల నాడి, ప్రజావుద్యమాన్ని ప్రారంభించాలనే ఆందోళన చేయబడుతూ వుంది. ఆ ప్రజావుద్యమమునకు ఏస్వరూపముండాలో వీరికి అప్పట్లో స్పష్టమైన అభిప్రాయములులేవు. ప్రజావుద్యమములేనిది కేవలం "నిర్మాణ కార్యక్రమము"తో సంపూర్ణ స్వాతంత్ర్యము రాదని మాత్రం గట్టిగా వారికి బోధపడింది. కాంగ్రెసులో అతివాదబృందము యేర్పడుటేగాక జాతీయోద్యమములో కాంగ్రెసేగాక అతివాద సంఘాలు యేర్పడ్డాయి. ముఖ్యంగా దేశమంతటా యువజనసంఘాలు స్థాపించబడ్డాయి. గ్రామాల్లోనికిప్రాకక పోయినా పట్టణాలన్నిటిలోను స్థాపించబడ్డాయి.

టెర్రరిష్టు సంఘాలు మరల తలయెత్తాయి. ముఖ్యంగా యీ పర్యాయం బెంగాల్లో గాక సంయుక్త రాష్ట్రాలలోను, పంజాబులోను యీ వుద్యమము తలయెత్తింది. (కాకోరీ కుట్రకేసు, హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీ) ఈ కాలములో యువకులందరిలోను గాంధి తత్వమును విమర్శించుట పరిపాటైపోయింది.

టెర్రరిష్టు సిద్ధాంతాలలో యిదివరకన్నా కొంత మార్పువచ్చింది. సహాయనిరాకరణోద్యమము అంతకుముందు వున్న టెర్రరిస్టువుద్యమంపై హెచ్చుగా హిందూమతపలుకుబడి వుండేది. రాజకీయంగా అతివాదులుగా వున్నను, సాంఘిక విషయాలలో హిందూమత దృష్టితో వ్యవహరించుటచేత అభివృద్ధి నిరోధక పంథాను అప్పటి టెర్రరిస్టులు అనుసరించారు. ఇప్పుడు వీరిలో హిందూమత పలుకుబడి పోయింది. సోషలిస్టు భావాలు యేర్పడ్డాయి. కాని సోషలిజమును సరియైన దృక్పథముతో అర్థంచేసుకోలేదు అందుచేత వ్యక్తి దౌర్జన్యవాదము యింకా మిగిలిపోయింది వీరిలో. అదేగాకుండా సోషలిజాన్ని వీరు అంగీకరించినను కార్మికవర్గశక్తిలో వీరికి నమ్మకంలేదు. కొద్దిమంది వీరులైన వ్యక్తులే విప్లవాన్ని గొనివస్తారనే విశ్వాసముంది. అందుచేత కార్మికవర్గ సంఘటనకు, ప్రజాసంఘాల నిర్మించి ప్రజావుద్యమాన్ని గొనిరావడానికి ప్రయత్నించక "వ్యక్తి దౌర్జన్య వాదానికి" దిగారు.

టెర్రరిస్టు సంఘాలలోను, యువజన సంఘాలలోను, కాంగ్రెసులోను చేరివున్న విప్లవభావాలు గల యువకులు గాంధి పద్ధతులతో అసంతృప్తిచెంది, సోషలిజమంటే అస్పష్టమైన అభిమానముగల్గియున్నారు. వీరికింకా సరియైన పోరాట కార్యక్రమము యేదో తెలియలేదు. కార్మిక, కర్షకవర్గము వైపుకు పూర్తిగా మొగ్గలేదు. వీరిలో స్థిరమైన మార్క్సిస్టు భావాలు గలవారుతప్ప తక్కినవారంతా ఒక పంథాను సంఘటితపర్చబడలేదు. కాంగ్రెసులోను, యువజన సంఘాలద్వారా సంపూర్ణ స్వాతంత్ర్యము గావాలనియు, ప్రజా పోరాటము గావాలనియు, గాంధి పోరాటపద్ధతులు పోయి, ప్రజా పోరాటపద్ధతులను కాంగ్రెసు ప్రవేశపెట్టాలని మాత్రం రాజకీయాందోళన, బహిరంగ సభల ద్వారా చేస్తూవున్నారు.

ఈ ఆందోళనద్వారాను, కార్మికవర్గం యీ రోజుల్లో గావిస్తూవున్న రాజకీయ ప్రదర్శనాలు (ముఖ్యంగా "సైమన్ కమీషన్"కు వ్యతిరేకంగా కార్మికవర్గం దేశమందెల్లెడల గావించిన బహిష్కార

ప్రదర్శనల) ద్వారాను, మద్రాసు కాంగ్రెసు (1927) లో సంపూర్ణ స్వాతంత్ర్యమును గడించుట తన ధ్యేయముగా కాంగ్రెసు ప్రకటించింది. తరువాత మరల రెండు సంవత్సరములవరకు (1929 లాహోరు కాంగ్రెసువరకు) కాంగ్రెసు నాయకత్వము ప్రభుత్వముతో "డొమీనియన్ స్టేటస్" సంపాదించుటకు బేరాలాడుచున్నప్పటికిని, కాంగ్రెసు ప్రజాసామాన్యముయొక్క భావాలను, సంపూర్ణ స్వాతంత్ర్యముగావాలనే కోర్కెను కాంగ్రెసు నాయకత్వము అధికారరీత్యా గుర్తించకతప్పిందిగాదు.

## కార్మికోద్యమము

బ్రిటిషు ప్రభుత్వము ఈ కాలములో భారత దేశములో ప్రవేశపెట్టిన ఆర్థిక దోపిడీ పద్ధతులవలన, భారతదేశ పరిశ్రమలు క్షీణదశకొచ్చాయి. భారత పెట్టుబడిదారులచే స్థాపించ బడ్డ పరిశ్రమలలో ముఖ్యమైనది నేత పరిశ్రమ: దీనికే హెచ్చు వత్తిడి గల్గింది. ఎందుచేతనంటే నేత పరిశ్రమతో హెచ్చు ఫ్యాక్టరీలు బట్టల ఫ్యాక్టరీలు. ఈ విషయములో ప్రభుత్వము తన దేశీయ బట్టల కర్తకుల, పెట్టుబడిదారుల రక్షణకై హెచ్చు కఠినచర్యలు గైకొంది. ఈ ఆర్థిక వత్తిడివలన భారతదేశ పెట్టుబడిదారులకు గల్గిన నష్టాన్ని, దుస్థితిని తొలగించుకొనుటకు యీ పరిశ్రమల్లోని కార్మికవర్గంపై దోపిడీ హెచ్చుచేయడానికి ప్రయత్నిస్తున్నారు. ఈ దోపిడీ రెండువిధాలుగా వుంది.

(1) యుద్ధములో ధరల పెంపుదలవలన కార్మికుల జీవితప్రమాణం హెచ్చింది. అందుచేత యుద్ధ అలవెన్సు క్రింద "వార్ బోనస్"అని అప్పుడు కార్మికులకు యిచ్చేవారు. ఇప్పుడు ఆ బోనస్ రద్దుచేశారు.

(2) భారతదేశ బట్టల పరిశ్రమలద్వారా వుత్పత్తి అయ్యే బట్టలు భారతదేశ ప్రజల మొత్తపు అవసరాలను తీర్చజాలవు. ఇంకా యెక్కువ వుత్పత్తిగావాలి. బ్రిటిష్, జపాన్ బట్టలు మనదేశానికి దిగుమతి అగుచున్నాయి. అందుచేత యీ దేశపు పరిశ్రమలతో భారతదేశ బట్టల పరిశ్రమలు పోటీ చేయవలసివచ్చింది పోటీలో నెగ్గాలంటే ఆ దేశపు పరిశ్రమలు అవలంబించే పారిశ్రామిక నవీనపద్ధతులు అవలంబించాలి. అప్పట్లో ప్రపంచమంతటా "రేషనలైజేషన్" ద్వారా నవీనపద్ధతులు అన్ని పరిశ్రమల్లోను ప్రవేశపెట్టుచున్నారని పైన చూశాము. ఆ "రేషనలైజేషన్" పద్ధతులే భారతదేశ పెట్టుబడిదారులు యిప్పటికూడ ప్రవేశపెట్టుటకు తలపెట్టారు

భారతదేశములోని రేషనలైజేషన్' పద్ధతులు వాస్తవంగా నవీనపద్ధతులుగాదు. క్రొత్తగా నవీన పరికరాలు యేమీ పాతపరికరాలస్థానే ప్రవేశపెట్టలేదు. కేవలం కార్మికులచేత మామూలు కూలికే హెచ్చువుత్పత్తి చేయించే దోపిడీ పద్ధతి ప్రవేశపెట్టారు. ఈ పద్ధతి ప్రథమములో నేతపరిశ్రమలో ప్రవేశపెట్టుటకు తలపెట్టారు. ఒక నేతగాడు యిదివరలో పనిజేస్తున్నట్లు ఒక మగ్గముపైననేగాక రెండుమూడు మగ్గాలపై యొకే పర్యాయము పనిజేయాలి. కొద్దిపరికరాల మార్పులతో యీ పద్ధతి సాధ్యమౌతుంది. దీనివలన అలా పనిజేయవలసిన కార్మికుడు హెచ్చు శారీరక, మానసిక శక్తిని వినియోగించవలె. దీనివలన నరాలకు హెచ్చువత్తిడి తగులుతుంది. ఇట్టిపనికి జీతము హెచ్చేమీలేదు. ఈ పై పద్ధతులవలన వుత్పత్తిచేయుటకు ఖర్చులు తగ్గుతాయి. తత్ఫలితంగా కార్మికులలో నిరుద్యోగం వ్యాపించింది; పనిలోవున్న కార్మికులకు శ్రమ యెక్కువ అయింది.



ఈ విధమైన చర్యలు తలపెట్టడంవలన కార్మికులలో బ్రహ్మాండమైన అసంతృప్తి, సంచలనం గల్గింది. ముఖ్యంగా బొంబాయిలోనే యీ బట్టల పరిశ్రమలు హెచ్చుగా వుండుటచేతను, బొంబాయి కార్మికులకు హెచ్చుచైతన్యముండుటచేతను వీరిలో పూర్తి సంచలనము గల్గింది. ఈ విధమయిన "రేషనలైజేషన్" పద్ధతులే నెమ్మది నెమ్మదిగా యితరచోట్ల నేతపరిశ్రమలలో ప్రవేశపెట్టుటకు తలపెట్టబడెను. తత్ఫలితంగా బెంగాల్‌లోని నేతపరిశ్రమ కార్మికులలోగూడ పెద్ద అసంతృప్తి, సంచలనము గల్గింది.

ఈ పరిస్థితులలోనే రైల్వే డిపార్టుమెంటు "ఖర్చుల తగ్గించుకొనుట"కు మార్గాలు అన్వేషించుటకు ఒక 'రిట్రెంచిమెంటు కమిటీ'ని వేసింది. రైల్వే కార్మికులలోగూడ ఆచే సమయములో సంచలనము గల్గింది; రైల్వే డిపార్టుమెంటులోని కార్మికులలోనేగాక, తక్కువ జీతాలతో పనిజేసే గుమాస్తాలలోగూడ యీ సంచలనం ప్రాకింది. 'రిట్రెంచిమెంటు' పద్ధతివలన వారికిగూడ హాని వాటిల్లింది.

ఈ కాలములో (1926 నుండి 29 వరకు) నేతకార్మికులు, రైల్వే కార్మికులలో బ్రహ్మాండమైన సమ్మెలు బయలుదేరడానికి పరిస్థితులు పరిపక్వంగావున్నాయి. 1919-21 వ సంవత్సరములలో కూడ కార్మికులు సమ్మెలు గావించారు. కాని అప్పటి రోజుల్లో కార్మికులలో ట్రేడ్‌యూనియన్ చైతన్యముగాని, సోషలిస్టు చైతన్యముగాని కలుగచేయడానికి మార్క్సిస్టు ప్రచారముగాని, పార్టీగాని లేదు. కేవలం వారంతటవారే ప్రాథమిక (Primitive) పద్ధతులలో సమ్మెలను గావించారు. ఇప్పుడు కార్మికులు సమ్మెలు చేయడానికి అనుకూల పరిస్థితులుండుటేగాక, కార్మికులలో ట్రేడ్ యూనియన్ చైతన్యము కలుగచేయడానికి సోషలిజాన్ని వారిలో ప్రచారం గావించి, యిదివరకన్నా వుత్తమమైన పోరాట పద్ధతులను వారికి నేర్పడానికి తగిన మార్క్సిస్టు కేంద్రాల్లు అప్పటప్పటికి యేర్పడ్డాయి. ట్రేడ్‌యూనియన్ చైతన్యముతోను, యిదివరకన్నా సంఘటిత పోరాట పద్ధతులతోను తమ హక్కులకొరకు పోరాడడానికి కార్మికుల్లో తగిన వర్గచైతన్యం కల్గింది.

## రైతుల స్థితిగతులు :

యుద్ధానంతరం వ్యవసాయ వస్తువులకు (ఆహారపదార్థాలకు తప్ప) ముఖ్యంగా యెగుమతిసరుకులకు ధరలు పడిపోయాయి (అవిసగింజలు, నీలిఆకు, (నీలిమందు) యుద్ధమువలన ప్రభుత్వ ఖర్చులు పెరుగుటచేత ప్రభుత్వ ఆదాయమును పెంచుటకు రైతులపై శిస్తులను హెచ్చించింది. ముఖ్యంగా రైతువారీ ప్రదేశాలలో భూమిపన్ను, నీటిపన్ను హెచ్చించింది. ఇందువలన గుజరాతు, ఆంధ్రరాష్ట్రము, పంజాబులో కొన్నిజిల్లాలలోను తీవ్రమైన అసంతృప్తి రైతులలోగల్గి తిరుగుబాట్లు గల్గాయి. ఈ తిరుగుబాట్లు పన్నులనిరాకరణోద్యమములుగా మారినాయి. ఇవి దేశమందెల్లెడల పాకి పెద్ద విప్లవోద్యమముగా మారడానికి తగిన విప్లవనాయకత్వం అప్పట్లో లేకపోయింది. వీటికి కాంగ్రెసు నాయకత్వంవహించిన చోట్లలోగూడ రైతులు స్థానికంగా తమంతటతామే ఏర్పరచిన విప్లవపోరాటను, ఆ శక్తిని అభివృద్ధిపర్చక అడ్డుపడింది.

ప్రభుత్వము తాత్కాలికంగా కొన్ని ప్రదేశాలలో యీ వుద్యమ ఫలితంగా పన్ను హెచ్చింపులను వసూలుచేయకుండా నిలుపుదలచేసింది. అయినప్పటికిని రైతుల్లో అసంతృప్తి తగ్గనేలేదు.

కొన్ని జమీందారీప్రదేశాల్లో (బెంగాల్, సంయుక్తరాష్ట్రాలు) విప్లవభావాలుగల యువజనసంఘాల తరపున రైతుల్లో పనిచేయడం ప్రారంభమైంది. ముఖ్యంగా సంయుక్త రాష్ట్రాలలోను, బెంగాలులోను

సోషలిస్టు భావాలుగల యువకులు జమిందారీ రైతుల్లో వారి దైనందిన కష్టాలనుగూర్చి పనిచేయడం ప్రారంభించారు. కిసాన్ సభలను అచ్చటచ్చట యేర్పరచి వాటిద్వారా రైతుల హక్కులనుగూర్చి ఆందోళన ప్రారంభించారు. ఈ ఆందోళన ఫలితంగా రైతుల్లో చైతన్యము గల్గింది. బెంగాల్‌లో ముజాఫర్ అహమ్మద్ నాయకత్వముక్రింద యీ విధమైన కిసాన్ ఆందోళన బయలుదేరింది.

పంజాబులో 'కీర్తి' సంఘంవారు, కాలిఫోర్నియాలోని శిక్కులసహాయంతో యేర్పడ్డ 'గదరుపార్టీ'తో సంబంధము గల్గియున్నారు. 'గదరుపార్టీ'లో కొందరు కమ్యూనిస్టు యిన్‌టర్నేషనల్‌తో సబంధము గల్గియుండి మార్క్సిస్టు అభిప్రాయములు గల్గియున్నారు. పంజాబులోవున్న 'కీర్తి' సంఘము వారికిగూడా యీ గదరుపార్టీతో సంబంధముండుటచేత కొన్ని మార్క్సిస్టు భావాలు యేర్పడ్డాయి. ప్రధానంగా టెర్రరిస్టుపార్టీగా యున్నప్పటికిని రైతుల్లోగూడా పనిజేస్తూంది "కీర్తి" పార్టీ. అందుచేత పంజాబురైతుల్లోగూడా సంచలనము గల్గింది

ఈ విధంగా యీ కాలములో రైతుల్లో నెమ్మది నెమ్మదిగా ఆందోళన ప్రారంభమై చైతన్యం గల్గుతోంది. కాని దాన్ని సంఘటితపర్చడానికి తగిన కేంద్రనాయకత్వం యేర్పడలేదు.

## పార్టీ నిర్మాణ ప్రయత్నాలు

ఈ అంతర్జాతీయ జాతీయపరిస్థితులలో పార్టీని నిర్మించడానికి యే యే ప్రయత్నాలు జరిగాయో చూద్దాం.

సహాయనిరాకరణోద్యమము కాలములో పార్టీ నిర్మాణ ప్రయత్నాలనుగూర్చి చర్చించుతూ కమ్యూనిస్టు ఇన్‌టర్‌నేషనల్‌యొక్క సరియైన మార్క్సిస్టు పాలసీని భారతదేశములో ప్రచారం చేయకుండా, పార్టీని నిర్మించకుండా, యమ్. యన్. రాయి తన తప్పుడు మార్క్సిస్టు వ్యతిరేక భావాలను యెలా ప్రచారం గావించాడో చూశాము. 'కలోనియల్ బ్యూరో' తరపున యమ్. యన్. రాయి చేస్తున్నపని యేమీ సంతృప్తికరంగాలేదు. అందుచేత కమ్యూనిస్టు ఇన్‌టర్‌నేషనల్, యమ్. యన్. రాయి గావించే మార్క్సిస్టు వ్యతిరేక ప్రచారమును గుర్తించి భారతదేశ వ్యవహారములను బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీకి అప్పగించింది. బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ భారతదేశానికి కొందరు కమ్యూనిస్టులను పంపి ఇచ్చట పార్టీని నిర్మించేటట్లు యేర్పాటుచేయుటకు పూనుకొంది. ఇందులకు 1926 వ సంవత్సరములో బ్రిటిష్ కమ్యూనిస్టులు, డచ్ కమ్యూనిస్టులు, జ్యూరిచ్‌లోను, యితర విదేశాల్లోనువున్న భారత కమ్యూనిస్టు ప్రతినిధులతోగూడిన కమ్యూనిస్టు కాన్ఫరెన్సు 'ఆమ్‌స్టర్‌డమ్' పట్టణములో జరుపబడింది. ఈ కాన్ఫరెన్సుతో యమ్. యన్. రాయి యింతవరకు 'కలోనియల్ బ్యూరో' తరపున అవలంబించిన మార్క్సిస్టు వ్యతిరేక పంథా ఖండించబడింది. భారతదేశములో పార్టీని నిర్మించుటకు, అచ్చటి పార్టీ వ్యవహారములను చూచుటకు బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ బాధ్యత వహించునట్లు తీర్మానించబడింది. బ్రిటిష్ కమ్యూనిస్టులను కొందరిని భారతదేశానికి పంపుటకు నిర్ణయించబడింది. ఈ నిర్ణయముతో భారతదేశ పార్టీ వ్యవహారములు అప్పటినుండి బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ చూస్తూవుంది; యమ్. యన్. రాయిని ఆ బాధ్యతనుండి తొలగించి, అతనిని యింకా పూర్తిగా పరీక్షించుటకు చైనాకు పంపింది. అచ్చట అతనుచేసిన ద్రోహాన్నిబట్టి కమ్యూనిస్టు ఇన్‌టర్‌నేషనల్‌నుండి 1927లో వెళ్ళగొట్టారు.



పై 'ఆమ్‌స్టర్‌డమ్' నిర్ణయము ప్రకారం బ్రిటిష్ కమ్యూనిస్టు పార్టీ 1926 వ సంవత్సరములో బ్రిటిష్ కమ్యూనిస్టులైన కామ్రేడ్సు బెన్ బ్రాడ్లే, స్ప్రాట్‌లను భారతదేశములో పార్టీని నిర్మించుటకు పంపింది. వీరు భారతదేశానికి రాగానే యిదివరలో యం. యన్. రాయ్ తోను, కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్‌తోను సంబంధము గలిగి మార్క్సిస్టుభావాలతో కార్మికులలోను, రైతుల్లోను పనిజేస్తున్న వారందరితో సంబంధం గలుగజేసుకున్నారు. ముఖ్యంగా బొంబాయిలో వున్న డాంగే, ఘాటే, బెంగాల్‌లో వున్న ముజఫర్ అహమ్మద్, యింకా మాస్కోనుండి తిరిగి వచ్చిన హిజ్రతీలలో కొందరితోను సంబంధము కలుగజేసుకున్నారు. వీరే ప్రథమ మార్క్సిస్టు కేడర్లు. వీరుగాక యువజన సంఘాల్లో పనిజేస్తున్నవారిలో మార్క్సిస్టు భావాలు, విప్లవానుభవముగల వారితోను, కాంగ్రెసులో గాంధితత్వమంటే విముఖతచెందిన నిజమైన సామ్రాజ్యవాద వ్యతిరేకులలోనుగూడ సంబంధం కలుగజేసుకున్నారు. ఈకేడర్లతో బొంబాయి, బెంగాల్, సంయుక్తరాష్ట్రములలోని కార్మికులలో, ముఖ్యంగా నేత పరిశ్రమ కార్మికులలోను, జి. ఐ. పి., ఇ. ఐ. ఆర్. రైల్వే కార్మికులలో పనిజేయడం ప్రారంభించారు. బొంబాయి, బెంగాల్, సంయుక్త రాష్ట్రాల్లో కార్మిక-కర్షక పార్టీలను స్థాపించారు.

కార్మికవర్గమును ట్రేడ్‌యూనియన్లద్వారా సంఘటితపర్చి, వార్కి రాజకీయ చైతన్యము, సోషలిస్టు చైతన్యము గల్గేటట్లు చూచుట మార్క్సిస్టుల ప్రథమ కర్తవ్యము అనే విషయము కామ్రేడ్ స్ప్రాట్, బ్రాడ్లీలు రాకముందు సరిగా గ్రహించలేదు. అందుచేత యీ పనికి హెచ్చుప్రాధాన్యత యివ్వలేదు. ఇందులకు యం యన్. రాయ్ మార్క్సిస్టు వ్యతిరేక ప్రచారము కారణం. (కార్మికవర్గ రాజకీయ పార్టీని యేర్పరచుటకన్నా ముందు, కాంగ్రెసులో పీపుల్సుపార్టీ' యేర్పరచవలయుననే ప్రచారము). బొంబాయిలో డాంగే.ఘాటే వగైరా కొద్దిమంది వ్యక్తులకు, కార్మికులకు అప్పటికే సంబంధము ఉన్ననూ కార్మికులలో పనిచేయుటకు హెచ్చుగా వారు ప్రయత్నించలేదు. వారు వ్రాసే కరపత్రాలుగూడ పూర్తిగా కార్మికులకు అందించే యేర్పాట్లులేవు. యెచ్చటనైనా కార్మికుల్లో పని జరుగుచున్ననూ అది స్థానికంగానే యుండిపోయింది ఇతర చోట్ల కార్మికుల్లో పనిజేసేవారితో సంబంధము లేదు.

స్ప్రాట్, బ్రాడ్లీలు వచ్చిన తదుపరి నిజమైన అఖిలభారత ట్రేడ్‌యూనియన్ ఉద్యమమునకు ఆకారం యేర్పడింది. స్థానిక ట్రేడ్‌యూనియన్లు యేర్పడ్డాయి. గిర్నీకాంగార్‌లాంటి ప్రజాపలుకుబడి గల విప్లవ కార్మికసంఘాలేర్పడ్డాయి.

సహాయనిరాకరణోద్యమము తదుపరి యేర్పడ్డ యువజన సంఘాలకు, కాంగ్రెసులోని విప్లవ భావములుగల యువకులకు సోషలిస్టు సాహిత్యము అందచేయడం, అధ్యయన తరగతులు యేర్పరచి మార్క్సిస్టు అభిప్రాయములను వారిలో వ్యాపింపజేయడం యీ కాలంలోనే జరిగింది. ఇదివరకు యే కొద్దిమంది నాయకులకో అలవడిన మార్క్సిస్టు భావాలు అన్ని ప్రాంతాలలోని యువకులకు వ్యాపించాయి. అందుచేత మార్క్సిస్టు సర్కిల్సు, గ్రూపులు అన్ని ప్రాంతాలలో యేర్పడ్డాయి.

జాతీయ బూర్జువావర్గముయొక్క రాజకీయ నాయకత్వమును, పోరాట పంథాను విమర్శిస్తూ స్పష్టమైన పోరాట కార్యక్రమమును రాజకీయకార్యక్రమమును, ప్రజలలో ప్రచారం గావించడం యీ కాలములోనే ప్రారంభమైనది. సామ్రాజ్యవాద పోరాటాన్ని అభివృద్ధిజేయడానికి స్పష్టమైన నినాదాలు యివ్వబడ్డాయి. ఈ నినాదాలు దేశమందెల్లెడలా మారుమ్రోగాయి. ఈ నినాదాల(బూర్జువా ప్రజాతంత్ర

విప్లవ నినాదాల) సహాయంతో ఇదివరకే ప్రజా పోరాటమంటే అస్పష్టమైన భావాలుగల అతివాదులు, విప్లవభావాలుగల యువకులు దేశమందంతటను ప్రబలమైన సామ్రాజ్యవాద వ్యతిరేక ఆందోళన సాగించారు; ఆందోళన, సామ్రాజ్యవాద వ్యతిరేక బహిరంగసభలు సర్వత్రా జరుగుచుండెను. ఈ విధంగా సామ్రాజ్యవాద వ్యతిరేకనినాదాలతో రాజకీయాందోళన గావించడంవలన పట్టణ పెటీబూర్జువా వర్గంలోను, రైతుల్లోను, కూలీలలోను గొప్పసామ్రాజ్యవాద వ్యతిరేకచైతన్యం, రాజకీయ సంచలనం గల్గాయి.

**ఈ కాలమ్ములో కమ్యూనిస్టులు పార్టీని నిర్మించుటకు అనుసరించిన పద్ధతులు.**

(1) కార్మికులతో ఘనిష్ఠ సంబంధం యేర్పరచుకొని వారిలో ట్రేడ్‌యూనియన్ ప్రచారము గావించుట; కార్మికుల కష్టాలను నివృత్తి గావించడానికి విప్లవసాధనంగా సమ్మెలను గావివచ్చుటకు ఆందోళనచేయుట. (బొంబాయిలో నేత పరిశ్రమ కార్మికులలో 1927 వ సంవత్సరములో ప్రచారము, జి. ఐ. పి. రైల్వే వర్కర్లలో ప్రచారము; కలకత్తా జ్యూట్ పరిశ్రమ కార్మికులలో ప్రచారము; ఇ. ఐ. ఆర్. కార్మికులలో ప్రచారము.)

(2) కార్మిక కర్షక రాజకీయ పార్టీలను స్థాపించుట (Workers & Peasants Party): యువజనసంఘాలతో సంబంధం కలుగజేసుకొనుట. (బొంబాయి, బెంగాల్, పంజాబు, సంయుక్త రాష్ట్రాలు).

(3) కార్మికుల సమ్మెలను సంఘటిత పద్ధతులతో గావివచ్చుట; ప్రజాపలుకుబడిగల ట్రేడ్ యూనియన్ల నేర్పర్చడం (అప్పటికే అఖిలభారత ట్రేడ్ యూనియన్ యేర్పడియున్ననూ దాని తరఫున వివిధ పరిశ్రమల్లో స్థానిక ట్రేడ్‌యూనియన్‌లను స్థాపించి, వాటిలో కార్మికులను సభ్యులుగా జేర్పించడం జరుగలేదు. నామకః ట్రేడ్‌యూనియనుగామాత్రమే వుంది. ఎందుచేతనంటే దానినాయకత్వము లిబరల్ రిఫార్మిస్టుల చేతుల్లో వుంది.) మిలిటెంటు ట్రేడ్‌యూనియనులను (సమ్మెల ద్వారా కార్మికుల కష్టాలను నెరవేర్చుకోవడానికి ప్రయత్నించే కార్మికసంఘాలు. రిఫార్మిస్టు ట్రేడ్ యూనియన్లు సమ్మెలను నిరోధిస్తాయి: అది చేతగాక పోతే సమ్మెలను భగ్నపర్చుటకు ప్రయత్నిస్తాయి.) స్థాపించుట; రిఫార్మిస్టులతో పోరాడుట; అఖిలభారత ట్రేడ్‌యూనియన్‌కాంగ్రెసులో మిలిటెంటు ట్రేడ్‌యూనియన్ గ్రూపును యేర్పర్చగలుగుటచేత మిలిటెంటు ట్రేడ్‌యూనియన్ కార్యక్రమము గూర్చిన తీర్మానములు నెగ్గే పరిస్థితులు యేర్పడ్డాయి. (1927 కాన్పూరులోను, 1928 ఝరియాలోను జరిగిన అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసులలో) అంతటితో లిబరల్ రిఫార్మిస్టులు ట్రేడ్ యూనియన్ కాంగ్రెసునువదిలి నేషనల్ ఫెడరేషన్ ఆఫ్ లేబరు'ను స్థాపించారు. దానితో అ॥ భా॥ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసును విచ్ఛిన్నం గావించారు.

(4) "కార్మిక కర్షక రాజకీయ పార్టీల" (Workers & peasents Conferences) సభలను యేర్పరచుట; ఈ సభలద్వారా బూర్జువా ప్రజాతంత్ర విప్లవ కార్యక్రమాన్ని: నినాదముల గూర్చి విరివిగా ప్రచారము గావించుట. (బూర్జువా ప్రజాతంత్ర విప్లవ నినాదాలు; సామ్రాజ్యవాదాన్ని, భూస్వామిక విధానాన్ని కూలద్రోయుట; ఇందులకు దేశవ్యాపిత ప్రజా పోరాటాన్ని సాగించుట; అందుకు కార్మిక కర్షక యువజన సంఘాలను స్థాపించి వివిధవర్గాల ప్రజలను సంఘటితపర్చుట);



సోవియట్ యూనియన్ సాధించిన కార్యాలగూర్చి, అప్పటి కార్మిక, కర్షక, యువజనుల ఆర్థిక, రాజకీయ పరిస్థితులగూర్చి ప్రచారంచేస్తూ సోషలిజాన్నిగూర్చి, సోవియట్ యూనియన్‌గూర్చి విరివిగా ప్రచారంచేయుట.

(5) 'కార్మిక కర్షక పార్టీ' పత్రికలనుస్థాపించి, వాటిద్వారా సోషలిస్టు ప్రచారమును, బూర్జువా ప్రజాతంత్ర విప్లవ కార్యక్రమ ప్రచారమును, గాంధితత్వ వ్యతిరేక ప్రచారము గావించుచుండుట (పత్రికలు: బొంబాయిలో "క్రాంతి"; బెంగాల్‌లో "గనవాణి" "కీర్తి" పంజాబ్‌లో; యు. పి. లో. "క్రాంతికారీ")

(6) కాంగ్రెసుగావించే రాజకీయ ప్రదర్శనాల్లో కార్మిక, కర్షక యువజన సంఘాలు పాల్గొనేటట్లుచేయుట. 'సైమన్ కమీషన్' బహిష్కారమును భారతదేశమంతటిలోను సంపూర్ణముగా బహిష్కరించే ఏర్పాట్లు చేయబడ్డాయి. కాంగ్రెసు 'సైమన్ కమీషన్'ను బహిష్కరిస్తూ గావించిన ప్రదర్శనాలలో కార్మిక, కర్షకులు పాల్గొంటూ వాటిని జయప్రదమొనర్చడమేగాక యెర్రజెండాగూర్చికూడ ప్రచారంగావించబడింది.

(7) కాంగ్రెసు సమావేశాల్లో కాంగ్రెసు నాయకుల విధానంగూర్చి, గాంధితత్వాన్నిగూర్చి అతివాద జాతీయవాదులదృక్పథంతో విమర్శించుట; (1927, మద్రాసు కాంగ్రెసు; 1928 లో కలకత్తా కాంగ్రెసు) కలకత్తా కాంగ్రెసు 1928 లో జరిగేటప్పుడు, అఖిలభారత కాంగ్రెసు కమిటీ పెండాల్ లోనికి కార్మిక - కర్షకపార్టీ నాయకత్వముక్రింద కలకత్తా కార్మికులు ప్రదర్శనాలు గావించారు.

అఖిలభారత కార్మిక - కర్షక పార్టీ ప్రథమ సమావేశం కలకత్తాలో 1928 లో జరుపబడింది. భారతదేశములోని కమ్యూనిస్టు గ్రూపులను అఖిలభారత కేంద్ర సంఘముగా సంఘటితపర్చుటకు ప్రయత్నం చేయబడింది. కేంద్రపార్టీ నాయకత్వాన్ని యేర్పరచుటకు ప్రయత్నం చేయబడింది.

ఈ పై పద్ధతులననుసరించి, వివిధ రాష్ట్రాలలో యెలా పార్టీ నిర్మింపబడిందో ఆలోచిద్దాము. ప్రథమములో కమ్యూనిస్టుపార్టీ నిర్మింపబడలేదు. "కార్మిక, కర్షకపార్టీ" అనేది నిర్మించి దానిలోని కమ్యూనిస్టులు వేరుగా గ్రూపుగా యేర్పడ్డారు. కాని యీ గ్రూపులు నామకః మాత్రముగానే వున్నాయి. "కార్మిక, కర్షకపార్టీ" స్వరూపమేమి? కామ్రేడ్స్ బ్రాడ్లే, స్ప్రాట్‌లు భారతదేశానికి రాగానే కమ్యూనిస్టు అభిప్రాయములు గలవారినందరినీ యొక పార్టీగా యేర్పరచుటకు ప్రయత్నించారు. స్పష్టమైన కమ్యూనిస్టు భావాలుగలవారు చాల కొద్దిమంది వున్నారు. వీరినే యొక పార్టీగా యేర్పరచిన, అస్పష్టమైన సోషలిస్టు భావాలు గలవారినందరిని సంఘటితపర్చుటకు వీలుండదనే ఉద్దేశ్యముతో స్పష్టమైన కమ్యూనిస్టు భావాలు గలవారిని ప్రత్యేకంగా సంఘటితపర్చలేదు. సోషలిజం అంటే సానుభూతి గలవారినందరిని కలిపి యొకపార్టీగా యేర్పరచి, ఆ పార్టీలో "కమ్యూనిస్టు గ్రూపులను" ప్రత్యేకన్నగా యేర్పరచారు. ఇలా యేర్పడ్డ పార్టీయే "కార్మిక కర్షక పార్టీ". ఈ పార్టీ తరఫున బూర్జువా ప్రజాతంత్ర విప్లవ నినాదాలు, సోషలిజము సోవియట్ యూనియన్‌గూర్చి ప్రచారం, ఆందోళన చేయబడుచుండేది. ఈ విధమైన ఆందోళనకే హెచ్చు ప్రాముఖ్యత యివ్వబడింది. గాని కమ్యూనిస్టు గ్రూపులను ప్రత్యేకంగా యేర్పరచి వారికి మార్క్సిజము, లెనినిజముగూర్చి సిద్ధాంతపర జ్ఞానం కల్గజేసి, నిర్మాణయుక్తంగా పనిచేయడానికి తర్ఫీదు చేయలేదు. "కార్మిక, కర్షక పార్టీ"లో కమ్యూనిస్టుగ్రూపులు కమ్యూనిస్టు నాయకుల తగాదాలను పరిష్కరించుటకు సాధనములుగామాత్రమే

వుపయోగపడ్డాయి. పార్టీ నిర్మాణ ప్రయత్నాలన్నీ "కార్మిక, కర్షక పార్టీ"ద్వారానే సాగింపబడ్డాయి. కమ్యూనిస్టులు ప్రత్యేకంగా యీ పార్టీలలో గ్రూపులుగా వున్ననూ యీ కాలములో కమ్యూనిస్టు పార్టీ ప్రత్యేకంగా యేర్పడలేదు.

## వివిధ రాష్ట్రాలలో కార్మిక కర్షక పార్టీ కార్యకలాపాలు

### బొంబాయి

కార్మిక కర్షక పార్టీ 1927 లో స్థాపించబడింది. పార్టీ పత్రికగా "క్రాంతి" వెలువడింది. ప్రథమములో బొంబాయి నేత పరిశ్రమ కార్మికులలో యీ పార్టీతరపున ఆందోళనచేయడం ప్రారంభించారు. "క్రాంతి"లో ఫ్యాక్టరీ కూలీల కష్టాలగూర్చి, యజమానులుచేసే దోపిడీ పద్ధతులగూర్చి వ్రాయబడుచుండేది. "క్రాంతి"లో హెచ్చుభాగం కార్మికుల ఆర్థికయిబ్బందులగూర్చి ఆందోళన చేయబడుచుండేదిగాని రాజకీయంగా ప్రభుత్వము ప్రజలపైగావించే నిర్బంధము, హత్యాచారాల గూర్చి యెక్కువగా శ్రద్ధ చూపెట్టబడేదిగాదు. అందుచేత "క్రాంతి" కేవలం కార్మికుల ఆర్థిక కష్టాలనుగూర్చి వెలిబుచ్చే పత్రికగామాత్రమే యుండిపోయింది. ప్రభుత్వస్వరూపమునుఅన్నివిధాలా బహిర్గతమొనర్చే రాజకీయ పత్రికగా పనిజేయలేదు.

కార్మికులలో కార్మిక కర్షకపార్టీ'గావించే ఆందోళన ముఖ్యంగారెండు విషయాలపై కేంద్రీకరింపబడింది. (1) 'రేషనలైజేషన్ పద్ధతులు' ప్రవేశపెట్టనీయరాదు. (2) "యుద్ధబోనస్"ను పునరుద్ధరించాలి. ఈ రెండు కోర్కెలు కార్మికులనందరిని ఆకర్షించాయి. ఇవిగాక సోవియట్ యూనియన్‌లో కార్మికులస్థితి యెంతసౌఖ్యప్రదముగావుందో, కేపిటలిస్టుదేశాల్లోని కార్మికులస్థితి యెంత హీనంగావుందో తెలియపర్చుచూ సోవియట్ యూనియన్ అంటేను, సోషలిజమంటేను తీవ్రప్రచారము గావించబడింది. దీనిఫలితంగా కార్మికులందరిలోను "రేషనలైజేషన్" పద్ధతిని ప్రవేశపెట్టనీయరాదనే దృఢనిశ్చయం గల్గింది; సోవియట్ యూనియన్, సోషలిజమంటేగాఢాభిమానంగల్గింది.

పై ప్రచారమూలకంగా కార్మికులలోనుండే నేరుగా కార్మికు హక్కులకొరకు పనిజేయగలవారు కొందరు తయారుఅయ్యారు. "కార్మిక కర్షకపార్టీ" కార్మికుల్లో పనిజేయకముందు బొంబాయిలో ఒక కార్మికసంఘంవుంది. దీనిపేరు "గిర్నికంగార్ మహామన్‌డల్". దీనినాయకులు బొంబాయి బూర్జువావర్గ విద్యావంతులలోని "ఫిలాంత్రపిస్టుల"లోకొందరు, కార్మికులకు, యజమానులకు యేవైనా తగాదాలువస్తే వాటిని పరిష్కారముచేస్తూవుండేవారు. సమ్మెలుగావించడం యెప్పుడూలేదు. అసలు వర్గకలహాన్నే అంగీకరించరు యజమానులు కూలీలను, పేదలను దయాదాక్షిణ్యముతో చూడవలయుననియు, యజమానులు దయగలవారుఅయితే కూలీలకు అంతాసౌఖ్యమే గల్గుతుందని వీరు చెప్పేవారు.

"గిర్నికంగార్ మహామండల్" నాయకులకు, కార్మిక ప్రజాసామాన్యానికి నేరుగా సంబంధము లేదు. కార్మికులలో మేస్త్రీల (జాబర్సు)తోనే సంబంధముండేది. ఈ మేస్త్రీలు వారి స్వలాభానికి, తమ వ్యక్తి అధికారాన్ని చలాయించుకోడానికి యీ యూనియన్‌ను తరచు వుపయోగించుకుంటూ వుండేవారు.



బొంబాయి "కార్మిక కర్షక పార్టీ" తరపున ప్రచారం సాగించిన తరువాత కార్మికులలో యీ యూనియన్ పలుకుబడిపోయింది. "గిర్నికంగార్ మహామండల్"లో రేంక్ అండ్ ఫైల్ కార్మిక సభ్యులు అందరూ "కార్మికకర్షకపార్టీ" వైపుకు వచ్చారు. ఎఱ్ఱజెండా (ప్రథమములో సుత్తికొడవలి చిహ్నములేవు; కేవలం ఎఱ్ఱజెండాయే) కార్మికులనందరిని ఆకర్షించింది. వేరే సంఘం యింకా పెట్టకపోయినప్పటికిని "కార్మిక కర్షక పార్టీ" యొక్క కార్యక్రమముపైన కార్మికులందరూ ఐక్యమయ్యారు; నూతన వుత్సాహం చెలరేగింది.

"కార్మిక కర్షక పార్టీ" పలుకుబడి, ఎఱ్ఱజెండా ప్రాబల్యము హెచ్చడంతో "గిర్నికంగారుమహామండల్"లో కార్మికవర్గమునుండి ప్రతినిధులుగావుండిన కార్మిక మేస్త్రీలలో కొందరు స్వలాభపరులు యీ కార్మిక సంచలనమునకు వ్యతిరేకులయ్యారు; "కార్మిక కర్షక పార్టీ"పై వ్యతిరేక ప్రచారం చేయడం ప్రారంభించారు. ఈ వ్యతిరేక ప్రచారాన్ని కార్మికులు సహించజాలక "గిర్నికంగారు మహామండల్" ఆఫీసుపైననూ, యీ మేస్త్రీలమీదకు దండెత్తి ఆఫీసు భవనాన్ని కూల్చివేసి, మేస్త్రీలను చితకగొట్టారు. కార్మికుల యీ చర్యయే "కార్మిక కర్షక పార్టీ" యెంతవరకు కార్మికులనందరిని ఆకర్షించిందో తెల్పుటకు నిదర్శనము.

"గిర్నికంగార్ మహామండల్"గాక లిబరల్‌రిఫార్మిస్టులచేత (ఎస్. యమ్ జోషి వగైరాలు) స్థాపించబడిన రిఫార్మిస్టు (సంస్కరణవాద) కార్మిక సంఘం యొకటివుంది. దీనిపేరు "టెక్స్టయిల్ లేబర్ యూనియన్". దీని సభ్యత్వంగూడ చాలతక్కువ. కార్మికులందరికీ యీ సంఘం వున్నట్లు గూడ తెలియదు. "కార్మిక కర్షక పార్టీ" యేర్పడ్డ తదుపరే బ్రహ్మాండమైన కార్మిక ఆందోళన, బహిరంగసభలు సాగాయి. అంతకుముందు "గిర్నికంగార్ మహామండల్" ద్వారాగాని, "టెక్స్టయిల్ లేబరు యూనియన్". ద్వారాగాని యెన్నడూ యిట్టి బహిరంగసభలు, ఆందోళన జరుపబడలేదు.

"కార్మిక కర్షక పార్టీ" ఆందోళన ఫలితంగా ప్రతిమిల్లులోను మిలిటెంటు కార్మికులతో సంబంధము గల్గింది. ప్రతి ఫ్యాక్టరీలోను యొక ట్రేడ్ యూనియన్ గ్రూపు యేర్పడింది. "గిర్నికంగార్ మహామండల్"లోని వెనుకటి నాయకులందరూ గూడ (స్వలాభపరులుతప్ప) "కార్మికకర్షక పార్టీ" తరపున పనిజేయడం ప్రారంభించారు. ఈ విధంగా ట్రేడ్ యూనియన్ నిర్మాణము యేర్పడకపోయిననూ దాని ఆకారము ప్రతి ఫ్యాక్టరీలోను యేర్పడింది.

1928 ఏప్రియల్‌లో నేతపరిశ్రమలో సమ్మెప్రారంభమైనది. "రేషనలైజేషన్" పద్ధతులుప్రవేశపెట్టవద్దనేది ముఖ్యకోర్కె. నేతపరిశ్రమ కార్మికులందరు (దాదాపు 2 లక్షల కార్మికులు) సమ్మెజేశారు. 6 మాసాలు నిరాఘాటముగా సమ్మెసాగింది. ఈ సమ్మెద్వారా కార్మికులలో గల్గిన ఐకమత్యము; వుత్సాహమును రిఫార్మిస్టులు (సంస్కరణవాదులు) గూడ గుర్తించారు. అందుచేతసమ్మెను "లేబరుటెక్స్టయిల్ యూనియన్" గూడ బలపర్చింది. సమ్మెకమిటీలో యన్. యమ్, జోషీగూడ సభ్యుడుగా వుండవలసివచ్చింది.

ఈ సమ్మెదినాల్లో "కార్మిక కర్షకపార్టీ" తరపున ప్రతిరోజు వుదయం, సాయంకాలము బహిరంగసభలు, ప్రదర్శనాలు జరుపబడుచూవుండేవి. ఈ సభల్లో కేవలం కార్మికుల కష్టాల గూర్చి చెప్పడమేగాకుండా, రాజకీయవిషయాలు, సోవియట్ యూనియన్‌లోని పరిస్థితులగూర్చి చెప్పబడుతూ వుండేవి. ప్రతిరోజుసభలు పెట్టిననూ వేలకువేలు కార్మికులు, ప్రజలు హాజరయ్యేవారు. ఇట్టిప్రదర్శ

నాలు, బహిరంగ సభలు యెన్నడూ కార్మికులు చూడకపోవడమేగాకుండా, ప్రజలుగూడ చూచి యుండలేదు. అందుచేత కాంగ్రెసు ప్రజాసామాన్యము, పెటీబూర్జువా వర్గములోను (బొంబాయి) అమితోత్సాహము, చైతన్యము గల్గింది. దాదాపు 2 లక్షలమంది కార్మికులు 6 నెలలవరకు సమ్మె సాగించారన్నవిషయం భారతదేశములోని యితరచోట్లల్లోగూడ ప్రజల్లో సంచలనము గల్గించింది, ముఖ్యంగా యితర పారిశ్రామిక ప్రదేశాల్లోని కార్మికులలోను, ప్రజలలోను చైతన్యం గల్గించింది. విప్లవభావాలుగల యువకుల్లో వుద్రేకము గలుగచేసింది. అందుచేత యీసమ్మెకు స్థానికప్రాముఖ్యతే గాక అఖిలభారత ప్రాముఖ్యతగూడవచ్చింది. ఎందుచేతనంటే యిలాంటి సమ్మె యింతకాలము వర్గ చైతన్యముతో, సంఘటితపద్ధతులతో యిది వరకెన్నడూ జరుపబడలేదు.

ఈ సమ్మెద్వారా బొంబాయికార్మికులలో ముఖ్యంగా యిదివరకు యేర్పడిన ఫ్యాక్టరీగ్రూపులలో విపరీతమైన చైతన్యం యేర్పడింది. ఇదివరలోవున్న గ్రూపులు, యిప్పుడుసమ్మెకమిటీలుగాను, బస్తీ కమిటీలుగాను మారాయి. (ఇవిపార్టీకమిటీలుగావు. సమ్మెనునడుపుటకు, కార్మికులనందరికో యెప్పటి కప్పుడు ఆందోళనచేయుటకు, మిల్లుయజమానుల గూండా (రౌడీ)లనుండి, సమ్మెవిచ్ఛేదకులనుండి కార్మికుల రక్షించుటకు యేర్పడ్డకమిటీలు.)

ఈ కమిటీలతో "కార్మిక కర్షక పార్టీ"కి నేరుగా సంబంధం యేర్పడింది. ఈ కమిటీ సభ్యులకు అధ్యయన తరగతులు యేర్పరచి రాజకీయాలు బోధించుతూవుండేవారు ఈవిధంగా మిలి టెంటు వర్కర్లలో అద్భుతమైన సంచలనముగల్గింది. కార్మికులలోనుండి ప్రతి ఫ్యాక్టరీలోను మిలి టెంటు కేడర్లు యేర్పడ్డాయి.

ఈ సమ్మె ఫలితంగా "రేషనలైజేషన్" తాత్కాలికంగా నిలుపుదల చేయబడింది. కార్మికుల కష్టాలనుగూర్చి విచారించుటకు ప్రభుత్వ విచారణకమిటీ ఒకటి యేర్పడింది. ఈ కమిటీలో సమ్మె కమిటీ ప్రతినిధులుగూడ వున్నారు. ఈ సమ్మె విజయంగావడంవలన కార్మికులలో సమ్మెలయందు, మిలిటెంటు కార్మిక సంఘాలయందు విశ్వాసంగల్గింది. రిఫార్మిస్టు (సంస్కరణవాద) పద్ధతుల లోను రిఫార్మిస్టు నాయకులంటే పూర్తి అసంతృప్తిగల్గింది. కార్మికులు వారంతటవారే యీ పద్ధతు లను విడనాడి సంస్కరణవాదులతో పోరాటం సాగించారు. ఆందోళనా ఫలితంగా కల్గిన యీ విజ యాన్ని సంఘటితపర్చ ప్రారంభించారు.

సమ్మె అనంతరం "గిర్నికంగారు యూనియన్" స్థాపించబడింది. ప్రతి ఫ్యాక్టరీలోను దాని శాఖలను స్థాపించి, సభ్యులు చేర్పించబడ్డారు. మొత్తం సభ్యత్వం 80,000 వరకు పెరిగింది. ఇదివరలో "గిర్నికంగారు మహామండల్", "టెక్స్టయిల్ లేబరుయూనియన్"ల సభ్యత్వం ఎన్నడూ 700 లకు మించలేదు. సమ్మెలో "కార్మిక, కర్షకపార్టీ" ఆందోళనద్వారా తయారై తర్ఫీదుపొందిన మిలిటెంటు వర్కర్లు యీ నిర్మాణమునకు పునాదిగా వున్నారు. అందుచేత "గిర్ని కంగారు యూని యన్" నిజమైన ప్రజా పలుకుబడిగల్గిన ట్రేడ్ యూనియన్‌గా తయారైంది. కార్మికులలో పాతుకు పోయింది. సభ్యత్వం సిరివిగా పెంపొందుటేగాక, యూనియన్ ఫండుక్రింద కేవలం కార్మికుల విరా ళములతో రు 50,000/- లు పోగుచేయబడ్డాయి. ఈ విధంగా భారతదేశ కార్మిక వుద్యమచరిత్రలో ప్రథమపారిగా నిజమైన, ప్రజా పలుకుబడిగల్గిన కార్మికవర్గ సంఘం యేర్పడింది.



ఈ సమయములోనే "కార్మిక కర్షకపార్టీ" తరపున జి. ఐ. పి. రైల్వేకార్మికులలో యిలాంటి ఆందోళనయే చేయబడుచున్నది. అప్పట్లో జి. ఐ. పి. యూనియన్ లిబరల్ రిఫార్మిష్టుల (లిబరల్ సంస్కరణవాదులు. వీరు సమ్మెలను నిరోధిస్తారు) చేతుల్లోవుంది. నాయకత్వం వారిచేతుల్లో వుంచుకుని యూనియన్ ఆందోళన క్రిందికార్మికులలో (గ్యాంగ్‌కూలీలు, పోర్టర్లు, కూలీలు వగైరా)నికి పోపీయ కుండా యింజనీర్సు వగైరా వుద్యోగస్థులయొక్క హక్కులకొరకే ఆందోళన చేయబడుతూవుండేది. సమ్మెవిధానానికి వీరుపూర్తిగా విరుద్ధం. ఈపరిస్థితుల్లో "కార్మిక కర్షకపార్టీ" వర్కర్లు యూనియన్‌లో ప్రవేశించి మొత్తం రైల్వేలైన్‌లోవున్న గ్యాంగ్‌వర్కర్లు, పోర్టర్లు, తదితర కార్మికప్రజాసామాన్యంలో తీవ్రప్రచారము గావించారు, సంస్కరణవాద పద్ధతులకు, మనపద్ధతులకు వున్నభేదము గూర్చి ప్రచా రం చేశారు. యూనియన్ ఆవశ్యకతగూర్చి బోధించారు. సోషలిజం గూర్చి, సోవియట్ యూనియన్ గూర్చి ప్రచారంగావించారు. ఇదివరకు యూనియన్ ప్రచారముచేయని సరికొత్త ప్రదేశాలలోని వెనుక బడివున్న కార్మికులలోగూడ తీవ్రప్రచారం గావించారు. ఈ తీవ్రప్రచార ఫలితంగా స్థానిక యూని యన్లలోను, కేంద్రయూనియనులోను "కార్మిక కర్షకపార్టీ" వర్కర్ల పలుకుబడి హెచ్చింది, సంస్క రణవాద పద్ధతులంటే అసంతృప్తి కార్మికులలో హెచ్చుతోంది.

## బొంబాయి 'కార్మిక కర్షక పార్టీ' గడించిన ఫలితాలు - దాని లోపాలు :

బొంబాయిలోని కమ్యూనిస్టు గ్రూపు (కార్మిక కర్షక పార్టీలోని) వాస్తవంగా కమ్యూనిస్టు గ్రూపుగాగాక, మిలిటెంటు ట్రేడ్‌యూనియన్ గ్రూపుగా మాత్రమే పనిచేసింది. ఈ గ్రూపుకు మార్క్సిస్టు, లెనినిస్టు సిద్ధాంతజ్ఞానము, పూర్తిగా అలవడలేదు; అలవర్చుకోడానికి తగిన ప్రయ త్నాలుగూడ చేయలేదు; సిద్ధాంతజ్ఞానము నభివృద్ధి పర్చుకోవడానికి తగిన ప్రయత్నం గావించక పోవుటచేత నాయకులకుగూడ సరియైన సిద్ధాంతజ్ఞానం అలవడలేదు.

"కార్మిక కర్షక పార్టీ" విశాలపార్టీగాను, అందులో యొక చిన్న గ్రూపుగాను కమ్యూనిస్టు బృందము పనిచేశారు. అందుచేత "కార్మిక కర్షక పార్టీ" దరిదాపు ఒక "లీగల్ బూర్జువా పార్టీ"గా పనిచేసిందిగాని కమ్యూనిస్టుపార్టీగా తయారుగాలేదు. మిలిటెంట్సును నిజమైన ట్రేడ్‌యూనియనిస్టు లుగా గూడ తయారు గావించుటకు ప్రయత్నం జరుగలేదు; ఆర్గనైజర్లుగా తయారుచేయడం అసలే జరుగలేదు వారుగూడ సమ్మెలలో ఆందోళనచేయుటకే అలవాటుపడ్డారుగాని స్థానికసంఘాలద్వారా సమ్మెలులేనప్పుడు కార్మికుల దైనందిన కష్టాలుగూర్చి పాటుబడుటకు తయారుచేయబడలేదు. వారిని కమ్యూనిస్టులుగా తయారుచేయుటకు అసలే ప్రయత్నం జరుగలేదు. అందుచేత హెచ్చుమంది మిలి టెంటు వర్కర్లు తయారైననూ, పార్టీ మాత్రం నిర్మింపబడలేదు.

కార్మికులలోనేగాక, కాంగ్రెసు యువకులలోగూడ ఆందోళన చేయబడింది. అయినప్పటికిని అది రాజకీయ ఆందోళనగానే వుండిపోయింది. వీరిలో రాజకీయ నినాదాలగూర్చి ప్రచారం జరిగింది. గాని, మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాలగూర్చి అధ్యయన తరగతులు పెట్టలేదు. జాతీయ బూర్జువా పోరాట పద్ధతులయెడల అసంతృప్తిచెంది నూతన ప్రజాపోరాట పద్ధతులకొరకు తడుములాడుచున్న విప్లవ యువకులలో మార్క్సిజము, లెనినిజముగూర్చి ప్రచారముచేసియున్నట్లయిన, వారినుండి పార్టీ నిర్మాణమునకు, పార్టీపనికి కొంతమంది తయారై వుండేవారు; కార్మికవర్గమునుండి, కాంగ్రెసు నుండి యిలా తయారైనవారినందరిని పార్టీగా సంఘటించినట్లయిన పార్టీనిర్మాణము అప్పుడే యెంతో

బలపడివుండేది. ఇలా చేయడానికి యిదివరకే స్పష్టమైన మార్క్సిస్టు అభిప్రాయములుగలవారం దగ్గరయుండు పార్టీగా సంఘటితపర్చబడాలి: అప్పుడే క్రమమైన, యెడతెగని పార్టీ నిర్మాణమును చేయగల్గుతాము. పార్టీ లేకపోవుటేగాక, అధ్యయన తరగతులుగూడ నిరంతరం సాగించడానికి యేర్పాట్లులేవు మార్క్సిజమును, లెనినిజమును ప్రచారం గావించడానికి పార్టీ కేంద్రపత్రికలేదు; మార్క్సిస్టు సాహిత్యంగూడ చాలినంతగాలేదు.

కార్మికోద్యమ బలహీనతను చూద్దాము. ప్రజా పలుకుబడిగల కార్మికవర్గ సంఘాలు (గిర్నీ కంగారు యూనియన్) స్థాపించబడ్డాయి. ప్రతి మిల్లులోను "మిల్లుకమిటీలు" యేర్పడ్డాయి. ఈ "మిల్లు కమిటీలు" శాసనరీత్యా యజమానులచేత గుర్తించబడకపోయినప్పటికిని, ఆచరణలో ఏమైనా సమస్యలు వచ్చినప్పుడు వాటి పరిష్కారంకు కార్మికుల తరఫున వీటినే పిలిచేవారు. అందుచేత వీటి ప్రతిష్ఠ, పలుకుబడి హెచ్చింది. ఆవిధంగా వుద్యమం అభివృద్ధిపొంది కార్మికులలో ప్రాథమికవర్గ చైతన్యం కల్గింది. ఇదేకాకుండా అన్నిచోట్ల కార్మిక వుద్యమంకొరకు పనిజేసే మిలిటెంటు వర్కర్లు తయారయ్యారు.

కాని యీ మిలిటెంటు వర్కర్లకు సోషలిస్టు చైతన్యములేదు; ట్రేడ్‌యూనియన్ ఆర్గనైజర్లుగాకూడా వీరు తయారు చేయబడలేదు. అందుచేత వీరిలో పోరాటశక్తి (Militancy) వున్ననూ, ట్రేడ్ యూనియన్ వుద్యమాన్ని సంఘటిత పద్ధతులలో కమ్యూనిస్టు చైతన్యముతో అభివృద్ధిచేసే శక్తి వీరిలో లేకపోయింది. అందువల్ల తాత్కాలికంగా "గిర్నీ కంగారు యూనియన్" సభ్యత్వము పెంపొందినను, 1929లో ప్రభుత్వం నిర్బంధం ప్రయోగించినప్పుడు, నాయకులందరిని అరెస్టుగావించినప్పుడు పని చేయజాలకపోయింది. ప్రజాందోళన చేయబడిందిగాని ప్రజా సంఘటన చేయబడలేదు. నాయకులకు, ప్రజలకు మధ్య పనిజేసే ట్రేడ్ యూనియన్‌కేడర్లను అభివృద్ధిపర్చలేదు. అందుచేత ట్రేడ్ యూనియన్ చైతన్యము కార్మికుల్లో అభివృద్ధి చెందిననూ ట్రేడ్ యూనియన్ మాత్రం నిర్మాణయుక్తంగా బలపడలేదు. ఈ కారణంచేతనే పార్టీగూడా నిర్మింపబడలేదు.

## బెంగాలులో పార్టీ నిర్మాణపు ఫలితాలు

బొంబాయిలోవలెనే యిచ్చటగూడ "కార్మిక కర్షక పార్టీ" స్థాపించబడింది. యువజన సంఘాలను స్థాపించి, విప్లవ భావాలుగల యువకులతో సంబంధము కలుగజేసుకోబడింది. ఈ యువజన సంఘాలనుండి సోషలిస్టు అభిప్రాయాలుగలవారు, రైతుల్లో, కార్మికుల్లో పనిజేస్తున్నవారినుండి అనుభవముగలవారు "కార్మిక, కర్షక పార్టీ"లో చేర్చబడ్డారు.

పార్టీ పత్రికగా "గనవాణి" అనేదాన్ని స్థాపించారు. మార్క్సిస్టు ప్రాథమిక సూత్రాలగూర్చి, బూర్జువా ప్రజా తంత్రం విప్లవ కార్యక్రమము, నినాదాలగూర్చి యీ పత్రికద్వారా ప్రచారము చేయబడుచుండెను. ఈ పత్రిక హెచ్చుగా (బొంబాయిలోవలె) కార్మికులలోగాక పెటీబూర్జువా వర్గములో యెక్కువగా ప్రచారము చేయబడుచుండెను.

బెంగాల్ నేతపరిశ్రమ కార్మికులలో (ముఖ్యంగా జనపనార పరిశ్రమ కార్మికులలో) "కార్మిక కర్షకపార్టీ" సభ్యులు పనిజేస్తూ వుండేవారు. ఝరియా బొగ్గుగనివారలలోను, ఛెంగియాల్ మొదలగు జనపనార పరిశ్రమల కార్మికులలో హెచ్చుగా పనిజేస్తూవుండేవారు. ఇ. ఐ. రైల్వే కార్మికులలో గూడ పని ప్రారంభించారు. ముఖ్యంగా ఖరగ్‌పూర్ రైల్వే వర్కుషాపులోని కార్మికులలో హెచ్చుగా



పనిజేస్తుండేవారు. బొంబాయిలో కార్మికులలో పనిచేస్తున్న విధానమునకు, బెంగాలులోని విధానమునకు చాల భేదముంది. బొంబాయిలో కార్మికులనుండే కొంతమంది మిలిటెంటు వర్కర్లు ప్రారంభమునుండి తయారైనారు. కార్మికులలో బ్రహ్మాండమైన వర్గచైతన్యము కల్గింది. ఇచ్చట కార్మికుల్లోనుండి పనిజేసేవర్కర్లు లేరు: పెటీబూర్జువా వర్గములోని, విద్యావంతులలోని విప్లవ భావములు గలవారు మాత్రమే పనిజేయుటవలన ఇచ్చట కార్మికోద్యమము కార్మిక ప్రజాసామాన్యములోనికి పోరబడలేదు. కార్మికుల వర్గచైతన్యము బొంబాయిలోవలె హెచ్చు స్థాయిలోలేదు. కొంతకాలానికి కార్మికుల్లోనుండి కొంతమంది వర్కర్లు తయారైనారు. గాని బొంబాయిలోవలె ఈ వర్కర్లు కార్మికసంఘ నాయకులుగా తయారుగాలేదు. కార్మిక సంఘముయొక్క నాయకత్వము పెటీబూర్జువా యువకుల, విద్యావంతులచేతుల్లోనే వుంది. అందుచేత కార్మికోద్యమములో సంస్కరణవాదులతో పోరాటము కార్మిక ప్రజాసామాన్యములోనికి గొంపోబడలేదు. ఈ కారణంచేత తరువాత సంస్కరణవాదులకు, కమ్యూనిస్టులకు వచ్చిన తగాదాలలో కార్మికవర్గాన్ని సంస్కరణవాదులు మోసగించగల్గారు. బొంబాయిలో మొదటినుండి కార్మికవర్గమునుండే బయలుదేరినవర్కర్లు యూనియన్ నాయకులుగాయుండుటచేత, వారికి సంస్కరణవాదుల యెత్తులన్నీ ప్రారంభమునుండీ తెలియుటచేత కార్మికులలో సంస్కరణవాదుల పలుకుబడి హెచ్చుగా పనిచేయలేదు.

బొంబాయిలోవలెనే యిచ్చట గూడ కమ్యూనిస్టుగ్రూపు "కార్మిక కర్షక పార్టీ"లో వున్నప్పటికిని పార్టీ నిర్మాణము చేయబడలేదు. ఆందోళన చేయుట మాత్రమే జరిగింది.

## సంయుక్త రాష్ట్రములలో పార్టీనిర్మాణ ఫలితాలు

ఈ కాలములో యిచ్చట కార్మికులలో పనిజేయబడలేదు. ఇచ్చటగూడ "కార్మికకర్షకపార్టీ" యేర్పడింది. ప్రథమములో విద్యార్థులతో సంబంధము కలుగజేసుకోబడింది. తరువాత కాంగ్రెసులోని విప్లవభావాలుగల యువకులతోను, అప్పటికే రైతుల్లోపనిజేస్తున్న కాంగ్రెసువర్కర్లతోను సంబంధము యేర్పడింది. బ్రహ్మాండమైన రైతుసభలు గావించ బడ్డాయి. ఒక ముఖ్యమైన రైతు సభమీరట్‌లో "కార్మిక కర్షకపార్టీ" ఆధ్వర్యము క్రింద యీ కాలములోనే జరుపబడింది. ఆసభద్వారా ఆరాష్ట్రములోని అతివాదులందరితోను "కార్మిక కర్షకపార్టీ"కి సంబంధము గల్గింది.

విద్యార్థులలో మార్క్సిజాన్ని గూర్చి ప్రచారము చేయబడింది. బెనారస్ హిందూవిశ్వ విద్యాలయము విద్యార్థులలో కొన్ని మార్క్సిస్టు గ్రూపులు యేర్పరచబడ్డాయి. వీటితో "కార్మిక కర్షకపార్టీ" పూర్తియైన సంబంధాలుపెట్టుకుంది. విద్యార్థులలో యేర్పడ్డమార్క్సిస్టు గ్రూపులు యొకమాసపత్రికను కొంతకాలమునడిపాయి దీనిపేరు "క్రాంతికారి". ఈపత్రికద్వారా ఆకర్షింపబడి విద్యార్థి, మార్క్సిస్టు సర్కిల్సులో పనిచేస్తున్నవారు కార్మిక కర్షక పార్టీ" సభ్యులలో ముఖ్యభాగం వీరు. "కార్మిక కర్షక పార్టీ"లో కమ్యూనిస్టు గ్రూపుగా యేర్పడ్డవారు యీ రాష్ట్రములోని మొదటి మార్క్సిస్టు కేడర్లు.

## పంజాబ్

ఇచ్చట యు పి లో వలెనే కార్మికులలో యేమీ పనిచేయబడలేదు. ఇచ్చట ప్రత్యేకంగా "కార్మిక కర్షక పార్టీ" యేర్పడలేదు. ఆరాష్ట్రములో విప్లవభావములుగల యువకులు రెండు విధాలుగావున్నారు. టెర్రరిస్టులుగాను, కిసాన్‌వర్కర్లుగాను వున్నారు; టెర్రరిస్టులపార్టీ "నవజవాన్ భారతసభ". ఇది

"హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీ" (భగవత్‌సింగు వగైరాలు దీని నాయకులు) యొక్క పలుకుబడిలోవుంది. కిసాన్‌వర్కర్లందరు "కీర్తిపార్టీ"లో వున్నారు. ఇది అమెరికాలోనున్న "గదరు పార్టీ" పలుకుబడిలోవుంది. ఏపార్టీకిగూడ మార్క్సిస్టు అభిప్రాయములులేవు. "కీర్తిపార్టీ"పై కొంచెముగా "గదరుపార్టీ"కి పలుకుబడియుండుటచేత సోషలిజం అంటే అస్పష్టమైన భావాలు వున్నాయి. కాని వీర్కిగూడా "నవజవాన్ భారతసభ"వారివలెనే టెర్రరిస్టు అభిప్రాయములే హెచ్చుగావున్నాయి.

ఈ రెండు సంఘాలలోను మార్క్సిస్టు గ్రూపులు యేర్పరచి మార్క్సిజమునుగూర్చి ప్రచారం చేయబడింది. మార్క్సిస్టు అభిప్రాయములు వ్యాపింపజేసి టెర్రరిస్టుభావాలనుండి వీరిని మార్చడానికి ప్రయత్నం చేయబడింది. "నవజవాన్ భారతసభ" ద్వారా యువజనులలోను, "కీర్తిపార్టీ" ద్వారా రైతులలోను ప్రచారం చేయబడింది; "కీర్తిపార్టీ"నుండి కొందరితోను, "హిజ్రతీ"లలో కొందరితోను కలసి "కీర్తికిసాన్‌పార్టీ" యేర్పరచబడింది. ఈ పార్టీలో మన పలుకుబడి బాగా వ్యాపించింది; కిసాన్ ప్రచారము యీ పార్టీద్వారా తీవ్రపర్చబడింది. "కీర్తికిసాన్‌పార్టీ"ద్వారా కమ్యూనిస్టు గ్రూపు ఒకటి యీ రాష్ట్రములోగూడ యేర్పరచబడింది

అమృతసర్‌లోవున్న ఉన్నిపరిశ్రమ కార్మికులతో కమ్యూనిస్టు గ్రూపుకు కొంతసంబంధము యేర్పడింది. కాని యిదినామమాత్రమే. "కీర్తిపార్టీ" "గదరుపార్టీ" సహాయంతో "కీర్తి" అనేపత్రిక గూడ స్థాపించబడింది. ఈ పత్రికద్వారా అచ్చటి కమ్యూనిస్టు గ్రూపుకొంత మార్క్సిస్టు ప్రచారము చేస్తూ వున్నప్పటికిని, యీ పత్రికముఖ్యంగా వ్యక్తి దౌర్జన్యవాదం గూర్చే ప్రచారం చేస్తూ వుండేది. అందుచేత హెచ్చుగా మార్క్సిస్టు ప్రచారము యీ పత్రికద్వారా చేయబడలేదు.

వివిధ రాష్ట్రాల్లో పై విధంగా "కార్మిక కర్షకపార్టీ" తరఫున కార్మికులలో కార్మికోద్యమాభివృద్ధికై కృషిజేయబడింది; కాంగ్రెసులోని, కాంగ్రెసేతర సంఘాలలోని విప్లవభావాలుగల యువకులతో బూర్జువాప్రజాతంత్ర నినాదాలపై రాజకీయాందోళన, ప్రచారం జరుపబడింది. దీనితోపాటు సోషలిస్టుప్రచారం గూడ చేయబడింది. దీని ఫలితంగా ప్రతిరాష్ట్రములో కమ్యూనిస్టు గ్రూపులుయేర్పడ్డాయి. ఈ గ్రూపులు కార్మికులలోను, విప్లవ భావాలుగల యువకుల్లోను బాగా పలుకుబడి సంపాదించాయి; రాజకీయాందోళన, ప్రదర్శనాలు నూతన నినాదాలతో చేయబడ్డాయి. (బూర్జువా ప్రజాతంత్ర విప్లవ కార్యక్రమము, నినాదాలు) మార్క్సిస్టు భావప్రచారం విరివిగా సాగింది. ముఖ్యంగా గాంధితత్వమంటే అసంతృప్తిగాంచి ప్రజాపోరాటము నభివృద్ధిచేయడానికి నూతన పద్ధతుల, కార్యక్రమము కొరకు తడుములాడే విప్లవభావములుగల యువకులలో మార్క్సిజము గూర్చిబాగా ప్రచారం జేయబడింది. ఈ విధంగా వెనుకటి (1919-1926 మధ్యకాలము) కాలములోకన్నా పార్టీ నిర్మాణము యీ విషయములో కొంతవరకు ముందుకుపోయాము.

(1) ప్రతిరాష్ట్రములో కమ్యూనిస్టు గ్రూపులు యేర్పడ్డాయి.

(2) ఈ కమ్యూనిస్టు గ్రూపులు కార్మికోద్యమమును అభివృద్ధి చేశాయి. కార్మికులకు ట్రేడ్ యూనియన్ చైతన్యము గల్గింది. ప్రజా పలుకుబడిగల్గిన ట్రేడ్‌యూనియన్లు (కార్మిక సంఘాలు) యేర్పడ్డాయి. అఖిలభారత నేతపరిశ్రమ కార్మికోద్యమము, జి. ఐ. పి. రైల్వే కార్మికోద్యమము, ఇ. ఐ. రైల్వే కార్మికోద్యమము యెర్రజెండా ప్రాబల్యముక్రిందకు వచ్చాయి. కార్మికుల్లో యెర్రజెండాగూర్చి విరివిగా ప్రచారమొనర్చబడింది. కార్మికులుగూడ రాజకీయ ప్రదర్శనాల్లో పాల్గొనుట ప్రారంభించారు (సైమన్‌కమీషన్ బహిష్కార ప్రదర్శనములు).



(౩) గాంధి పోరాట పద్ధతులకును, జాతీయ బూర్జువా నిర్మాణ కార్యక్రమమునకు వ్యతిరేకంగా మార్క్సిస్టు (కార్మిక పోరాట పద్ధతులను, ప్రజా ప్రదర్శనములు, సమ్మెవిధానం, బహిరంగ సభలద్వారా తీవ్ర ఆందోళనము గావించుట వగైరా) పోరాట పద్ధతులు, సోషలిస్టు సిద్ధాంతములు దేశములో ప్రచారం చేయబడ్డాయి. దీనివలన గాంధి పోరాటపద్ధతులతో అసంతృప్తిచెందిన విప్లవ భావములుగల యువకులలో తీవ్ర రాజకీయాందోళన గావించుటకు, ప్రజా పోరాటాన్ని అభివృద్ధి గావించుటకు ఆందోళనా పద్ధతులు, పోరాట పద్ధతులు లభించాయి. అందువలన యీ కాలములో కార్మికోద్యమము అభివృద్ధి అగుటేగాక, బూర్జువా ప్రజాతంత్ర విప్లవ కార్యక్రమము, నినాదముల నాధారముగాగొని తీవ్ర రాజకీయాందోళన కాంగ్రెసులోని, కాంగ్రెసు బయట ప్రజా సామాన్యములో జరుపబడింది. ఈ ఆందోళనా ఫలితంగా కాంగ్రెసులో సంపూర్ణ స్వాతంత్ర్యమే కాంగ్రెసు ఆశయంగా వుండాలనే ఒక బలమైన అతివాదబృందము యేర్పడింది; కాంగ్రెసు నాయకత్వము పూర్తిగా రాజీ పద్ధతులు మానుకొనకపోయిననూ, సంపూర్ణ స్వాతంత్ర్యమును గడించుటే కాంగ్రెసు ఆశయంగా అంగీకరించక తప్పిందిగాదు. (1927 మద్రాసు కాంగ్రెసు)

(4) బూర్జువా ప్రజాతంత్ర విప్లవ కార్యక్రమము, వినాదాలు కాంగ్రెసులోని, కాంగ్రెసు బయటనున్న విప్లవ యువకులలో ప్రచారం గావింపబడ్డాయేగాని, వార్కి తగిన మార్క్సిస్టు పరిజ్ఞానము కలుగజేసి, వారిని కమ్యూనిస్టులుగా తయారుచేసి పార్టీ నిర్మాణమునకు పూనుకోలేదు. అందుచేత 1930 వ సంవత్సరములో జాతీయోద్యమము వచ్చినప్పుడు, ప్రభుత్వ నిర్బంధమువలన (మీరట్ కేసు) ముఖ్యమైన కమ్యూనిస్టులందరూ జైళ్ళకు పంపబడ్డప్పుడు జాతీయోద్యమములో కార్మికవర్గం పాల్గొనేటట్లుచేసి, తద్వారా కార్మికవర్గ పోరాట పద్ధతులద్వారా శాసనోల్లంఘనోద్యమమును నిజమైన విప్లవోద్యమముగా మార్చుటకు అవకాశము లేకపోయింది; తగిన పార్టీ కేడర్లు తయారుచేయబడక పోవడమే యిందుకు కారణం.

(5) రాజకీయాందోళనలోను, కార్మికోద్యమములోను మునిగిపోయి, పార్టీ నిర్మాణమును వదలుటచేత కేవలం ఆందోళనాపరులుగను, మిలిటెంటు ట్రేడ్ యూనియనిష్టులుగా మాత్రమే "కార్మిక కర్షక పార్టీ" సభ్యులు తయారైనారు; పార్టీసభ్యులుగా అభివృద్ధిగాలేదు. ప్రభుత్వ నిర్బంధము రాగానే ముఖ్య పార్టీ నాయకులు అందరూ అరెస్టుగాబడ్డారు. దానితో కార్మికోద్యమము బలహీనపడింది. తదుపరి శాసనోల్లంఘనం వచ్చినప్పుడు కార్మికవర్గాన్ని దానిలో పాల్గొనేటట్లు చేసి దాని విప్లవ పాత్రను నిర్వహించేటట్లు చేయడానికి తగిన పార్టీ లేకపోవడంవలన జాతీయోద్యమము నుండి పార్టీ తాత్కాలికంగా దూరమైపోయింది. అరెస్టుకాగా మిగిలివున్న పార్టీసభ్యులలో జాతీయోద్యమములో పాల్గొనాలనే రాజకీయపరిజ్ఞానం లేకపోవడంవలన సెక్టేరియన్ దృక్పధంతో పాల్గొనకుండా వుండిపోయారు. వీటికన్నిటికి కారణం యింతకుముందు పార్టీని నిర్మించడానికి కార్మిక మిలిటెంట్సుకు పూర్తి మార్క్సిస్టు పరిజ్ఞానం కలుగజేయడానికి తీవ్ర ప్రయత్నం చేయబడక పోవడమే.

(౬) కార్మికవర్గం రాజకీయాల్లో ప్రవేశించి రాజకీయోద్యమముపై కార్మికవర్గ ప్రభావమును ప్రసరింపజేయుటకుగాను, రాజకీయరంగములో ప్రవేశించాలని యిప్పుడిప్పుడే గుర్తించుతోంది.

(7) అఖిల భారత ట్రేడ్‌యూనియన్ సంఘాన్ని సంస్కరణవాదుల పలుకుబడినుండి తప్పించుటకుగాను ప్రయత్నాలు చేయబడ్డాయి; అ. భా. ట్రేడ్ యూనియన్‌లోపల బలమైన మిలిటెంటు ట్రేడ్ యూనియన్ గ్రూపు ఒకటి యేర్పరచబడి సంస్కరణవాదులతో తీవ్ర పోరాటము సాగింపబడింది.

## పార్టీ కేంద్రనాయకత్వమును యేర్పరచుటకు ప్రయత్నాలు

ఇంతవరకు వివిధరాష్ట్రాలలో పార్టీని నిర్మించుటకు గావించిన ప్రయత్నాలు చూశాము; వాటి ఫలితాలు చూశాము యీ కాలంలో పార్టీ కేంద్ర నాయకత్వమును యేర్పరచుటకు గూడ ప్రయత్నం జరిగింది

1928 వ సంవత్సరములో కలకత్తాలో కాంగ్రెసు సమావేశము జరుగుచున్నప్పుడు, అఖిల భారత కార్మిక కర్షకపార్టీ ప్రథమసమావేశం జరుపబడింది. అన్నిరాష్ట్రాలనుండి కార్మిక కర్షకపార్టీ ప్రతినిధులేగాక వివిధరాష్ట్రాల కమ్యూనిస్టు గ్రూపుల ప్రతినిధులు వచ్చారు. ఇంతకు ముందు అన్ని రాష్ట్రాల కమ్యూనిస్టుల ప్రతినిధులు ఒకచోటయెప్పుడూ సమావేశంగాలేదు; 1925 లో కాన్‌పూర్‌లో (స్ప్రాట్, బ్రాడ్లేలు రాకపూర్వం) ఒకసమావేశం చేయబడ్డది. అందులో డాంగే, ఘాటే వగైరాలు గూడ వున్నారు. కాని అదివాస్తవముగా అఖిలభారత సమావేశముగాక పోవుటేగాక, కమ్యూనిస్టు కాన్ఫరెన్సుగూడగాదు. అందులోనికి పోలీసుయేజెంట్లుగూడ వచ్చారు. అప్పుడు సమావేశకర్తలుగూడ కమ్యూనిస్టులుగారు. యం. యన్. రాయి అనుచరులు. అందుచేత నామకః 1925 లో కాన్పూర్‌లో ఒక కాన్ఫరెన్సు జరుపబడి నప్పటికి (ఇందులో నామకః ఒక సెంట్రల్‌కమిటీ గూడ యెన్నుకోబడింది; అదితరువాత యెప్పుడూ సమావేశము గాలేదు) అన్నిరాష్ట్రాల ప్రాతినిధ్యంతోను, నిసలైన మార్క్సిస్టులతోను గూడిన ప్రథమకమ్యూనిస్టు కాన్ఫరెన్సు యిప్పుడే జరిగింది. అంతవరకు స్ప్రాట్. బ్రాడ్లేలు దేశమంతటా పర్యటనముచేస్తూ వివిధరాష్ట్రాల ప్రతినిధులతో సంబంధాలు గల్గియున్నప్పటికి అందరూ కలసియింతకు ముందుయెన్నడూ సమావేశముగాలేదు. అందుచేత సెంట్రల్ కమిటీగూడయేర్పడలేదు.

ఈ కాన్ఫరెన్సులో అట్టిసెంట్రల్ కమిటీని యేర్పరచారు, (కాని వెంటనే మీరట్‌అరెస్టులు జాతరం వలన మరల యీ కమిటీగూడ సమావేశంగాలేదు.) అప్పుడే అఖిలభారతపార్టీ కార్యక్రమాన్ని, పార్టీనిబంధనావళిని, పార్టీపత్రికను యేర్పరచుటకు నిర్ణయింపబడెనుగాని యేమీ అమలు జరుగలేదు. పార్టీకార్యక్రమమును తెలియపర్చుచూ యొక కరపత్రం అచ్చువేయబడింది. దీనిపేరు "కాల్‌టు యాక్షన్" (A call to action) దానిలో వివిధ రాష్ట్రాలలో జరుపబడిన 'కార్మికకర్షక పార్టీ' సమావేశాల తీర్మానాలు క్రోడికరింపబడ్డాయి. అంతకు తప్పమరేమీలేదు.

ఈ సమావేశములో గత 3 సంవత్సరములనుండి చేయబడ్డపార్టీ నిర్మాణపు పని, కార్మికోద్యమపుపని, రాజకీయాందోళన గూర్చి చర్చించబడింది. అంతవరకు పార్టీ నిర్మాణమునకు సరిగాశ్రద్ధ చూపలేదనే విషయం గుర్తించబడింది. మార్క్సిస్టుకేడర్లను యేర్పరచుటలో వెనుకబడ్డవిషయం, పార్టీ నిర్మాణమునకన్నా ట్రేడ్ యూనియన్‌పనికి, రాజకీయాందోళనకు శక్తినంతా వినియోగించి కేవలం



మిలిటెంటు ట్రేడ్ యూనియనిస్టులగా మాత్రమే తయారైనామనే విషయాన్ని గుర్తించారు. ఇక ముందు కమ్యూనిస్టు కేడర్లను తయారుచేయుటకు, పార్టీ నిర్మాణమునకు యెక్కువశ్రద్ధ వహించుటకు, ట్రేడ్‌యూనియన్ వుద్యమములో తయారైన మిలిటెంటు వర్కర్లను నిజమైన ట్రేడ్ యూనియనిస్టులుగా తయారుచేయుటకు, అందులో పూర్తి చైతన్యము గలవారిని పార్టీ కేడర్లుగా తయారుచేయడానికి నిశ్చయించబడింది.

ఈ పై సమావేశం చేయకముందు ఆ సమయములో సమావేశమౌతున్న కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్ ఆరవ కాంగ్రెసు సమావేశం (1928) లో తయారుచేయబడ్డ "కలోనియల్ థీసిస్" లోని కొన్ని భాగాలుమాత్రమే భారత దేశమునకు పంపబడ్డాయి. ఇవి పై నిర్ణయాలు గావించడానికి పూర్తిగా తోడ్పడ్డాయి. ఈ నిర్ణయాలు చేయబడ్డప్పటికిని అమలు జరుపబడలేదు. ఎందుకు అమలు జరుపబడజాలకపోయాయో ముందు చర్చించబడుతుంది. ఈవిధంగా యీ కాలములో కేంద్ర పార్టీ నాయకత్వమును యేర్పరచుటకు ప్రయత్నములు చేయబడ్డప్పటికిని జయప్రదము గాలేదు.

ఈ ప్రథమ అ. భా. కార్మిక కర్షక పార్టీ సమావేశము రాజకీయ ప్రదర్శనమునకు పనికి వచ్చింది. ఈ సమయంలో "అఖిల భారత కార్మిక కర్షక పార్టీ" నాయకత్వముక్రింద 20000 మంది కార్మికులతోను, యువకులతోను బ్రహ్మాండమైన ప్రదర్శనం (బూర్జువా ప్రజాతంత్ర రాజకీయ నినాదాలతో) అఖిల భారత కాంగ్రెసు కమిటీ సమావేశమగుచున్న ప్రదేశంలోనికి తీసుకుపోబడింది. ఇందువలన కాంగ్రెసు నాయకత్వమునకు కోపమువచ్చిననూ, కాంగ్రెసు వాలంటీర్లలోను, అచ్చట కాంగ్రెసు సమావేశములో పాల్గొనుచున్న వివిధ రాష్ట్రాల ప్రతినిధులలోను యీ ప్రదర్శనం పూర్తి చైతన్యం కలిగించింది. ఈ ప్రతినిధులద్వారా బూర్జువా ప్రజాతంత్ర విప్లవ నినాదాలు, రాజకీయాందోళనా పద్ధతులు దేశములోని వివిధ ప్రాంతాలకు గొంపోబడినాయి. ఈ విధంగా పార్టీ నినాదాలను ప్రదర్శింపజేయడానికి యీ సమావేశం వుపయోగపడిందిగాని అఖిల భారత పార్టీ కేంద్రపార్టీ నాయకత్వమును స్థాపించుటకు వుపయోగపడలేదు. ఇంతవరకు పార్టీ అవలంబించిన పార్టీ నిర్మాణ పద్ధతులు పార్టీని నిర్మించుటకు సరిపోవనియు, యింకా యెక్కువ శ్రద్ధతో పార్టీ కేడర్లను అభివృద్ధి చేయుటకు ప్రయత్నించాలని మాత్రం గుర్తించబడింది.

# మూడవ భాగము

## పార్టీ నిర్మాణ చరిత్ర

## (1929—1933)

1926 నుండి 1928 వ సంవత్సరం ఆఖరు వరకు 3 సంవత్సరములలో కార్మిక కర్షకపార్టీ ద్వారా జరుపబడిన పార్టీనిర్మాణ ప్రయత్నాలను చూశాము. ఈ ప్రయత్నాల ఫలితంగా పార్టీనిర్మింపబడక పోయినను, పార్టీకేంద్ర నాయకత్వమును యేర్పరచ జాలకపోయినను. భారతదేశములో కమ్యూనిస్టుపార్టీని నిర్మించుటకు తగిన పరిస్థితులు యేర్పడ్డాయి. ఆ పరిస్థితులుయివి.

(1) ప్రతిరాష్ట్రములోను కమ్యూనిస్టు గ్రూపులు యేర్పడ్డాయి.

(2) ఈ గ్రూపులన్నిటికి ఒకదానికొకదానికి సంబంధాలు యేర్పడ్డాయి. కాని యింకా కేంద్ర పార్టీనాయకత్వం యేర్పడలేదు.

(3) కార్మికులలో వర్గచైతన్యమభివృద్ధిఅయింది. వర్గకలహసిద్ధాంతం అనుసరించి పనిచేసే కార్మికోద్యమము ఉద్భవించింది. ప్రజాపలుకుబడిగల్గి, కమ్యూనిస్టుల నాయకత్వము క్రిందనడుపబడు చున్న కార్మిక సంఘాలు యేర్పడ్డాయి. (గిర్నికంగారు యూనియన్; జి. ఐ. పి. రైల్వేప్రాథమిక సంఘాలు, బెంగాల్ జూట్ పరిశ్రమ కార్మిక సంఘాలు) ఈ విధంగా సంస్కరణవాద కార్మికోద్యమమునకు వ్యతిరేకంగా మిలిటెంటు ట్రేడ్ యూనియనోద్యమము అభివృద్ధిఅయింది.

(4) కమ్యూనిస్టు నినాదాలు, బూర్జువా ప్రజాతంత్రవిప్లవ నినాదాలు దేశములోని వివిధప్రాంతాల ప్రజలలో వ్యాపించాయి. వీటి నాధారముగాగొని కాంగ్రెసు మితవాదకార్యక్రమమునకు వ్యతిరేకంగా తీవ్రరాజకీయాందోళన ప్రారంభమైనది. గొప్పరాజకీయ ప్రదర్శనాలు, సభలు జరుపడం ప్రారంభమైనవి.

(5) కార్మికోద్యమము అభివృద్ధి అవడంతోను, కార్మికవర్గం రాజకీయరంగములో ప్రవేశించడంతోను (సైమన్ కమీషన్‌ను బహిష్కరిస్తూ వ్యతిరేక ప్రదర్శనాలు) కార్మికవర్గంనుండి కొంత



మంది మిలిటెంటు వర్కర్లు తయారైనారు. ఈ వర్కర్లనుండి పార్టీసభ్యులను తయారుచేయడానికి అవకాశమేర్పడింది.

ఈ పరిస్థితులేర్పడినను యీ కాలములోగూడ పార్టీ నిర్మింపబడకుండుటకు యే కారణాలు అడ్డువచ్చాయో వాటినిగూర్చి తెలుసుకొనుట అవసరము. ఈ కాలములో పార్టీ నిర్మాణ చరిత్ర యీ పై విషయాలనుగూర్చే తెలియపర్చుతుంది. 1929 వ సంవత్సరము లగాయతు పార్టీ నిర్మాణచరిత్రను పరిశీలించేముందు అంతర్జాతీయంగా జరిగిన కొన్ని ముఖ్య విషయాలు, ఘటనలుగూర్చి తెలుసుకోవడము అవసరం.

1928 వ సంవత్సరములో కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్ ఆరవకాంగ్రెసు సమావేశం జరిగింది. ఆ సమావేశములో ప్రథమసారిగా వలసరాజ్యాలకు సంబంధించిన రాజకీయవిషయాలు, పార్టీనిర్మాణ సిద్ధాంతాలు పూర్తిగా చర్చించబడ్డాయి. (వలసరాజ్యాలలో ప్రజాపుద్యమాలను యెలా సాగించాల్సింది, పార్టీ నిర్మాణమును యెలా కొనసాగించవలసిందీ). ఈ విషయాలన్నీ కలిపి ఒక థీసీస్ తయారు చేయబడింది. దీనినే ఆరవకాంగ్రెసు "కలోనియల్ (వలస రాజ్యాలకు సంబంధించిన) థీసీస్" అన్నారు.

ఈ సమయములోనే 'రెడ్ ఇన్‌టర్‌నేషనల్ ఆఫ్ లేబరు యూనియన్సు' నాలుగవసమావేశం గూడ జరుపబడింది. ఈ 'రెడ్ ఇన్‌టర్ నేషనల్ ఆఫ్ లేబరు యూనియన్సు' గూర్చి క్లుప్తంగా తెలుసుకోవడం అవసరం. యుద్ధానంతరం. యుద్ధము జరుగుచున్నప్పుడు సోషల్ డెమాక్రాట్లు, రెండవ అంతర్జాతీయ మహాసభ (సెకండ్ ఇన్‌టర్ నేషనల్) బూర్జువా వర్గమునకు అన్నివిధాలా తోడ్పడుతూ కార్మిక వర్గమునకు ద్రోహంచేసింది. యుద్ధానంతరం చెలరేగిన (యూరపులో) కార్మిక విప్లవాలను అణచుటలో బూర్జువావర్గ ప్రభుత్వాలకు తోడ్పడ్డారు. ఈ పాలసీకి వ్యతిరేకంగా, (రిఫార్మిస్టు పాలసీకి) కమ్యూనిస్టులు కార్మికులపక్షాన నిలబడిపోరాడారు. యుద్ధానంతరం సోషల్ డెమాక్రాట్లు ప్రభుత్వ స్థానాల్లోయుండి ప్రభుత్వ యంత్రాన్ని, కార్మికులపై తమ నాయకత్వాన్ని నిలుపుకోడానికి సకలవిధాలా వుపయోగించారు. తద్వారా సంస్కరణవాద సిద్ధాంతాలను, పరిస్థితులను కార్మికోద్యమముపై స్థిరపర్చుటకు ప్రయత్నిస్తూ వున్నారు. కార్మిక విప్లవాలు అణచివేయబడ్డ తదుపరి కార్మికుల్లోగూడ నిరుత్సాహం వ్యాపించింది. ఈ అవకాశాన్ని తీసుకొని, కమ్యూనిస్టులను అణచివేయడానికి, కమ్యూనిస్టు విప్లవసిద్ధాంతములను, మిలిటెంటు ట్రేడ్ యూనియన్ పద్ధతులను రూపుమాపడానికి సోషల్ డెమాక్రాట్లు ప్రయత్నించారు. దీని కనుకూలంగా ధనికవాదులు, సంస్కరణవాద అభిప్రాయముల పై కార్మికోద్యమము నడపబడుటకు సోషల్ డెమాక్రాట్లకు తోడ్పడ్డారు. కార్మికులలో పై భాగానికి కొన్ని సౌకర్యములు, హెచ్చు జీతాలు యేర్పరచడం ప్రారంభించారు. ఈ పరిస్థితులలో విప్లవ కార్మికోద్యమ సిద్ధాంతాలకొరకు పోరాడుటే కమ్యూనిస్టులకు ముఖ్య కర్తవ్యమైనది. ట్రేడ్‌యూనియన్‌లలో హెచ్చుభాగం సోషల్ డెమాక్రాట్లచేతుల్లో వున్నాయి వాటిల్లోనుండి కమ్యూనిస్టులను, కమ్యూనిస్టుల పలుకుబడిక్రిందవున్న కార్మికులను తరిమివేయడంచేత మరోమార్గం లేక కమ్యూనిస్టులు "రెడ్ లేబరు యూనియన్"లు పెట్టాల్సివచ్చింది. ఇవి మన దేశంలోని "గిర్నికంగారు యూనియన్" మాదిరి సంఘాలు. వివిధ దేశాలలోను యీపరిస్థితులే యుండుటచేత అన్ని ప్రదేశాల్లోగూడ యిట్టి "రెడ్ లేబరు యూనియన్"లను కమ్యూనిస్టులు యేర్పరచవలసి వచ్చింది. వీటిని సరియైన అంతర్జాతీయ దృక్పథంతో నడిపించుటకు, వాటి సిద్ధాంతజ్ఞానాన్ని అభివృద్ధిపర్చుటకు

వివిధ దేశాలలోని "రెడ్ లేబరు యూనియన్"ల ప్రతినిధులతో 'రెడ్ ఇంటర్ నేషనల్ ఆఫ్ లేబరు యూనియన్స్" స్థాపించబడింది. ఇది కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్‌తోనే స్థాపించబడింది.

పార్టీ నిర్మాణమునకు సంబంధించినంతవరకు యీ రెండు అంతర్జాతీయ సభలయొక్క నిర్ణయాలు క్లుప్తంగా తెలుసుకోవడం అవసరం. ఎందుచేతనంటే యీకాలములో రాజకీయ రంగంలోను, పార్టీ నిర్మాణ రంగంలోను, కార్మికోద్యమ రంగంలోను, మనము అవలంబించిన పంథాను సరిగ్గా అర్థం జేసుకోవడానికి యీ నిర్ణయాలు తెలుసుకోవడం అవసరం. ఈ నిర్ణయాల ననుసరించే మనం పార్టీని నిర్మించుటకు ప్రయత్నాలుచేశాము.

## పై రెండు అంతర్జాతీయ సభల నిర్ణయాలు

### కమ్యూనిస్టు అంతర్జాతీయ ఆరవ కాంగ్రెసు నిర్ణయాలు :

వలస రాజ్యాలలోని విప్లవ జాతీయోద్యములలో గల్గిన చారిత్రాత్మకమైన అభివృద్ధినిగూర్చి, వాటివిభిన్న పోకడలనుగూర్చి, వుద్యమములో సంభవించిన వివిధ రకములైన మార్పుల గూర్చి సమగ్రమైనచర్చ కమ్యూనిస్టు ఇన్‌టర్‌నేషనల్ ఆరవసమావేశంలో చేయబడింది. ఈ చర్చాఫలితంగా కొన్ని సిద్ధాంతాలు (అన్ని వలస రాజ్యాలకు అనువర్తించే సామాన్య సూత్రాలు) చేయబడ్డాయి; "వలస రాజ్యాలలోని, అర్థవలస రాజ్యాలలోని విప్లవ జాతీయోద్యమము గూర్చిన థీసీస్" (Thesis on the revolutionary movement in the colonies & semi-colonies) అనబడే "కలోనియల్ థీసీస్" తయారుచేయబడింది. ఈ థీసిస్ తయారు చేయడంలోను, వలస రాజ్యాలలోని విప్లవ వుద్యమాలను సమీక్ష చేయడంలోను, 1920 వ సంవత్సరములో కమ్యూనిస్టు ఇన్‌టర్‌నేషనల్ రెండవసమావేశములో వలసరాజ్యాల విప్లవ వుద్యమాలగూర్చి, తయారుచేయబడ్డ 'కలోనియల్ అండ్ నేషనల్ థీసిస్' ఆధారంగా తీసుకోబడ్డది. అందుచేత అప్పుడు లెనిన్ తయారు చేసిన 'థీసీస్'లోని సిద్ధాంతములపైననే ముఖ్య నిర్ణయాలు ఆధారపడివున్నాయి. ఆరవ కాంగ్రెసు అప్పుడు వలసరాజ్యాలలో వున్న విప్లవోద్యమాలకు (ప్రతి దేశమునకు ప్రత్యేక పరిస్థితులను, ఆ దేశ పార్టీ నిర్మాణ అవస్థనుబట్టి) ఆచరణయోగ్యమైన, తక్షణమే అమలు జరుపవలసిన (సిద్ధాంత, ఆచరణలకు సంబంధించిన) నిర్ణయాలు చేయబడ్డాయి. ఇచ్చట యీ కడపటి నిర్ణయాలు మాత్రమే మనపార్టీ నిర్మాణమునకు సంబంధించినంత వరకు తెలుపబడ్డాయి.

ఆరవకాంగ్రెసు సమావేశమునకుముందే వలసరాజ్యాలసమస్య చర్చించబడింది. వలసరాజ్యాల విప్లవ వుద్యమాలను నడిపించుటకు, సరిచూచుటకును 'కలోనియల్ బ్యూరో' అనేదాన్ని కమ్యూనిస్టు ఇన్‌టర్‌నేషనల్ యేర్పరచిందనియు, దానికి డైరెక్టరుగా యమ్. యన్. రాయిని నియమించినదనియు యిదివరలో చూచాము. యమ్. యన్. రాయి కమ్యూనిస్టు ఇన్‌టర్‌నేషనల్ పాలసీగాక తన వ్యక్తిపంథాను, మార్క్సిస్టు వ్యతిరేక దృక్పథముతో వ్యవహరించాడనిగూడ చూశాము. యమ్.యన్. రాయి ఆరవ కాంగ్రెసునాటికి (అంతకుముందే ప్రారంభమైనది) 'డికాలనైజేషన్' అనే ఒక క్రొత్త వలసరాజ్యాల "థీసీస్"నుతయారు చేశాడు. అందుచేత కమ్యూనిస్టు ఇన్‌టర్‌నేషనల్ యీ వివిధ సమస్యలను సమగ్రముగా చర్చించి 'కలోనియల్ థీసీస్'ను తయారు చేయుటకు 'కమ్యూనిస్టు ఇన్



టర్‌నేషనల్' కార్యసంఘసభ్యులలో నొకడైన "కూషినిన్" ఆధ్వర్యముక్రింద యొక వుపసంఘాన్ని 1927 వ సంవత్సరములో నియమించింది. ఈ వుపసంఘసహాయంతో "కూషినిన్" 'కలోనియల్' థీసీస్‌ను తయారు చేశాడు.

### యమ్. యన్. రాయి. "డికాలనైజేషన్" సిద్ధాంతము

'కలోనియల్ థీసీస్' యొక్క ముఖ్యనిర్ణయాలు (పార్టీనిర్మాణ చరిత్రకు సంబంధించినంత వరకు) తెలుసుకునే ముందు యమ్. యన్. రాయి. డికాలనైజేషన్' సిద్ధాంతముగూర్చి తెలుసుకుందాము. ఈసిద్ధాంతము మార్క్సిస్టుమూల సిద్ధాంతాలకే పూర్తిగావ్యతిరేకముగా వుండుటచేత ఆరవ కాంగ్రెసు దాన్ని చర్చించడానికి గూడ నిరాకరించింది.

కేపిటలిస్టు దేశాలలోని పారిశ్రామికాభివృద్ధి వుచ్ఛస్థాయికి వచ్చిందనియు, యికఅంతకన్నా హెచ్చుగా పారిశ్రామికాభివృద్ధిని కేపిటలిస్టు దేశాల్లోగావించడం కేపిటలిస్టులకు లాభదాయకముగా దనియు, అందుచేతసామ్రాజ్య వాద దేశాలు వాటివలసరాజ్యాలలో యంత్రాలను స్థాపించి వలసరాజ్యాల పారిశ్రామికాభివృద్ధిని తమయాజమాన్యముక్రింద సాగిస్తారనియు, అప్పుడు వలసరాజ్యాల బూర్జువా వర్గమునుగూడతమలో చిన్నభాగస్థులగా చేసుకుంటారనియు, అందుచేత వలసరాజ్యాల బూర్జువావర్గమునకు, సామ్రాజ్యవాదానికి రాజీకుదిరి వలసరాజ్యాల పరిశ్రమలు అభివృద్ధి పొందుతాయనియు, అచ్చటి విప్లవోద్యమమును, సామ్రాజ్యవాదము అచ్చటి బూర్జువావర్గముకలసి అణచివేస్తాయనియు యీ 'డికాలనైజేషన్' సిద్ధాంతం చెప్పుతోంది. ఇలా సామ్రాజ్యవాదంతో రాజీపడదడంవలన సామ్రాజ్యవాద వ్యతిరేకతను జాతీయబూర్జువా వర్గం విడనాడి జాతీయోద్యమమును అణచుటకు సామ్రాజ్యవాదంతో కలసివుంటుందని యీ సిద్ధాంతం' చెప్పుతుంది.

బ్రిటిష్ సామ్రాజ్యవాదం హిందూదేశపు పారిశ్రామికాభివృద్ధిని అరికట్టదనియు, బూర్జువా వర్గముతోకలసి యిచ్చటయంత్రాలను స్థాపించి పరిశ్రమలను అభివృద్ధిచేస్తుందనియు, ఇలాచేయడం యిదివరకే ప్రారంభించిందనీ యీ "సిద్ధాంతం" వాదన. అందుచేతనే బూర్జువావర్గము జాతీయోద్యమమును సక్రమముగా సాగించడం లేదనియు, సామ్రాజ్యవాద వ్యతిరేకపాత్రను వదిలివేసి విప్లవ ప్రతీఘాతకశక్తిగా తయారౌతోందనియు. గాన విప్లవ భావాలుగల మధ్యతరగతి, పెటీబూర్జువా వర్గవిద్యావంతులతోగూడిన మరొకప్రజానాయకత్వంక్రింద కాంగ్రెసును తిర్గిఆర్గనైజ్ చేయాలనియు ఈవాదన తెల్పుతుంది. ఇందుకు ప్రస్తుత కాంగ్రెసునాయకత్వమును కాంగ్రెసునుండి బయటకు వెళ్లగొట్టాలని యం.యన్. రాయి వాదిస్తూవున్నాడు. ఇదేసమయములో కార్మికవర్గరాజకీయనాయకత్వమును గూడ వ్యతిరేకిస్తున్నాడు. ఎందుచేతనంటే భారత దేశములోని పారిశ్రామిక కార్మికసంఖ్య మధ్యతరగతి, పెటీబూర్జువా వర్గములతో పోల్చిచూచినప్పుడు చాల తక్కువగా వుందనియు, రాజకీయచైతన్యముగూడ తక్కువే అనియు. అందుచేత ప్రస్తుతం జాతీయోద్యమానికి కార్మికవర్గం నాయకత్వము వహించలేదనియు, మధ్యతరగతి, పెటీబూర్జువా వర్గనాయకత్వమును యేర్పరచుటకు కమ్యూనిస్టులు పనిచేయాలని 'డికాలనైజేషన్' సిద్ధాంతముద్వారా యమ్,యన్.రాయి వాదించాడు. అందుకు కాంగ్రెసులో ప్రథమంలో "పీపుల్సుపార్టీని" తరువాత "రేడికల్" పార్టీని ఆర్గనైజ్ చేయాలని యమ్. యన్. రాయి. వాదించాడు. "డీకాలనైజేషన్" ముఖ్యసిద్ధాంతంయిది.

(1) జాతీయబూర్జువా వర్గం సామ్రాజ్యవాద వ్యతిరేక దృక్పథమును, పాత్రను వదలుకుంది. జాతీయోద్యమములో ఒక విప్లవ ప్రతీఘాత పాత్రను మాత్రమేసాగిస్తూ ప్రభుత్వముతో సహకారం చేస్తుంది.

(2) కార్మిక వర్గం అల్పసంఖ్యాకముగా నుండుట చేతనూ, రాజకీయచైతన్యం హెచ్చుగా లేనందున జాతీయోద్యమములో రాజకీయ పాత్రను తగినంతగా వహించి వుద్యమానికి నాయకత్వము సంపాదించలేదు కాన కార్మికవర్గరాజకీయ పార్టీని స్థాపించుటకు ప్రయత్నించుట అనవసరము.

(3) జాతీయ బూర్జువావర్గం సామ్రాజ్యవాద వ్యతిరేకపాత్రను వదలుకుందిగాన, మధ్యతరగతి పెటీ బూర్జువా వర్గనాయకత్వము స్థాపించాలి. అందులకు తయారు చేయుటకు యీ వర్గముయొక్క రాజకీయపార్టీని, (కాంగ్రెసులో "పీపుల్సుపార్టీ" స్థాపించాలని అప్పుడు వాదించాడు) జాతీయఅతివాదుల పార్టీని స్థాపించాలని వాదించాడు. ఈ విధంగా జాతీయ బూర్జువావర్గసామ్రాజ్యవాద వ్యతిరేక పాత్రను గుర్తించక, కార్మిక వర్గరాజకీయ పాత్రను అంగీకరించక మధ్యతరగతి, పెటీబూర్జువా వర్గరాజకీయ పాత్రను గూర్చి హెచ్చుగా తలచాడు. (Over estimate)

ఈ "డికాలనైజేషన్" సిద్ధాంతమును మార్క్సిస్టువ్యతిరేక సిద్ధాంతముగా పరిగణించి కమ్యూనిస్టుఇన్టర్ నేషనల్ ఆరవకాంగ్రెసు పూర్తిగా నిరాకరించింది. అదేగాకుండా యమ్. యన్. రాయి అనుచరులను అరని ప్రచారమునకు వ్యతిరేకముగా తీవ్రమైన సిద్ధాంతపోరాటాన్ని అన్నివలసరాజ్యాలలో సాగించవలసినదిగా కమ్యూనిస్టులను హెచ్చరించింది.

కమ్యూనిస్టు ఇన్టర్ నేషనల్ ఆరవ కాంగ్రెసు నిర్ణయాలు :

ఇక "కమ్యూనిస్టు ఇన్టర్‌నేషనల్" ఆరవకాంగ్రెసు భారతదేశ పార్టీ నిర్మాణమునకు సంబంధించినంతవరకు యే నిర్ణయాలు గావించిందో చూద్దాము ఈ క్రింది వుత్తరువులు భారతదేశ కమ్యూనిస్టులకు అందజేసింది.

(1) 1926 నుండి 28 వ సంవత్సరమువరకు పార్టీని నిర్మించుటకు గావించిన ప్రయత్నాల ఫలితంగా, కమ్యూనిస్టుల ఆందోళన, పని ఫలితంగా కార్మికుల్లో అద్భుతమైన వర్గచైతన్యము గల్గినదనియు, ప్రజా వుద్యమముగూడ అభివృద్ధి పొందుతోందనియు, యిలాంటి పరిస్థితుల్లో కార్మికవర్గ రాజకీయ పార్టీని యేర్పరచుటకు, అభివృద్ధి చేయడానికి అవసరమైన భౌతిక పరిస్థితులు భారతదేశములో యేర్పడ్డాయనియు, కమ్యూనిస్టు యిన్టర్‌నేషనల్ ఆరవకాంగ్రెసు భావించింది. కార్మికవర్గమునకు సోషలిస్టు చైతన్యం కలుగజేయుటకు జాతీయోద్యమములో కార్మికవర్గం తగిన పాత్రవహించి దాన్ని విప్లవోద్యమముగా మార్చుటకు అట్టి పార్టీ అవసరం. ఈ పార్టీ యేర్పడనిదే ప్రజా వుద్యమము విప్లవ వుద్యమముగా మారుటగాని, కార్మికవర్గమునకు సోషలిస్టు చైతన్యం యేర్పడుటగాని జరుగదు. అందుచేత కమ్యూనిస్టులు వెంటనే అట్టి పార్టీ నిర్మాణమునకు పూనుకోవాలి. ఈ పార్టీ పూర్తిగా రహస్యపార్టీగా వుండాలి. (అప్పటికి భారత దేశంలో కమ్యూనిస్టు పార్టీని బహిష్కరించలేదు. అయినప్పటికినీ అప్పటికే ఈ పార్టీ రహస్యముగా పనిజేయుటకు యేర్పాట్లు గావించాలని "కమ్యూనిస్టు ఇన్టర్ నేషనల్" హెచ్చరించినది.) అట్టి పార్టీని నిర్మించుటకుగాను అప్పటికి భారత దేశములో వివిధ రాష్ట్రాలలోవున్న వివిధ మార్క్సిస్టు గ్రూపులను ఐక్యపరచి వెంటనే యొక కేంద్ర



నాయకత్వమును యేర్పరచాలనియు, యీక్రింది నాయకత్వము రహస్యముగా వుండాలనియు చెప్పబడింది. కేంద్ర నాయకత్వమును యేర్పరచుటేగాక, పార్టీ యే కొద్దిమందితోనో నిర్మింపబడకుండా కార్మికఉద్యమముద్వారా, ప్రజా వుద్యమము ద్వారా తయారైన మిలిటెంటు వర్కర్లను పార్టీ సభ్యులుగా తయారుచేసి పార్టీని అన్నివర్గాలలోనికి ముఖ్యంగా కార్మిక వర్గంలోనికి విస్తరింపజేయాలి.

ఈవిధంగా రహస్య పార్టీ కేంద్ర నాయకత్వమును స్థాపించడం, పార్టీ కేడర్లను తయారు చేయడం - కమ్యూనిస్టుల ప్రథమ, తక్షణ కర్తవ్యంగా నిర్ణయింపబడింది.

(2) 1926 నుండి 28 వరకు "కార్మిక కర్షకపార్టీ" తరఫునచేయబడ్డ (వివిధ రాష్ట్రాలలో) పార్టీనిర్మాణప్రయత్నాలను పరిశీలించి యిలానిర్ణయించబడింది. కార్మిక కర్షకపార్టీ'నే కమ్యూనిస్టు పార్టీగా పనిజేయించుటకు ప్రయత్నించారనియు, కమ్యూనిస్టు గ్రూప్సు యేర్పరచబడిననూ అవిగూడ పార్టీని నిర్మించుటకు ప్రయత్నించకుండా "కార్మిక కర్షక పార్టీ" తోనే లీనమైపోయాయనియు, అందువలన నామమాత్రముగా మాత్రమేయుండిపోయాయని తెలియపర్చింది. పార్టీయెలానిర్మింపబడాలో చెప్పింది. వివిధవర్గములతో గూడినది కమ్యూనిస్టుపార్టీ గాదనియు, కార్మికవర్గముయొక్క రాజకీయ పార్టీగానే కమ్యూనిస్టుపార్టీ వుంటుందనియు, అట్టిపార్టీలో భిన్నభిన్న సిద్ధాంతాలకు, ఆదర్శములకు, క్రమ శిక్షణకు తావుండదని తెలియపర్చింది. "కార్మిక కర్షక పార్టీ"లో కేవలం మార్క్సిస్టులేగాక, అనేక అస్పష్టమైన, విప్లవభావములుగల వారందరు యుండుటచేత, అదియొక కార్మికవర్గపార్టీ గానేరదనియు, అందుచేత కమ్యూనిస్టుపార్టీని "కార్మిక కర్షకపార్టీ"లో బ్రాంచిగాగాక ప్రత్యేకంగా యేర్పరచవలయుననియు, అందులో కేవలంస్పష్టమైన మార్క్సిస్టు అభిప్రాయములుగల, క్రమశిక్షణకు లోబడేవారిని మాత్రమే జేర్చుకోవాలనే కమ్యూనిస్టుపార్టీ ప్రాథమిక నిర్మాణ సూత్రములు తెలియజేయబడ్డాయి. "కార్మిక కర్షక పార్టీ"ని రద్దుగావించి, దానిని పార్టీగా పనిచేయించుట మానివేయాలని నిర్ణయింపబడింది. కమ్యూనిస్టు నినాదాలను, బూర్జువా ప్రజాతంత్ర విప్లవకార్యక్రమాన్ని, ప్రచారము గావించుటకు 'కార్మిక కర్షకపార్టీ' ప్రదర్శనాలు, సభలుమాత్రము యేర్పరచుతూ వుండవచ్చు; ఇలా చేస్తుంటే 'కార్మిక కర్షకపార్టీ, ద్వారా కూడగట్టిన విప్లవ, సామ్రాజ్యవాదవ్యతిరేక శక్తులు చెల్లాచెదరైపోకుండా చేయవచ్చును. ఈ విధంగా కమ్యూనిస్టుపార్టీని వివిధవర్గాల సిద్ధాంతాలతోగూడిన పార్టీగాగాక కేవలం కార్మికసిద్ధాంతాలను, కార్మికవర్గరాజకీయపాత్రను అంగీకరించి పనిజేయునట్టి స్పష్టమైన మార్క్సిస్టుభావాలుగల వారితోనే నిర్మించాలని హెచ్చరించింది.

(3) జాతీయోద్యమము, దానియెడల కమ్యూనిస్టులు అవలంబించాల్సిన వైఖరిగూర్చి తరువాత విచారించబడింది. జాతీయ పోరాటంలో తప్పక కమ్యూనిస్టులు పాల్గొనాలనియు, తద్వారా జాతీయోద్యమముపై జాతీయ బూర్జువా సంస్కరణవాదముయొక్క పలుకుబడిని తొలగించి, కార్మికవర్గ రాజకీయ పలుకుబడిని, నాయకత్వాన్ని (Hegemony) స్థాపించాలని చెప్పింది. 1930 వ సంవత్సరములో వచ్చే జాతీయ పోరాటాన్ని ముందుగానే తెలుసుకోగల్గింది. అందుచేత జాతీయోద్యమములో కార్మికవర్గం తగిన పాత్ర వహించుటకు కార్మికవర్గాన్ని రాజకీయంగా సిద్ధంచేయాలనియు, యిందులకు కమ్యూనిస్టులు నిర్మాణయుత్తంగా బలముగా వుంటేనే ఈ కర్తవ్యాన్ని నెరవేర్చగల్గుతారనియు, అందులకు ప్రథమకర్తవ్యంగా పార్టీనిబలపర్చి ఈ కార్యానికి తయారుచేయాలనియు గూడ తెల్పింది.

ఈ విషయములో ఒక హెచ్చరికగూడ చేయబడింది. జాతీయ బూర్జువా నాయకత్వమును కేవలం విమర్శించినంతమాత్రమున దాని సంస్కరణతత్వము ప్రజలకు వెల్లడిగాదనియు, పోరాటములో ప్రజలతోపాటు పాల్గొని ఆచరణలో బూర్జువా పోరాటపద్ధతులకన్న కార్మికవర్గ పోరాటపద్ధతులు యెలా వుత్తమమైనవో, బూర్జువా నాయకత్వము రాజీకి యెలా ప్రాకులాడుచు పోరాటగమనాన్ని ఆటంకపర్చుతుందో, యెలా కార్మికవర్గ పంథాద్వారానే బ్రిటిష్ సామ్రాజ్యవాదం అంతం చేయబడుతుందో, - యీ విషయాలన్నీ పోరాటము వచ్చినప్పుడు పోరాటములో పాల్గొంటూ ప్రజ ప్రజలకు విశదపర్చాలి. ఇలా ఆచరణలో, పోరాటములో పాల్గొనుటద్వారా ప్రజలకు విశదపర్చకుండా కేవలం పోరాటాన్ని, బూర్జువా నాయకత్వమును మాటలలో విమర్శించుతూవుంటే ప్రజలు యీ విమర్శనను అర్థం చేసుకోజాలకపోగా, కమ్యూనిస్టులకు వ్యతిరేకులుగాకూడా తయారు అవుతారు. అట్టి విమర్శవలన ప్రజలపై బూర్జువా నాయకత్వము, పలుకుబడి స్థిరపడుతుంది అందుచేత కమ్యూనిస్టులు యీ అపాయాన్ని గుర్తించాలని హెచ్చరించింది. అందులకే యిప్పటినుండి నిర్మాణయుక్తంగా పార్టీని బలపర్చవలసినదిగా హెచ్చరించింది; పార్టీ కేడర్లను అభివృద్ధి చేయవలసినదిగా తెలియపర్చింది. (దీని వుద్దేశ్యము జాతీయ నాయకత్వముయొక్క సంస్కరణ తత్వమును విమర్శించుట తప్పనిగాదు. అలా విమర్శించకపోతే మరీ హానివస్తుంది. విమర్శించడం సరియైన పంథా. విమర్శనతోగూడ పై విధమైన ఆచరణలేకపోతే గలిగే నష్టాలగూర్చి, తద్వారా పార్టీకి సంభవించే అపాయాన్నిగూర్చి ముందుగానే హెచ్చరించింది. దీన్నిబట్టి యెంతదూరదృష్టితో ప్రవర్తించినదీ గ్రహించవచ్చును.)

ఇక కార్మికోద్యమములో కమ్యూనిస్టులు ఎలా పనిజేయాలనే విషయాలగూర్చి "రెడ్ ఇంటర్నేషనల్ ఆఫ్ లేబరు యూనియన్స్" యేమిచెప్పిందో ఆలోచిద్దాము. ముఖ్యంగా 1926 నుండి 28 వ సంవత్సరంవరకు, అంతకు తర్వాత యుద్ధానంతరం, కార్మికులసమ్మెలగూర్చి పూర్తిగా పరిశీలనచేసి, యీ క్రింది నిర్ణయాలను గావించింది.

(1) ప్రథమ విషయంయిది. భారత దేశకార్మికోద్యమము యింకాలిబరల్ సంస్కరణవాదుల (వీరు సమ్మెలనే నిరోధిస్తారు) జాతీయసంస్కరణవాదుల (సమ్మెలను నిరోధించరు; ఆర్థికసమ్మెలు తప్పితే రాజకీయ సమ్మెలు చేయవద్దంటారు) పలుకుబడిలోనేవుంది. వీరిపలుకుబడి కార్మికులలో నశించనిది కార్మికోద్యమము నిజమైన మిలిటెంటుట్రేడ్ యూనియన్ పంథాను గూడ అభివృద్ధిగాదు. (రాజకీయ పాత్రను వహించడం అలావుంచినసూ) అందుచేత కమ్యూనిస్టులు కార్మికోద్యమమును పైసంస్కరణవాదుల పలుకుబడినుండి తప్పించుటకుగాను సంస్కరణవాదముగూర్చి సిద్ధాంత పోరాటాన్ని కార్మికప్రజాసామాన్యము మధ్య (నాయకులలోనేగాక) నిరంతరం సాగిస్తూవుండాలి. (ఇది ఆచరణలో యెలా అనుసరించాలో తక్కిన విషయాల్లో తెలియపర్చబడింది)

(2) కమ్యూనిస్టుల పలుకుబడి క్రిందవున్న ట్రేడ్ యూనియనులలో యెలాపనిజేయాలో చెప్పబడింది. ఇట్టి ట్రేడ్ యూనియనులలో పూర్తివర్గచైతన్యము కార్మికులలో వుత్పన్నమైన మాటవాస్తవమే. అందువలన ప్రతిఫ్యాక్టరీలోను "మిల్లుకమిటీలు" యేర్పరచబడ్డాయి. కార్మికులనుండే కార్మికహక్కులకు పనిజేసేనాయకులు యేర్పడ్డారు. ఈ నాయకులను, కమిటీల పలుకుబడిని యజమానులుగూడ గుర్తించక తప్పిందిగాదు. అట్టిపరిస్థితులలో యీ "కమిటీలను" కేవలం సమ్మెవచ్చి



నప్పుడు సమ్మెనడుపుటకు, ఆందోళనచేయుటకే యేర్పరచకుండా యెల్లప్పుడూ సక్రమ పద్ధతులలో కార్మికుల దైనందిన కష్టాల గూర్చిపాటుబడే నిజమైనట్రేడ్ యూనియన్లుగా తయారుచేయాలి. సరియైన ఆఫీసులను యేర్పరచాలి. జమాఖర్చులను యెప్పటికప్పుడు తెలియపర్చుతూవుండాలి. ఇలా చేసినప్పుడే ప్రజలకు, యీ "కమిటీలకు" ఘనిష్ఠసంబంధము యేర్పడుతుంది. నాయకులను కేవలం ఆందోళనాపరులుగా మాత్రమేగాక నిజమైన - సమర్థతగల ట్రేడ్‌యూనియన్ నిర్వాహకులుగాను, ఆర్గనైజర్లుగాను తయారుచేయాలి. ఈ విధంగా తయారుచేసిన విప్లవోత్సాహమునకు తోడు, విప్లవాన్ని ఆర్గనైజ్‌చేసే శక్తి, విప్లవానంతరం పరిపాలనాకౌశలం అబ్బుతుంది.

(3) కమ్యూనిస్టులు కార్మికులలో పనిచేయుటకు ప్రారంభించకముందుగూడ ట్రేడ్‌యూనియనులు వున్నాయి. గాని అవి నామకః పై కమిటీలుగా మాత్రమే వున్నాయి. వాటికార్మిక సభ్యత్వము బహుస్వల్పము. కమ్యూనిస్టులు కార్మికోద్యమములో ప్రవేశించిన తదుపరి ట్రేడ్ యూనియన్లు ప్రజాబాహుళ్యమైన సంఘాలుగా మారాయి. కార్మికుల ప్రేమను, విశ్వాసాన్ని చూరగొన్నాయి. ఇలా ట్రేడ్‌యూనియన్లు కార్మికులతో ఘనిష్ఠసంబంధము యేర్పరచగల్గినప్పుడే, ప్రజాబాహుళ్యమైనప్పుడే కార్మికోద్యమము విప్లవపంథాను అనుసరించగల్గుతుంది. అందుచేత కమ్యూనిస్టులు కేవలం 'గిర్నికంగార్ యూనియన్'తోను, జి. ఐ. పి. రైల్వేకార్మికుల యూనియన్‌తోనేగాక యిలాంటి వుద్యమాన్ని, అప్పట్లో సంస్కరణవాదుల చేతుల్లోవున్న ప్రతియూనియన్‌లోను ప్రవేశించిదాన్ని ప్రజాబాహుళ్యమైన సంఘముగా తయారుచేయాలి. సంస్కరణవాదులతో నిరంతరం సిద్ధాంతపోరాటము జరుపుటతోనే సంతృప్తిగాంచక, కార్మికుల దైనందిన కష్టాలకొరకు సమ్మెలను గావించుటకు, యిందులకై యూనియన్ నాయకత్వము నంగీకరించి పనిజేయుటకు కార్మికులలో నిరంతరం ఆందోళనగావించాలి. ఈ ఆందోళనలోనే సంస్కరణవాదుల తత్వాన్నిబట్టబయలుచేయాలి. ఈ విధంగా సంస్కరణవాదులనాయకత్వపుపలుకుబడిని నాశనముగావించి కమ్యూనిస్టుల పలుకుబడిని హెచ్చించాలి. సంస్కరణవాదుల నాయకత్వాన్ని విమర్శించడం ఆయాయూనియనులలోని కార్మికులవర్గచైతన్యమును బట్టివుండాలి; హెచ్చుమంది కార్మికులు కమ్యూనిస్టులు యిచ్చేకార్యక్రమమును సమర్థించేటట్లు వుండాలి. ఈ విధంగా సంస్కరణవాదుల పలుకుబడి క్రమేణా క్షీణింపజేసే యెత్తులు అవలంబించాలి.

(4) సంస్కరణ వాదులు, కమ్యూనిస్టులు గూడ ప్రవేశించని పరిశ్రమలుయింకా చాలా వున్నాయి. అట్టి పరిశ్రమల కార్మికుల్లో కమ్యూనిస్టులు ప్రవేశించి తీవ్రంగా పనిజేయాలి.

ఈ పై నిర్ణయాల ముఖ్యోద్దేశము యిది.

(1) ఈ కాలములో అభివృద్ధి అయిన కార్మిక వుద్యమముద్వారా తయారైన మిలిటెంటు వర్కర్లను సమర్థులయిన ట్రేడ్ యూనియనిష్టులుగాను, ఆర్గనైజర్లుగాను, తయారుచేయాలి; వీరినుండి పార్టీ సభ్యులను తయారుచేయాలి. వారిని రాజకీయ దృష్టి, వర్గచైతన్యముతో పని చేయగల్గిన ఆందోళనపరులుగా తయారుచేయాలి. (2) సంస్కరణవాదులతో సిద్ధాంతపోరాటాన్ని తీవ్రపర్చాలి; (కొత్త) ట్రేడ్ యూనియన్ వుద్యమాన్ని నిజమైన ప్రజావుద్యమముగా తయారుచేయాలి.

పార్టీ నిర్మాణమునకు సంబంధించినంతవరకు పై నిర్ణయాలను 1928 వ సంవత్సరం ఆఖరులో 'కమ్యూనిస్టు ఇన్‌టర్ నేషనల్' భారత దేశ కమ్యూనిస్టులకు అందజేసింది. ఈ నిర్ణయాలను యీ

కాలములోను, ముందుకాలములోను (1934 నుండి 1935 వరకుగూడ) భారతదేశ కమ్యూనిస్టులు యెలా అమలుపర్చారో చూద్దాము.

ఇందులకుగాను 1929 లో మీరట్ అరెస్టులు జరగడానికిముందు భారత దేశములోని పరిస్థితు లను క్లుప్తంగా పరిశీలన చేద్దాము.

## మీరట్ కేసుకు పూర్వమున్న పరిస్థితులు :

1926 నుండి యింతవరకు కమ్యూనిస్టుల నినాదాలవలన రాజకీయాందోళన తీవ్ర పర్చబడింది. 1929 వ సంవత్సరం ప్రారంభమునాటికే ప్రభుత్వమునకు ముందురానున్న జాతీయోద్యమ చిహ్నాలు కనుపించాయి. 1920 - 22 వ సంవత్సరములమధ్య చెలరేగిన జాతీయోద్యమమునకు, ముందు రానున్న జాతీయోద్యమమునకు వున్న భేదమును పూర్తిగా ప్రభుత్వము గ్రహించింది. ఈ మధ్య ప్రజలలోగల్గిన చైతన్యం, అభివృద్ధి అయిన సంఘటిత కార్మికోద్యమము, విప్లవభావాల ముఖ్యంగా కమ్యూనిస్టు భావాల ప్రభావము, ప్రచారము - వీటి అన్నిటిబట్టి ప్రభుత్వము ముందు రానున్న జాతీయోద్యమ తీవ్రతను, అందులో కమ్యూనిస్టుల కార్మికోద్యమ ప్రాబల్యమును పూర్తిగా గ్రహిం చింది. ఇంతవరకూ బహిరంగ ప్రచారము, ఆందోళన చేయనిచ్చింది. ఇక దీనినిసాగనిస్తే వుండే ప్రమాదమును గ్రహించింది కార్మికోద్యమము పూర్తిగా అభివృద్ధి పొందినది. ఈ అభివృద్ధి కమ్యూనిస్టుల పని, ప్రచారమువలన గల్గింది. అందుచేత తీవ్రమైన సమ్మెలు గావించబడ్డాయి. (బొంబాయి, కలకత్తా, నాగపూర్ నేత పరిశ్రమ కార్మికుల సమ్మెలు) జయంపొందాయి గూడాను. ఇందువలన కార్మికోద్యమముపై కమ్యూనిస్టుల పలుకుబడి అభివృద్ధి అయింది. ఈ సమ్మెలద్వారా కార్మికుల పోరాటశక్తి అభివృద్ధి అయింది. చైతన్యం వృద్ధిచెందింది. ఇంతకుముందు యిట్టి చైతన్య పూర్వకమైన సమ్మెలు యెన్నడూ చేయబడలేదు. ఎర్రజెండా కార్మికులలో పూర్తిగా ప్రచారం గావించబడింది. విప్లవ భావాలతోగూడిన కార్మిక సంఘాలు అభివృద్ధి పొందడమేగాక అవి ప్రజా బాహుళ్యమై అన్నిచోట్లకు యెర్రజెండా పలుకుబడి వ్యాపించుతోంది. కేవలం ఆర్థిక సమ్మెలు చేయడమేగాక, రాజకీయ నినాదాలుగూడ యీ సమ్మెలలో యివ్వబడి, కార్మికులకు రాజకీయ చైత న్యము కలుగజేయబడుతోంది కార్మికులు తమ సంఘటిత శక్తితో రాజకీయాల్లో ప్రవేశించడం ప్రారంభమౌతోంది.

జాతీయ బూర్జువా పోరాటపద్ధతులతో, సిద్ధాంతాలతో అసంతృప్తిచెందిన యువకులు అనేక మంది యువజన సంఘాలు స్థాపించి కమ్యూనిస్టులచే యివ్వబడ్డ బూర్జువా ప్రజాతంత్ర విప్లవ నినా దాలతో రాజకీయాందోళన గావిస్తున్నారు. సంపూర్ణస్వాతంత్ర్యము గావాలనే ప్రచారంచేస్తున్నారు. వీరిలో చాలమంది సోషలిజమువైపుకు మ్రొగ్గుచున్నారు. యువజనసంఘాలన్నీ కమ్యూనిస్టుల పలుకు బడిక్రిందగాని, టెర్రరిస్టుల పలుకుబడి క్రిందగాని స్థాపించబడుచున్నాయి.

రైతులు కాంగ్రెసు పలుకుబడి క్రింద వున్నప్పటికిని (బార్డోలీ, ఆంధ్ర, యు.పి. వగైరా ప్రదే శాల్లో) రైతుల్లో విప్లవ భావాలు చెలరేగుతున్నాయి. రైతులకోర్కెలను ప్రభుత్వము సరకు చేయక పోవడంవలన (రైతువారీప్రదేశాల్లో అదనపుపన్నులు, వ్యాపారపు వ్యవసాయపువస్తువుల ధరలు పడి పోవడం, అటవీసత్యాగ్రహ మొనర్చినసూ అచ్చటి కష్టాలు ప్రభుత్వం తొలగించ కుండుట, జమీం



దారీ రైతులకు రక్షణలేకుండుట వగైరా) రైతుల్లో అశాంతి యింకా అలాగేవుంది. రైతుల్లోగూడ మరల జాతీయోద్యమము వచ్చినప్పుడు గొప్పతిరుగుబాట్లు వస్తాయనియు, అట్టివానిని కాంగ్రెసునాయ కత్వము గూడ కంట్రోలుచేయలేదనియు ప్రభుత్వం గ్రహించింది.

కాంగ్రెసు నాయకత్వముగూడ పూర్తిగా అసంతృప్తిపొంది వున్నది. "డొమీనియన్ స్టేటస్" కొరకు ఆందోళనచేస్తున్నప్పటికీ ప్రభుత్వం కాంగ్రెసుకోర్కెను సరకుజేయడంలేదు; పైగా "సైమన్ కమీషన్"ను నియమించి బూర్జువావర్గ ఆగ్రహానికి గురిఅయింది. ఆర్థిక సౌకర్యాలు చేయకపోగా వున్న సౌకర్యాలను గూడ ప్రభుత్వము లాగివేస్తోంది. ఈ కాలములో సామ్రాజ్యవాదము జాతీయ బూర్జువా వర్గముపై ఆర్థిక, రాజకీయవత్తిడి యింకా హెచ్చుగావించింది. అందుచేత బూర్జువా వర్గము లోని అందరు ప్రభుత్వముపై అసంతృప్తిచూపెట్టుచున్నారు. ఈ అసంతృప్తి సెంట్రల్ అస్సెంబ్లీలో "స్వరాజ్యపార్టీ" గావిస్తున్న "కాన్‌స్టిట్యూషనల్" పోరాటముద్వారా వెల్లడింప బడుతోంది.

కాంగ్రెసులో "సంపూర్ణస్వాతంత్ర్యము" కొరకు పోరాటము సాగించవలెననే కాంగ్రెసు ప్రజా సామాన్యము యొక్క ఆందోళన నానాటికి యెక్కువయింది; ఈ సమయములోనే "టెర్రరిజము" గూడ వ్యాపించుతోంది. (కాకోరీ, హిందూస్థాన్ సోషలిస్టురిపబ్లికన్ ఆర్మీ)

ఈ పై పరిస్థితులలో కాంగ్రెసు నాయకత్వముగూడ జాతీయోద్యమమును బూర్జువా హద్దులలో వుంచుకో జాలదని ప్రభుత్వం భావించి అట్టి జాతీయోద్యమము రాకముందే యీ తీవ్ర ఆందోళనకు, వుద్యమానికి కారకులైన కమ్యూనిస్టులపై పూర్తినిర్బంధము ప్రయోగించి అట్టి వుపద్రవము రాక ముందే జాగ్రత్తపడుటకు నిశ్చయించింది అదేగాకుండా యికముందు రాబోయే ఆర్థికదుస్థితి, అందు వల్లగల్గే బ్రహ్మాండమైన దేశవ్యాపిత వుద్యమమును రూపుమాపుటకుగాను ప్రభుత్వ వ్యతిరేకులందరు సమాయత్తముగాక ముందే ఒకొకరిని ఒకొకపర్యాయం జయించుటకు నిశ్చయించింది. ఈ ప్లానుతో వుద్యమానికి అగ్రగాములుగా యున్నట్టి, సంఘటిత, చైతన్యపూర్వక కార్మిక వుద్యమమునకు ఆధార ముగావున్న కమ్యూనిస్టులను అరెస్టుగావించడంతో జాతీయోద్యమముపై నిర్బంధం ప్రయోగించింది. ఈ విధంగా మీరట్ కుట్రకేసుబనాయించింది.

## మీరట్ అరెస్టుల తర్వాత పార్టీ నిర్మాణ ప్రయత్నాలు :

మీరట్‌కేసులో పార్టీ అఖిలభారత నాయకులందరినీ, రాష్ట్రాలలోని ముఖ్య పార్టీ నాయకులను ప్రభుత్వము అరెస్టుగావించింది తత్ఫలితంగా పార్టీపని ప్రతిచోటా స్తంభించిపోయింది. పార్టీని నిర్మిం చడంలో యింతకుముందు అనుసరించిన తప్పుడు పద్ధతులవలన యీ అరెస్టులతో పార్టీలోని బల హీనతలన్నీ బయటపడ్డాయి.

## మీరట్ అరెస్టులతో బయటపడ్డ పార్టీ బలహీనతలు :

(1) ట్రేడ్ యూనియన్ పనిని చేయగల్గుటకు మాత్రమే తగిన పార్టీ నిర్మాణమును యేర్ప రచగల్గితిమిగాని, అదేసమయాన రాజకీయంగా పార్టీ పనిజేయుటకు తగిన పార్టీకేడర్లను తయారు చేయజాలకపోయాం. అఖిల భారత కేంద్ర నాయకత్వం ఏర్పడలేదు. పార్టీపత్రిక స్థాపించబడలేదు. రాష్ట్రాలతో సరియైన రహస్య కాంటాక్టులువగైరా యేర్పాట్లు చేయకాలకపోయాము.

(2) నాయకులపై ప్రభుత్వము నిర్బంధము నుపయోగించి ప్రజలనుండి వేరుచేసినప్పుడు, ఉద్యమము ఆగిపోకుండా నిరంతరం పని సాగించుటకు, తగిన సామర్థ్యముగల కేడర్లను తయారు చేయజాలక పోయాం. కమ్యూనిస్టుల కృషిఫలితంగా కార్మికోద్యమము అభివృద్ధి అయినప్పటికిని, వేల కొలది మిలిటెంట్సు తయారైనప్పటికిని అట్టి కేడర్లను తయారు చేయజాలకపోయాము; మిలిటెంట్సును తగినట్లుగా వుపయోగించలేకపోయాము. అందుచేత నాయకులను ప్రజలనుండి వేరుచేయగానే కార్మికోద్యమము, రాజకీయాందోళన క్షీణించిపోయింది. (వెనుకసాగించే కేడర్లు లేకపోవడం వలన వున్న మిలిటెంట్సుకు ఏమిచేయాలో తెలియక నిస్పృహ యేర్పడడంవలన.)

(3) ప్రభుత్వ నిర్బంధమును జయప్రదంగా యెదుర్కొనగల్గేందుకు తగిన బలిష్ఠమైన పార్టీ నిర్మాణం చేయబడలేదు: మార్క్సిస్టు సిద్ధాంతాలు పార్టీని నిర్మించడానికన్నా హెచ్చుగా ఆందోళన గావించుటకే వుపయోగపడ్డాయి. కార్మికులలో సోషలిజముగూర్చి, సోవియట్ యూనియన్‌గూర్చి ప్రచారము చేశాముగాని, ప్రభుత్వ నిర్బంధమును యెదుర్కొనుటకుగాను మార్క్సిస్టు పంథా ననుసరించి బలిష్ఠమైన ప్రజా సంఘటనను యెలా గావించుకోవాలో వారికి చెప్పలేదు; వారికి ఆందోళన నేర్పాముగాని; సంఘటిత పద్ధతులనెలా అలవర్చుకోవాలో చెప్పలేదు.

(4) పార్టీని నిర్మించుటకు ప్రత్యేక ఆర్గనైజర్లులేరు; ట్రేడ్ యూనియన్ పనిచేసేవారే పార్టీ పని చూడడంమూలాన ట్రేడ్ యూనియన్ పనితప్ప పార్టీపని జరుగలేదు. పార్టీ నిర్మాణం వెనుక బడింది. ప్రజా సంఘాల పనిజేయడానికి, పార్టీ పనిజేయడానికి ప్రత్యేక కేడర్లను తర్ఫీదుగావించ లేదు. ప్రభుత్వం పార్టీ నాయకత్వమును నిర్బంధానికి గురిచేయగానే ట్రేడ్ యూనియను వుద్యమము పునాదిలేని భవనమువలె కూలిపోయింది.

ఈ విధంగా మీరట్ అరెస్టులవలన పార్టీనిర్మాణము స్తంభించిపోవడమేగాక కార్మికోద్యమము గూడ క్షీణించిపోయింది. దీనికి కారణం వుత్త ట్రేడ్ యూనియన్ దృక్పథంతో పనిచేయుటచేత పార్టీ నిర్మింపబడలేదు; సుసంఘటితమైన కార్మికోద్యమము అభివృద్ధిగాలేదు. పార్టీ నాయకులుగా గాక, ట్రేడ్ యూనియనిస్టులుగామాత్రమే కమ్యూనిస్టులు కార్మికోద్యమములో పనిజేయడంవలన పార్టీ కేడర్లుగాని, ట్రేడ్ యూనియన్ కేడర్లుగాని హెచ్చుగా అభివృద్ధిగాలేదు.

## మీరట్ అరెస్టు ఫలితాలు :

అఖిల భారత పార్టీ కేంద్రాన్ని స్థాపించుటకు, పార్టీని ఆరవ కాంగ్రెసు వుత్తర్వుల ననుసరించి నిర్మించుటకు అప్పుడే ప్రయత్నాలు జరుగుచున్నాయి. ఇంకా పని ప్రారంభముగూడగాలేదు, ఈ పరిస్థితులలో యీ అరెస్టులు వచ్చాయి. దీనితో అఖిల భారత పార్టీ నాయకులందరూ, కార్మిక నాయకులు అరెస్టు గావింపబడ్డారు. అఖిల భారతకేంద్రాన్ని యేర్పరచుటకు తయారైన పార్టీ కాంటాక్టులు, పార్టీకేడర్లు యీ అరెస్టులతో చెల్లాచెదరైపోయాయి. అప్పటిలో కొంతకాలమువరకు మరల యింతకుముందున్న కాంటాక్టుల పునరుద్ధరించుటచే అసంభవమైపోయింది. గత మూడు సంవత్సరాల నుండి గడించిన పార్టీ అనుభవము, ఈ అనుభవముగల కేడర్లు ఉద్యమమునుండి వేరుచేయబడ్డారు. అందుచేత మరల కార్మికోద్యమము వెనుకటి స్థాయికి రావడానికి మరికొంతకాలంపట్టింది.



## మీరట్ అరెస్టుల గుణపాఠాలు :

(1) ప్రభుత్వ నిర్బంధము సరత్రా వ్యాపించిన ప్రజా వుద్యమమును (చైతన్య రహితమైన వుద్యమాన్నిగూడా) పూర్తిగా రూపుమాపలేదు: ఆకస్మికంగా (spontaneous) వచ్చే తిరుగుబాట్లుగూడ ప్రభుత్వం యెంత క్రూరనిర్బంధ మువయోగించినను ఆకమానపు ఎందుచేతనంటే, యిట్టి తిరుగుబాట్లకు కారణమైన ఆర్థిక దోపిడీలేకుండా సామ్రాజ్యవాదము జీవించజాలదు గాబట్టి. ఈ దోపిడీవలన సామ్రాజ్యవాదమునకు, ప్రజలకు అనివార్యముగా వుత్పన్నమగుచున్న పరస్పర వైరుధ్యమమువలననే యీ తిరుగుబాట్లు వస్తూవున్నాయి. సామ్రాజ్యవాదము అంతమైనప్పుడే యీ స్పర్ధ, తత్ఫలితంగా గర్గే తిరుగుబాట్లు అంతమౌతాయి.

అందుచేత ప్రభుత్వము యిలాంటి తిరుగుబాట్లను ప్రోత్సహించుచూ, వాటిని సంఘటితమొనర్చుటకు, వాటికి చైతన్యం కలుగచేయడానికికృషిచేసే విప్లవ కేంద్రాలను, పార్టీలను రూపుమాపడానికి ప్రయత్నిస్తుంది. ఎందుచేతనంటే ప్రభుత్వంపై అసంతృప్తితో అనివార్యంగా వాటంతటకవే గర్గే ప్రజాతిరుగుబాట్లు సంఘటిత పద్ధతులతోను, స్పష్టమైన ఆశయాలతోను; చైతన్యముతోగూడిన ప్రజావుద్యమముగా మారినయెడల వాటిని అణచుట ప్రభుత్వతరము గాదు. ప్రజ లందరిపైన, వుద్యమ మంతటిపైనా నిర్బంధమును ప్రయోగించక, (అలాచేయడం అసంభవముగనుక), వుద్యమానికి చైతన్యముగల్గించే సంఘటితమార్గము చూపెట్టే విప్లవ సంఘాలపైన నిర్బంధాన్నంతా కేంద్రీకరించుచుండి.

(2) కమ్యూనిస్టు ఇన్‌టర్‌నేషనల్ ఆరవ కాంగ్రెసు నిర్ణయాలు మీరట్ అరెస్టుకు పూర్వమే కమ్యూనిస్టులకు అందజేయబడ్డప్పటికి. వివిధరాష్ట్రాలలోని మార్క్సిస్టు గ్రూపులను ఐక్యపర్చి అఖిల భారతపార్టీ కేంద్రాన్ని యెందుచేత యేర్పరచజాలక పోయారు ? కారణంయిది ఇంతకు పూర్వం కమ్యూనిస్టులు పార్టీని నిర్మించడానికి అవలంబించిన పద్ధతులు "ఏం చెయ్యాలి" అనే లెనిన్ గ్రంథములో వర్ణింపబడ్డ ప్రాధమిక (Primitive) పద్ధతులే కారణం. ట్రేడ్‌యూనియన్ పనిలో మునిగిపోయి పార్టీదానంతటకదే, (పార్టీని ప్రయత్నపూర్వకంగా నిర్మించకుండానే, కేడర్లను తయారు చేయకుండానే) నిర్మింపబడుతుందని కమ్యూనిస్టులు భావించారు. ట్రేడ్ యూనియన్ వుద్యమాన్ని అభివృద్ధిచేయడంతోపాటు పార్టీని నిర్మించకపోతే నిర్మించిన ట్రేడ్‌యూనియన్ వుద్యమముగూడ నిలవదనే మార్క్సిస్టు దృక్పథం లేకపోయింది. పార్టీ రాజకీయంగా యేంముఖ్యపాత్ర వహించుతుందో గ్రహించలేక ఉత్త ట్రేడ్ యూనియనిస్టులుగా పనిజేశారు. అందుచేతపార్టీ నిర్మాతలుగాగాక, మిలిటెంటు ట్రేడ్‌యూనియనిస్టులుగా మాత్రమే తయారయ్యారు. దీనిఫలితం కార్మిక ఆందోళన, సమ్మెల ప్రవాహములో కొట్టుకొనిపోయి ప్రభుత్వనిర్బంధమునకు గురిఅయ్యారు. దీనినే లెనిన్ దానంతటకదే (spontaneous) వచ్చు ప్రజావుద్యమాన్ని విప్లవస్థాయికి తీసుకపోవడానికి ప్రయత్నించడముకు బదులు, విప్లవకారులే (కమ్యూనిస్టులు) ఆ ప్రవాహములో పడికొట్టుకుపోవడమని అన్నాడు. ఈ విధంగా చేయడం సంఘటిత పద్ధతుల, పార్టీ పాత్రను గుర్తించక పోవడమే. [illegible] పార్టీని [illegible] నిర్మించుటకు నిరాకరించుటే పార్టీ ఆవశ్యకతను తెలుసుకోక పోవడమే. విప్లవమంటే వాటంతటకవే వచ్చే (spontaneous) ప్రజాతిరుగుబాట్లనే పొరపాటు అభిప్రాయముల్లు [illegible] యిట్టి ప్రాధమిక (primitive) పద్ధతులను విప్లవకారులు అనుసరిస్తున్నారు. పార్టీని నిర్మించడం, అఖిలభారత రాజకీయ దృక్పథము అలవర్చుకోడానికి నిరాకరించడం; కేవలం కార్మికోద్యమ సంకుచిత హద్దులలో

వుండి దేశంలో జరిగే రాజకీయ మార్పులను గుర్తించుటగాని, వాటిని అనుకూలంగా మార్చుటకుగాని పనిజేయాలని గుర్తించక పోవడమే అవుతుంది. ఇట్టివారు ట్రేడ్‌యూనియనిస్టులుగాని, కమ్యూనిస్టులుగారు.

మీరట్ అరెస్టులు - కార్మికోద్యమము బలహీనతలు

మీరట్ అరెస్టులు కార్మికోద్యమములో బలహీనతలను గూడ బయటబెట్టాయి. కమ్యూనిస్టులు కార్మికోద్యమములో ప్రవేశించిన తదుపరే కార్మికోద్యమమునకు వర్గచైతన్యముగల్గి ప్రజా బాహుళ్యమైన వుద్యమముగా తయారైనమాట వాస్తవమే. కాని యీ అభివృద్ధికి సరియైన పునాది యేర్పడలేదు. జయము లభించినను జయము స్థిరపర్చుకోవడానికి తగిన నిర్మాణము అభివృద్ధిగా లేదు. రోజువారీగూడ బాగా పనిజేసే ట్రేడ్ యూనియనులు యేర్పడలేదు; సరియైన ఆఫీసులులేవు. నిరంతరం వాటిని సక్రమముగా నడిపించుటకు, ప్రభుత్వనిర్బంధము వచ్చినప్పుడుగూడ, నాయకులు అరెస్టు గాబడ్డప్పటికి పని సాగించగల్గే సమర్థులైన ట్రేడ్‌యూనియన్ కేడర్లు తయారుగాలేదు. కార్మికసమ్మెలలో తీవ్ర ఆందోళన గావించుటకు, సమ్మెకమిటీలను నడిపించుటకు, సమ్మె విఘాతకులనుండి, రౌడీలనుండి కార్మిక ప్రజాసామాన్యాన్ని రక్షించడానికి తాత్కాలికంగా వాలంటీర్లు తయారైనమాట వాస్తవమే. కాని యీ వాలంటీర్లు సమ్మెరోజుల్లోను, నాయకులుండి పనిజేస్తున్నప్పుడు మాత్రమే పనిజేయగల్గినారు గాని, నాయకులు అరెస్టుగాబడ్డప్పుడు, ప్రభుత్వము నిర్బంధము వుపయోగించినప్పుడు కార్మికసంఘాల బాధ్యతలను నిర్వహించడం వీరికి చేతగాలేదు. ఇందుకు కారణం వీరికి సహజముగానే సంఘటనాపద్ధతులు తెలియకపోవుటవలన గాదు. వీరు సమ్మెలలో చూపెట్టిన సాహసము, ఆకస్మికంగా వచ్చు వుద్యమాలను యెంతవరకు సంఘటిత పద్ధతులతో నడుపుటకు వీలుంటుందో అంత సంఘటనాపరిజ్ఞానమును చూపెట్టారు. వీరిశక్తికి మించిన సాహసాలు ప్రదర్శించారు కాని వీరికి మార్క్సిస్టు చైతన్యముగల్గించి విప్లవవుద్యమస్థాయికి కార్మికోద్యమాన్ని గొనిపోవుటకు యేపంథా అనుసరించాలో వీరికి నేర్పకపోవడం నాయకులది తప్పు. నాయకులు చేయవలసినది యితరులను నాయకులుగా తయారుచేయడంగాని యితరులపై రపు నాయకత్వమును చలాయించుటగాదు; ఇతరులు చేయాల్సిన పనినంతా తామే చేయడంగాదు. ఇది బూర్జువా నాయకులు అవలంబించే పద్ధతి; విప్లవనాయకుల పంథాగాదు.

అందుచేత యీ మిలిటెంటు వర్కర్లు రాజకీయ దృష్టితో పనిజేయుటకు తయారు గాకపోయిననూ, కార్మిక సంఘాలను, కార్మికోద్యమాన్ని సంఘటిత పద్ధతులతో నిర్వహించుటకుగూడ తగిన చైతన్యము తర్ఫీదు పొందలేకపోయారు. కార్మికవర్గములోనుండి తయారైన కార్మిక నాయకులలో చాలమంది "గిర్నికంగారు మహామండల్"లో పనిచేసినవారే. హెచ్చుగా "జాబరు" క్లాసులోనుంచి వచ్చినవారుగూడాను. అందుచేత వీరి నాయకత్వము (వుత్తమ ఆందోళనా పద్ధతులు అలవర్చుకోగలగడంతప్ప) "జాబరు" మెత్తనం దశకన్నా మించలేదు. చైతన్యము రాలేదు. నాయకులు అరెస్టు కాగానే, నిర్బంధము ప్రయోగింపబడగానే కార్మికోద్యమము యజమానులపై దాడిగావించే అవస్థనుంచి యజమానుల, ప్రభుత్వపు దాడులను తట్టుకొనేస్థితికి వచ్చేసరికి వీరి పూర్వ లక్షణాలు బైటపడ్డాయి. కార్మికులను వదలి, సంస్కరణవాదులను, యజమానులను అనుసరించడం, సమ్మెలను రానీయకుండా చేయడం ప్రారంభించారు. కార్మికోద్యమము అభివృద్ధి గాంచుచున్నప్పుడు కార్మికులతోనే వీరు నిలబడ్డారు. కాని కార్మిక వుద్యమముపై నిర్బంధము ప్రారంభమైనప్పుడు వీరు కార్మికులను విడనాడారు.



కాని కార్మికోద్యమ ప్రభావము, కృషి వ్యర్థముగాలేదు. మిలిటెంటు వర్కర్లుగా తయారైనవారినుండి నూతన నాయకత్వము బయలుదేరింది. వీరిలో కార్మికవర్గ చైతన్యము నాటుకుపోయింది. ఎర్ర జెండాకు, కమ్యూనిస్టు సిద్ధాంతాలకు విశ్వాసపాత్రులుగా వుండిపోయారు. వీరినుండే చాలమంది తరువాత కమ్యూనిస్టులుగా తయారైనారు. నాయకులు లేకపోయిననూ యీకాలములో పార్టీసిద్ధాంతాల కొరకు, పార్టీ అస్తిత్వముకొరకు సంస్కరణవాదులతో పూర్తి పోరాటము సాగించి, నాయకులు జైళ్ళనుండి తిరిగి వచ్చునప్పటికి యొక ఖచ్చితమైన మార్క్సిస్టు గ్రూపును యేర్పరచారు. ఈ గ్రూపు లేకపోయినయెడల మరల 1934 లో కార్మికసంఘాన్ని (బొంబాయిలో) వశపర్చుకుని పార్టీని నిర్మించడం అసంభవమయ్యేది

కార్మికోద్యమముపై దాడి :

సామ్రాజ్యవాదము, యజమానులుగూడ పార్టీ కార్మికోద్యమపు బలహీనతలను అవకాశముగా గైకొని దాడి ప్రారంభించారు, ప్రభుత్వము "సాంఘిక కలహాలను" రేపింది. ముఖ్యంగా కార్మికులు నివసించే ప్రదేశాల్లోనే యీ సాంఘిక కలహాలను వ్యాపింపజేసింది. ఆ ప్రదేశాల్లో నిర్బంధ వుత్తర్వులు జారీచేయబడ్డాయి. పోలీసు సిబ్బంది హెచ్చుచేయబడింది.

మిల్లు కమిటీలలో "ఆపద్భ్యనిస్టులు" అభివృద్ధిగావడంతో వాటిని యజమానులు యిదివరకు మాదిరి గుర్తించడం మానివేశారు. మిలిటెంటు వర్కర్లను పనిలోనుండి తీసివేయడం ఆరంభించారు. "మిల్లు కమిటీల" సభ్యులను రౌడీలచేత కొట్టించడం ప్రారంభించారు. యజమానుల, సామ్రాజ్యవాదంయొక్క యీ చర్యల వుద్దేశ్యం కార్మికులను రెచ్చగొట్టి సమ్మెలు బలవంతంగా చేయించి వాటి సాకుతో మిగిలివున్న కార్మిక వుద్యమాన్ని, మిల్లుకమిటీలను అణచివేద్దామని. యీ పర్యాయం యజమానులే కార్మికులచేత సమ్మెలు చేయించడానికి ప్రయత్నించారు.

ఈవిధంగా 1929 ఏప్రిల్‌లో బొంబాయిలో నేతపరిశ్రమకార్మికులందరూ సమ్మెగావించారు. 4½ మాసాలవరకు సమ్మెసాగింది. కాని పూర్తిగా అపజయంపొందింది. ప్రభుత్వనిర్బంధం విచ్చలవిడిగా వుపయోగింప బడింది. రెండవ శ్రేణిలోని కార్మికనాయకులు అందరు అరెస్టుచేయబడ్డారు. కార్మిక సంఘాలు, మిల్లుకమిటీలు అణచివేయబడ్డాయి. "గిర్నికంగారు యూనియన్" నామమాత్రసంఘమైపోయింది

జి. ఐ. పి. రైల్వే కార్మికులలో గూడ 1930 లో సమ్మెవచ్చింది. ఆర్థికదుస్థితి ఫలితంగా రైల్వేలవ్యాపారము మందగించింది. ఇదివరలో (1928 లో "రైల్వే రిట్రెంచ్ మెంటు" ప్రతిపాదనలన్నీ యిప్పుడు అమలుజరుపబడ్డాయి. కూలీల వేతనాలు తగ్గించబడ్డాయి. కార్మికులు గుమాస్తాలు అనేకమంది పనులనుండి తొలగింపబడ్డారు. ఈ సమయములో సమ్మెవచ్చింది. కాని యీ సంఘంగూడ అతివాదుల పలుకుబడిలో వున్నప్పటికిని మీరట్ అరెస్టులతో యీ సంఘము సంస్కరణవాదుల (రూయికర్ వగైరా) చేతిల్లోనికి పోయింది. స్థానికసంఘాలు మిలిటెంటు వర్కర్లచేతుల్లో వున్నప్పటికిని ప్రభుత్వము, రైల్వేఅధికారులు తీవ్ర నిర్బంధ ముపయోగించుటచేత ముఖ్యంగా

కమ్యూనిస్టుల నందరిని ముందరగనే అరెస్టుగావించుటచేత, రూయికరు వగైరా సంస్కరణవాదులు ద్రోహము చేయడంవలన సమ్మె విఫలమైనది.

ఈ రెండు సమ్మెలలోను కమ్యూనిస్టుపార్టీ నిర్మాణబలహీనత చేతను, కార్మికోద్యమము యొక్క బలహీనతవలన ప్రభుత్వనిర్బంధము, సంస్కరణవాదుల ద్రోహచర్యలు కలసి కార్మికోద్యమమును, కమ్యూనిస్టులను తాత్కాలికంగా అణచుటలో జయముపొందాయి. ఒకవిషయం ముఖ్యంగా గమనించాలి. పార్టీబలహీనతలను, కార్మికోద్యమములోని బలహీనతలను వుపయోగించుకోవడంవల ననే ఈవిధమైన నిర్బంధము వుపయోగించి వుద్యమాన్ని అణచగల్గారు. కాబట్టి ఈరెండు సమ్మెల నుండిపార్టీ నిర్మాణము విషయములో నేర్చుకోవలసిన పాఠాలు యివి:

(1) సమ్మెలను చేయడము కార్మికులు నేర్చుకున్నంతమాత్రానే, సమ్మెలకు కమ్యూనిస్టులు గాని, వారి సానుభూతిపరులుగాని నాయకులుగా వున్నంతమాత్రానే కార్మికోద్యమము విప్లవరూపం దాల్చదు. (సమ్మెలు చేయుటకు జాతీయ సంస్కరణవాదులు గూడ అంగీకరిస్తారు; పాల్గొంటారు గూడాను. పాల్గొని విచ్ఛిన్నం చేయడానికి ప్రయత్నిస్తారు.) ప్రతి ముఖ్య పరిశ్రమలోను, కార్మిక సంఘములోను వర్గచైతన్యముతో గూడుకొన్న మిలిటెంటువర్కర్లు, వారిని నిరంతరం తర్ఫీదు గావించడానికి సుసంఘటితమైన మిలిటెంటు సంఘనిర్మాణము వుండాలి; అంతేగాకుండా వీటిని సరియైన పంథాను నడుపుటకు కార్మికవర్గ రాజకీయపార్టీ (కమ్యూనిస్టుపార్టీ) వుండాలి. అప్పుడే ప్రభుత్వనిర్బంధమును తట్టుకొని యెట్టి చిన్న సమ్మెనైననూ విప్లవస్థాయికి గొనిపోవచ్చును. అట్టి నిర్మాణము లేనప్పుడు యెంత ప్రజాబాహుళ్యమైన సమ్మెనైనా కమ్యూనిస్టులు నడుపుచున్ననూ సులభముగా ప్రభుత్వము అణచివేయగల్గుతుంది. ఇట్టి కార్యాలను నిర్వహించుటకు కార్మికవర్గ రాజకీయపార్టీ అవసరం.

(2) మిలిటెంటు వర్కర్లకు వర్గచైతన్యము గల్గించుటకు, రాజకీయ చైతన్యము గల్గించుటకు నిరంతరం పనిజేసేపార్టీ యుండుటేగాక, పార్టీకి, మిలిటెంటువర్కర్ల ద్వారా కార్మిక ప్రజాసామాన్యముతో నిరంతరం సంబంధ ముంచుటకు, ప్రజల మనోభావాలను తెలుసుకోవడానికి, ప్రజలలో చైతన్యము కలుగజేయడానికి తగిన ప్రజాబాహుళ్యమైన కార్మిక సంఘాలుండాలి. అలాలేకపోతే వర్గ చైతన్యమున్న మిలిటెంటు వర్కర్లు, కార్మికులే విప్లవ పంథాను అనుసరిస్తారుగాని, వర్గచైతన్యము పొందనివెనుకబడివున్న కార్మికులు విప్లవపంథాను అంగీకరించరు. అదేగాకుండా పార్టీగూడ కార్మికులకన్నా ముందుపోవడమో, లేక వెనుకబడివుండడమో తటస్థించుతుందిగాని కార్మికులకు సరియైన నాయకత్వము వహించలేదు.

ఈ రెండు సమ్మెల ద్వారాను గడించిన పైగుణపాఠాలను మాత్రం కమ్యూనిస్టులను అనుసరిస్తున్న మిలిటెంటు వర్కర్లు పూర్తిగా అలవర్చుకున్నారు. ఈ సమ్మెలలో వీరు యింకాకొంతమంది "మిలిటెంటులను" తయారు గావించారు. సమ్మెల ద్వారా తయారగుచున్నట్టి యీ "మిలిటెంటు వర్కర్ల"తో నూతన సమ్మెకమిటీలను, మిల్లుకమిటీలను యేర్పరచి యిదివరలోవున్న "మిల్లుకమిటీల"లోని "అవకాశవాదుల" (సమయానుకూలవాదుల) నాయకులతో, సంస్కరణవాదులతో తీవ్రపోరాటము సల్పుతూ క్రొత్తగా తయారగుచున్న వాళ్ళకు యీ పోరాటముద్వారా మార్క్సిస్టు సిద్ధాంతాలను (వారికి తెలిసినంత వరకు) తెలియజెప్పుచూవుండిరి. వీరికి మార్క్సిజము, లెనినిజము గూర్చి



సమ్మెలు జరుగుతూ వున్నప్పుడు గూడ అధ్యయన తరగతులు పెట్టుచుండిరి. పాతనాయకులు గావించిన తప్పులగూర్చి, వాటిని యేలా సవరించుకోవాలో తెలియచెప్పుతూవుండిరి. ఈ విధంగా యీసమ్మెలలో తయారైన "మిలిటెంటు వర్కర్లతోను" యిదివరకు 'మిల్లు కమిటీల'లోని రిఫార్మిస్టులతో పోరాడుచున్న "మిల్లు కమిటీల" సభ్యులతోను గూడుకున్న యొకసంఘం 1930 లో స్థాపించబడింది. దీనిపేరు "యంగ్ వర్కర్సులీగ్". బొంబాయి కార్మికులలోని వుత్తమమైన ధైర్యశాలురు, వర్గ చైతన్యముతో గూడిన కమ్యూనిస్టు అనుచరులు అందరూ యీ సంఘములో వుండిరి. ఈ సంఘము నుండే బొంబాయి కమ్యూనిస్టుపార్టీ నిర్మించబడింది.

ఈ విధంగా 1926 నుండి 1929 వరకు పార్టీని నిర్మించుటకు గావించిన ప్రయత్నాలకన్నా, యీ కాలములో కార్మికవర్గమునుండి "మిలిటెంటు వర్కర్ల"కు కమ్యూనిస్టు చైతన్యము కలుగజేసి పార్టీ సభ్యులుగా తయారుచేయడానికి హెచ్చు ప్రయత్నాలు చేయబడ్డాయి. "యంగ్ వర్కర్సులీగ్" యిందుకొరకే యేర్పడినది. పార్టీ నాయకులు లేనికాలములో ప్రభుత్వం ప్రచండ నిర్బంధవిధానంతో కార్మిక వుద్యమాన్ని అణుస్తున్న రోజుల్లో సంస్కరణవాదుల పలుకుబడిని కార్మికులలో ప్రవేశించకుండా ఎర్రజెండా పలుకుబడి, ఎర్రజెండా పంథాను కార్మికులలో నిలబెట్టుటకు నిరంతరం కృషి చేస్తూవున్నది. కాని యీ సంఘానికి చెందినవారిని యింకా కార్మికులు తమ నాయకులుగా పరిగణించడంలేదు. సంస్కరణవాదులే యింకా నాయకులుగా పరిగణింపబడుచున్నారు. అంతేగాకుండా వీరికి యింకా పూర్తి మార్క్సిస్టు చైతన్యము, రాజకీయ చైతన్యము గలుగలేదు. అందుచేత అఖిల భారత రాజకీయాల్లో తాము యే పాత్ర వహించాలో వీరికి స్పష్టముగాలేదు; స్థానిక కార్మిక వుద్యమములోనే మునిగిపోయారు.

వీరిని నిజమైన కమ్యూనిస్టులుగా తయారుగావించుటకు పార్టీ యీ కాలములో హెచ్చుగా పని చేయజాలకపోయింది. అట్టి పనిని నిర్వహించగలవారందరూ జైళ్ళలో వుండిపోయారు. ఇదేగాకుండా కార్మికోద్యమములో లిబరల్ రిఫార్మిస్టులు, నేషనల్ రిఫార్మిస్టులు 1931నుండి 33 ప్రారంభమువరకు గావించిన చీలికలు వీరినియింకా బలహీనపర్చాయి.

## కార్మికోద్యమములో ఈ కాలములో గలుగజేయబడ్డ చీలికలు

లిబరల్ రిఫార్మిస్టులు అ. భా. కాంగ్రెసునుండి చీలిపోవుట:

కమ్యూనిస్టుల పలుకుబడి కార్మికోద్యమముపై హెచ్చినకొలదీ, కార్మికవర్గం రాజకీయాల్లో ప్రవేశించుచూ వున్నకొలదీ అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులోని లిబరల్ రిఫార్మిస్టులు (యన్. యమ్. జోషీ, బి. శివరావు వగైరాలు) ఆందోళన పడసాగిరి. అదేగాకుండా కమ్యూనిస్టుల పలుకుబడి అ. భా. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు కేంద్ర కౌన్సిల్‌లోగూడ అభివృద్ధి అయింది. ప్రజా పలుకుబడిగల కార్మిక సంఘాలన్నీ కమ్యూనిస్టుల చేతుల్లోవున్నాయి కమ్యూనిస్టులు అ. భా. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులో రాజకీయ విషయాలు చర్చించడము; సంపూర్ణ స్వాతంత్ర్యం గావాలనే తీర్మానములు తీసుకురావడం ప్రారంభించారు ఈ తీర్మానాన్ని క్రింది సంఘాలు పూర్తిగా బలపర్చాయి. అంతేగాకుండా అ. భా. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులో ఒక గ్రూపుగావున్న జాతీయ

సంస్కరణవాదులు (కాంగ్రెసువాదులు) గూడ యీ తీర్మానాన్ని బలపర్చారు. అందుచేత అ. భా. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులో లిబరల్ రిఫార్మిస్టుల రాజకీయాలకు తావులేకుండా పోతోంది.

ఈ పరిస్థితుల్లో 1929 లో నాగపూర్‌లో అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు జరుపబడింది. దానిలో కమ్యూనిస్టులు, జాతీయ సంస్కరణవాదులు కలిసి మెజారిటీ గ్రూపు అయ్యారు. కమ్యూనిస్టులు సంపూర్ణ స్వాతంత్ర్యము గావాలనే తీర్మానము, అ. భా. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసును 'రెడ్ ఇన్‌టర్ నేషనల్ ఆఫ్ లేబరు యూనియన్సు'కు అనుబంధ సంఘముగా చేయాలనే తీర్మానము ప్రతిపాదించారు. కమ్యూనిస్టులను జాతీయ సంస్కరణవాదులు బలపర్చారు. ఆ పరిస్థితులలో లిబరల్ రిఫార్మిస్టులు అ. భా. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసునుండి లేచిపోయి, వేరే ట్రేడ్ యూనియన్‌ను స్థాపించారు. అదే "నేషనల్ ఫెడరేషన్ ఆఫ్ లేబర్". అప్పుడే యొక స్టేట్‌మెంటు గూడ ప్రకటించారు. కార్మిక సంఘాలు కమ్యూనిస్టుల పలుకుబడిలోనికి పోయాయనియు, కార్మిక సంఘాలు రాజకీయ కక్షలకొరకు వుపయోగింపబడుచున్నాయనియు, తాము కార్మిక సంఘాలను యీ విప్లవ రాజకీయాలనుండి, కమ్యూనిస్టులనుండి రక్షించి, కార్మికుల ఆర్థిక హక్కులకొరకు పోరాడే నిజమైన కార్మిక సంఘాలను స్థాపించుటకుగాను అ. భా. కాంగ్రెసునుండి విడిపోయామనియు, ఆ స్టేట్‌మెంటులో తెల్పారు. ఈ విధంగా అ. భా. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసును, ముఖ్యంగా అందులోని కమ్యూనిస్టులను ప్రభుత్వ నిర్బంధమునకు గురి అయ్యేటట్లుచేశారు ఈవిధంగా లిబరల్ రిఫార్మిస్టులు కార్మికోద్యమము ప్రాథమిక వర్గచైతన్యం పొందగానే, రాజకీయాల్లో ప్రవేశించుటకు ప్రారంభించగానే కార్మికోద్యమమునుండి పారిపోయి దాన్ని ఛిన్నాభిన్నముచేయడం ప్రారంభించారు.

నేషనల్ సంస్కరణవాదులు నాగపూర్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు (1929)లో కమ్యూనిస్టులను బలపర్చినంతమాత్రమున కార్మికోద్యమములో కమ్యూనిస్టులపంథాను అంగీకరించారని భావించరాదు. నేషనల్ సంస్కరణవాదులకు, లిబరల్ రిఫార్మిస్టులకు వున్న భేదమును గ్రహించితే నాగపూర్‌లో కమ్యూనిస్టులను బలపర్చిననూ, శాసనోల్లంఘనము ప్రారంభమైన తదుపరి కమ్యూనిస్టులకు పూర్తిగా వ్యతిరేకులై కార్మికోద్యమమును విచ్ఛిన్నం గావించుటకు కారణం బోధపడుతుంది. ఈ మూలకారణం తెలుసుకోజాలకపోయినచో కార్మికోద్యమములో యీ చీలికలు అర్థంగావు; తరువాత కమ్యూనిస్టులు కార్మికోద్యమమును ఐక్యపర్చుటకు గావించిన ప్రయత్నాలు అర్థంగావు. అందుచేత నేషనల్ సంస్కరణవాదులకు, లిబరల్ రిఫార్మిస్టులకు వున్న భేదమును తెలుసుకోవాలి.

## లిబరల్, నేషనల్ రిఫార్మిస్టుల పంథాలు

లిబరల్ రిఫార్మిస్టులు కార్మికులలో ప్రాథమిక వర్గచైతన్యముగూడ వచ్చుటకు అంగీకరించరు. కార్మికసంఘాలు ప్రజాసంఘాలుగా మారుటకు తీవ్ర ఆందోళన చేయుటకుగూడ అంగీకరించరు; యే సమ్మెలనైనా తీవ్రముగా నిరోధిస్తారు; కార్మిక ప్రజాందోళననూ, వుద్యమాన్ని యేమాత్రం అంగీకరించరు. కార్మికులకు, యజమానులకు వచ్చే తగాదాలను పార్లమెంటరీ పద్ధతులద్వారా (సమ్మెలులేకుండా, ప్రభుత్వముచే యేర్పరచబడిన మధ్యవర్తిత్వ సంఘాలద్వారా) తీర్చుటకే అంగీకరిస్తారు. యజమానులపై ప్రభుత్వముద్వారా వత్తిడి తీసుకురావలెను గాని, కార్మికులు స్వతంత్ర కార్యాచరణద్వారా (సమ్మె, ఆందోళన) యజమానులను వత్తిడిచేయగూడదు; ప్రభుత్వమునకు పిటీషనులు పెట్టుకొనుటద్వారా మాత్రమే ఆందోళన గావించాలి. అంతకుమించి ఆందోళన చేయరాదు. రాజకీయరంగములో కార్మికులు జోక్యము కలుగచేసుకోరాదు. (ఎన్నికలలో తమ ప్రతినిధులకు ఓట్లు యిచ్చుట తప్ప) కార్మికసంఘాలు పూర్తిగా ఆర్థికహక్కులను కాపాడుకొనే సంఘాలుగా మాత్రమే యుండాలి.



జాతీయ సంస్కరణవాదుల వాదం చూద్దాం, కార్మికులకు సమ్మెచేసుకొనేహక్కు యిస్తారు, కార్మికోద్యమాన్ని ప్రజావుద్యమముగా అభివృద్ధి చేసుకోవడానికి అంగీకరిస్తారు. రాజకీయాలు చర్చించడానికి, రాజకీయరంగములో పాల్గొనుటకుగూడ అంగీకరిస్తారు. అయినప్పటికీ ఈ విషయాలకన్నిటికి అంగీకరించిననూ ఒక ముఖ్యవిషయమును అంగీకరించక నిరాకరించుటవలన యివన్నీ కార్మికోద్యమమును బూర్జువావర్గమునకు అనుబంధముగా మార్చుటకు వుపయోగపడతాయి. సమ్మెహక్కు బూర్జువావర్గ హద్దులను అతిక్రమించకుండా వుండేటట్లు యివ్వబడుతుంది. కార్మికవర్గం ట్రేడ్‌యూనియన్ చైతన్యం పొందుటకు, కార్మికోద్యమమును అభివృద్ధిచేసుకోవడానికి అంగీకరిస్తారు. గాని యీ వుద్యమము కేవలం కార్మికుల ఆర్థికహక్కులను బూర్జువా విధానముయొక్క హద్దులలోపలనే రక్షించుకోవడానికి వుద్దేశించాలి. రాజకీయాలు చర్చించుటకు, రాజకీయరంగములో ప్రవేశించుటకు అంగీకరించిననూ, కార్మికవర్గం బూర్జువావర్గ నాయకత్వమును అంగీకరించాలి; దానిని విమర్శించిననూ, ఆవిమర్శ బూర్జువావర్గ నాయకత్వమును అభివృద్ధిచేయుటకు మాత్రమే చేయబడాలి. కాని దాన్ని నాశనముగావించి కార్మికవర్గ రాజకీయనాయకత్వం యేర్పరచుకొనుటకు చేయబడరాదు. అందుచేత, కార్మికవర్గం స్వతంత్ర రాజకీయశక్తిగా తయారగుటకు అంగీకరించరు; అదే దృష్టితో కార్మికవర్గ రాజకీయపార్టీ యేర్పడ్డానికి అంగీకరించరు.

ముఖ్యవిషయ మేమంటే బూర్జువావిధానమును నాశనము గావించనట్టి, బూర్జువా రాజకీయ నాయకత్వమును అంగీకరించేటట్టి యే కార్మికోద్యమమునైనా జాతీయ సంస్కరణవాదులు అంగీకరించుతారు. ఈ వుద్దేశంతోనే వీరు కార్మికులలో పనిజేస్తారు. అందుచేత స్వతంత్ర రాజకీయపంథాతో కార్మికులలో పనిజేస్తున్న కమ్యూనిస్టులను కార్మికోద్యమమునుండి వేరుచేయడానికి జాతీయ సంస్కరణవాదులుగూడ పనిజేశారు.

నాగపూర్‌లో (1929) కమ్యూనిస్టులను లిబరల్ రిఫార్మిస్టులకు వ్యతిరేకంగా జాతీయ సంస్కరణ వాదులు యెందుకు బలపర్చినదీ బోధపడుతుంది. అప్పటికి కార్మికోద్యమము యింకా పూర్తిగా బలపడలేదు. కమ్యూనిస్టుల పలుకుబడి వున్ననూ అది యింకా నిర్మాణ యుక్తంగా స్థిరపడలేదు. కమ్యూనిస్టులు దానిలో స్థిరపడకముందే, కమ్యూనిస్టులచే అభివృద్ధి చేయబడ్డ కార్మికోద్యమమును తమ రాజకీయ హక్కులకొరకు (జాతీయ బూర్జువావర్గము యొక్క హక్కులు) ఉపయోగించుకోవడానికి, కార్మికోద్యమము యింతకన్న హెచ్చు అభివృద్ధి గాకుండా బూర్జువా హద్దులతోనే వుంచడానికి వారలా చేశారు. పై ఆశయాలు యీడేరాలంటే కార్మికోద్యమముపై పలుకుబడి, దానిలో స్థానం సంపాదించాలి. అందువల్లనూ ఆరోజుల్లో కమ్యూనిస్టులను వ్యతిరేకించినచో యిదివరకు యేమీ స్థానంలేకుండా వుండుటవలన, కార్మికులలో ప్రవేశించడమే కష్టమౌతుంది. దానివలన కమ్యూనిస్టుల స్థానం మరింత బలపడుతుంది. అందుచేత తాత్కాలికంగా కమ్యూనిస్టులను బలపర్చడంవలన వారికి నష్టమేమీ లేదు. పైగా కార్మికశ్రేయోభిలాషులుగా వారిని కార్మికులు తలుస్తారు. అదీగాకుండా అప్పటికింకా కార్మికవర్గం బూర్జువావర్గానికి

అహేతుకరమైన రాజకీయచర్యలు యేమీ గావించుటలేదు; రాజకీయ ప్రత్యర్థిగా తయారుగాలేదు. ఈ వుద్దేశాలతో నాగపూరులో లిబరల్ రిఫార్మిస్టులకు వ్యతిరేకంగా జాతీయ రిఫార్మిస్టులు కమ్యూనిస్టులను బలపర్చి కార్మికవుద్యమ శ్రేయోభిలాషులుగా నటించారు. కాని అసలు వుద్దేశం శాసనోల్లంఘనం ప్రారంభమైన తదుపరి బహిర్గతమైనది.

## జాతీయ సంస్కరణవాదుల విచ్ఛిన్న చర్యలు :

1930 లో కమ్యూనిస్టు నాయకులు, వారి ననుసరించే కార్మికవర్గ నాయకులు అరెస్టుగాబడ్డారు. కార్మికోద్యమముపై మిల్లు యజమానులు, ప్రభుత్వము పూర్తిదాడిని ప్రయోగించుచున్నారు. ట్రేడ్ యూనియన్ లలోనే చీలికలు గల్గాయి. "మిల్లు కమిటీల" కార్మిక నాయకుల్లోనే రిఫార్మిస్టులను అనుసరించే అపర్యాప్తనిస్టులు బయలుదేరారు. మిలిటెంటు వర్కర్లు రిఫార్మిస్టులతో పోరాటం సాగిస్తున్నా వారు స్థానికముగా పనిజేసే వాలంటీర్లుగానే పరిగణింపబడ్డారు. గాని వారు కార్మికప్రజాసామాన్యమునకు నాయకులుగా పరిగణింపబడుటలేదు. ఈ పరిస్థితుల్లో వెనుకబడ్డ కార్మికులలో అవిశ్వాసం ప్రారంభమైనది. కార్మికవర్గ మంతటిలోనుగూడ యిదివరలోవున్న వుత్సాహం తగ్గిపోయింది.

కార్మికోద్యమములోని యీ బలహీనతను ఉపయోగించుకొని జాతీయ సంస్కరణవాదులు (కందాల్కరు, రూయికరు, సుభాస్‌బోసు వగైరాలు) కమ్యూనిస్టులచే అభివృద్ధిగావింపబడ్డ 'గిర్నికంగారు యూనియన్' 'జి. ఐ. పి.' రైల్వే యూనియన్, అ. భా. ట్రేడ్‌యూనియన్ వుద్యమాన్ని విచ్ఛిన్నం గావించారు. చీలికలు గలుగజేశారు. వీరితో రాయిస్టులుగూడ కలిశారు. ప్రారంభంలో 'బొంబాయి గిర్నికంగారు" యూనియన్‌లో యీ చీలికలు కలుగచేశారు. (1930 జూలైలో) దీనికి బొంబాయి రాష్ట్రీయ కాంగ్రెసుకమిటీ నాయకులుగూడ తోడ్పడ్డారు. బొంబాయి నేత పరిశ్రమ మిల్లు యజమానులు ఆర్థిక సహాయంచేశారు. "గిర్నికంగారు యూనియన్"నుండి విడిపోయి, "బొంబాయి ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు" అనేదాన్ని స్థాపించారు "గిర్నికంగారు యూనియన్" శాసనోల్లంఘనములో పాల్గొనుటలేదనియు, కాంగ్రెసు నాయకత్వమును విమర్శించుతోందనియు, అట్లు విమర్శించుట దేశమునకు ద్రోహముచేయుటే అనియు, కాంగ్రెసు నాయకత్వము ననుసరించి, శాసనోల్లంఘనములో కార్మిక సంఘాలు పాల్గొనాలనియు ప్రకటించుచూ, యిట్టి కార్మిక సంఘాలను స్థాపించుటే తమ వుద్దేశ్యమని తెలియపర్చుచూ "గిర్నికంగారు యూనియన్"నుండి వెడలిపోయి, వేరే కార్మికసంఘం స్థాపించారు. కమ్యూనిస్టులను కార్మికులు అనుసరించగూడదని ప్రకటించారు.

ఇదేవిధంగా అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులోగూడ విభేదాలు కలుగజేశారు. కలకత్తాలో (1931 జూలై) జరుపబడ్డ అ. భా. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసునుండి నేషనల్ రిఫార్మిస్టులు (సుభాస్‌చంద్రబోసు నాయకత్వముక్రింద) వెడలిపోయారు. కమ్యూనిస్టులపైన, కార్మికోద్యమముపైన ప్రభుత్వం నిర్బంధము వుపయోగించుటచేత అ. భా. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు పూర్తిగా బలహీనపడిపోయింది. సభ్యత్వం తగ్గిపోయింది. జాతీయ సంస్కరణవాదులపై విచ్ఛిన్న చర్యలతో మరింత బలహీనపడిపోయింది. జాతీయ సంస్కరణవాదులు వేరే స్థాపించిన అ. భా. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసుకు అసలే సభ్యత్వంలేదు; అదీ నామమాత్ర సంఘముగానేవుంది. ఇదేవిధంగా "జి. ఐ. పి." రైల్వేసంఘాన్నిగూడ (రూయికరు) బలహీనపర్చారు. ఇలా అన్నివైపుల నుండి-ప్రభుత్వమునుండి, లిబరల్, నేషనల్ రిఫార్మిస్టులనుండి, కార్మికోద్యమములోని అపర్యాప్త



నిస్టులనుండి. కార్మికోద్యమము బలహీనపడిపోయింది. మిగిలియున్న కమ్యూనిస్టులుగూడ పూర్తిగా బలహీనపడిపోయారు. (దీనికి అనుబంధంగా భారత కార్మికోద్యమ చరిత్ర, త్రిపురి సంచికలోని కార్మికోద్యమాన్ని గురించిన వ్యాసాలు చదవండి.)

## జాతీయ సంస్కరణవాదుల విచ్ఛిన్న చర్యలకు కారణాలు :

1930 వ సంవత్సరములో కాంగ్రెసు సాగించిన శాసనోల్లంఘనములో కార్మికవర్గం కమ్యూనిస్టుల నాయకత్వముక్రింద, స్వతంత్ర రాజకీయ నినాదాలతో, కార్మిక పోరాట పద్ధతులతో పాల్గొనడం కాంగ్రెసు నాయకత్వమునకు యిష్టంలేదు. బూర్జువావర్గ నినాదాలతో, బూర్జువావర్గ రాజకీయ పోరాట పద్ధతులతో పాల్గొనవలెననే కోరింది. కార్మికవర్గ పలుకుబడి, కమ్యూనిస్టుల పలుకుబడి జాతీయోద్యమముపై యెంత స్వల్పముగాయున్ననూ శాసనోల్లంఘనము సాగుతూవున్నప్పుడు శాసనోల్లంఘనంలో స్వతంత్రశక్తిగా పాల్గొంటే, అది అనేకరెట్లు అభివృద్ధి అవుతుంది. శాసనోల్లంఘనములో లక్షలకు లక్షలు ప్రజా సామాన్యము పాల్గొంటూవున్నప్పుడు ఆ ప్రజాసామాన్యమునంతా కార్మికవర్గ రాజకీయ పలుకుబడిక్రిందకు పోతుంది; బూర్జువావర్గ పలుకుబడి సన్నగిలుతుంది. ఆ విధంగా పోరాటపరిణామముతో ప్రజలందరిపై కార్మికవర్గం తన రాజకీయ పలుకుబడిని స్థాపించుకోడానికి అనుకూల వాతావరణం యేర్పడుతుంది. (ఎందుచేతనంటే, కాంగ్రెసు నాయకత్వమునకన్నా కార్మికవర్గం యేకరీతిగా ప్రజలందరి కోర్కెలు యీడేరేవరకు పోరాటములో నిలబడి పోరాడుతూవుంటుంది గాబట్టి). ఈ పరిస్థితి సంభవించినప్పుడు శాసనోల్లంఘనమును, ప్రభుత్వముపై వత్తిడిచేసి తన బూర్జువా హక్కులు పొందేటందులకు రాజీపడుటకుగాను కాంగ్రెసునాయకత్వం వుపయోగించుటకు వీలుండదు; పైగా వుద్యమముపై తన పెత్తనం క్రమేణా పోతుంది. అందుచే కార్మికవర్గం స్వతంత్రపంథాతో ముఖ్యంగా కమ్యూనిస్టు నినాదాలతో శాసనోల్లంఘనములో పాల్గొనుట అవమయములో కాంగ్రెసు నాయకత్వమునకు యిష్టంలేదు కాని కార్మికులు శాసనోల్లంఘనంలో పాల్గొంటే వుద్యమము బలిష్ఠంగా వుంటుందని, ప్రభుత్వాన్ని బాగా బెదిరించవచ్చునవీ గూడా బూర్జువావర్గానికి వుంది. అందుచేత కమ్యూనిస్టులను వేరుజేసి, తమ నినాదాలతో, పోరాటపద్ధతులతోనే కార్మికులు శాసనోల్లంఘనంలో పాల్గొనాలని కోరారు. ఇందుకే కార్మికుల్లో చీలికలు తీసుకువచ్చారు.

జాతీయోద్యమము ప్రారంభమై దేశములో బ్రహ్మాండమైన ప్రజాపంచలనము, చైతన్యము గల్గుచున్న సమయములో, జాతీయ బూర్జువావర్గ పోరాటపద్ధతులతో అసంతృప్తిచెంది అనేకమంది యువకులు నూతన స్వాతంత్ర్యపోరాట పంథాకొరకు వెతుకులాడుచున్న సమయమందు—కార్మికవర్గంలో చీలికలు బయలుదేరాయి; జాతీయరంగంలో తన పాత్రను నిర్వహించడానికి కార్మికవర్గం విఫలమయింది. సహాయనిరాకరణం రోజుల్లోవలెనే (1920-22) ప్రజలను సక్రమపంథాను నడిపించి స్వాతంత్ర్యపోరాటాన్ని జయప్రదమొనర్చుటకు తగిన కార్మికనాయకత్వము లేకపోయింది. అప్పటికన్నా రాజకీయచైతన్యము ప్రజలలో అభివృద్ధిచెందినది. జాతీయ బూర్జువావర్గపోరాట పద్ధతులంటే అసంతృప్తిగూడ జనించింది. మరొకవైపున కార్మికవర్గం తన స్వతంత్రపంథాను (సమ్మెలద్వారా, ప్రదర్శనములద్వారా) కార్మికోద్యమాన్ని అభివృద్ధి గావించింది. కమ్యూనిస్టుల పలుకుబడి కార్మికవర్గంలోను, జాతీయ యువకులలోను వ్యాపించింది కమ్యూనిస్టు నినాదాలతో దేశమంతటా స్వాతంత్ర్యపోరాటమును సాగించుటకు రాజకీయాందోళన సాగుతోంది. కార్మికోద్యమము రాజకీయరంగ

ములో తన స్వతంత్రపంథాను ప్రవేశించుతోంది. ఈవిధంగా శాసనోల్లంఘనము నాటికి స్వామ్రాజ్య నిరాకరణోద్యమ రోజుల్లోకంటే భౌతికపరిస్థితులు విప్లవోద్యమవ్యాప్తికి అనుకూలంగా వున్ననూ, శాసనోల్లంఘనోద్యమములో కమ్యూనిస్టులు, కార్మికవర్గం పాల్గొని జాతీయోద్యమమును విప్లవ వుద్యమముగా ఏల తయారుచేయజాలక పోయింది? ఈప్రశ్న అర్థంచేసుకోకపోయినచో యీ కాలములో పార్టీ నిర్మాణము యెందుకు బలహీనపడిపోయిందో గ్రహించజాలము. అటుపై పార్టీ నిర్మాణమును అభివృద్ధిపర్చుటకు యే ప్రయత్నాలు చేయవలెనో, చేయబడ్డాయో తెలుసుకోజాలము. అందుచేత శాసనోల్లంఘనమప్పుడు పార్టీ యేపంథా అవలంబించిందో చూద్దాము.

## 1930_33 శాసనోల్లంఘనము — కమ్యూనిస్టులు

1930 - 33 శాసనోల్లంఘన పోరాటములో మన పార్టీ (కమ్యూనిస్టులు: అప్పటికింకా సరియైన పార్టీగా యేర్పడలేదు) పాల్గొనలేదనే విషయం మనకందరకు తెలిసిన విషయమే. కార్మికవర్గము గూడా జాతీయోద్యమములో ప్రజాబాహుళ్యముగా పాల్గొనలేదనే విషయంగూడ మనకుతెలును. శాసనోల్లంఘనమునకు పూర్వమే కార్మికోద్యమముపైననూ, కమ్యూనిస్టులపైననూ ప్రభుత్వం ప్రత్యేకంగా నిర్బంధము ప్రయోగించినదనియు, అందువలన కార్మికోద్యమము, కమ్యూనిస్టులు పూర్తిగా బలహీన పడ్డారని పైనచూశాము. ప్రభుత్వ నిర్బంధమునకు గురిగాకుండా బైటనున్న కమ్యూనిస్టు గ్రూపులు గూడ జాతీయ బూర్జువా నాయకత్వమును, శాసనోల్లంఘన పద్ధతిని, రాజకీయంగా విమర్శిస్తూవుండిరే గాని శాసనోల్లంఘనములో పాల్గొనలేదు. అందుచేత జాతీయ వుద్యమమునుండి, ప్రభుత్వ వ్యతిరేక జాతీయ శక్తులనుండి తాత్కాలికంగా వేరుబడిపోయాము. కాంగ్రెసు నాయకత్వము కమ్యూనిస్టులను "ద్రోహుల"ని గూడ ప్రచారంచేసింది. చైతన్యములేని ప్రజలు నమ్మారుగూడాను. ఇదే సమయములో కార్మికవర్గములో జాతీయ సంస్కరణవాదులు గావించే దుష్ప్రచారమును, చీలికలను యెదుర్కొంటూ, కమ్యూనిస్టు పద్ధతులను, నిజమైన విప్లవ కార్మిక పంథానుగూర్చి ప్రచారం చేయడం గూడ పెద్ద పని అయింది. ఈ ప్రచార ఫలితంగా కార్మికవర్గమునుండి సమ్మెలలో తయారైన మిలిటెంట్లు మార్క్సిస్టు కేడర్లుగా తయారైనారు. శాసనోల్లంఘనముతో పాల్గొంటున్న యువకులు, విద్యావంతులు శాసనోల్లంఘన గమనంతో అసంతృప్తిచెంది మన పార్టీగావించే విమర్శనను ఆలోచించడం ప్రారంభించిననూ పూర్తిగా మనవైపుకు యింకా రాలేదు. కమ్యూనిస్టులు కాంగ్రెసు నాయకత్వము యెడల చేస్తున్న విమర్శనలోని సత్యాన్ని నెమ్మదినెమ్మదిగా తెలుసుకుంటున్నవారు గూడ చాల కొద్దిమంది. తక్కిన కాంగ్రెసు ప్రజాసామాన్యమంతా కమ్యూనిస్టులంటే పూర్తి వ్యతిరేకత చూపెట్టాడు. అందుచేత కాంగ్రెసు ప్రజా బాహుళ్యమునుండి, జాతీయోద్యమమునుండి మనం వేరుబడిపోయాము. ఈవిధంగా వేరుబడిపోవుటకు కారణములేవో ఆలోచించేముందు, మనం అప్పుడు అవలంబించిన పంథానుగూర్చి విమర్శించేవారి వాదన పరిశీలన చేయుట అవసరం.

### కమ్యూనిస్టుల సెక్టేరియన్ దృక్పథానికి కారణాలు:

వీరి వాదన యిది. ముఖ్యంగా యీ వాదనను అప్పట్లో రాయిస్టులు, తరువాత కాంగ్రెసు సోషలిస్టులు చేశారు: "కమ్యూనిస్టులు కాంగ్రెసు నాయకత్వమును, కాంగ్రెసు పోరాటాన్ని తీవ్రంగా విమర్శించారు; కాంగ్రెసును బూర్జువా ఆర్గనైజేషన్ అని తిట్టారు. అందుచేత వారు కాంగ్రెసు



నుండి, జాతీయ వుద్యమాన్నుండి వేరుబడిపోయారు" అని వీరి వాదన. ఇది కేవలం మెన్షివిక్ వాదనతప్ప మరేమీగాదు. కార్మికవర్గం, దాని పార్టీ అయిన కమ్యూనిస్టుపార్టీ జాతీయ బూర్జువావర్గ నాయకత్వము, దాని పోరాట పంథాలను రాజకీయంగా విమర్శించరాదు. మారు మాటాడకుండా కాంగ్రెసు నాయకత్వమును అనుసరించాలి. కాంగ్రెసు క్రమశిక్షణకు లోబడి పనిచేయాలి. అదే గాకుండా కార్మికవర్గాన్ని అసంఖ్యాకులుగా శాసనోల్లంఘనములో పాల్గొనేటట్లుచేసి జైళ్ళకు పంపాలి. ఈవిధంగా జాతీయ బూర్జువావర్గం సాగించిన పోరాటములో పాల్గొంటే, యీ వుద్యమము విప్లవ వుద్యమముగా దానంతటదే మారుతుంది." ఈ వాదన మార్క్సిజము, లెనినిజములకు పూర్తిగా వ్యతిరేకము. కార్మికవర్గ రాజకీయ నాయకత్వము జాతీయోద్యమముపై స్థాపించుటకు బదులు జాతీయ బూర్జువావర్గ నాయకత్వము జాతీయోద్యమముపైననూ, కార్మికవర్గంపైననూ గూడ స్థిరపర్చుటే అవుతుంది. 1930 - 31 లో రాయిస్టుల చర్యలు దీన్ని ధృవపర్చాయి. "గిర్నీ కంగారు యూనియన్"ను జాతీయ సంస్కరణవాదులు (కండాల్కార్ వగైరాలు) విచ్ఛిన్నము గావింపుచున్నప్పుడు (1930 - 31) రాయిస్టులు వారికి కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా తోడ్పడ్డారు. యమ్. యన్. రాయి భారతదేశ కార్మికోద్యమములోని సంస్కరణవాదులందరిని గూడకట్టి కలకత్తాలో 1931 జులైలో జరిగిన అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులో కమ్యూనిస్టులపై తీవ్ర పోరాటము సల్పి, అ. భా. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులో సుభాస్‌బోసు వగైరా జాతీయ సంస్కరణవాదులు చీలికలు కలుగజేయుటకు తోడ్పడ్డాడు. (ఈ పాత్రనే కాంగ్రెసు సోషలిస్టులు తరువాత వహించారు. దీన్ని ముందు పరిశీలించుదాం.) కాంగ్రెసు సోషలిస్టుపార్టీ ప్రత్యేకంగా యేర్పరచుటకు కాంగ్రెసు సోషలిస్టులు గావించిన వాదనలలో యీ విషయమే చెప్పారు.

మనం రాజకీయంగా జాతీయోద్యమమునుండి వేరుపడుటకు ముఖ్యకారణాలు గమనించేముందు ఒక విషయం పరిశీలించుదాం.

శాసనోల్లంఘన సమయము నాటికే మన బలముక్షీణించిననూ, అప్పటికే మనకున్న శక్తినను సరించి జాతీయోద్యమములో పాల్గొనజాలకపోయామనియు, ఇందువలన మనం రాజకీయంగా మరీవేరుబడిపోయామనియు పైన చెప్పాము. దీని అర్థం పై విమర్శకులు చెప్పినట్లుగా మనం కాంగ్రెసు నాయకత్వాన్ని విమర్శించకుండా మనకున్న బలముతో వుద్యమములో పాల్గొని జైళ్ళకు పోలేదనే విమర్శ గాదు. జాతీయోద్యమముపై అప్పుడు ప్రభుత్వము గావించే నిర్బంధమునకు వ్యతిరేకంగా, దానికి గురియైన జాతీయ శక్తులతో సానుభూతి చూపెట్టుచూ కార్మికులు రాజకీయంగా ప్రదర్శనాలుగూడ చేయజాలకపోయారు. అలాంటి ప్రదర్శనాలు మన పలుకుబడికింద వున్న కార్మికవర్గముచేత చేయించగలిగినట్లయిన జాతీయోద్యమమునుండి యీవిధంగా వేరుబడిపోయే వాళ్ళముగాము. ప్రభుత్వ నిర్బంధము యే వర్గంమీద జేయబడుచున్ననూ, దానిని ముందుశ్రేణిలో వుండి యెదుర్కోవడం కార్మికవర్గ రాజకీయ బాధ్యతలలో యొకటి. ఈ బాధ్యతను కార్మికవర్గం నిర్వహించజాలకపోయింది. అలా చేయించుటకు తగినశక్తి అప్పట్లో మనకుంది. అలా చేయకపోవడమే పొరబాటుగాని, కాంగ్రెసు నాయకత్వమును విమర్శించుట తప్పుగాదు. కాంగ్రెసు సాగించిన శాసనోల్లంఘనము విప్లవ వుద్యమము గాదనియు, కాంగ్రెసు బూర్జువావర్గ పార్టీ అనియు విమర్శించడంగూడ తప్పుగాదు. కార్మిక సంఘాలలో పనిజేసేవారందరు శాసనోల్లంఘనము గావించి జైళ్ళకు పోకపోవడం తప్పుగాదు. ఈ విధంగా చేయడమే మెన్షివిజం అని (కాంగ్రెసు నాయకత్వమును ఏమీ విమర్శించకుండా వుండడం),

"లిక్విడేషనిజం"అని (కార్మిక సంఘాలు, కార్మికపార్టీ తక్కిన పనులన్నీ కట్టిపెట్టి శాసనోల్లంఘనం చేసి జైళ్ళకుపోవడం) అంటారు.

కాని మన "సెక్టేరియన్" పంథాకు, రాజకీయంగా జాతీయోద్యమమునుండి వేరుబడిపోవడానికి వాస్తవమైన కారణాలు యివికావు.

## కారణాలు

మొదటి కారణం :- బోల్షివిక్ పంథాను, కాంగ్రెసు నాయకత్వముయొక్క పోరాట విచ్ఛిన్న పంథాను, దాని సంస్కరణ, రాజీ తత్వాలను ప్రజలందరికి బహిర్గత మొనర్చుటకు తగినంత పార్టీ యంత్రము శాసనోల్లంఘన సమయమునకు తయారుగాలేదు. (మీరట్ అరెస్టులు, అ. భా. పార్టీ కేంద్రము యేర్పడకపోవడం; అన్ని ప్రదేశాలకుపోయే పార్టీ పత్రిక లేకపోవడం వగైరా) కార్మిక వర్గంలో మనపార్టీ స్థిరంగా నాటుకోకపోవడం, కార్మికవుద్యమము తాత్కాలికంగా మన పలుకుబడిలో వున్నా దానికి తగిన ఆధారం మనం యేర్పరచలేదు. కార్మికోద్యమముద్వారా తయారైన వర్గచైతన్యమును, రాజకీయ చైతన్యముగాను, సోషలిస్టు చైతన్యముగాను తయారు చేయజాలకపోయాం. అందుచేత కార్మికవర్గంనుండి మిలిటెంటు వర్కర్లు తయారైనా, వారిని పార్టీ కేడర్లుగా తయారుచేయకపోవడంవలన జాతీయోద్యమము ప్రారంభముగాకముందే యిట్టి సోషలిస్టు చైతన్యమున్న పార్టీకేడర్లు ప్రభుత్వ నిర్బంధమునకు గురి అయ్యారు. దానితో కార్మికవర్గాన్ని జాతీయోద్యమ రంగంలోనికి గొనివచ్చే పార్టీకేడర్లు సమయానికి లేకుండాపోయాయి. మిగిలివున్న రేంక్ అండ్ ఫైల్ వర్కర్లు మిలిటెంటు ట్రేడ్ యూనియనిస్టులు మాత్రమేగాని రాజకీయ, సోషలిస్టు చైతన్యము గలవారుగాదు. అందుచేత శాసనోల్లంఘనము వచ్చేసరికి వారి రాజకీయ (కార్మికవర్గ) పాత్రయేమో తెలుసుకోజాలక కేవలం ట్రేడ్ యూనియనిస్టులుగా మాత్రం పనిచేశారు. జాతీయ సంస్కరణవాదులను కార్మికులతో విమర్శించినట్లే కాంగ్రెసు నాయకులనుగూడ విమర్శించారు. ఈ విమర్శనతోపాటు కార్యాచరణగూడ లేకపోవడంవలన జాతీయ రంగంనుండి విడబడిపోవలసివచ్చింది. ఇలా సెక్టేరియన్ తత్వంలోకి పోవడానికి కారణం రాజకీయంగా తమకున్న బాధ్యతలేవో తెలుసుకోజాలకపోవడమే; ఇందుకు తగిన పార్టీ రాజకీయ కేంద్రము లేకపోవడమే; మీరట్ కేసుకు పూర్వమే యిలాంటి రాజకీయ కేంద్రాన్ని యేర్పరచవలసింది. కమ్యూనిస్టు నాయకులుగూడ ట్రేడ్ యూనియన్ దృక్పధంతో పనిచేయడంవలన యీ ముఖ్య రాజకీయ కర్తవ్యాన్ని మర్చిపోయారు. ఈ విధంగా జాతీయోద్యమము వచ్చేసరికి కమ్యూనిస్టులు, మిలిటెంటు ట్రేడ్ యూనియనిస్టులుగా మాత్రమే పని చేయగలిగారు.

రెండవ కారణం :- మీరట్ అరెస్టులకు గురికాకుండా మిగిలియున్న కమ్యూనిస్టు గ్రూపులు యీ తప్పును గుర్తించినప్పటికిని, అప్పటికి రాష్ట్రాలలో మిగిలియున్న గ్రూపులను ఐక్యపర్చి యొక రహస్య పార్టీ కేంద్రాన్ని స్థాపించి కార్మికవర్గమునుండి, జాతీయ యువకులనుండి పార్టీ సభ్యులను తయారుచేసి, భారతదేశ మంతటిలోను యొక నిర్ణీత పద్ధతిని ట్రేడ్ యూనియన్ పనితోపాటు, రాజకీయాందోళన (కార్మిక రాజకీయ ప్రదర్శనాలు, రైతుల ప్రజాబాహుళ్యమైన రాజకీయ సానుభూతి సభలు) సాగించలేకపోయాము. (ఈ పని అ. భా. పార్టీ కేంద్రము స్థాపించబడందే, యీ పనికి



కొందరు పార్టీ కేడర్లను తయారుచేసి ట్రేడ్ యూనియన్ పనినుండి ప్రత్యేకించనిదే సాధ్యముగాదు.) కార్మికవర్గ రాజకీయపాత్ర ప్రాముఖ్యతను గ్రహించినచో యిలా చేయగల్గేవాళ్ళము; కాని స్థానికంగా ట్రేడ్ యూనియన్ పనిలో మునిగి యీ రాజకీయ కర్తవ్యాన్ని మర్చిపోయాము.

## ఈ కాలములో పార్టీ నిర్మాణ ప్రయత్నాల ఫలితాలు

(1) పార్టీ నిర్మాణములో యొక మార్పుగల్గింది. కార్మికవర్గంనుండి యిదివరలో తయారైనట్టి, యిప్పుడు తయారగుచున్న మిలిటెంటు వర్కర్లకు మార్క్సిజము, లెనినిజము గూర్చి బాగా బోధచేయబడింది. వీరందరిలో సోషలిస్టు చైతన్యము అభివృద్ధి అయింది. క్రొత్త పార్టీ కేడర్లు తయారయ్యారు. కాని వీరింకా స్థానిక ట్రేడ్ యూనియన్ పనులలోనే మునిగివున్నారు. ఈవిధంగా మీరట్‌కు ముందు కమ్యూనిస్టులు అవలంబించిన మిలిటెంటు ట్రేడ్ యూనియన్ పంథానుండి పార్టీ నిర్మాణమునకు కొంతవరకు మరలాము. ఇదివరలోవలె కేవలం ట్రేడ్ యూనియన్ పని, రాజకీయ ఆందోళనలే పార్టీకి మూలాధారంగా వుండుటలేదు. కార్మిక వర్గమునుండి బయలుదేరిన మిలిటెంటు వర్కర్ల నాధారంగాగొని పార్టీని నిర్మించుటకు ప్రయత్నం ప్రారంభమైనది. కలకత్తా, బొంబాయి ప్రదేశాల్లోని కార్మికుల్లోనుండి చైతన్యముపొంది ముందుకువస్తున్న మిలిటెంటు వర్కర్లు జాతీయోద్యమముద్వారా గాంధి పోరాట పద్ధతులయెడల విముఖత్వముచెందిన విప్లవయువకులు, విద్యార్థులు, వీరితో పార్టీ నిర్మింపబడుతోంది; కాని యిలాంటివారందరికీ పార్టీ పద్ధతులలో పూర్తి తర్ఫీదు యివ్వ దానికి తగిన పార్టీయంత్రం నిర్మింపబడలేదు.

(2) ఇలా కమ్యూనిస్టులుగా తయారగుచున్నవారు, కేవలం కమ్యూనిస్టు ఆందోళనద్వారా ఆకర్షింపబడినవారుగాక, దైనందినం సంస్కరణవాదులతో ఢీకొంటూ, వారిచర్యల నెదుర్కొంటూ, ఢక్కా మొక్కీలు తిని, సంస్కరణవాదం నిజతత్వాన్ని పూర్తిగా తెలుసుకున్నవారు. మార్క్సిస్టు పద్ధతుల ప్రాముఖ్యతను ఆచరణద్వారా జీర్ణించుకొని మార్క్సిస్టు సిద్ధాంతాలలో అకుంఠిత విశ్వాసం అలవర్చుకున్నవారు.

## మన లోపాలు

(1) పార్టీ నిర్మాణముగూర్చి మర్చిపోయాము. అత్యవసరమైన రాజకీయ కర్తవ్యమైననూ, పార్టీ కేంద్రాన్ని స్థాపించలేకపోయాము.

(2) రాజకీయముగా పనిచేయవలసి వచ్చినప్పుడుగూడ మన స్థానిక తత్వాన్ని విడనాడక ట్రేడ్ యూనియన్ వుద్యమములోనే మునిగిపోయాము. అందువలన కార్మిక సంఘాలను, పార్టీని గూడ స్థిరమైన పునాదిపై నిర్మించజాలకపోయాము.

(3) పై స్థానిక తత్వంతోకూడిన ప్రవర్తనవలన రాజకీయంగా జాతీయోద్యమములో కార్మిక వర్గ పాత్రను నిర్వహించజాలకపోయాం. అందుచేత దాన్నుండి వేరుబడిపోయాం; దీని ఫలితంగా పార్టీలో విభేదాలుగూడ గలిగాయి. పార్టీ నిర్మాణం స్తంభించిపోవలసివచ్చింది.

# నాల్గవ భాగం

## పార్టీ నిర్మాణచరిత్ర (1933 – 36)

ఈ కాలంలో పార్టీ నిర్మాణచరిత్రనుగూర్చి తెలుసుకొనేముందు (1929-33) సంవత్సరముల మధ్య పార్టీ పరిస్థితులగూర్చి క్లుప్తంగా మరల గుర్తుచేసుకోవడం అవసరం. 1929-33 సంవత్సరముల మధ్య పార్టీనిర్మాణము స్తంభించిపోయిందని యిదివరలో చూశాము. అయినప్పటికి కొన్ని ప్రయత్నాలు పార్టీని నిర్మించుటకు జరిగాయి. ఈ ప్రయత్నాలనుగూర్చి తెలుసుకుందాము.

మీరట్ అరెస్టుల అనంతరము ఒక రాష్ట్రానికి మరొక రాష్ట్రానికి సంబంధాలు తెగిపోయాయి. ఇదివరకు కలకత్తాలో 1928 వ సంవత్సరములో యేర్పడ్డ తాత్కాలిక పార్టీకేంద్రము చెల్లాచెదరైపోయింది. అందుచేత మరల రాష్ట్రాలలోని అరెస్టుగాకుండా మిలిగియున్న గ్రూపులను ఐక్యపరచి పార్టీ కేంద్రాన్ని స్థాపించడం జరిగితేనేగాని పార్టీ నిర్మాణము కొనసాగించుటకు వీలులేదు. మీరట్ అరెస్టుల తరువాత ముందుకువచ్చిన కమ్యూనిస్టులు యీపనికి పూనుకున్నారు. లాహోరు కాంగ్రెసు సమావేశమప్పుడు (1930) రెండవ అ. భా. కార్మిక కర్షకపార్టీ సమావేశము జరిగింది. అప్పటికి వివిధ రాష్ట్రాలనుండి వచ్చిన కమ్యూనిస్టు గ్రూపులతో మరల సంబంధాలు యేర్పరచుకొని పార్టీ కేంద్రాన్ని స్థాపించాలని బొంబాయి కమ్యూనిస్టుగ్రూపు ప్రయత్నించింది. కాని ఆ సమావేశమునకు అన్ని రాష్ట్రాలనుండి ప్రతినిధులు రాజాలకపోవడంవలన ఆ ప్రయత్నం ఫలించలేదు. అప్పటికివచ్చిన పంజాబు కమ్యూనిస్టులతోను, బెంగాల్ కమ్యూనిస్టులతోను, బొంబాయి గ్రూపుకు సంబంధము యేర్పడింది. ఈ సంబంధముగూడ యెక్కువకాల ముండలేదు.

ఈవిధంగా పార్టీ కేంద్రమును యేర్పరచజాలకపోయారు ఏ రాష్ట్రములో గ్రూపు ఆ రాష్ట్రములోనే ట్రేడ్ యూనియన్ పనిలో మునిగిపోవడంవలన యే రాష్ట్రం గ్రూపుగూడ పార్టీ కేంద్రాన్ని నిర్మించుటకు అవసరమైన కృషి చేయజాలకపోయింది. కాని యే రాష్ట్రములో గ్రూపు ఆ రాష్ట్రములో పార్టీ కేడర్లను తయారుచేయుటకు కొద్దిగానో, గొప్పగానో కృషిచేస్తూవుంది. అందుచేత యీ



కాలములో పార్టీ కేంద్రము యేర్పడకపోయిననూ పార్టీసభ్యుల సంఖ్య, ముఖ్యంగా కార్మికవర్గంనుండి తయారైన సంఖ్య అభివృద్ధి అయింది. (బొంబాయిలో 'యంగ్ వర్కర్సులీగ్', బెంగాల్‌లో 'గనవాణి' గ్రూపు). పార్టీ కేంద్రము యేర్పడి, అఖిలభారత రాజకీయ దృక్పధముతో యొక పార్టీ పత్రిక యీ కాలములో యేర్పడియున్నచో పార్టీ నిర్మాణము అభివృద్ధి అయివుండేది; 1931 - 32 సంవత్సరముల మధ్య బొంబాయి గ్రూపులో వచ్చిన విభేదాలురాకుండా వుండేవి.

ఈ కాలములోనే భారతదేశ కమ్యూనిస్టుపార్టీ రహస్య కేంద్రాన్ని యేర్పరచి, పార్టీ నిర్మాణమును అభివృద్ధిచేయుటకు 'కమ్యూనిస్టు ఇన్‌టర్ నేషనల్'గూడ కృషిచేసింది. 1930 వ సంవత్సరములో "కమ్యూనిస్టు ఇన్‌టర్‌నేషనల్" ప్రతినిధి ఒకరు భారత దేశానికివచ్చి బొంబాయి గ్రూపుతో కలిసి పనిజేశాడు. బొంబాయిలో అప్పుడు పనిజేస్తున్న కమ్యూనిస్టులందరిని ఐక్యపర్చి తాత్కాలికంగా బొంబాయి పార్టీకేంద్రాన్ని యేర్పరచాడు. అప్పటికి బొంబాయి గ్రూపుకు కలకత్తా గ్రూపుతో వున్న సంబంధముల నాధారముజేసుకుని కలకత్తా గ్రూపుతో సంబంధము యేర్పరచుకున్నాడు. కాని యీ సంబంధము హెచ్చుకాలము పనిచేయజాలక పోవడంవలన కలకత్తా గ్రూపుతో సంబంధము హెచ్చుకాలము వుండలేదు.

కమ్యూనిస్టు ఇన్‌టర్‌నేషనల్ ప్రతినిధి బొంబాయి వచ్చినతరువాతనే భారతదేశ కమ్యూనిస్టు పార్టీకంతకూ యొక చిత్తు నిబంధనావళి (constitution) తయారుచేయబడింది. వివిధ రాష్ట్రాల్లోని కమ్యూనిస్టుగ్రూపులలో రాజకీయ, సిద్ధాంతఐక్యతను ఏర్పరచుటకుగాను బహిరంగంగా "Worker's weekly" (వర్కర్సు వీక్‌లీ) అనే మార్క్సిస్టు పత్రిక స్థాపించబడింది అన్ని గ్రూపులకు దీన్ని అందజేయుటకు ప్రయత్నాలు జరిగాయి. "పార్టీ చిత్తు కార్యక్రమము" ఒకటి తయారుచేయబడి అన్ని గ్రూపులకు పంపబడింది. ఈ కాలంలోనే మద్రాసు రాష్ట్రములో పార్టీని నిర్మించుటకు కామ్రేడ్ ఖాన్ మద్రాసు పంపబడ్డాడు. షోలాపూర్, అహమ్మదాబాద్, ఖాందేష్ ప్రదేశాలలోని కార్మికులలో పనిచేయడానికి, పార్టీని నిర్మించడానికి బొంబాయినుండి కొందరు 'యంగ్ వర్కర్సు లీగ్' సభ్యులు పంపబడ్డారు.

స్థానికంగా బొంబాయిలోచేయబడ్డ పార్టీ నిర్మాణప్రయత్నాలేగాక, అఖిల భారత పార్టీకేంద్రాన్ని ఏర్పరచుటకు కమ్యూనిస్టు ఇన్‌టర్‌నేషనల్ ప్రతినిధిద్వారా మరల ప్రయత్నించబడింది. 'వర్కర్సు వీక్లీ'ద్వారా యేర్పడ్డ కొన్ని కాంటాక్టుల, అదివరకే యేర్పడ్డ సంబంధాల నాధారముగగొని 1931 వ సంవత్సరములో కరాచీ కాంగ్రెసు సమయమప్పుడు కరాచీలో మూడవ అఖిల భారత కార్మిక కర్షక పార్టీ' సమావేశం జరుపబడింది. ఆ సమావేశములోగూడ పార్టీ కేంద్రము నేర్పరచుటకు చేయబడ్డ ప్రయత్నం ఫలించలేదు ఎందుచేతనంటే పార్టీ సెంటరుపనికి ప్రత్యేకించబడ్డవారు సెంటరు పని కొరకే పనిజేయకపోవడంవలననూ, తమ రాష్ట్రములోని ట్రేడ్‌యూనియన్ పనిని వారే చేయుచుండుటవలననూ, పార్టీ కేంద్రపనిని చేయజాలకపోయారు. తరువాత అరెస్టుగాబడ్డారు. దీనితో మరల సంబంధాలు తెగిపోయి, పార్టీకేంద్రము నామకఃగూడ లేకుండపోయింది. ఇదే గాకుండా పార్టీ నిర్మాణమును పూర్తిగా కుంటుపర్చిన మరియొక సంఘటనగూడా సంభవించింది. 1931 - 32 సంవత్సరములలో బొంబాయి పార్టీ సభ్యులలో తీవ్ర విభేదాలు కలిగాయి. ప్రారంభములో రాజకీయ అభిప్రాయ భేదముతో ఆరంభమై పార్టీకి తీవ్రహాని గల్గించే వ్యక్తి భేదాభిప్రాయముల క్రింద

మారాయి. ఈ విభేదాలతో కమ్యూనిస్టు ఇన్‌టర్‌నేషనల్ ప్రతినిధి వచ్చాక, నామకః యేర్పడ్డ పార్టీ కేంద్రోము, పార్టీలోని రాజకీయ సిద్ధాంత ఐక్యత యెగిరిపోయింది. 1932 వ సంవత్సరం అఖరుకు పార్టీ పరిస్థితులు చాల విషమరూపందాల్చి ముఖ్యంగా బొంబాయి గ్రూపు (ఈ గ్రూపే భారతదేశ కమ్యూనిస్టుగ్రూపులలో చాల ప్రధానమైనది; అందుచేత యీ గ్రూపులో విభేదాలురాగానే పార్టీ నిర్మాణము పూర్తిగా స్థంభించిపోయింది.) బహిరంగంగా, దైనికపత్రికలలో ఒకరిపై యింకొకరు వ్యతిరేక ప్రచారము సాగించుకొన్నారు. దీనితో పార్టీ పూర్తిగా బలహీనపడిపోయింది. జాతీయోద్యమమునుండి వేరుపడిపోవడం, పార్టీలో ఐకమత్యం లేకపోవడం, కార్మికోద్యమము జాతీయ సంస్కరణవాదుల చేతుల్లోకి పోవడం పార్టీనాయకులు ఒకరినొకరు బహిరంగంగా పత్రికలలో దూషించుకోవడం— యివి పార్టీ అభివృద్ధిని పూర్తిగా స్థంభింపజేసినవి. ఇది 1932 వ సంవత్సరం ఆఖరుకు పార్టీపరిస్థితి. పార్టీ నామకః కేంద్రముగూడ లేదు. రాష్ట్రాల్లోని గ్రూపుల కొకదాని కొకదానికి సంబంధాలు పూర్తిగా తెగిపోయాయి. కలకత్తా, అహమ్మదాబాద్, మద్రాస్ వగైరా ప్రదేశాల్లో కొందరు కమ్యూనిస్టులు ప్రత్యేక గ్రూపులుగా పనిజేస్తున్నా అచ్చట పార్టీ యింకా నిర్మించబడలేదు. ఈగ్రూపు లన్నిటిలోను బొంబాయిగ్రూపు ప్రాముఖ్యమైనది. ఈగ్రూపు బాగా పనిజేస్తుంటే పార్టీ అంతా బాగా పనిజేసినట్లు; లేకపోతే లేనట్లు. ఈగ్రూపు చరిత్ర ఈ కాలంలో మొత్తం భారతదేశ చరిత్ర. అందుచేత యీ కాలంలో యీగ్రూపు యేస్థితిలో వుందో తెలుసుకుందాం.

## బొంబాయి కమ్యూనిస్టు గ్రూపు

'గిర్నికంగారు యూనియన్'ను జాతీయ సంస్కరణవాదులు విచ్ఛిన్నం గావించిన తరువాత, చైతన్యములేని కార్మికులందరూ సంస్కరణవాదుల పలుకుబడిలోనికి పోయారు. వీరిని సంస్కరణవాదుల పలుకుబడినుండి తొలగించడానికి, కమ్యూనిస్టు సానుభూతిపరు లందరిలో యేర్పడిన నిరుత్సాహాన్ని తొలగించి ఐకమత్యము నెలకొల్పడానికి "యంగ్ వర్కర్సులీగ్" స్థాపించబడిందని యిదివరకే చూశాము. ఈ సంఘంద్వారా అధ్యయన తరగతులు సాగించడం, సంస్కరణవాదులతో పోరాటం సాగించడం జరుగుతోంది "బొంబాయి కమ్యూనిస్టు గ్రూపు" తరఫున "క్రాంతి" పత్రిక మరల తీసుకురాబడింది. ఇదివరకువలె కేవలం కార్మిక బులెటెన్‌వలెగాక యీ పర్యాయం రాజకీయ పత్రికగా వెలువడింది. "యంగ్ వర్కర్సులీగ్", "యంగ్ కమ్యూనిస్టులీగ్" సభ్యులకు మార్క్సిస్టు దృక్పథం కలుగజేయడానికి సులభమైన శైలిలో అర్థమయ్యేటట్లు అప్పటి రాజకీయ సమస్యలగూర్చి విశదపర్చడానికి "క్రాంతి" యెంతో తోడ్పడింది. బొంబాయి కమ్యూనిస్టు గ్రూపు రాజకీయ పరిజ్ఞానం అభివృద్ధి చెందేటట్లు బాగా వుపయోగపడింది.

"క్రాంతి" గాకుండా, మరాఠీలో సోషలిస్టు సాహిత్యం కొంత వెలువడింది. "కమ్యూనిస్టు మానిఫెస్టో", "గాంధి తత్వము" అనే కరపత్రాలు మరాఠీలో ప్రకటించబడ్డాయి. ఇవి "యంగ్ వర్కర్సులీగ్" సభ్యులకు అధ్యయన తరగతులు పెట్టుటకు చాలవరకు తోడ్పడ్డాయి.

ఇతర ప్రాంతాలలోగూడ యిలాగే మార్క్సిస్టు అధ్యయన తరగతులు సాగించబడ్డాయి. కాని యెచ్చటాగూడ కార్మికవర్గములోనుండి పార్టీ సభ్యులను అభివృద్ధిచేయుటకు, జాతీయ సంస్క-



రణతత్వమును బట్టబయలు చేయుటకు బొంబాయి కమ్యూనిస్టులు గావించినట్లుగా ప్రయత్నము చేయబడలేదు.

అందువలన బొంబాయిపార్టీ నిర్మాణప్రయత్నాలు అఖిలభారత పార్టీ నిర్మాణచరిత్రకు యెంతో ముఖ్యమైనవి. భారతదేశ కార్మికవర్గమునకంతకు ముందుగా బొంబాయి కార్మికపంథాను చూపెట్టింది. ఆవిధంగా భారతదేశ కార్మికోద్యమమునకు బొంబాయి కార్మికవర్గం నాయకత్వము వహించినది. అలాగే బొంబాయి కమ్యూనిస్టుగ్రూపు యితర కమ్యూనిస్టుగ్రూపు లన్నిటికీగూడ నాయకత్వము వహించి, పార్టీ కేంద్రాన్ని స్థాపించగల్గినట్లయిన పార్టీ నిర్మాణం యెంతో ముందుకు పోయేది. కాని బొంబాయి కమ్యూనిస్టుగ్రూపు తనలోవున్న బలహీనతలు తొలగించుకోజాలక పోవడంవలన యీ కార్యాన్ని సాధించజాలక పోయింది; అంతేగాకుండా అచ్చట తాత్కాలికంగా తీవ్ర విభేదాలకు గురి అయి విచ్ఛినమయింది. అందువలన ప్రధాన కమ్యూనిస్టుగ్రూపు విచ్ఛిన్నంగావడంతో అ. భా. పార్టీ నిర్మాణముగూడ స్థంభించిపోయింది. బొంబాయిగ్రూపును విచ్ఛిన్నం గావించిన విభేదాలకు మూలము గూర్చి తెలుసుకోవడం చాలా అవసరము. ఎందుచేతనంటే బొంబాయి గ్రూపులోని విభేదాలు వాస్తవంగా రాజకీయ విభేదాలుగాని వ్యక్తివిభేదాలు గావు. పార్టీ ముఖ్య కర్తవ్యమును మర్చిపోయి తప్పుడు పంథాల ననుసరించడంవలన గల్గిన విభేదాలు; ఈ తప్పుడుపంథాలు యేవో తెలుసుకోవడం, ఆత్మవిమర్శన గావించుకోవడం పార్టీ నిర్మాణాభివృద్ధికి యెంతో తోడ్పడుకుంది. వాస్తవంగా పార్టీని నిర్మించడమును పార్టీలోని వివిధ తప్పుడు పోకడలతో పోరాడి వాటిని రూపుమాపడం యెంతో అవసరం.

### బొంబాయి గ్రూపులోని విభేదాలు (1931 - 32)

బొంబాయి గ్రూపులోగల్గిన విభేదాలు ప్రారంభములో రాజకీయ పాలసీపైననే బయలుదేరాయి. శాసనోల్లంఘనంయెడల కమ్యూనిస్టులు యే వైఖరి అవలంబించాలి అనే ప్రధాన రాజకీయ సమస్యపై బయలుదేరాయి. ఆఖరుకు యీ రాజకీయ విబేధాలు వ్యక్తి తగాదాలుగా మారి పార్టీ అభివృద్ధికి యెంతో అడ్డుపడ్డాయి. కాన బొంబాయి కమ్యూనిస్టులలో గల్గిన చీలికలు కేవలం వ్యక్తిగత తగాదాలుగాక ప్రధాన రాజకీయ సమస్యపైననే వుదయించాయి. వాటిని తెలుసుకోవడం చాల అవసరం. అందుచేత ఆ విభేదాలగూర్చి, వాటి రాజకీయ మూలాన్నిగూర్చి యిచ్చట క్లుప్తంగా పరిశీలించుదాం :-

(1) ఒక పక్షం యిలా వాదించింది: శాసనోల్లంఘనములో మనం పాల్గొనకపోవడంవలన జాతీయోద్యమమునకు దూరమైపోతున్నాము. కమ్యూనిస్టులు "ద్రోహులు"గా ప్రజలందరిలోను తలపబడుతున్నారు. కాంగ్రెసు నాయకుల పలుకుబడి కార్మికుల్లో వ్యాపించుతోంది. కార్మికుల్లో పూర్తి నిరుత్సాహం వ్యాపించింది. కమ్యూనిస్టుల పలుకుబడి కార్మికుల్లోగూడ తగ్గిపోతూవుంది. ఇట్టి పరిస్థితుల్లో కాంగ్రెసు నాయకత్వమును, దాని పోరాట పంథానుగూర్చి యేమీ విమర్శ చేయరాదు. కమ్యూనిస్టులు జాతీయ సంస్కరణవాదులపై తీవ్ర విమర్శ చేయకూడదు. జాతీయ వుద్యమములో కమ్యూనిస్టులుగూడ పాల్గొనాలి; జాతీయ బూర్జువా నాయకత్వాన్ని అంగీకరించి పనిజేయాలి."

(2) రెండవ పక్షం వాదం యిది :- కాంగ్రెసు నాయకత్వపు రాజకీయ పాత్రను విమర్శించడం యెన్నడూ మానగూడదు: జాతీయ సంస్కరణవాదులపై పోరాటమును మానగూడదు. ఇలా చేయడంవలననే కమ్యూనిస్టు సిద్ధాంతాలు కలిషితంగాకుండా కాపాడుతాము. కార్మికోద్యమమును పూర్తిగా విడనాడి జాతీయ వుద్యమములో పాల్గొనగూడదు. మనకు జాతీయ వుద్యమంలో, పాల్గొనే అంత శక్తి యిప్పుడులేదు. జాతీయోద్యమములో పాల్గొనటనుకన్న కార్మికోద్యమములో మన స్థానాన్ని బలపర్చుకోవడం ముఖ్యం. కాబట్టి కార్మికోద్యమమునకు వ్యతిరేకులుగా వుండి, దానిని విచ్ఛిన్నం చేస్తున్న కాంగ్రెసు నాయకత్వము, జాతీయ సంస్కరణవాదుల నిజతత్వాన్ని బట్టబయలుచేయడం మానడమంటే కార్మికోద్యమాన్ని విడనాడడమే అవుతుంది.

మొదటిపక్షం, రెండవపక్షాన్ని "సెక్టేరియను"లు అని విమర్శించినది; రెండవపక్షం మొదటి పక్షాన్ని సంస్కరణవాదులని ఒకరినొకరు విమర్శించుకోనడం ప్రారంభించారు. జాతీయ బూర్జువా వర్గం అవలంబించే పోరాట విచ్ఛిన్నపాత్రను సరిగా గ్రహించక "బూర్జువావర్గ పాత్రను" ఎక్కువ అంచనా వేస్తున్నారని (overestimate) మొదటిపక్షాన్ని రెండవపక్షం విమర్శించింది.

ఈ విధంగా జాతీయ పోరాటము జరుగుచున్నప్పుడు, ముఖ్య గ్రూపు అయిన బొంబాయి గ్రూపులో రాజకీయ భేదాభిప్రాయములు బయలుదేరాయి. ఈ రెండుపక్షాల వాదనలు తప్పుడు వాదనలే. రెండు పక్షాలుగూడ పార్టీ ఆ సమయములో యెందుచేత బలహీనపడిపోయిందో అర్థంచేసుకోలేదు. పార్టీని నిర్మించజాలకపోవుటే మన బలహీనతకంతకూ కారణం అనేదాన్ని అర్థం జేసుకోలేదు. పార్టీలోని రాజకీయ భేదాభిప్రాయములవలన, వివిధ దృక్పధములవలన యీ విభేదాలు యేర్పడుచున్నాయని భావించి ఒకరినొకరు విమర్శించుకోవడం ప్రారంభించారు. అసలు బలహీనతను మర్చిపోయారు

ఈ వాదనలు యెంతవరకు సరియైనవో ఆలోచిద్దాము. మొదటిపక్షపు వాదములో కొంతవరకూ, రెండవపక్షపు వాదములో కొంతవరకు సత్యమున్నది. ఏ పక్షపు వాదముగూడ అంతా సరియైనదికాదు. అప్పట్లో (మొదటిపక్షము చెప్పినట్లు) కమ్యూనిస్టులు జాతీయోద్యమములో పాల్గొనకపోవడంవలన రాజకీయ రంగమునుండి విడబడిపోతున్న మాట వాస్తవమే. కాంగ్రెసు నాయకత్వమును విమర్శిస్తున్నందువలన కాంగ్రెసు ప్రజా సామాన్యం మనకు వ్యతిరేకమగుచున్నమాట వాస్తవమే. ప్రజలు, కాంగ్రెసు నాయకత్వము కమ్యూనిస్టులపైగావించే దుష్ప్రచారము నమ్ముచున్నమాట వాస్తవమే. కమ్యూనిస్టులు జాతీయోద్యమమునకు బయటవుండి, దానిలో పాల్గొనకుండా ప్రభుత్వము గావించేఅత్యాచారాలను, నిర్బంధమును నిరసించకుండా, ప్రజాబాహుళ్యమైన సానుభూతి ప్రదర్శనములు చేయకుండా కాంగ్రెసు నాయకత్వమును విమర్శించడంవలన ప్రజలుగూడ కమ్యూనిస్టులకు దూరమైనమాట వాస్తవమే.

ప్రజలపై సామ్రాజ్యవాదముగావించే నిర్బంధము, అత్యాచారములను బహిర్గతముచేస్తూ, దాన్ని ఖండించడములో కమ్యూనిస్టులు, కార్మికవర్గం అన్ని రాజకీయపార్టీలకంటె ముందుగా వుండాలి; ఇలా ఖండించడమేగాక కార్మిక వర్గాన్నంతటిని, ప్రజలను ఇట్టి ప్రభుత్వ నిర్బంధమునకు వ్యతిరేకంగా సమీకరించాలి. జాతీయోద్యమము, ప్రజా వుద్యమము బాగా చెలరేగుచున్న సమయములో సానుభూతి వెల్లడించడానికి, ప్రొటెస్టు (నిరసన) ప్రదర్శనాలు గావించడానికి, కార్మిక సమ్మెల



ద్వారా ప్రజావుద్యమాన్ని బలపర్చడానికి కార్మికవర్గాన్ని సిద్ధపర్చాల్సి వుంది. అలాచేయక ప్రభుత్వ నిర్బంధానికి గురిఅగుచున్న కాంగ్రెసునాయకులను వూరకనే విమర్శించుతూ కూర్చుంటే ప్రజలు అసహ్యించుకోవడంలో తప్పేమీలేదు. ఇలా సిద్ధంచేయడముద్వారానే కార్మికవర్గము రాజకీయ చైతన్యం పొందుతుంది. అప్పుడే కార్మికవర్గం, కమ్యూనిస్టులు ప్రభుత్వవ్యతిరేక పోరాటశక్తులకు నాయకత్వం వహించి వారిపై జాతీయ బూర్జువావర్గముకున్న రాజకీయ పలుకుబడిని క్రమక్రమేణా ఆచరణద్వారా క్షీణింపజేస్తారు. ఈ యెత్తులను కమ్యూనిస్టు ఇన్‌టర్‌నేషనల్ ఆరవకాంగ్రెసు తెల్పినప్పుడు అందరమూ అంగీకరించాము. కాని ఆచరణలో విఫలులమైనాము. ఈ మన విఫలతను గుర్తించియే మనం జాతీయోద్యమములో పాల్గొనకపోవడం వలన జాతీయోద్యమమునుండి వేరుబడిపోతున్నామని మొదటిపక్షం వాదించింది. ఇంతవరకు మొదటిపక్షవాదం సరియైనదే ఈ ఆత్మవిమర్శన పార్టీని ముందుకు గొంపోవుటకు సహాయపడింది. కాని యీ వాదనలో యింకో ప్రమాదం వుంది. కాంగ్రెసు నాయకత్వము పోరాటాన్ని యెలా విచ్ఛిన్నం గావించిందో, జాతీయ సంస్కరణవాదులు యెలా కార్మికోద్యమాన్ని విచ్ఛిన్నం గావించారో తెల్పుతూ ఆరోజుల్లో కమ్యూనిస్టులు గావించిన విమర్శచేసి వుండాల్సిందిగాదని గూడ వీరివాదన. ఇది మెన్షివిక్‌వాదన తప్ప మరేమీ గాదు. ఇది చాల ప్రమాదకరమైన వాదము. ఎందుచేతనంటే జాతీయోద్యమమును కాంగ్రెసునాయకత్వము యెలా విచ్ఛిన్నము గావించుతూ బూర్జువావర్గ స్వార్థములకుగాను వుద్యమాన్ని యెలా వుపయోగించుకొంటూవుందో — వుద్యమము యే పంథాను అభివృద్ధిచేస్తే ప్రజల హక్కులు సంపాదించబడేవో, యీ విషయమును యెప్పటికప్పుడు బహిర్గతము చేయడంవలననూ, కార్మికోద్యమములో విప్లవపంథా కొరకు, జాతీయ సంస్కరణవాదులకు వ్యతిరేకంగా పోరాటము సాగిస్తూవుంటూ, కార్మికవర్గంలో సంస్కరణవాద భావాలు వ్యాపించకుండా తీవ్ర ప్రచారము గావించడంవలననూ, శాసనోల్లంఘనము అంతమయ్యాక గాంధిపద్ధతులతో అసంతృప్తిచెందిన జాతీయ యువకులందరు సోషలిస్టులుగాను, నిజమైన సామ్రాజ్యవాద వ్యతిరేకులుగాను తయారైనారు. కమ్యూనిస్టుపార్టీ వైపుకు ఆకర్షింపబడ్డారు. ఈ విమర్శయే అప్పుడు చేయకున్న యీ విధమైన అభివృద్ధిగాక కాంగ్రెసు నాయకత్వమును అతివాదపదజాలముతో బలపర్చే మరో తప్పుడు సోషలిస్టుపంథా అభివృద్ధిఅయ్యేది; కమ్యూనిస్టుపార్టీ అభివృద్ధి మరికొంత కాలమువరకూ నిరోధింపబడివుండేది. అప్పుడు వుత్త విమర్శచేయకుండా శాసనోల్లంఘనములో కమ్యూనిస్టులు పాల్గొంటే పార్టీ రాజకీయంగా గొప్ప శక్తిగా అప్పటికే తయారై పార్టీ యెన్నోరెట్లు అభివృద్ధి అయి వుండేది. ఇదే ముఖ్యలోపంగాని అసలు విమర్శే మానివేయడము సరియైనదిగాదు.

మొదటిపక్షం వారి రెండవ తప్పుడువాదము యిది. కార్మికోద్యమము పై కాంగ్రెసునాయకత్వపు పలుకుబడి హెచ్చుతోందనియు, కార్మికులలో అసంతృప్తి (reaction) వచ్చినదనియు వారి వాదన. ఇది యెంతమాత్రం సత్యంగాదు. సామ్రాజ్యవాద నిర్బంధ ప్రయోగమువలన, జాతీయ సంస్కరణవాదులు కార్మికోద్యమములో చీలికలు కలుగజేసి బలహీనపర్చిననూ, (యీ చర్యలవలన కొంత నిరుత్సాహం గల్గినమాట వాస్తవమే) కార్మిక సంఘాలకు, వుద్యమానికి ఆయువుపట్లయిన మిలిటెంటు వర్కర్లందరు కమ్యూనిస్టులపై సానుభూతిగావుండి వారినే అనుసరిస్తున్నారు. (యంగ్ వర్కర్సు లీగ్) అదేగాకుండా యీసమయములోనే కార్మికవర్గ మిలిటెంటు వర్కర్సునుండి పార్టీ సభ్యులు యిదివరకంటె హెచ్చుగా తయారుచేయబడ్డారు. 1931 వ సంవత్సరాంతములో బొంబాయిలోనేగాక, షోలపూరుకుకూడ కార్మికోద్యమము ప్రాకినది. (కమ్యూనిస్టుల నాయకత్వముక్రింద.)

బొంబాయిలో నేతపరిశ్రమ కార్మికులేగాక, ఆయిల్‌పరిశ్రమ కార్మికులలోగూడ ట్రేడ్‌యూనియన్లు అభివృద్ధి అయ్యాయి. అప్పుడు జాతీయోద్యమములో కార్మికవర్గం, కమ్యూనిస్టులు నెరవేర్చవలసిన రాజకీయ కర్తవ్యమును కమ్యూనిస్టులు నెరవేర్చలేక పోయారు గాని, కార్మికవర్గంలోగాని, పార్టీ సానుభూతిపరులలోగాని కాంగ్రెసునాయకత్వపు పలుకుబడి హెచ్చలేదు. పైగా, జాతీయ సంస్కరణ వాదుల ద్రోహం, వారి విచ్ఛిన్నపాత్ర స్పష్టంగా అర్థం చేసుకోగల్గారు.

అందువలన మొదటిపక్షం ఆత్మవిమర్శన సరియైనదైననూ, దానినుండి నేర్చుకోవలసిన గుణ పాఠాలు నేర్చుకొనుటకు పూనుకోవడానికి బదులు అసలు పార్టీ పాలసీ, జాతీయ బూర్జువావర్గ రాజకీయ పాత్రనుగూర్చి పార్టీగావించిన విమర్శే తప్పు అనే మెన్షివిక్ వాదనకు దిగి పార్టీ పురోభివృద్ధికి అడ్డు పడ్డారు.

రెండవపక్షం వాదం పూర్తి "సెక్టేరియన్" దృక్పథంతో కూడుకుంది. దీనివలన అప్పుడు పార్టీకున్న అవకాశాలనుబట్టి గూడ శాసనోల్లంఘనములో పాల్గొనకపోవడంవలన పార్టీకి చాల హాని కలిగినదనే విషయాన్ని యీ పక్షం గుర్తించలేదు.

ఈ రెండు పక్షాలు అసలు బలహీనతను గుర్తించకుండా యీవిధంగా ఒకరినొకరు విమర్శించుకొనడంవలన యీ రాజకీయ విభేదాలే పెద్దవై పార్టీని రెండు చీలికలుగా చేశాయి. ఈ రాజకీయ భేదాభిప్రాయములు కమ్యూనిస్టులలోనేగాక, జాతీయ బూర్జువా పోరాట పద్ధతులతో, గాంధి తత్వముతో అసంతృప్తిచెంది సోషలిస్టు పద్ధతులవైపుకు, కార్మిక పద్ధతులవైపుకు నెమ్మదినెమ్మదిగా ఆకర్షింపబడ్డవారిలోగూడ వ్యాపించాయి. ఎందుచేతనంటే, అప్పటికే కొంత రాజకీయ స్థానాన్ని గడించి, గొప్ప కార్మికోద్యమమును నడుపుచున్న బొంబాయి కమ్యూనిస్టు గ్రూపు యీ చీలికలకు గురి అయివుండడంవలన, కమ్యూనిస్టులవైపు ఆకర్షింపబడుచున్న వారినందరిని ఒక నిశ్చితమైన రాజకీయ పంథాను ఐక్యపర్చగలిగే రాజకీయశక్తి బొంబాయి గ్రూపుకు లేకపోయింది. స్పష్టమైన రాజకీయ కార్యక్రమమొకటియిచ్చి వీరిలో విభిన్నరాజకీయ పోకడలురాకుండా చేయజాలకపోయింది. అలాజేసివుంటే కాంగ్రెసు సోషలిస్టు పార్టీయే వుత్పన్నమయ్యేదిగాదు; అయిననూ హెచ్చుమందిని ఆకర్షించివుండేదిగాదు. అప్పట్లో పార్టీ కర్తవ్యం యిది. బొంబాయిగ్రూపులో వుత్పన్నమైన పై చీలికలను అంతమొనర్చి దేశమంతటా కమ్యూనిస్టులవైపుకు ఆకర్షింపబడుచున్న విప్లవ యువకులకు ఒక స్పష్టమైన కార్యక్రమమిచ్చి వారినుండి వుత్తమమైనవారిని పార్టీలోనికి జేర్చుకోవడం, యిదివరకు వివిధ రాష్ట్రాలలోవున్న కమ్యూనిస్టు గ్రూపులను రాజకీయంగా ఐక్యపర్చి దేశములో వుత్పన్నమగుచున్న సోషలిస్టు-సానుభూతిని-సంఘటితపర్చడం - యిందుకు పార్టీ కేంద్రాన్ని స్థాపించడం - యివి పార్టీ కర్తవ్యాలు. దురదృష్టవశాత్తు యీ కర్తవ్యాలు యేవీ నెరవేర్చబడలేదు. పైగా తద్వ్యతిరేకమైనది సంభవించింది.

బొంబాయి గ్రూపులో పూర్తి విభేదాలుగల్గి, ఆ గ్రూపు రెండు పక్షాలుగా చీలిపోయింది. బొంబాయి గ్రూపు నాయకులలో హెచ్చుమంది విడిపోయి వేరే పార్టీని పెట్టారు. విడిపోయినవారిలో హెచ్చుమంది బాగా చదువుకున్న మేధావంతులు; సమర్థులైన పార్టీ నాయకులు; పార్టీ రెండవ రకపు నాయకులు; వీరే మొదటిపక్షం వాదనచేసినవారు. ఇక బొంబాయి గ్రూపులో మిగిలి వున్నవారు రేంక్ అండ్ ఫైల్ వర్కర్లు. పార్టీ నాయకులలో మిగిలివున్న అల్పసంఖ్యాకులు, వీరు రెండవపక్షం



వాదనచేసినవారు. వీరు మైనారిటీ అయిపోయారు. మెజారిటీ విడిపోయి వేరేగ్రూపు స్థాపించారు. ఈ చీలికలు 1932 లో జరిగాయి. ఇలా చీలిన తరువాత ముఖ్యంగా 1932 వ సంవత్సరములో ఒక గ్రూపు నొక గ్రూపు బహిరంగంగా పత్రికల్లో దూషించుకోవడంగూడ తటస్థించింది. పార్టీలో యేర్పడ్డ యీ చీలికలే కార్మిక సంఘాలకు గూడ ప్రాకాయి. మొదటి పక్షంవారు నాయకులుగా యుండుటచేత రెండవపక్షానికంటె కార్మికులతో హెచ్చు సంబంధాలు కల్గియున్నారు. "గిర్నికంగార్ యూనియన్"ను "యెఱ్ఱ జెండా గిర్నికంగార్ యూనియన్"గా పునర్నిర్మించారు. జి. ఐ. పి. రైల్వే కార్మికుల్లో యిదివరకున్న సంబంధాలనుబట్టి అచ్చటగూడ "యెఱ్ఱజెండా" సంఘాలుపెట్టారు షోలాపూరులోకిగూడ వెళ్ళి అచ్చటకూడ యిదేవిధంగా చేశారు. ఖాందేష్‌లోనికి క్రొత్తగా ప్రవేశించి అచ్చట పనిచేశారు. ఈ విధంగా యిదివరకు కమ్యూనిస్టుల పలుకుబడిలోవున్న కార్మిక వుద్యమములోనుండి రెండవ పక్షమువారిని వేరుచేశారు.

ఈ చీలికలు కలుగుటవలన యూనియన్స్ ఆర్థికంగాగూడ దెబ్బతింది. ధనలోపంచేత రెండవ పక్షం పని సన్నగిలిపోయి, వారందరూ చెల్లాచెదరై పోయారు. 1933 వ సంవత్సరం ఆరంభమయ్యే సరికి పార్టీ యీ అధ్వాన్నస్థితికి వచ్చింది.

బొంబాయి గ్రూపులోని చీలికలు బొంబాయి పార్టీ నిర్మాణమును, కార్మికోద్యమమును స్తంభింపజేయడమేగాక, యీ గ్రూపు అ. భా. కమ్యూనిస్టు గ్రూపులకు నాయకత్వము వహించి యుండుటచేత పార్టీ కేంద్రస్థాపనము, వివిధరాష్ట్రాల పార్టీగ్రూపుల అభివృద్ధిగూడ ఆగిపోయినాయి.

## భారతదేశ కమ్యూనిస్టులకు, బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ, చైనా కమ్యూనిస్టుపార్టీ, జర్మన్ కమ్యూనిస్టుపార్టీ వ్రాసిన [1933 లో] లేఖలు

కమ్యూనిస్టు ఇన్‌టర్‌నేషనల్ ప్రతినిధి 1930లో భారతదేశములో పార్టీ నిర్మాణమునకు సహాయపడుటకు వచ్చియున్నాడనియు, పార్టీని నిర్మించుటకు కొన్ని ప్రయత్నాలు చేశాడనియు పైన చూశాము. 1932 నుండి 33 వ సంవత్సరారంభమువరకు భారతదేశములోని కమ్యూనిస్టుల పరిస్థితుల గూర్చి సమగ్రమైన నివేదికను తయారుచేసి యీ ప్రతినిధి ఇంగ్లండుకు స్వయంగా తీసుకువెళ్లారు. అప్పటనుండి కమ్యూనిస్టు 'ఇన్‌టర్‌నేషనల్' ఆ రిపోర్టులను పూర్తిగా చర్చించి బ్రిటిష్, చైనా, జర్మన్ కమ్యూనిస్టు పార్టీలద్వారా మూడు లేఖలను భారత కమ్యూనిస్టులకు పంపించి పార్టీని నిర్మించుటకు పూనుకోవలసిందిగా విజ్ఞప్తిగావించింది. బ్రిటిష్, చైనా, జర్మన్ కమ్యూనిస్టు పార్టీలు భారతదేశ కమ్యూనిస్టులకు వ్రాసిన చరిత్రాత్మకమైన మూడులేఖలు కమ్యూనిస్టు పార్టీలోగల్గిన విభేదాలను తొలగించి పార్టీ నిర్మాణము నభివృద్ధిచేయుటకు, తక్షణం చేయవలసిన రాజకీయ కర్తవ్యములేవో తెలుసుకోడానికి యెంతో సహాయపడ్డాయి. భారతదేశ పరిస్థితుల ననుసరించి మన కర్తవ్యమును నెరవేర్చుటకు అప్పట్లో అడ్డంకులుగావున్న మనపార్టీ బలహీనతలను తొలగించుకొనడానికి సహాయపడ్డాయి. ఆ జాబుల్లో యివ్వబడ్డ నినాదాల నాధారముగాగొనే అప్పటినుండి కార్మికసంఘాల్లో ఐక్యత

కొరకు. సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనను యేర్పరచడానికి పార్టీ తీవ్ర కృషిచేసింది భారత రాజకీయాల్లో ప్రధానమైన సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తిగా కమ్యూనిస్టులు ముందుకువచ్చారు.

**పై జాబుల్లోని ముఖ్య విషయాలు :**

భారతదేశ కమ్యూనిస్టులు శాసనోల్లంఘనోద్యమములో పాల్గొనకపోవడంవలన రాజకీయంగా యెలా బలహీనపడిపోయారో విపులంగా విశదపర్చబడింది. జాతీయోద్యమములో తమ పాత్రను నిర్వహించుకోజాలకపోవడానికి, తదనంతరం పార్టీలోగల్గిన రాజకీయ విభేదాలకు మూలకారణం పార్టీ నిర్మాణము బలిష్ఠముగా లేకపోవుటే అని నిరూపింపబడింది. పార్టీసభ్యులు అన్నిచోట్ల అఖిల భారత రాజకీయ దృక్పథముతోగాక, కేవలం ట్రేడ్ యూనియన్ దృక్పథముతో పనిజేయడంవలననే పార్టీ నిర్మింపబడలేదనియు, తత్ఫలితంగా పార్టీ మంచి సమయములో (శాసనోల్లంఘన సమయములో) తన రాజకీయ కర్తవ్యాన్ని నిర్వహించజాలకపోయిందని స్పష్టపరచబడింది. బలహీనంగావున్న పార్టీ నిర్మాణమును బలిష్ఠమొనర్చుటకు పార్టీ ముందుగా పూనుకోవాలని, అన్నిగ్రూపులు పూనుకోవలయునని కోరబడింది.

జాతీయోద్యమముపైన కార్మికవర్గరాజకీయ నాయకత్వము సంపాదించడముకు పార్టీకృషిచేయాలనే ప్రధాన కర్తవ్యాన్ని సరిగా అర్థం చేసుకోకపోవడం వలన యీ పొరపాట్లు చేశారని తెల్పుచు కార్మికవర్గ రాజకీయనాయకత్వమును యెలా సంపాదించాలో విపులంగా చెప్పబడింది. జాతీయ కాంగ్రెసు నాయకత్వపు పలుకుబడిని జాతీయవుద్యమాన్నుండి వేరుచేయడానికి కమ్యూనిస్టులు కేవలం కాంగ్రెసు నాయకత్వపు రాజీపంథాను విమర్శించడమేగాదు చేయవలసింది, జాతీయోద్యమములో పాల్గొనేయితరపార్టీలన్నిటికంటె ప్రభుత్వ దౌర్జన్యమును, నిర్బంధమును యెదుర్కొవడంలో ముందుండి పనిజేయాలి; కార్మిక వర్గంగొప్పరాజకీయ ప్రదర్శనాలద్వారా, బహిరంగసభలద్వారా, ప్రొటెస్టు సమ్మెలద్వారా ప్రభుత్వం ప్రజలపై గావించే ప్రతిదౌర్జన్యాన్ని నిరసించడం, యెదుర్కొవడం గూడ జరిగినప్పుడే రాజకీయంగా చైతన్యం పొందుచున్న ప్రజా సామాన్యం, తదితర రాజకీయ శక్తులు కార్మిక వర్గరాజకీయ పలుకుబడిలోనికి వస్తారు. కమ్యూనిస్టులు యీ కర్తవ్యాన్ని నిర్వహించజాలకపోవడం వలననే జాతీయోద్యమమునుండి విడిపోతున్నారని జాబులు కమ్యూనిస్టులను హెచ్చరించాయి. కాంగ్రెసు నాయకుల రాజీపంథాను, జాతీయ సంస్కరణ తత్వమును గూర్చి విమర్శించడములోగాదు కమ్యూనిస్టులు తప్పుగావించినది. ఈ విమర్శయే లేకుండిన పార్టీ అభివృద్ధిఅగుటకే అవకాశముండేదిగాదనియు, సంస్కరణతత్వము పూర్తిగాబలపడి పోయివుండేదని గూడతెలియపర్చారు.

కమ్యూనిస్టులు గావించిన పైపొరపాట్లను స్పష్టపర్చినమీదట; తక్షణం పార్టీనిర్మాణ విషయములో కమ్యూనిస్టులు గావించవలసిన కర్తవ్యాన్నిగూర్చి యేయేపనులు వెంటనే చేయవలసివుంటుందో తెలియపర్చబడింది. వివిధరాష్ట్రాల్లోవున్న కమ్యూనిస్టు గ్రూపులను తక్షణం అందరికి అంగీకృతమైన యొక రాజకీయ కార్యక్రమముపై ఐక్యపర్చి, పార్టీకేంద్రమును స్థాపించుటకు గాను అందరూ కలసి ఒకపార్టీకార్యక్రమమును తయారుచేసి దానిపైపార్టీని నిర్మించుటకు వెంటనే పూనుకోవలయునని కమ్యూనిస్టులందరికి విజ్ఞప్తిగావించబడింది. కమ్యూనిస్టులే తమలోతాము రాజకీయ ఐక్యతను స్థాపించుకో జాలకపోయిన, దేశములోని ప్రజలందరు ప్రభుత్వమునకు వ్యతిరేకముగా ఒక కార్యక్రమముపై ఐక్యముగావాలని కోరడం యెలా హాస్యాస్పదముగా వుంటుంటో తెలియపర్చ బడింది.



సమ్మెలద్వారా, జాతీయోద్యమముద్వారా వర్గచైతన్యము పొందిన కార్మికవర్గ మిలిటెంటు వర్కర్లకు, జాతీయ మిలిటెంటు వర్కర్లకు పార్టీ సూత్రాలను గూర్చి తెలియపర్చవలయుననియు, యిందులకు అధ్యయన తరగతులను యేర్పరచవలయుననియు చెప్పబడింది. ముఖ్యంగా కార్మిక వర్గంనుండి పార్టీకేడర్లుగా తయారుచేయుటకు గట్టి ప్రయత్నాలు చేయాలనియు, కార్మికసంఘాల్లో పనిజేస్తున్న కార్మికవర్గ మిలిటెంటు వర్కర్లకు స్థానిక ట్రేడ్‌యూనియనులను రోజువారీ సక్రమ పద్ధతులపై పనిజేయించుటకు తర్ఫీతు యివ్వవలయుననియు, యిదివరలో ఆందోళన పరులుగా మాత్రమే పనిజేస్తున్నవారిని ఆర్గనైజర్లుగా గూడతయారు చేయాలనియు తెలియజెప్పబడింది. సంస్కరణవాదుల పలుకుబడిలోవున్న కార్మిక సంఘాలలో యెలా పనిజేయాలో ఆపనిప్రాముఖ్యతయేమో విశదపర్చారు. ప్రభుత్వము, మిల్లుయజమానులు కలసి కార్మికులపై గావిస్తున్న ఆర్థికదాడిని కూలీరేట్లతగ్గింపులను యెదుర్కొవడానికి కార్మిక వర్గములో ఐకమత్యం యేర్పడనిదే సంభవము గాదనియు, అట్టి ఐక్యతకొరకు కమ్యూనిస్టులు వెంటనే పూనుకోవలయునని హెచ్చరించబడింది కార్మికులలో ఐక్యతను సాధించుటకు, సంస్కరణవాదులు గూడ కలసి పనిజేయడానికి వీలైన కార్యక్రమమును కమ్యూనిస్టులు తయారుచేసి దానిని సంస్కరణవాదులు గూడ అంగీకరించి, దానిను సరించి కార్మిక సంఘాలద్వారా ఆందోళన చేయునట్లు కార్మికుల నందరిని సమీకరించాలని తెలియపర్చబడింది. రాజకీయ భేదాభిప్రాయములున్ననూ సంస్కరణవాదులతో కలసి కార్మికవర్గం అంతటికి సంబంధించేతక్షణ కోర్కెల కొరకు పోరాడుటకు గాను కమ్యూనిస్టులు తయారుగావాలనియు, అలా జేసినప్పుడే కార్మికులలో ఐక్యతనుయేర్పరచుటకు కమ్యూనిస్టులు అత్యంతచొరవతీసుకొని పనిచేయగల్గుతారని స్పష్టంజేయబడింది. కార్మిక వర్గాన్ని ఐక్యపర్చుటకు కమ్యూనిస్టులేముందు చొరవ తీసుకుని పనిజేయాలని హెచ్చరించబడింది.

జాతీయ రంగములోగూడ బ్రిటిష్ సామ్రాజ్యవాదమునకు వ్యతిరేకముగా ప్రజలనందరిని ఐక్యపర్చుటకు కమ్యూనిస్టులు ముందుకు రావాలనియు, అప్పుడే కాంగ్రెసు నాయకత్వ సంస్కరణ వాద తత్వమును బట్టబయలుజేసి, దాని పలుకుబడిని ప్రజలపైస్థిరపడకుండా చేయగల్గుతామని తెలియపర్చబడింది. కమ్యూనిస్టులు సామ్రాజ్యవాద వ్యతిరేకులనందరిని సంఘటిత పర్చుటకు ఒక రాజకీయ కార్యక్రమమును తయారుజేసి దానిని కాంగ్రెసు అంగీకరించేటట్లు ఆందోళనగావించాలని తెలియపర్చబడింది. ఇలా రాజకీయరంగంలో కమ్యూనిస్టులు ముందుకురాకపోయిన, ప్రభుత్వవ్యతిరేక శక్తులన్నిటిని రాజకీయంగా ఐక్యపర్చే ఒకరాజకీయ కార్యక్రమమును యేర్పరచజాలక పోయిన కమ్యూనిస్టులకు జాతీయోద్యమములో స్థానములేకుండా పోతుందనియు, జాతీయోద్యమముపై కాంగ్రెసు నాయకత్వపు పలుకుబడి నాటుకుపోయి స్వాతంత్ర్య వుద్యమము విప్లవోద్యమముగా మారదనియు హెచ్చరించబడింది.

ఈవిధంగా వివిధరంగాల్లో "యునైటెడ్ ఫ్రంట్" యెత్తులు అప్పటి పరిస్థితులలో యెలా అవలంబించాలో, అలా అవలంబించకపోయిన పార్టీ యెలా స్తంభించిపోతుందో స్పష్టంగా తెలియచెప్పబడింది.

ఈ చరిత్రాత్మకమైన జాబులు పార్టీ కేంద్రాన్ని యేర్పరచుటకు, నూతన పరిస్థితులలో పార్టీని నిర్మించుటకు చాల తోడ్పడ్డాయి. ముఖ్యంగా బొంబాయి గ్రూపులోగల్గిన చీలికలు యీ జాబులు

అంతఃకలహబడిన తరువాత అంతమై బొంబాయి పార్టీలో ఐకమత్యత యేర్పడింది. ఈ ఐకమత్యత అంతా పార్టీని నిర్మించుటకు, వెంటనే తాత్కాలిక పార్టీ కేంద్రాన్ని స్థాపించుటకు, కార్మికోద్యమములో ఐక్యతకొరకు తీవ్ర కృషి చేయుటకు తోడ్పడింది. ఈ విధంగా యీ జాబులు భారత దేశ కమ్యూనిస్టు వుద్యమమును నూతన స్థాయికి గొనిపోవుటకెంతో సహాయపడ్డాయి.

ఈ జాబులు భారత దేశానికివచ్చిన కాలంలోనే మీరట్ కేసులో అరెస్టుగాబడ్డ పార్టీ నాయకులు గూడ కొందరు విడుదలైనారు. బొంబాయి గ్రూపులోని రెండు పక్షాలకు యీ జాబులలో యివ్వబడిన కార్యక్రమముపై ఐక్యమై పనిజేయమని వీరు విజ్ఞప్తిజేశారు. ఉభయ పక్షాలు అంగీకరించాయి బొంబాయి కమ్యూనిస్టులను ఐక్యపర్చుటకుగాను యీ జాబులు యెంతో తోడ్పడ్డాయి.

### కమ్యూనిస్టు నాయకుల సమావేశం

ఈవిధంగా బొంబాయి గ్రూపులో ఒక విధమైన ఐక్యతయేర్పడ్డ తరువాత, 1933 నవంబరులో వివిధ రాష్ట్రాల కమ్యూనిస్టు గ్రూపులతోగూడిన పార్టీ కాన్ఫరెన్సు యొకటి బొంబాయిలో పిలువబడింది. ఆ కాన్ఫరెన్సుకు బెంగాల్, పంజాబు, యు. పి., బొంబాయి కమ్యూనిస్టు గ్రూపులు హాజరయ్యాయి. ఆ కాన్ఫరెన్సులో యీజాబులు దీర్ఘంగా చర్చించబడ్డాయి. దానిలో విషయాలన్ని అంగీకరించబడ్డాయి. ఈ జాబుల నాధారముగాగొని పార్టీ చిత్తు కార్యక్రమమొకటి తయారుచేయబడింది. పార్టీ చిత్తు నిబంధనావళిగూడ తయారుచేయబడింది. కార్మికోద్యమములో ఐకమత్యమును యేర్పరచుటకు యే యెత్తులు అవలంబించాలో చర్చించబడింది. గాని, సమగ్రమైన థీసిస్ యేదీ తయారు చేయబడలేదు. తాత్కాలికముగా ఒక కేంద్ర కమిటీ యెన్నుకోబడింది. ఈ కమిటీకి లోబడి అన్ని గ్రూపులు పనిచేయుటకు అంగీకరించబడింది ఈ విధంగా 1933 నవంబరునాటికి పార్టీ తాత్కాలిక కేంద్రాన్ని యేర్పరచడం, పార్టీలోని చీలికలు రద్దుఅవడం, పార్టీ యిదివరకు గావించిన తప్పులను గూర్చి ఆత్మ విమర్శగావించుకొని పార్టీ అభివృద్ధికొరకు, కార్మికోద్యమ అభివృద్ధికొరకు ఒక స్పష్టమైన కార్యక్రమం తయారుజేయడం జరిగింది. పార్టీ అఖిలభారత రాజకీయ దృక్పథంలో పనిజేయుటకు ఒక ముఖ్యమైన ప్రయత్నం గావించబడింది.

## అంతర్జాతీయ, జాతీయ పరిస్థితులు

బ్రిటిష్, చైనా, జర్మన్ కమ్యూనిస్టు పార్టీలు భారత కమ్యూనిస్టులకు వ్రాసిన పై లేఖల ప్రాముఖ్యతను, అప్పట్లో మన పార్టీపైనున్న భారమైన రాజకీయ కర్తవ్యాలనుగూర్చి సరిగా తెలుసుకోవాలంటే అప్పటి జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులగూర్చి క్లుప్తంగా తెలుసుకోవాలి. అప్పుడే ఆ లేఖల ప్రాధాన్యత, మన పార్టీపై యెంత బరువైన బాధ్యతలుపడ్డాయో అర్థముజేసుకొని ముందుకు పోవడానికి వుత్తేజాన్ని తెచ్చుకుంటాం.

### యూరప్‌లోని పరిస్థితులు

1933 వ సంవత్సరమునాటికి అంతర్జాతీయ పరిస్థితులలో చాల ముఖ్యమైన రాజకీయమార్పులు గల్గాయి. 1930వ సంవత్సరములో వచ్చిన ఆర్థికదుస్థితి ఫలితంగా కేపిటలిస్టు దేశాల్లో నిరుద్యోగము, పేదరికము మెండైనవి. కార్మికుల వేతనాలు సగానికి సగం తగ్గించబడ్డాయి. పారిశ్రామికాభివృద్ధి నిలబడిపోవడంవలన చిన్న చిన్న వ్యాపారస్థులు దివాలాలు తీశారు. అనేకమందికి వుద్యోగాలు వూడాయి. కేపిటలిస్టు దేశాలమధ్య పోటీమరింత (మార్కెటుపై ఆధిక్యత కొరకు) హెచ్చైంది. కేపిటలిస్టులు తమలాభాలను నిలపెట్టుకోవడం కొరకు అన్నితరగతుల ప్రజలపైఆర్థికదోపిడీ హెచ్చుచేశారు. ఈ పరిస్థితుల్లో కార్మికోద్యమము తీవ్రమైనది. ఈవుద్యమానికి నాయకత్వముకమ్యూనిస్టులు వహించారు. ఈ కార్మికోద్యమము ప్రజల నందరిని గూడ ఆకర్షింపగల్గింది.

కాని కార్మికోద్యమములో సంపూర్ణ ఐక్యతయేర్పడలేదు. సోషల్ డెమాక్రట్లు కార్మికులకు యెలా ద్రోహముచేస్తూ, యుద్ధములోను, యుద్ధానంతరం 'రేషనలైజేషన్' పద్ధతులు ప్రవేశపెట్టుటకు బూర్జువావర్గమునకు సహాయపడింది, బూర్జువావర్గముతో చేతులుగల్పి దాని చేతుల్లో కీలుబొమ్మలు అయినది, యీ సోషల్ డెమాక్రట్లకు బూర్జువా వర్గమునకు వ్యతిరేకంగా కార్మికవర్గ స్వార్థములను రక్షించుటకు కమ్యూనిస్టులు యెలా పోరాడినదీ యిదివరలో చూచాము. కమ్యూనిస్టులు యెల్లప్పుడూ కార్మికవర్గ శ్రేయస్సుకొరకు, విప్లవ పంథాను బూర్జువావర్గమునకు, సోషల్ డెమాక్రట్లకు వ్యతిరేకంగా పోరాడుచుండుట వలన కార్మిక వర్గంలో కమ్యూనిస్టుల పలుకుబడి హెచ్చినది. సోషల్ డెమాక్రట్ నాయకుల పలుకుబడి నానాటికి క్షీణించింది. వీరిపలుకుబడి క్షీణించిన కొలది, కార్మికులకు, కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా బూర్జువావర్గంతో మరింతగా లీనమైపోవడం ప్రారంభించి కార్మికోద్యమములో తమకు మిగిలియున్న పలుకుబడితో కార్మికోద్యమాన్ని విచ్ఛిన్నంచేయడానికి ప్రయత్నించారు. బూర్జువా వర్గమునకు లొంగిపోయి, కార్మికోద్యమమును విచ్ఛిన్న పర్చుతున్న వీరిపాలసీ యెడల సోషల్ డెమాక్రట్ వర్కర్లు చాలమంది అసంతృప్తిచెందారు. ఆర్థిక దుస్థితివచ్చిన తరువాత యీ అసంతృప్తి మరింతహెచ్చింది. ఇట్టివారినందరిని సోషల్ డెమాక్రటు నాయకులపాలసీకి వ్యతిరేకంగా ఐక్యపర్చుచూ, కార్మికోద్యమములో గల్గిన చీలికలను తొలగించుటకు కమ్యూనిస్టులు కృషిజేస్తున్నారు. ముఖ్యంగాజర్మనీలో కార్మికోద్యమము తీవ్రరూపం దాల్చి కమ్యూనిస్టుల పలుకుబడిహెచ్చుతోంది. కమ్యూనిస్టుపార్టీబలం అభివృద్ధి అయింది. జర్మనీ బూర్జువావర్గము యుద్ధానంతరం ఆర్థికంగా బలహీనపడి యుండుటచేత 1930 వ సంవత్సరములో వచ్చిన ఆర్థిక దుస్థితిలో కోల్కోలేని దుస్థితిపాలై బలహీనపడిపోయింది. ఈసమయంలో యూరప్ అంతటాగూడ బూర్జువావర్గము తీవ్ర ఆర్థిక, రాజకీయ సంక్షోభానికి గురిఅయింది.

ప్రభుత్వ అధికారమును చేగొనుటకు కార్మికవర్గానికి విప్లవావకాశం యేర్పడింది. కాని కార్మిక వర్గం రాజకీయంగా తయారుగాలేదు; దానిలోని చీలికలు రద్దుచేసుకొని రాజకీయైక్యతను స్థాపించుకోలేదు. ఈ బలహీనత పోతేనేగాని బూర్జువా వర్గమునుండి అధికారాన్ని గుంజుకోగల్గినట్టి బలం కార్మిక వర్గమునకు కలుగదు. కమ్యూనిస్టులు యిట్టి ఐక్యతను స్థాపించుటకుగాను, సోషల్ డెమాక్రట్ నాయకులకు విజ్ఞప్తిచేశారు. కాని వారు చలించలేదు. పైగా ఆర్థిక దుస్థితి ఫలితంగా బూర్జువా వర్గం కార్మికవర్గంపై గావించుచున్న దోపిడీనిగూడ యెదుర్కొనకుండా బూర్జువావర్గమునకు సహాయపడ్డారు. ఈ పరిస్థితుల్లో తీవ్ర దుస్థితికిపాలై అన్ని దేశాలలోనికన్నా అధికమైన విప్లవ కార్మికోద్యమమును యెదుర్కోవలసివచ్చినట్టి జర్మన్ బూర్జువావర్గము, కార్మికోద్యమములోనున్న అనైక్యతను, సోషల్ డెమాక్రటిక్ నాయకులద్రోహాన్ని అవకాశంగా తీసుకొని ఫాసిస్టు నియంతృత్వమును యేర్ప

రచించింది. వెంటనే విప్లవ కార్మికోద్యమముపైననూ, దానికి అగ్రగామిగావున్న జర్మన్ కమ్యూనిస్టు పార్టీపైననూ తీవ్ర నిర్బంధము ప్రయోగించి వాటిని బలహీనపర్చింది.

జర్మనీలో ఫాసిజం రావడంతో ప్రపంచ రాజకీయాల్లో నూతనయుగం ప్రారంభమైంది. ప్రతి దేశములోని విప్లవ ప్రతిఘాత శక్తులు, యుద్ధమును పురిగొల్పే శక్తులు లేచాయి; యీ శక్తులను ప్రోత్సహించి, అభివృద్ధిచేయడానికి, యుద్ధమునుగొని వచ్చుటకు జర్మన్ ఫాసిస్టులు నాయకత్వము వహించి ప్రపంచములోని అభివృద్ధికరమైన శాంతినిగోరే శక్తులపైన తీవ్రదాడి సాగించారు. ప్రపంచ శాంతిస్థాపనకు విప్లవ కృషిచేస్తున్న సోవియట్ యూనియన్‌పై తీవ్ర వ్యతిరేక ప్రచారము గావించడం ప్రారంభించారు. దీనితో ప్రపంచ కార్మికోద్యమమునకు, శాంతినిగోరే శక్తులకు తీవ్రమైన అపాయం గల్గే పరిస్థితులొచ్చాయి. సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా యుద్ధమువచ్చే పరిస్థితులు యేర్పడ్డాయి. ఈ ఫాసిస్టులకు బ్రిటన్, ఫ్రాంసు వగైరా దేశాల సామ్రాజ్యవాదులు పరోక్షంగా సహాయము చేయడం ప్రారంభించారు. జర్మన్ ఫాసిస్టు విప్లవ ప్రతీఘాతక పద్ధతులను తమ దేశములో గూడ కార్మికోద్యమమును అణచుటకు ప్రవేశపెట్టుటకు ప్రయత్నాలుచేయడం ప్రారంభించారు. ఈ విధంగా జర్మనీలో ఫాసిస్టు పరిపాలన యేర్పడడముతో ప్రపంచ శాంతికి భంగముకల్గింది. ప్రపంచ అభివృద్ధికరమైన కార్మికవర్గ సోషలిస్టు శక్తులకు ముప్పు వాటిల్లినది. యుద్ధ ప్రమాదం ఆసన్నమైంది. ఈ పరిస్థితులలో కార్మికవర్గం, కమ్యూనిస్టుల ప్రధానకర్తవ్యం యీ ఫాసిస్టు దాడినుండి రక్షించుకోవడానికి, ఫాసిజమునకు, యుద్ధమును వాంఛించే శక్తులకు వ్యతిరేక వుద్యమాన్ని అభివృద్ధి గావించి వాటిని అంతముగావించడం. యిందుకుగాను యుద్ధానికి, ఫాసిజానికి వ్యతిరేకంగా ప్రజలనందరినీ అన్నివర్గాలను సమీకరించడానికి తక్షణం కమ్యూనిస్టులు పూనుకోవలసివచ్చింది.

ఈ సమయములోనే (1933 ఏప్రియల్‌లో) ఫాసిజంను ఆదిలోనే అంతంజేయడానికి, అన్ని దేశాల ప్రజలు కలసి పనిజేయడానికి కమ్యూనిస్టులు గావించే ప్రయత్నాలతో సహకారం చేయమని రెండవ అంతర్జాతీయ సంఘమునకు, దాని నాయకులకు విజ్ఞాపన గావించింది. కాని అప్పుడుగూడ సోషల్ డెమాక్రిట్‌నాయకులు చలించలేదు; కమ్యూనిస్టులతో సహకారంచేయడానికి నిరాకరించారు.

సోషల్ డెమాక్రిట్ నాయకులు యీ పర్యాయముగూడ ప్రపంచ శాంతిని కాపాడడానికి, ఫాసిజముతో పోరాడుటకు కమ్యూనిస్టులతో కలసి పనిచేయడానికి నిరాకరించారు. సోషల్ డెమాక్రిట్ నాయకుల యీ విద్రోహచర్యలను సోషల్ డెమాక్రిట్ ప్రజాసామాన్యం త్వరత్వరగా గ్రహించింది. కమ్యూనిస్టు పంథావైపుకు ఆకర్షింపబడింది. ఫాసిస్టు వ్యతిరేక వుద్యమములో పాల్గొనుటకు, కమ్యూనిస్టులతో సహకారం చేయుటకు సోషల్ డెమాక్రిట్ ప్రజాసామాన్యం సిద్ధమైంది. సోషల్ డెమాక్రిట్ వర్కర్లు, ప్రజలందరూ ఫాసిస్టు వ్యతిరేక వుద్యమముయెడల చూపెడుతున్న వుత్సాహం, కార్మికులలో చీలికలు రద్దుగావించుగొని, ఐక్యకంఠంతో ఫాసిస్టు వుపద్రవాన్ని యెదుర్కోవడానికి గన్పరచుచున్న పట్టుదల నాధారముగాగొని, కమ్యూనిస్టులు వెంటనే విశాలమైన ఫాసిస్టు వ్యతిరేక వుద్యమాన్ని నిర్మించాలని కమ్యూనిస్టు అంతర్జాతీయ మహాసభ హెచ్చరించింది. సోషల్ డెమాక్రిట్ ప్రజాసామాన్యం—కమ్యూనిస్టులమధ్య ఐకమత్యము యేర్పరచవలసినదిగా అన్ని దేశాల కమ్యూనిస్టులకు వుత్తరువులు చేసింది. ఈవిధంగా కమ్యూనిస్టులు సోషల్ డెమా



క్రటిక్ ప్రజాసామాన్యమును ఫాసిస్టువ్యతిరేక కార్యక్రమముపై సమీకరించుచూ తమవైపుకు ఆకర్షించారు.

ఇదేవిధంగా కార్మిక సంఘాల్లో గూడ ఐక్యతగొని రావడానికి కమ్యూనిస్టులు కృషి ప్రారంభించారు. కమ్యూనిస్టులచేత యేర్పరచబడ్డ రెడ్‌యూనియన్సు' (రెడ్ ఇన్‌టర్ నేషనల్ ఆఫ్ లేబరు యూనియన్సును గూర్చి వ్రాసేటప్పుడు "రెడ్ యూనియన్సు" గూర్చి విచారించాము) కార్మిక సంఘాలలో ఐక్యత గొనివచ్చుటకు చొరవ తీసుకుని పనిచేశాయి. ఫాసిస్టులు, కేపిటలిస్టులు కార్మికులపైగావించే అధిక దోపిడీకి వ్యతిరేకంగా కార్మిక వర్గము అంతా ఆందోళన చేయడానికి అందుకు దాన్ని ఐక్యపర్చుటకు కృషిచేశాయి. ఈ ఆందోళనతో కార్మిక వర్గమంతా క్రమేణా ఐక్యమైంది. ఫేసిస్టు వ్యతిరేక వుద్యమాన్ని, ఫేసిస్టుక్రూరనిర్బంధాలకు గురియైగూడ, కమ్యూనిస్టులు సాగించుచుండుటచేత ఫేసిస్టుదోపిడీకి, నిర్బంధమునకు గురిఅయిన ప్రజలంతా కమ్యూనిస్టులవైపుకు ఆకర్షింపబడ్డారు. ఫేసిస్టు వ్యతిరేక నినాదాలపై ప్రజలనంతా ఐక్యపర్చడం కమ్యూనిస్టులు ప్రారంభించారు. కమ్యూనిస్టుపార్టీ ప్రతిష్ఠహెచ్చింది సోషల్ డెమాక్రట్ నాయకుల ద్రోహాన్ని గుర్తించిన సోషలిస్టులందరూ కమ్యూనిస్టుపార్టీలో జేరడం ప్రారంభించారు. ఈ విధంగా ఫేసిజము యితర దేశాలకు ప్రాకకుండా అరికట్టుటకు, యుద్ధాన్నిరాకుండా అరికట్టుటకు, ప్రజాబాహుళ్యమైన కమ్యూనిస్టుపార్టీలను స్థాపించుటకు అనువైన పరిస్థితులు యేర్పడ్డాయి. ఫేసిస్టులపై అధికమగుచున్న ప్రజల క్రోధాగ్నిని ఫేసిజముకు, దానికి దోహదమిస్తున్న సామ్రాజ్యవాదులకు వ్యతిరేకముగా ప్రయోగించి, బలవరమైన ఫేసిస్టు సామ్రాజ్యవాద వ్యతిరేక వుద్యమాలను అభివృద్ధిచేయుటకు తగినట్లుగా అన్ని దేశాల్లోని కమ్యూనిస్టుపార్టీలు తయారుగావలసిన పరిస్థితులు ప్రపంచమంతటా యేర్పడ్డాయి. యీ బాధ్యతను నిర్వహించుటకు, ప్రజలను ఐక్యపర్చుటకు, ముందుకార్మిక వర్గములో సంపూర్ణ ఐక్యత రానిదే సాధ్యంగాదు. కమ్యూనిస్టుపార్టీలలో రాజకీయ, నిర్మాణ ఐక్యత యేర్పడందే సాధ్యంగాదు. పార్టీ నిర్మాణమును యిదివరకుకంటె యెన్నోరెట్లు బలపర్చి, నూతన కర్తవ్యములను నెరవేర్చగల్గేటట్లు పునర్నిర్మాణము గావించినప్పుడే సాధ్యమౌతుంది.

ఇవన్నీ యీ క్రింది నిర్మాణబాధ్యతలను నిర్వహించితేనే సాధ్యము అవుతాయి (1) జర్మనీలో ఫేసిజము రావడంతో ప్రపంచములో నూతన పరిస్థితులు యేర్పడడం వలన ఆ నూతన పరిస్థితులలో కమ్యూనిస్టులు తమ తక్షణ కర్తవ్యంను నెరవేర్చుటకుగాను తగినరాజకీయ, నిర్మాణ చతురతను పార్టీ సభ్యులకు గలుగజేయడం; ఫాసిస్టు వ్యతిరేకవుద్యమాన్ని అభివృద్ధిపర్చుటకు 'యునైటెడ్ ఫ్రంటు' (సంయుక్తసంఘటన) యెత్తులను ఆచరణలో పెట్టుటకు పార్టీసభ్యులకు తగిన తర్ఫీదుయివ్వడం (2) ఫేసిస్టువ్యతిరేక వుద్యమము అభివృద్ధి చేస్తున్నప్పటికి, యే పరిస్థితులలో నైనాయుద్ధం అనివార్యమైనప్పుడు యుద్ధపరిస్థితులలో, రహస్యముగా పార్టీసభ్యులు పనిజేయుటకు పార్టీ సభ్యులకు తర్ఫీదు యివ్వడం, యుద్ధములో సంభవించే ప్రతిమార్పుకు ప్రతిఘటనకు తగినట్లుగా పార్టీ శక్తిసామర్థ్యములతో పనిజేసే పార్టీ యంత్రాన్ని పార్టీసిద్ధముగా తయారుచేయడం. ఈ బాధ్యతలను సరిగా నిర్వహించడానికి అన్ని కమ్యూనిస్టు పార్టీ కమ్యూనిస్టులకు సూచనలివ్వడానికి కమ్యూనిస్టుయిన్‌టర్‌నేషల్ కార్యవర్గ 13 వ సమావేశం 1933 డిశెంబరులో జరుపబడింది.

వలసరాజ్యాలలోని పరిస్థితులు

యూరప్‌లోని పరిస్థితులు యిలావుంటే, వలసరాజ్యాలలోని ముఖ్యదేశాల్లోని పరిస్థితులు యెలా వున్నాయో చూద్దాము. యూరప్ దేశములోని ప్రజలకు ఫేసిజానికి, యుద్ధానికి వ్యతిరేకంగా పోరాడుటకు తమలో సంపూర్ణఐక్యతను నెలకొల్పుకోవడం యెలా ప్రధానమైందో, వలసరాజ్యాల్లోని ప్రజలకు గూడ సామ్రాజ్యవాదం ప్రజలపై ప్రయోగిస్తున్న ఆర్థిక, రాజకీయ నిర్బంధములకు వ్యతిరేకంగా ప్రజలందరిని ఐక్యంచేయడం ప్రధాన జాతీయ కర్తవ్యమైంది. సామ్రాజ్యవాదులు యుద్ధప్రయత్నాలను తమ దేశాల్లోకంటె తమవలస రాజ్యాల్లో బహిరంగంగా గావించడం ప్రారంభించారు. యుద్ధ వాతావరణ మేర్పడింది. ఆర్థిక దోపిడి హెచ్చడం, పౌరసత్వహక్కులను సంకుచిత పర్చడానికి రాజ్యాంగాలను మార్పుచేయడం, యిప్పటినుండే ప్రారంభించారు. యుద్ధకాలములో ప్రజలనుండి ముప్పులేకుండా వుండుటకుగాను తగిన నిర్బంధ పరిపాలన మేర్పరచుటకు అనువైన రాజ్యాంగమును యేర్పరచుటకు తీవ్రప్రయత్నాలు గావించబడుచున్నాయి. ఇవన్నీముందు రానున్న యుద్ధాన్నిదృష్టిలో వుంచుకొనే చేయబడుచున్నాయి.

చైనాలో యుద్ధమే ప్రారంభమైనది. జపాన్ మంచూరియాపై 1931 లో దాడిగావించింది. జర్మనీలో సోషల్‌డెమాక్రటులు వలెనే కొమింటాంగ్ పార్టీ (కాంగ్రెసుసంస్థమాదిరిది) నాయకులు చైనావిప్లవమునకు చేసిన ద్రోహఫలితంగా, కమ్యూనిస్టులపై చియాంగ్ కేషెక్ గావించిన దాడుల ఫలితంగా చైనా అంతరంగికంగా బలహీనపడిపోయింది. ఈ బలహీనత నుపయోగించుకొని జపాన్ "మిలిటారిస్టులు" (యుద్ధపిపాసులు) చైనాపైపడ్డారు. చియాంగ్ కై షేక్; కొమింటాంగ్ యితర నాయకుల విద్రోహాన్ని ప్రజలకు కమ్యూనిస్టులు వెల్లడించారు. అంతేగాకుండా జపాన్ సైన్యాలను ప్రతిఘటించవడానికి ప్రజలను సమీకరించి దేశరక్షణకు పూనుకున్నారు అనేకత్యాగాలు గావించారు. ఒకవైపున కొమింటాంగ్ సేనలుగావించే అంతఃకలహయుద్ధాన్ని యెదుర్కొంటూ, మరొకవైపున జపాన్ ఆక్రమించిన వుత్తరచైనాలో జపాన్‌సేనలకు వ్యతిరేకంగా గెరిల్లాయుద్ధం గావిస్తూ కమ్యూనిస్టులు అతిక్రూర నిర్బంధములకు గురిఅయి చైనాస్వాతంత్ర్యము కొరకు పోరాడారు.

పార్టీ ప్రజలలోగల్గిన యీ ముఖ్యమైన మనోభావమును గ్రహించింది: జపాన్ సేనలను ప్రతిఘటించుటకు, అందుకుగాను ప్రజలందరినీ ఐక్యపర్చుటకు తనశక్తినంత వినియోగించింది. తత్ఫలితంగా ప్రజలు కొమింటాంగ్ కమ్యూనిస్టులపై గావిస్తున్న దేశారిష్టమైన దాడులను ఆపుచేయుటకు ఆందోళన చేయడం ప్రారంభించారు. దాన్ని కమ్యూనిస్టుపార్టీ యింకా తీవ్రపర్చుటకు తగినసమయములో విప్లవ చొరవతీసుకుంది. దక్షిణచైనానుండి రెడ్‌ఆర్మీని, జపాన్‌సేనలు స్థావర మేర్పరచుకొని కూర్చున్న ఉత్తరచైనాసరిహద్దులకు మార్చుటకు నిశ్చయించింది. భీకరారణ్యములగుండా, ఇసుకనేలలమీద, ఎత్తైన కొండలమీదుగా అనేక నదులను దాటి అనేక కష్టాలకు లోనై చరిత్రాత్మకమైన 6000 మైళ్ళ యాత్రను (March) చేసింది. ఉత్తరచైనా సరిహద్దు రాష్ట్రమైన షెగ్‌వాన్ (Sehegwan) రాష్ట్రములో రెడ్‌ఆర్మీ కేంద్రమును, చైనా సోవియట్ పరిపాలనా కేంద్రమును యేర్పరచి, అచ్చట జపాన్ సేనలను యెదిరించుటకు, జపాన్ వ్యతిరేక సైన్యాలను తయారుచేయుటకు బలిష్టమైన కేంద్రాన్ని స్థాపించింది. నేషనలిస్టు చైనాలో జపాన్ వ్యతిరేక ప్రజా సంఘటనకొరకు ఆందోళన సాగిస్తూ, దానిద్వారా చైనాలో సంపూర్ణఐక్యతను యేర్పరచుటకు ప్రచారముగావించినది. ఈవిధంగా



జపాన్ సేనలతో నేరుగా పోరాడడం, జాపాన్ వ్యతిరేక ప్రజా ఐక్య సంఘటనకొరకు తీవ్ర కృషి చేయడం, సమ్మిళితంచేసి కృషిచేయడంతో చైనా ప్రజల స్వాతంత్ర్య పోరాటానికి నాయకత్వము వహించినది. ఈవిధంగా చైనా ప్రజలనందరిని జపాన్‌కు వ్యతిరేకముగా సంఘటితపర్చి ఐక్యపర్చుటకుగాను చైనా కమ్యూనిస్టుపార్టీ తీవ్ర కృషిచేయడం ఆరంభించినది. జపాన్ సామ్రాజ్యవాదమునకు వ్యతిరేకముగా చైనా స్వాతంత్ర్యముకొరకు ఆ దేశ ప్రజలు గావించే పోరాటములో చైనా కమ్యూనిస్టుపార్టీ ముఖ్యపాత్ర వహించింది.

చైనా కమ్యూనిస్టులు జపాన్ సేనలను ప్రతిఘటించుటకుగాను జపాన్ వ్యతిరేక ప్రజాసంఘటనకై తీవ్ర ఆందోళన గావించారు. కొమింటాంగ్ సేనలక్రిందవున్న 'నేషనలిస్టు చైనా'లో చైనా కమ్యూనిస్టులు అనేక వర్ణనాతీతమైన నిర్బంధములకు, హత్యలకు గురియై జపాన్ వ్యతిరేక ప్రజా సంఘటనను నిర్మించడానికి గావించిన కృషివలన, ఉత్తరచైనాలో గావించిన గెరిల్లా యుద్ధంద్వారా చైనా కమ్యూనిస్టులు చైనా ప్రజలను తమ పంథావైపుకు బాగా ఆకర్షించగల్గారు. ఈ కృషివలన చైనా ప్రజలలో కొమింటాంగ్ సేనలు గావించుచున్న వినాశకరమైన అంతఃకలహము అంతముగావాలనే ఆందోళన బయలుదేరింది. జపాన్‌సేనలను ప్రతిఘటించాలనే వుద్యమము ఆరంభమైంది.

## మనదేశ పరిస్థితులు

ఈ సమయములో మనదేశపరిస్థితులగూర్చి క్లుప్తంగా తెలుసుకుందాము. బ్రిటిష్ సామ్రాజ్యవాదము బానిసరాజ్యాంగ చట్టాన్ని భారతదేశములో ప్రవేశపెట్టుటకు కృషిచేస్తోంది. లండన్‌లోజరుపబడిన మూడు "రౌండ్ టేబిల్" సమావేశాల ఫలితంగా 1933 లో భారత రాజ్యాంగ సంస్కరణలను గూర్చి తెలియపర్చుచూ ప్రభుత్వ శ్వేతపత్రం" ప్రకటించబడింది. అదేసమయంలో జాతీయోద్యమము పైన తీవ్రనిర్బంధం ప్రయోగించి, దాన్ని అణచివేయగల్గింది. మీరట్ అరెస్టుల తరువాత మిగిలివున్న కార్మికోద్యమము, కమ్యూనిస్టు వుద్యమాలను తీవ్రనిర్బంధమునకు గురిజేసింది. కేవలంకమ్యూనిస్టులు, కార్మికవర్గంపైననేగాక ప్రజలందరిపైననూ ప్రభుత్వ దౌర్జన్యం హెచ్చింది. అందుచేత ప్రజలలో నిరుత్సాహం వ్యాపించింది. అయినప్పటికి అసంతృప్తి రగుల్తూనేవుంది. ప్రభుత్వ నిర్బంధాన్ని యెదుర్కొవడానికి, స్వాతంత్ర్య వుద్యమాన్ని యీ పరిస్థితులలో ముందుకు గొంపోవడానికి జాతీయ బూర్జువా పోరాటపద్ధతులు విఫలమయ్యాయని తెలుసుకోగల్గారు. నూతన పద్ధతుల కొరకు వెతకడం ప్రారంభించారు.

కార్మికోద్యమములో సంస్కరణవాదులకు, కమ్యూనిస్టులకువచ్చిన తగాదాలఫలితంగాను, తరువాత కమ్యూనిస్టుగ్రూపులోవచ్చిన చీలికలుఫలితంగాను కార్మికవర్గం పూర్తిగా బలహీనపడిపోయింది. ప్రభుత్వము, మిల్లుయజమానులు నిర్దాక్షిణ్యంగా నిర్బంధము ప్రయోగిస్తున్నారు. ఈ నిర్బంధమును యెదుర్కొవడానికి మరల బలిష్టమైన కార్మిక వుద్యమాన్ని నిర్మించాలని మాత్రం కార్మికవర్గం గుర్తించుతోంది. అందుకు కార్మిక వుద్యమములో యేర్పడ్డ చీలికలుపోయి ఐక్యత యేర్పడనిదే సాధ్యంగాదనిగూడ గ్రహించింది. అందుచేత కార్మికులుతమలో తమకు వచ్చిన చీలికలను రద్దుచేసుకోవడానికి పూర్తిగా సుముఖత చూపెడుతున్నారు.

కార్మికోద్యమము బలహీనపడిన తరువాత మిల్లు యజమానులు కార్మికుల కూలిరేట్లుపూర్తిగా తగ్గించారు. ఈ కూలితగ్గింపు రద్దుకొరకు మరల తీవ్ర సమ్మెలను గావించుటకు కార్మికులు వుత్సాహం చూపెడుతున్నారు. (ఎందుచేతనంటే ప్రభుత్వనిర్బంధమున్ననూ, యజమానులు చేసేదోపిడీ హద్దుమీరిపోతోంది. అందుచేత ప్రభుత్వనిర్బంధమును గూడ లెక్కచేయక కార్మికులు నిస్పృహ చెందు తున్నారు.)

టెర్రరిస్టుపద్ధతుల నిష్ప్రయోజనమును అందులోపాల్గొన్న యువకులందరు గ్రహించుచున్నారు. కమ్యూనిస్టుల రాజకీయ పంథాయే సరియైనదని క్రమేణా గుర్తిస్తున్నారు. శాసనోల్లంఘనంలో పాల్గొని జైళ్లకు పోయిన కాంగ్రెసు వాలంటీర్లకు జైళ్ళలో కమ్యూనిస్టులతోను, టెర్రరిస్టులతో సంబంధం యేర్పడింది. గాంధితత్వం అంటే అసంతృప్తిచెందారు. సోషలిజం అంటే ఆకర్షింపబడి పూర్తిగా దాన్నిగూర్చి అధ్యయనము గావించడం ప్రారంభించారు. అట్టివారందరు జైళ్ళనుండి రాగానే గాంధి తత్వమునకు వ్యతిరేకముగాను, సోషలిజమున కనుకూలముగా ప్రచారముగావిస్తూ రైతుల్లో, కూలీలలో పనిచేయడం ప్రారంభించారు. కార్మిక వర్గం, రైతాంగము సోషలిస్టు సంఘటిత పద్ధతులతో పని జేస్తున్నప్పుడు చూపెట్టుచున్న, వుత్సాహము, పోరాటశక్తివీరిని మరింత సోషలిజమువైపుకు గొంపోయాయి. కమ్యూనిస్టుల రాజకీయ పంథాలో వీరికి విశ్వాసము అధికమౌతోంది. కమ్యూనిస్టు గ్రూపులతో దగ్గర సంబంధంగూడ ఏర్పడుతోంది.

ఈ పరిస్థితుల్లో కమ్యూనిస్టులవైపుకు ఆకర్షింపబడ్డ వివిధ రకముల శక్తులను రాజకీయంగా ఐక్యపర్చుటకు, స్వాతంత్ర్య పోరాటమును ముందుకు గొనిపోవుటకు, కార్మికోద్యమములో ఐక్యతను గొనిరావడానికి కమ్యూనిస్టులు ఒక పార్టీగా ముందుకువచ్చి వుండాల్సింది. కాని కమ్యూనిస్టులలోనే యింకా పూర్తి రాజకీయైక్యత యేర్పడలేదు. కమ్యూనిస్టులవైపుకు ఆకర్షింపబడ్డ వివిధ శక్తులను రాజకీయంగా ఐక్యపర్చడానికి, వారికి తగిన రాజకీయ శిక్షణ యెప్పటికప్పుడు యివ్వడానికి పార్టీ కేంద్రమొకటి యేర్పడాలి. 1933 లో కమ్యూనిస్టు నాయకులందరూ సమావేశమైనతరువాత యేర్పడ్డ పార్టీ కేంద్రముగూడ యీ బాధ్యతను నిర్వహించడానికి తగిన శక్తిగల్గియుండలేదు.

అంతర్జాతీయ, జాతీయ పరిస్థితులనుగూర్చి యింత హెచ్చుగా చర్చించడములో ముఖ్యోద్దేశము యిది : ప్రపంచమంతటా యొక నూతనశకము, జర్మనీలో ఫాసిజము యేర్పడడముతోను, యుద్ధ ప్రయత్నాలు ప్రారంభముగావడంతో ఆరంభమైనదనియు, యీ పరిస్థితులలో వివిధదేశ కమ్యూనిస్టు పార్టీలు కేవలం కార్మికవర్గంలో పనిజేయుటేగాక, ఫాసిస్టులకు, యుద్ధానికి, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రజలనందరిని ఐక్యపర్చి, బ్రహ్మాండమైన ప్రజా వుద్యమాలను అన్ని దేశాల్లోను అభివృద్ధిజేయుటకుగాను, ముందుకు రావలయుననియు: అందుకు తగినట్లుగా కమ్యూనిస్టు పార్టీలు రాజకీయంగాను, నిర్మాణయుక్తంగాను తయారుగావలసిన విషయాన్ని బోధపర్చుటకే యింత హెచ్చుగా చర్చించాం. 'యునైటెడ్ ఫ్రంటు' యెత్తుగడల ననుసరించి కమ్యూనిస్టులు నూతన పరిస్థితుల్లో పనిజేయాలనే ముఖ్య విషయాన్ని స్పష్టపర్చుటకు చర్చించాము. ఈ యెత్తుగడలతో యీ కాలములో పనిచేయజాలకపోయినచో కమ్యూనిస్టుపార్టీలు ప్రజలనుండి విడబడిపోయి, కార్మికోద్యమము, ప్రజా వుద్యమము చెల్లాచెదరైపోయి ప్రపంచము యుద్ధములోనికి సామ్రాజ్యవాదులచేత, ఫాసిస్టుల



చేత, యీడ్వబడుతుందనియు, 'కమ్యూనిస్టు యిన్‌టర్‌నేషనల్' జర్మనీలో ఫాసిజము అధికారములోనికి రాగానే కమ్యూనిస్టు పార్టీలన్నిటికి హెచ్చరిక గావించింది.

ఈ నూతన పరిస్థితుల కనుగుణ్యంగా మన దేశంలో గావించిన పార్టీ రాజకీయ, నిర్మాణ ప్రయత్నాలగూర్చి యిక పరిశీలించుదాం :-

## 1933 సమావేశానంతరం పార్టీ నిర్మాణ ప్రయత్నాలు :

1934 వ సంవత్సరం అంతా పార్టీలో ఐక్యత యేర్పరచుటకు, కార్మికోద్యమములో ఐక్యత యేర్పరచుటకు కృషి చేయబడింది. బొంబాయిలో 1933 నవంబరులో జరుపబడిన పార్టీ కాన్ఫరెన్సు ఫలితంగా యేర్పడ్డ పార్టీ కేంద్రమునకు రాష్ట్రాలలోని కమ్యూనిస్టు గ్రూపులతో ముఖ్యంగా బెంగాల్, పంజాబు, యు. పి. మద్రాసు గ్రూపులతో సంబంధాలు యేర్పడ్డాయి. ఈ సంబంధాలు యింకా పూర్తిగా దిట్టపర్చబడలేదు. ఎందుచేతనంటే పార్టీ కేంద్రమే యింకా సరిగా పనిజేయడం ప్రారంభించ లేదు.

పార్టీ పత్రిక (ఇంగ్లీషులో) ప్రథమ సంచిక 1934 ప్రారంభములో రహస్యంగా తీసుకురాబడింది. 1933 వ సంవత్సరం నవంబరులో జరుపబడిన పార్టీ కాన్ఫరెన్సులోని పార్టీ చర్చల నాధారముగాగాని తాత్కాలిక పార్టీ సెంట్రల్ కమిటీచే తయారుచేయబడ్డ పార్టీ రాజకీయ చిత్తు కార్యక్రమము యీ సంచికలో ప్రకటించబడింది. అన్ని రాష్ట్రాల కమ్యూనిస్టు గ్రూపులకు పత్రిక అందజేయబడింది. పార్టీ చిత్తు కార్యక్రమముపై అన్ని గ్రూపులను రాజకీయంగా ఐక్యపర్చుటకు యిది ఆధారంగా తీసుకోబడింది. పార్టీ కాన్ఫరెన్సుద్వారా యేర్పడ్డ ఐక్యతను యింకా గట్టిపర్చుటకు యీ సంచికలో ప్రకటింపబడ్డ పార్టీ చిత్తు కార్యక్రమము వుపయోగపడింది.

1933 వ సంవత్సరాంతములో యేర్పడ్డ పార్టీ సెంట్రల్ కమిటీగూడ సరిగా పనిచేయజాలకపోయింది. లోగడ పార్టీ, యే తప్పులుచేసూ పార్టీ నిర్మాణమును వుపేక్షచేసిందో ఆతప్పులే మరల యీ పార్టీ కేంద్రముగూడ చేయ నారంభించినది. పార్టీ కేంద్రములో పనిచేసే కామ్రేడ్సు "ట్రేడ్ యూనియన్" పనినుండి పూర్తిగా వేరుచేయబడనిదే, అఖిల భారత రాజకీయ దృక్పథముతో పార్టీ కేంద్రము పనిజేయడం సాధ్యంగాదనియు, పార్టీ రాజకీయ, నిర్మాణ కర్తవ్యములు వెనుకబడిపోతాయనే విషయాన్ని మరల యీ కేంద్రకమిటీగూడ మర్చిపోయింది. అప్పుడున్న జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులలో పార్టీపైనున్న రాజకీయ భారము చాల హెచ్చయినదనియు, ఆ బాధ్యతను నెరవేర్చుటకు వెంటనే పూనుకోవాలనియు, కార్మికవర్గం ముందుముందు పెద్ద సమ్మెలను గావించబోతూ వుందనియు, ఆ సమ్మెలను జయప్రదముగా నడిపించుటకు పార్టీ తయారుగా వుండాలనియు అవగాహనను వేసుకొనే దూరదృష్టి రాజకీయ పార్టీ కేంద్రానికి లేకపోయింది గాంధి తత్వము యెడల విముఖత్వముచెంది సోషలిజమువైపుకు, కార్మికవర్గంవైపుకు మరలుచున్న జాతీయశక్తులను రాజకీయంగా పార్టీ పలుకుబడికిక్రిందకు గొనివచ్చుటకు పార్టీ నిర్మాణమును యిప్పటినుండే బలపర్చుకోవాలనే దూరదృష్టి లేకపోయింది. రాజకీయ శక్తిగా కమ్యూనిస్టులు యింతవరకు పనిజేయజాలకపోవడంవలన జాతీయోద్యమమునుండి విడిపోయారన్న విషయాన్ని నామకః మాత్రమే అంగీకరించారుగాని ఆచరణలో ఆ ఆత్మ విమర్శన ప్రతిబింబించలేదు. ఇందువలన క్రొత్తగాయేర్పడ్డ పార్టీ సెంట్రల్‌కమిటీ అప్పట్లో దాని అ. భా. రాజకీయ కర్తవ్యాలు యేవో, అవి యేవిధంగా నెరవేర్చాలో

గ్రహించజాలకపోయింది. కార్మికవర్గంలో, జీతాల తగ్గింపువలన గల్గుచున్న అసంతృప్తి, ప్రభుత్వ నిర్బంధముయెడల, ప్రభుత్వము ప్రవేశపెట్ట దలచుచున్న నూతన రాజకీయ సంస్కరణములయెడల ప్రజలందరిలోను గల్గుచున్న అసంతృప్తి ఫలితంగా భవిష్యత్‌లో ఒక బ్రహ్మాండమైన ప్రజా వుద్యమము అభివృద్ధి అవుతుందనియు, ఆ పరిస్థితులలో కమ్యూనిస్టులు, కార్మికవర్గం ఆ ప్రజా సంచలనాన్ని సంఘటితపర్చుటకు పార్టీ నిర్మాణమును అభివృద్ధిజేయాలనియు, అందుకు క్రొత్తగా యేర్పడ్డ పార్టీ కేంద్రము తక్షణమే పూనుకోవలయుననియు ఆచరణలో గ్రహించజాలకపోయింది. అందుచేత పూర్వమువలెనే కార్మికులు సమ్మెలుచేయడం ప్రారంభమయ్యేసరికి ఆ సమ్మెలలోను కార్మికోద్యమములోను మరల మునిగిపోయి పార్టీ రాజకీయ కర్తవ్యమును మర్చిపోయింది. 1933 నవంబరులో కమ్యూనిస్టు గ్రూపులలో యేర్పడ్డ రాజకీయ ఐక్యతను యింకా గట్టిపర్చుటకు పార్టీ సభ్యులను రాజకీయంగాను, నిర్మాణరీత్యా బాగా తర్ఫీదు చేయాలని గుర్తించజాలకపోయింది. రాష్ట్రాల్లోని గ్రూపులనుండి ప్రత్యేకంగా పార్టీపనికి నియమింపబడ్డవారిని పార్టీ నాయకులుగా, పార్టీ ఆర్గనైజర్లుగా తయారు చేయకపోవడంవలన పార్టీ నాయకులు అరెస్టుకాగానే పార్టీ కేంద్రాన్ని పనిచేయించగల పార్టీకేడర్లు లేకపోయారు. స్థానిక గ్రూపులతోను, పార్టీ సభ్యులతోను సంబంధాలు మరల తెగిపోయాయి.

పార్టీ పత్రికను యేదో విధంగా ప్రకటించారేగాని, దాన్ని నిరాటంకంగా సాగించడానికి తగిన పార్టీ రచయితలను తయారుచేయలేదు. రహస్యంగా అన్నిచోట్లకు పత్రికను పంపేబందోబస్తులేదు. సాహిత్యపు పంపుగూడలేదు. అన్నిటికన్నా ముఖ్యమైనది "పార్టీ పత్రికను" నడుపుటకు రాజకీయముగా ఏకాభిప్రాయములుగల్గ పార్టీసంబంధాలు (Party relations) గల్గి ఒక టీమ్ (జట్టు)గా పనిజేయగలట్టి కేంద్రపార్టీ నాయకత్వాన్ని తయారు చేయలేదు.

పైబాధ్యతలను నిర్వహించగల పార్టీకేంద్రం యేర్పడినప్పుడే పార్టీ ప్రజలనందరిని సమీకరించి, రాజకీయంగా ఐక్యపర్చి, సంఘటిత పర్చగల్గుతుంది. "యునైటెడ్‌ఫ్రంటు" (సంయుక్త సంఘటన) యెత్తులను ఆచరణలోపెట్టగల్గుతుంది. కార్మిక వర్గంపై కేపిటలిస్టులు గావిస్తున్న ఆర్థికదాడి ఫలితంగా కార్మికుల్లో యేర్పడ్డ అసంతృప్తిని, సంచలనమును సంఘటితపర్చి కార్మికోద్యమమును బలపర్చగల్గుతుంది.

## "కమ్యూనిస్టు ఇన్‌టర్‌నేషనల్" కార్యవర్గ 13 వ సమావేశం

ఈ కాలంలో అన్ని దేశాల్లోని కమ్యూనిస్టులు పార్టీని యెలా పునర్నిర్మించవలసింది తెలియపర్చుతూపై సమావేశంగావించిన నిర్ణయాలు అప్పుడే పార్టీని పునర్నిర్మించుతున్న భారతకమ్యూనిస్టులకు యెంతోతోడ్పడ్డాయి. ఈ సమావేశనిర్ణయాలను (పార్టీ పునర్నిర్మాణానికి సంబంధించినంతవరకు) తెలుసుకోడం అప్రస్తుతంగాదు.

1933 డిశంబరులో సమావేశమైన "కమ్యూనిస్టు ఇన్‌టర్‌నేషనల్" కార్యవర్గం, 13 వ ప్లీనంలో "యునైటెడ్ ఫ్రంటు" యెత్తులగూర్చి, ముఖ్యంగా యీ యెత్తులను ఆచరణలో పెట్టుటకు కమ్యూనిస్టుపార్టీలు యే విధంగా పునర్నిర్మింపబడాలో సమగ్రముగా చర్చించబడి కొన్నినిర్ణయాలు తీసుకోబడ్డాయి. ఫేసిస్టు ముప్పును, యుద్ధప్రమాదమును రూపుమాపుటకుగాను ప్రజలందరినీ సమీకరించి ఫేసిస్టు, యుద్ధవ్యతిరేక ప్రజావుద్యమాలను నిర్మించుటే కమ్యూనిస్టులు ఆరోజుల్లో గావించాల్సిన ముఖ్యకర్తవ్యాలు. ఇందులకు కార్మిక వర్గములోను, ప్రజలలోను "యునైటెడ్ ఫ్రంటు" యెత్తుల ప్రకారం పనిజేయాలనియు, దీనికనుగుణ్యముగా పార్టీప్రచారము, పార్టీకార్యకలాపాలు జరుపబడాలని తీర్మానించినది. పార్టీనిర్మాణము విషయంలో అత్యంత ప్రాముఖ్యమైన నిర్ణయాలు గావించింది. కమ్యూనిస్టుపార్టీలు రహస్య పరిస్థితుల్లోను, యుద్ధపరిస్థితుల్లోను, ఫాసిస్టు నిర్బంధపరిపాలన క్రిందను పనిజేయగల్గుటకు బలిష్టమైన రహస్యపార్టీ యంత్రాలను నిర్మించవలయుననియు, బహిరంగంగా పనిజేయుటకు అవకాశములున్న దేశాల్లోగూడ ఇట్టిరహస్యపార్టీయంత్రాలు (స్వరూపంలోనైనా) యేర్పరచవలయునని తీర్మానించింది. ఎందుచేతనంటే యేక్షణమందైనా యుద్ధమురావచ్చును. అట్టిపరిస్థితులలో పార్టీబహిరంగంగా పనిజేసే అవకాశాలు పూర్తిగా తగ్గిపోతాయి. రహస్యముగా పనిచేయగల్గేశక్తి పార్టీకుంటేనే పార్టీఅస్థిత్వం వుంటుంది. రహస్యపరిస్థితులలోగూడ నిరాటంకంగా పార్టీపనిజేయగల్గుటకు సిద్ధమైనప్పుడే పార్టీబాధ్యతలను నిర్వహించగల్గుతుంది. లేకపోతే పార్టీవిచ్ఛిన్నమౌతుంది. ఫాసిస్టువ్యతిరేక, యుద్ధవ్యతిరేకవుద్యమాలకు అగ్రగాములుగాయుండి నడిపించగలశక్తి, అందుకుసరియైన రాజకీయ పాలసీ కమ్యూనిస్టుపార్టీకితప్ప యేపార్టీకిలేదు. అప్పటికే సోషల్‌డెమాక్రట్ పార్టీలు బూర్జువావర్గముతో కార్మికవర్గస్వార్థములకు వ్యతిరేకంగా కలిసిపోయాయి. అందుచేత కమ్యూనిస్టుపార్టీలు నిర్మాణయుక్తంగా యెంతబలం గల్గియుంటాయో దానిపైననే పైవుద్యమాల అభివృద్ధిఆధారపడుతుంది. కమ్యూనిస్టుపార్టీ నిర్మాణయుక్తంగా, బలముగా లేకుండా, కార్మికవర్గముతో పార్టీకి ఘనిష్ట సంబంధాలు లేకుండా, "యునైటెడ్‌ఫ్రంటు" యెత్తులు జయప్రదంగావు. పార్టీనిర్మాణము తగినంతబలంగాలేనప్పుడు, "సంయుక్త సంఘటన" లోయుండి పనిజేసే సంస్కరణవాదుల పలుకుబడిని క్షీణింపజేయడానికిబదులు బలపర్చడానికే సామాన్యంగా "సంయుక్తసంఘటన" ఉపయోగపడుతుంది. అందుచేత "సంయుక్త సంఘటన" ఉద్యమము పార్టీని, ప్రజావుద్యమమును అభివృద్ధిచేసేదిగా వుండాలి. ఇందుకు కమ్యూనిస్టు పార్టీలు యీ క్రిందిబాధ్యతలను నిర్వహించాలి.

(1) పార్టీని యిదివరకుకన్నా రాజకీయముగాను, సిద్ధాంత పరిజ్ఞానంలోను యెంతో అభివృద్ధి చేయాలి. పార్టీ సభ్యులలో పార్టీ రాజకీయ పాలసీపైన, పార్టీ మూల సిద్ధాంతాలపైన సంపూర్ణ ఐక్యతను నెలకొల్పాలి;

(2) పార్టీ నిర్మాణయుక్తంగా యిదివరకుకంటె బలంగా యుండాలి. పార్టీ నాయకుల, ఆర్గనైజర్ల సంఖ్య బాగా హెచ్చాలి. పార్టీలో చురుకుగా పనిజేసే సామాన్య సభ్యులందరు పార్టీ ఆర్గనైజర్లుగా తర్ఫీదు చేయబడాలి. పార్టీ వివిధరకాల పనులను సమర్థతతో నెరవేర్చగల వివిధ పార్టీ కేడర్లను తయారుచేయాలి. పార్టీ రహస్యంగా యే క్షణమందైననూ పనిచేయుటకు తగిన రహస్య పార్టీ యంత్రాన్ని నిర్మించాలి.

(3) కార్మికవర్గంలో పార్టీ పూర్తిగా నాటుకుపోవాలి. పార్టీని అన్ని ముఖ్య సమయాల్లోను కార్మికవర్గం బలపర్చేటట్లుగా వుండాలి కార్మికవర్గంనుండి పార్టీసభ్యులు హెచ్చుగా తయారుగా బడుతూ వుండాలి.

నూతన పరిస్థితుల్లో "యునైటెడ్ ఫ్రంటు" యెత్తులద్వారానే పార్టీ అభివృద్ధిపొందుటకు, ప్రజా వుద్యమము అభివృద్ధిపొందుటకు అవకాశముంది. అయినప్పటికిని కార్మికవర్గంలో పార్టీ పూర్తిగా నాటుకోనిది, నిర్మాణరీత్యా బలంగాలేనిదీ, యే క్షణమునందైనా రహస్యంగా పనిజేయుటకు తగిన రహస్య యంత్రం నిర్మింపబడనిదే, "యునైటెడ్ ఫ్రంటు" యెత్తులద్వారా పార్టీని అభివృద్ధిపర్చలేము; లేకపోయిన "యునైటెడ్ ఫ్రంటు"లోని సంస్కరణవాదులు, రాజకీయవాదులు మన పార్టీ బలహీనతను ఆధారముగా జేసుకొని, "యునైటెడ్ ఫ్రంటు"ను విచ్ఛిన్నం గావించి ఫాసిస్టు నియంతృత్వాలకు, ప్రజా ఐక్యత విచ్ఛిన్నానికి దారితీస్తారు. అందుచేత పార్టీ నిర్మాణమును బలిష్ఠ మొనర్చుట ప్రధానంగా గమనించవలసిన విషయం.

"కమ్యూనిస్టు ఇన్‌టర్‌నేషనల్" కార్యవర్గ 13 వ సమావేశంగావించిన పై నిర్ణయాలు భారత దేశ కమ్యూనిస్టులకు అందజేయబడ్డాయి. 1934 సంవత్సరంలో వెలువడ్డ "కమ్యూనిస్టు" రెండవ సంచికలో యీ నిర్ణయాలు (మన దేశమునకు సంబంధించినంతవరకు) ప్రకటించబడ్డాయి. సూత్రప్రాయంగా పై నిర్ణయాలను అప్పటి పార్టీకేంద్రం అంగీకరించినదేగాని ఆచరణలో వాటిననుసరించి పార్టీ పునర్నిర్మాణం జరుపబడలేదు. పార్టీ కేంద్రపని వదలివేసి ట్రేడ్‌యూనియన్ పనిలో మరల మునిగిపోయింది. పార్టీపనిని వదలివేసి, యెచ్చట సమ్మెలు బయలుదేరితే ఆసమ్మెల్లో పాల్గొనడం మొదలుపెట్టింది. దీనినే "ట్రేడ్ యూనియన్ తత్వం"అని లెనిన్ అన్నాడు. అప్పటి పరిస్థితులలో పార్టీ పునర్నిర్మాణపు ఆవశ్యకతను సరిగ్గా గుర్తించకపోవడంవలన యీ తప్పుడు పంథా అవలంబించింది.

ఈ విధంగా అప్పుడు యేర్పడ్డపార్టీ కేంద్రము నిజమైనపార్టీ కేంద్రముగా పనిచేయజాలకపోయింది. అందువలన ట్రేడ్ యూనియన్ వుద్యమములో మునిగిపోయి, దానిద్వారా మరల ప్రభుత్వ నిర్బంధమునకు గురిఅయింది. 1934 ఏప్రియల్‌లో నేతపరిశ్రమలోవచ్చిన సార్వజనిక సమ్మెతో పార్టీ కేంద్రకమిటీ సభ్యులలో చాలమంది అరెస్టుగావింపబడ్డారు. దానితో తాత్కాలికంగా యేర్పడ్డ పార్టీకేంద్రము పార్టీ పునర్నిర్మాణమునకు సంబంధించిన ప్రాథమికపనులనుగూడ నెరవేర్చకుండా యెగిరిపోయింది. దీనితో పార్టీపునర్నిర్మాణపుపని, పార్టీకేంద్రమును స్థాపించుటకుగా జరుగుతున్న కృషి స్థంభించిపోయింది. 1936 వ సంవత్సరం వరకూ మరల పార్టీకేంద్రము యేర్పడలేదు.

ఈ కాలములో పార్టీకేంద్రము అనుసరించిన పార్టీనిర్మాణ పద్ధతుల వలన యొకగుణపాఠము నేర్చుకున్నాము. పార్టీనిర్మాణ రీత్యాబలంగా లేకుండా ఆకస్మికంగా సంభవించే యెంతబ్రహ్మాండవుద్యమాలైనను అపజయంపొందుతాయి. ప్రభుత్వం సులువుగా అట్టివుద్యమాలను అణచివేయగల్గుతుంది. అంతేగాకుండా ఒకవేళ తాత్కాలికంగా ప్రజావుద్యమాలు జయమొందినను పార్టీనిర్మాణము, బలము గూడా ప్రజావుద్యమాలతో పాటు అభివృద్ధి చెందకపోతే పార్టీలోని యీ బలహీనతలే కొంతకాలానికి ప్రజావుద్యమాలకు సంకెళ్ళుగామారి పూర్తిగావాటిని బలహీనంచేస్తాయని గూడ తెలుసుకోవాలి. ముఖ్యంగా కార్మికవర్గంలో వర్గచైతన్యము కల్గేరోజుల్లో, కార్మికవర్గముపై యజమానులు, ప్రభుత్వం గావించే దోపిడీల ఫలితంగా ఆకస్మికంగా వచ్చేసమ్మెలు దేశమంతటా వ్యాపించుతూ వున్నరోజుల్లో వాటిని సంఘటితపర్చి హెచ్చుస్థాయికి గొంపోవడానికి పార్టీ నిర్మాణంబలంగావుండాలి. అప్పుడే సమ్మెలు జయప్రదమౌతాయి. దానితోపాటు కార్మిక వర్గచైతన్యం మరింత అభివృద్ధిఅయి పార్టీ



కార్మికవర్గంలో బాగానాటుకునిపోతుంది. ఇదివరకుకంటే హెచ్చుస్థలాలకు వ్యాపిస్తూ దేశవ్యాపితస్వరూపాన్ని తీసుకుంటున్న యీ సమ్మెలన్నిటిని ఐక్యపర్చి సంఘటితమార్గాన నడుపుటకు పార్టీ స్థానికంగా, స్థానిక దృష్టితోనే పనిజేసినంతమాత్రాన సరిపోదు. దేశమందలి సమ్మెలన్నిటిని ఒకనిర్ణీత పంథాను నడుపగలపార్టీకేంద్రం అవసరము; అట్టి కేంద్రములేనిదే దేశమంతటా, అచ్చటచ్చటా, అప్పుడప్పుడూ (ఆయాపరిస్థితులబట్టి) చెలరేగుచుండే సమ్మెలను కేంద్రీకరించి యజమానులపై పెద్దదెబ్బతీయుటకు వీలుండదు. అందుచేత దేశములో కార్మికులలో అసంతృప్తి ప్రబలినకొద్దీ, ఆకస్మికంగావచ్చే సమ్మెల సంఖ్యహెచ్చుతూ వుండేకొలదీ, పార్టీకేంద్రము బలిష్ఠమైనదిగా వుండాలి; సభ్యులందరిలోను రాజకీయైక్యత యేర్పడాలి. పార్టీనిర్మాణము నలువైపుల వ్యాపించాలి. వివిధరకములపార్టీ పనులు చేయగల పార్టీకేడర్లు తయారుగావాలి. అప్పుడే ఈ సమ్మెలను కేంద్రీకరించి సార్వజనిక సమ్మెగా మార్చగల్గుతాము. ఇట్టిపార్టీకేంద్రము, పార్టీనిర్మాణములేకపోతే యెచ్చటి సమ్మెలచ్చట స్థానిక బలము క్షీణించగానే విఫలమైపోతాయి. ఒకదానికొకటి సంబంధములేకుండా వివిధకాలాల్లో సమ్మెలు జరుపబడుతాయి. ఒకదానినొకటి వేరువేరుగా ప్రభుత్వం అణచివేస్తుంది. దానితో ప్రజాశక్తి వృధా అయిపోతుంది.

కార్మికవర్గం, దాని తక్షణ, అవసరకోర్కెల నీడేర్చుకొనుటకుగాను యజమానులతో ఐక్యకంఠముగాను, సంఘటితమార్గాన పోరాడుటకు సంసిద్ధతచూపుచున్నప్పుడు, కార్మికేతరవర్గములనుండి విప్లవ భావాలుగల యువకులు సోషలిజంవైపుకు కార్మికవర్గ పంథావైపుకు ఆకర్షింపబడుచున్నప్పుడు ఆ పంచలనాన్నంతా సంఘటితపర్చి పార్టీ రాజకీయ కార్యక్రమముపై వీరినందరినీ ఐక్యపర్చి, వుద్యమాన్ని అభివృద్ధిచేయడానికి పార్టీ దిట్టమైన కేంద్ర యంత్రాన్ని నిర్మించుకొని సిద్ధంగావుండాలి. అట్టి కేంద్రం కార్మికులనుండి, విప్లవ యువకులనుండి ముందుకు వస్తున్నవారిని పార్టీ సభ్యులుగా తయారుచేసి వారికి మార్క్సిస్టు, లెనినిస్టు సిద్ధాంతజ్ఞానమును, చైతన్యమును, కలుగజేయాలి. అప్పుడే పార్టీ సభ్యులనుండి పార్టీ పనులనే వృత్తిగా చేయుచున్న పార్టీకేడర్లు, ఆర్గనైజర్లు తయారు అవుతారు; పార్టీ నాయకుల సంఖ్య వృద్ధి అవుతుంది. పార్టీ పునర్నిర్మాణానికిగాను అలాంటి పార్టీకేంద్రం అవసరం యిదివరకంటె అనేకరెట్లు హెచ్చింది.

అట్టి పార్టీకేంద్రము ఆవశ్యకతను స్థానిక, రాష్ట్రపార్టీ గ్రూపులు గుర్తించలేదు. అందుచేతనే స్థానిక ట్రేడ్‌యూనియన్ పనులలో మునిగిపోయి పార్టీ నిర్మాణపు పనులనే మర్చిపోయారు.

కార్మికవుద్యమం దానంతటకదే బయలుదేరుచున్న సోషలిస్టువుద్యమం, కార్మికవుద్యమం ఎంత బ్రహ్మాండ స్వరూపముదాల్చినను, అట్టివుద్యమాన్ని చైతన్యవంతము గావించడానికి పార్టీ నిర్మాణం అభివృద్ధిగానిదే నిర్ణీతరాజకీయాశయాలను గడించగల్గేంతటి విప్లవ వుద్యమముగా పరిణమించజాలదు. దేశములోని అన్నితరగతులను రాజకీయరంగమునకు కదల్చి రాజకీయైక్యతను వారిలో నెలకొల్పజాలదు. ఆవుద్యమముపై కార్మికవర్గరాజకీయ పలుకుబడి, నాయకత్వం యేర్పడవు. జాతీయబూర్జువా సంస్కరణవాదులపలుకుబడి, ప్రభావం క్షీణించదు. అందుచేత అలాంటివుద్యమం జయప్రదంగానేరదు.

పార్టీనిర్మాణావశ్యకతను, పార్టీకేంద్రమును కాపాడవలసిన అవసరమును గుర్తించకపోవడం వలన తాత్కాలికంగా 1933 లో యేర్పడ్డపార్టీకేంద్రము ట్రేడ్‌యూనియన్ వుద్యమములో మునిగిపోయింది. తత్ఫలితంగా ప్రభుత్వనిర్బంధమునకు గురియై పార్టీనిర్మాణము ఆగిపోయింది.

## కార్మికోద్యమములో ఐక్యత - కమ్యూనిస్టుల ప్రయత్నాలు

1935 లో అ.భా. ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసులోను, తరువాత కార్మికోద్యమమంతటా యేర్పడ్డఐక్యత దానంతటదే యేర్పడలేదు. కమ్యూనిస్టులు యీ ఐక్యతను నిరోధిస్తున్న సంస్కరణ వాదులతో పోరాటము సాగించారు. కార్మికుల నందరిని అప్పటి ప్రధాన కార్మిక సమస్యలపై (కూలీ తగ్గింపులను రద్దుగావించడం కొరకు తీవ్రఆందోళన) ఐక్యపర్చుటకు తీవ్రకృషిచేశారు. కార్మిక ప్రజాసామాన్యమునకు అందరికీ సంబంధించిన కూలీ తగ్గింపుల (Wage-cuts) సమస్యను తీసుకునియీ సమస్యపై కార్మికవర్గమునంతా ఐక్యపర్చుటకు, కూలీతగ్గింపుల రద్దుకై కార్మికవర్గంలో పనిజేసే అన్నిరకాలవారితో కలసిపోరాడుటకును కమ్యూనిస్టులు అంగీకరించారు. ఇందుకు సార్వజనిక సమ్మెను గొనిరావలయునని, అప్పుడే యజమానులు లొంగుతారని, అందుకు అందరూ కలసి పనిజేయాలని, సంస్కరణ వాదులతో యీ సమస్యపైకలసి పనిజేయడానికి సిద్ధంగావున్నామని కమ్యూనిస్టులు ప్రకటించారు. కాని రిఫార్మిస్టు నాయకులు యిందుకు అంగీకరించలేదు. కార్మికోద్యమములో మరల ఐక్యతరావడం, తద్వారా కార్మికవుద్యమము బలపడడం వారికియిష్టంలేదు. ఐక్యముగాయున్న కార్మికోద్యమములో సంస్కరణ వాదుల స్థానం బలహీనంగా వుంటుంది. అందుచేత సంస్కరణ వాదులు కార్మికోద్యమమును యెప్పుడూ విచ్ఛిన్నం చేయడానికి ప్రయత్నిస్తూ వుంటారు. అందుచేత సంస్కరణవాదులు కమ్యూనిస్టుల పై విజ్ఞప్తిని యేమీ సరుకుచేయలేదు. కమ్యూనిస్టులతోకలసి పని చేయుటకు నిరాకరించారు.

కమ్యూనిస్టులు జీతాల తగ్గింపులను రద్దుచేయించుటకు ఆందోళనచేస్తూ వుండడం. సంస్కరణ వాదులు యీ ఆందోళనతో సహకారం చేయడానికి నిరాకరించడంవలన సంస్కరణవాదులంటే తీవ్ర అసమ్మతి, కమ్యూనిస్టులంటే సానుభూతి కార్మికులలో క్రమేణా గల్గింది. సంస్కరణవాదుల పలుకుబడిక్రింద వున్న కార్మికులుగూడ సంస్కరణవాదుల వైఖరిపట్ల అసంతృప్తి వెల్లడించారు. సంస్కరణవాదుల నిజస్వరూపము కార్మికులందరికి తెలిసింది. అందుచేత కమ్యూనిస్టులతో కలసి పనిజేయాలనే ఒత్తిడి సర్వత్రా గల్గింది. కమ్యూనిస్టులు, వారి పలుకుబడిక్రింద వున్న కార్మికులు, కార్మికోద్యమమును ఐక్యపర్చుటకు గావించే ఆందోళనను కార్మికవర్గమంతా బలపర్చింది.

1933 వ సంవత్సరంనుండి భారతదేశ పెట్టుబడిదారులు అన్ని పరిశ్రమలలోను ముఖ్యంగా నేతపరిశ్రమలో కార్మికుల వేతనాలు చాలభాగం తగ్గించారనియు, అందుచేత కార్మికుల్లో అందరిలోను (వెనుకబడియున్న కార్మికవర్గంలోగూడ) సంచలనముపుట్టి సమ్మెలు యెచ్చటబడితే అచ్చట చెలరేగే పరిస్థితులు యేర్పడ్డాయని యిదివరలోనే చెప్పబడింది. ముఖ్యంగా బొంబాయి, నాగపూర్, కాన్పూర్, అహమ్మదాబాద్ వగైరా ప్రదేశాల్లోని నేతపరిశ్రమ కార్మికుల్లో తీవ్ర ఆందోళన బయలుదేరింది. ఈ పరిస్థితులలోనే కమ్యూనిస్టులు ముఖ్యంగా బొంబాయి కమ్యూనిస్టుగ్రూపు వేతనాల తగ్గింపును రద్దుగావించడానికి కార్మికుల్లో ఆందోళన బయలుదేరతీసింది. ఇందులకు నేతపరిశ్రమ కార్మికులందరూ జనరల్ స్ట్రయిక్' చేయాలని కార్మికుల్లో ప్రచారం గావించింది. కార్మికుల్లో వున్న వివిధ రాజకీయపక్షాలు ఐక్యంగా పనిజేయాలనియు, అందులకు కమ్యూనిస్టులు సిద్ధంగా వున్నారనియు ప్రచారము గావించింది. కమ్యూనిస్టుల నాయకత్వముక్రింద అచ్చటచ్చట చిన్నచిన్న సమ్మెలుగూడ బయలుదేరాయి. ప్రభుత్వ నిర్బంధమువలన, సంస్కరణవాదులు కార్మికోద్యమములో గావించిన



విచ్ఛిన్న పద్ధతులవలన కార్మికుల్లో గల్గిన నిరుత్సాహము క్రమక్రమేణా పోయింది. పోరాట మనోభావాలుద్భవించాయి; "జనరల్ స్ట్రయిక్" చేయాలనే ఆందోళనను బలపర్చసాగారు అంతే గాకుండా యిదివరలో కార్మికోద్యమములో గల్గిన చీలికలన్నీ రద్దుగావింపబడి యీ సమస్యపై అందరూ ఐక్యంగా పోరాటము సాగించాలనే అభిలాషకార్మికుల్లో జనించింది.

## కమ్యూనిస్టు నాయకుల విడుదలానంతరం

1933 ఆఖరున రణదివె వగైరా కమ్యూనిస్టు కార్మికనాయకులు జైళ్ళనుండి విడుదలై వచ్చారు. నాయకుల రాకతో కార్మికులు తమలోనున్న చీలికలు రద్దుచేసుకొని ఐక్యతను నెలకొల్పుకోడానికి మరింత దృఢ నిశ్చయులయ్యారు. జైళ్ళనుండి విడుదలైనవారందరి సంతకాలతో కార్మికులందరూ ఐక్యము గావలయునని, అందుకు అన్ని రాజకీయపక్షాలు సహకారం చేయాలనీ, విజ్ఞప్తి చేస్తూ కరపత్రాలు పంచిపెట్టబడ్డాయి. దీనితో కార్మికుల్లో ఐక్యత నెలకొల్పుకోవాలనే కోర్కె మరింత బలపడింది.

కార్మికుల్లో యేర్పడ్డ వుత్సాహమును, ఐక్యత కావాలనే అభిలాషను మరింత తీవ్రపర్చుటకు నాయకులు జైళ్ళనుండి రాగానే బొంబాయిలో ఒక బ్రహ్మాండమైన బహిరంగసభ 1934 ప్రారంభములో యేర్పరచబడింది. దాదాపు 30,000 మంది హాజరయ్యారు. కమ్యూనిస్టులచేత యేర్పరచబడిన సభ అయినా, సంస్కరణవాదులనుగూడ దానిలో పాల్గొనుటకు ఆహ్వానించారు. కార్మికోద్యమములో ఐక్యతను పునః స్థాపించేవిషయమై సభలో చర్చించబడ్డది కమ్యూనిస్టులు వారి సూచనలను చేశారు. సంస్కరణవాదులుకూడా కొందరు మాట్లాడారు కాని సంస్కరణవాదులు కార్మికోద్యమములో ఐక్యత నెలకొల్పాల్సిన అవసరంలేదనే మాట్లాడారు. అందుచేత కార్మికులు ప్రత్యక్షంగా సంస్కరణవాదులు కార్మిక ఐక్యతను యెలా అడ్డుచున్నారో గ్రహించారు. కమ్యూనిస్టులే వాస్తవంగా కృషిచేస్తున్నారని కార్మికుల్లో చాలమందికి స్పష్టమైంది. దీన్నే మరొక దుస్సంఘటన ధృవపర్చింది.

కమ్యూనిస్టు ప్రతినిధులు మాట్లాడుచుండగా పోలీసులచేత, సంస్కరణవాదులచేత ప్రేరేపింపబడిన కొందరు రౌడీలు సభలోకి, ఉపన్యాసకులపైకి రాళ్లు రువ్వడం ప్రారంభించారు. అంతటితో సభలో గల్లంతుపుట్టింది. ఈ చిన్నవిషయం సాకుగాతీసుకొని అప్పటికే సిద్ధంగావున్న పోలీసులు సభను చెల్లాచెదరుచేసి కార్మికులపై తీవ్రమైన లాఠీచార్జి గావించారు. ఈ విధంగా ముందుగానే సభను భగ్నంచేయుటకు పోలీసులు, సంస్కరణవాదులు కుట్రగావించి సభను భంగపర్చారు. అయినప్పటికీ అప్పటికే కమ్యూనిస్టులు కొందరు మాట్లాడడం అయిపోయింది. కమ్యూనిస్టు సూచనలేవో కార్మికులు తెలుసుకోగల్గారు. సభలో సంస్కరణవాదు లవలంబించిన వైఖరితోవారు కార్మికప్రజా సామాన్యంనుండి మరింత వేరుబడిపోయారు.

ఈ విధంగా కమ్యూనిస్టులు కార్మికుల్లో సంస్కరణ వాదులకు వ్యతిరేకంగా, ఐక్యతను సాధించడానికి గావించిన తీవ్రకృషి ఫలితంగా కార్మికోద్యమము మరల బలపడింది. ప్రభుత్వం, మిల్లు యజమానులు గావిస్తున్నదాడిని కార్మికులు ఐక్యంగాయెదుర్కొనడానికి తయారయ్యారు. కాని సంస్క

రణవాదులు పూర్తిగా కమ్యూనిస్టుల ప్రయత్నాలను వ్యతిరేకించుటవలన కార్మికుల్లో సంపూర్ణఐక్యత సాధించబడలేదు.

## 1934 ఏప్రియల్ "జనరల్ స్ట్రయిక్"

1934 వ సంవత్సరం ఏప్రిల్ 23 వ తేదీన జనరల్ స్ట్రయిక్ ప్రారంభింపబడింది. కార్మిక వర్గాన్ని, ముఖ్యంగా బొంబాయి కార్మికవర్గమును దానికి సంసిద్ధంచేయడానికి కమ్యూనిస్టులు 1934 ఫిబ్రవరి 4 వ తేదీన అంతర్జాతీయ కార్మిక నిరుద్యోగుల దినోత్సవాన్ని జరిపారు. ఆనాడు బొంబాయి కార్మికులలో అధిక సంఖ్యాకులు ప్రదర్శనములో పాల్గొన్నారు. బహిరంగసభ జరుపబడింది. ఆ నాటి ప్రదర్శనం, బహిరంగసభ కార్మికుల్లో పోరాటోత్సాహాన్ని రేకెత్తించింది ఏప్రియల్ జనరల్ స్ట్రయిక్ కుదీనితో కార్మికులను సిద్ధంచేశారు.

"జనరల్‌స్ట్రయిక్ ప్రారంభమునుండి ప్రభుత్వం నిర్బంధంసాగించింది. ప్రభుత్వనిర్బంధాన్ని యెదుర్కొంటూ, పోలీసుదళాలను ముఖాముఖితాకుతూ, బొంబాయి "యంగ్‌వర్కర్సులీగ్" ప్రదర్శనాలలోను, సభలోను ముందుగావుండిపనిజేసింది. ముఖ్యంగా సమ్మెను విచ్ఛిన్నపర్చుటకు తయారయ్యే "బ్లాక్‌లెగ్స్" (Black - legs) సమ్మెవిచ్ఛేదకులను యెదుర్కొని కార్మికుల్లో వుత్సాహాన్ని నిలబెట్టడానికి సమ్మెదారుల ప్రతిఘటనాశక్తి నభివృద్ధిపరచడానికి కమ్యూనిస్టుపార్టీసభ్యులు పూర్తిగా కృషిచేశారు. అందుచేత బొంబాయిగో ప్రతిఫ్యాక్టరీలో సమ్మెచేసే కార్మికులకు వీరునాయకులుగా పరిగణింపబడ్డారు.

కమ్యూనిస్టునాయకులను అందరినీ మరల ప్రభుత్వం అరెస్టుగావించింది. నాయకులేగాక రెండవ శ్రేణి, మూడవశ్రేణి కార్మికనాయకులు గూడఅరెస్టుగావించ బడ్డారు. ఈ అరెస్టులతో సమ్మెతీవ్రత తగ్గింది సమ్మెకు అగ్రగాములుగా వుండి పనిజేసేవారిని అరెస్టుచేయడంలో వారిస్థానానే మరలపని చేసేవారు లేకపోవడం వలన సమ్మెచేసే కార్మికుల్లో, ముఖ్యంగా హెచ్చుగా చైతన్యములేని కార్మికుల్లో నిరుత్సాహం ప్రారంభమైనది. కమ్యూనిస్టు నాయకులందరు అరెస్టుగావడంతో మరలసమ్మె కేంద్రకమిటీ సంస్కరణ వాదుల చేతుల్లోనికిపోయింది (కండాల్కరు, జోషి, రూయికరువగైరా) సమ్మెతీవ్రత తగ్గగానే, ప్రభుత్వనిర్బంధము, మిల్లుయజమానులదాడి గూడమరింత తీవ్రమయ్యాయి. దానితో సమ్మెఅపజయం పొందింది. కార్మికులు పనిలో ప్రవేశించారు.

## సమ్మె ఫలితాలు

1934 సార్వజనికసమ్మె విఫలమైనప్పటికిని కార్మికోద్యమములో ఐక్యతను సాధించడానికి యీ సమ్మెచాలతోడ్పడింది. బొంబాయి, కాన్పూరువగైరా ప్రదేశాల్లో యిదివరకు కార్మికోద్యమములో కమ్యూనిస్టులు కోల్పోయిన స్థానాన్నితిర్గి సంపాదించగల్గారు. "సంయుక్తసంఘటన" యెత్తుగడల గూర్చి కార్మికుల్లోబాగా ప్రచారంగావించబడింది. "యునైటెడ్‌ఫ్రంటు" కార్యక్రమముపై పనిజేయడానికి నిరాకరిస్తూ, కార్మికోద్యమ ఐక్యతను నిరోధిస్తూవున్న "రిఫార్మిస్టుల"ను కార్మికులనుండి దూరం చేయగల్గుతున్నారు. కార్మికుల్లో కమ్యూనిస్టుల పలుకుబడి క్రమేణా హెచ్చుతోంది. బొంబాయిలో కార్మికోద్యమము కమ్యూనిస్టుల పలుకుబడిలోనికి వచ్చింది. కార్మికుల జీతాలతగ్గింపు గూడ చాలవరకు రద్దుగావించబడింది. ఈ జయము లభించుటవలననే కార్మికవర్గం కమ్యూనిస్టుపంధాను బలపర్చింది. ఈ జయాలు సాధించడంవలననే 1935 లో జరుపబడ్డ అ. భా. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులో సంస్కరణ వాదులకు, కమ్యూనిస్టులకు మధ్యఐక్యత కుదిరింది. తత్ఫలితంగా కార్మికోద్యమము బలపడింది. బొంబాయిలో మరల "గిర్నికంగారు యూనియన్"లో ఐక్యతయేర్పడింది. ముఖ్యంగా గమనించవలసినదేమంటే కమ్యూనిస్టులు, వారిననుసరించే "యంగ్‌వర్కర్సులీగ్" లాంటి మిలిటెంటు వర్కర్లు, నిత్యం కమ్యూనిస్టుపంధాకొరకు కృషిచేస్తూ, దీనికి అడ్డుగావున్న సంస్కరణ వాదులతో పోరాడుతూవుండుట వలననే కార్మికోద్యమ ఐక్యత సాధ్యమైనదిగాని యీ ఐక్యత ఆకస్మికముగా సంభవించినదిగాదు. కమ్యూనిస్టులు కార్మికుల్లో బలంగావున్నప్పుడు మాత్రమే కార్మికోద్యమ ఐక్యత సాధ్యమౌతుంది. కమ్యూనిస్టులు, కార్మికవర్గంనుండి విడబడిపోయినప్పుడుగాని, కార్మికోద్యమము గూడ తక్కువస్థాయిలో వున్నప్పుడుగాని సంస్కరణవాదులు కార్మికోద్యమ ఐక్యతకొరకు తమంతట తామే కృషిజేయరు. పైగా కార్మికోద్యమములో అనైక్యతను కొనసాగించుతూ కార్మికోద్యమాన్ని బలహీనపర్చుతారు; ఈ విషయాన్ని గమనించాలి. (ఉ. 1928 లో నేషనల్ రిఫార్మిస్టులు కమ్యూనిస్టులతో వున్నారు. 1931-34 వరకూ చీలిపోయారు. కార్మికోద్యమములో వుద్దేశ్య పూర్వకంగా చీలికలుకలుగజేసి బలహీనపర్చారు. మరల కమ్యూనిస్టులతో 1935 లో కలిసిపనిజేశారు.)

### కార్మికోద్యమ ఐక్యతకై కమ్యూనిస్టులు గావించినకృషి - దా గుణపాఠాలు

ఈ కాలములో కమ్యూనిస్టులు కార్మికోద్యమ ఐక్యతను సాధించడానికి గావించిన పోరాటము వలన యీ క్రింది అనుభవాన్ని గుణపాఠాలను నేర్చుకున్నారు.

(1) బొంబాయి కమ్యూనిస్టు గ్రూపులో చీలికలురద్దయి పార్టీకేంద్రము యేర్పడి "కమ్యూనిస్టులందరూ కలసి ఐక్యకంఠముగా కార్మికోద్యమ ఐక్యతకొరకు ప్రచారముగావించ మొదలిడివ తరవాతనే, కార్మికవర్గంలో ఐక్యతను యేర్పరచుటకు జయప్రదముగా సంస్కరణవాదులతో పోరాటము సాగించగల్గాము; కార్మికోద్యమములో వారిపలుకుబడి (ముఖ్యంగా బొంబాయిలో) చాల వరకు నాశనముగావించగల్గాము అందుచేత పార్టీలో ఐక్యతలేకుండా, అన్నిగ్రూపులు అంగీకరించిన కేంద్ర పార్టీ నాయకత్వము స్థాపించబడకుండా కార్మికవర్గంలో ఐక్యత సాధించలేము.

(2) ఎచ్చటబడితే అచ్చట కమ్యూనిస్టులే కార్మికవర్గంను ఐక్యపర్చుటకు ముందుగా కృషిచేశారు. సంస్కరణవాదులు యీ కృషికి పూర్తిఅడ్డంకులు కలుగజేశారు. 1932-33 సంవత్సరాల మధ్యకార్మికవర్గం ఐక్యపోరాటముకొరకు తపించింది. ఆసమయములోనే కమ్యూనిస్టులు చొరవచేసి, ఐక్యపోరాటం గావించుటకు తమతో కలవవలసినదిగా సంస్కరణవాదనాయకులకు విజ్ఞప్తిగావించారు. కాని వారు యేమీ సరకుచేయలేదు. ఈ పైవిషయాలబట్టి కార్మికోద్యమమును విచ్ఛిన్నపరచడానికి కారకులు, కార్మికోద్యమ ఐక్యతను గొనిరావడానికి అడ్డుపడుతూవుంది సంస్కరణ వాదులేగాని కమ్యూనిస్టుల సెక్టేరియన్ దృక్పధము గాదని స్పష్టమౌతుంది. కమ్యూనిస్టుల సెక్టేరియన్ దృక్పధం వలన కార్మికోద్యమము హెచ్చుగా అభివృద్ధి అయ్యేఅవకాశాలు తాత్కాలికంగా సన్నగిల్లాయి; కాని కార్మికోద్యమము చీలికలకు గురిఅయిపూర్తిగా యీ కాలంలో బలహీనపడుటకు సంస్కరణవాదుల విచ్ఛిన్నచర్యలే ముఖ్యకారణాలు. అంతేగాకుండా ప్రతిపర్యాయంగూడ (1929; 1931-32; 1933-35;

సంవత్సరములలో) కమ్యూనిస్టులే కార్మికోద్యమ ఐక్యతను కాపాడుటకు ముందుండిపనిచేశారు. ఈ ఐక్యతకు భంగము గల్గించే పరిస్థితులలోను, కార్మికోద్యమమును విచ్ఛిన్నము గావించుటకు ప్రయత్నించినప్పుడు సంస్కరణవాదులతో కమ్యూనిస్టులు (అవసరమైనంతవరకు) పోరాడారు. కమ్యూనిస్టులు యెప్పుడూగూడ కార్మికోద్యమాభివృద్ధిని దృష్టిలోవుంచుకోకుండా ఉత్త కమ్యూనిస్టు సిద్ధాంతాల కొరకు కార్మికోద్యమ ఐక్యతా సమస్యతో యెట్టిసంబంధముచేకుండా "సెక్టేరియన్" గా సంస్కరణ వాదులతో పోరాడలేదు.

(3) 1934 సార్వజనిక సమ్మెగూడ పూర్తిగా ప్రభుత్వంచే అణచబడింది. ఇదివరలో జరిగిన సమ్మెలలో నేర్చుకున్న గుణపాఠమే మరల ఈసమ్మెగూడ నేర్పుతోంది. ఆగుణపాఠముయిది: ఆర్థిక హక్కులకొరకు జరుపబడే సమ్మెలుగూడ కార్మిక పోరాటాలలో సహజంగా తయారుగాబడే మిలిటెంటు వర్కర్లు మాత్రమే పోరాడడము వలన జయప్రదముగావు. ఇట్టి "వేన్‌గార్డు" (ముందుండి పనిజేసేవాళ్లు) పోరాటముతో పోలీసులలో ఢీకొనుటద్వారా, సమ్మెవిఘాతకులతో నేరుగా పోట్లాడుటద్వారా ప్రజావుద్యమం. ప్రజావుత్సాహము తీవ్రమౌతుంది. దానితో కార్మికుల్లో (ముఖ్యంగా వెనుకబడివున్న కార్మికుల్లో) పోరాటోత్సాహం బాగా అధికమవుతుంది; ఈ వుత్సాహం "వేన్‌గార్డు" పోరాడుచున్నంత వరకు, పోరాటరంగములో ప్రభుత్వము "వేన్‌గార్డును" వుంచునంతవరకు, వుంటుంది. ప్రభుత్వము వీరిని అరెస్టుగావించగానే వారి మాదిరిగా పనిజేయగలవారుండేరప్ప వుత్సాహం తగ్గిపోతుంది; సమ్మెతీవ్రత తగ్గుతుంది అందుచేత "వేన్‌గార్డు" పోలీసులతో ఢీకొనుటకు తర్ఫీతుగావింప బడడమేగాక సమ్మెదారులందరినీ ప్రభుత్వ నిర్భంధాన్ని యెదుర్కొవడానికి తర్ఫీతు చేసినప్పుడే అందుకు గాను పార్టీనిర్మాణం, పార్టీయంత్రం నిర్మింపబడినప్పుడే అదిసాధ్యమౌతుంది. ఈ విధంగా కార్మిక వర్గమునంతను తమవలెనే పోరాడేశక్తిగల్గేటట్లు, సమ్మెలు సంభవించునప్పుడు సమ్మెపోరాటాన్ని సాగించడానికి "వేన్‌గార్డు"గా పనిజేస్తున్నవార్కి తగిన రాజకీయపరిజ్ఞానం, సిద్ధాంత పరిజ్ఞానంలేదు. ఈ "వేన్‌గార్డు" ధైర్యంగా పోట్లాడ గల్గుతుంది. అత్యద్భుతమైన సాహసాలను త్యాగాలను చేయగల్గుతుంది. ప్రజామాన్యాన్ని తమ ఉపన్యాసములద్వారా వూపవేస్తుంది. కాని నిర్మాణయుక్తంగా నిరంతరం కార్మికులలో రాజకీయచైతన్యమును గల్గించగల్గే "రాజకీయశక్తి", దాన్ని వార్కిగలుగ జేయగల పార్టీ యంత్రం యింకా తయారుగాలేదు. సమ్మెకాలములో కార్మికుల ప్రతిఘటనాశక్తి "వేన్‌గార్డు" పోయినంత మాత్రముననే విచ్ఛిన్నంగాకుండా వుండేందులకు అలాంటి నిర్మాణం అవసరం.

కాన సమ్మెల బలహీనతకు పార్టీబలహీనతయే ముఖ్యకారణం ప్రతిమిల్లు కమిటీ ప్రదేశములోనువున్న పార్టీసభ్యులు యీ పైవిధంగా మిల్లుకమిటీసభ్యులను, అచ్చటికార్మికులను తయారుచేయజాలక పోయారు. ఈ సభ్యులే యీకార్యము నెరవేర్చుటకు అశక్తులుగా వునారు. సమ్మెలు వచ్చినప్పుడు సమ్మెలలో ఆందోళనగావించుటకు, సమ్మెల్లో ముందుండి తామే పోలీసులను ఢీకొనుటకు మిలిటెంట్లుగామాత్రం తయారుచేయబడ్డారు. కాని కార్మికులందరినీ తమవలె తయారుచేయాలనే భావం వీరికిలేదు.

కేవలం సమ్మెలునడుపుటకేగాక, విప్లవములో ప్రథమశ్రేణిలోవుండి ప్రజావుద్యమాన్నంతనూ నడుపుటకు, కార్మికులను క్రమక్రమేణా యిలాంటి సమ్మెలద్వారా తయారుచేయాలి. ఇందుకు శక్తి



వంతులైన, విప్లవమే వృత్తిగాగల పార్టీఆర్గనైజర్లు వున్నప్పుడే యీ కార్యం సాధింపబడుతుంది. పార్టీసభ్యులకు ఇలాంటి తర్ఫీతు యివ్వబడకపోవడంవలన వారున్నప్రదేశాల్లోని మిల్లుకమిటీలను, ప్రజాసామాన్యమును, ప్రభుత్వ నిర్భంధాన్నిగూడా యెదుర్కొంటూ పోరాటమును సాగించకల్గేటట్లు తయారుచేయజాలకపోయారు. మిల్లుకమిటీలు కార్మికుల ప్రతిఘటనాశక్తిని అభివృద్ధిచేయగల కేంద్రాలుగా తయారుగాలేదు.

(4) ఈకాలంలో బొంబాయి, కాన్పూరు, అహ్మదాబాద్, షోలాపూర్, నాగపూరు ప్రదేశాల్లో జరుపబడ్డ సమ్మెలు ప్రభుత్వముచేత అణచబడిననూ 1929-30 సంవత్సరములలోగల్గిన సమ్మెలు అపజయంపొందినతదుపరి కార్మికుల్లోగల్గినంత నిరుత్సాహం, అవినీతి యిప్పుడు గలుగలేదు. అప్పటికన్నా ప్రతిప్రదేశంలో కమ్యూనిస్టుగ్రూపులు అభివృద్ధిఅయ్యాయి; వీరిననుసరించే మిలిటెంటువర్కర్లు అధికమయ్యారు. వీరే ప్రభుత్వనిర్బంధమును యెదుర్కొంటూ కార్మికులనందరిని పోరాటములో ఐక్యపర్చుచూ కార్మికోద్యమ ఐక్యతను విచ్ఛిన్నంగావించే సంస్కరణవాదుల ఎత్తులను సాగనీయకుండా పనిజేశారు. ఈ కృషిఫలితంగా, యీ పోరాటాలఫలితంగా కార్మికోద్యమములో ఐక్యత యేర్పడుటకు కార్మికోద్యమము ముందుకు పోవడానికి అవకాశమేర్పడింది.

ఈవిధంగా కార్మికోద్యమములో కమ్యూనిస్టులు ఐక్యతకై తీవ్రంగా పనిజేశారు. దీనిఫలితంగా కార్మికోద్యమము అభివృద్ధిగాంచింది స్థానికంగా "రిఫార్మిస్టుల" పలుకుబడిలోవున్న కార్మికసంఘాలకు, "రెడ్‌ఫ్లాగ్" (యెర్రజెండా) ట్రేడ్ యూనియన్‌లకు (కమ్యూనిస్టుల పలుకుబడి క్రిందవున్న కార్మిక సంఘాలు) ఐక్యత యేర్పడుతోంది. స్థానికసంఘాల్లో యేర్పడ్డ యీ ఐకమత్యము పైకమిటీలలోగూడ యేర్పడవలెననే ఆందోళన బయలుదేరింది ఈ ఆందోళనలో "రిఫార్మిస్టు" సంఘాలలో వున్నకార్మికులు గూడ పాల్గొంటున్నారు. ఇదివరలో కార్మికోద్యమములో గల్గిన చీలికలవలన కార్మికోద్యమము బలహీనపడడం, మరల కమ్యూనిస్టులు కార్మికోద్యమమును ఐక్యపర్చుటకు గావిస్తున్న ప్రయత్నాలవలన క్రమేణా కార్మికోద్యమము బలపడడం వీరు కండ్లారచూస్తున్నారు. అందుచేత క్రింద కార్మిక సంఘాలలో యేర్పడ్డ ఐక్యత పైసంఘాలలో గూడ నెలకొల్పాలనేకోర్కె, ఆందోళన హెచ్చయింది. ఈ పరిస్థితుల్లో, కార్మికోద్యమములో ముఖ్యంగా క్రింది (స్థానిక) కమిటీలలో తమకున్న పలుకుబడి నాధారముగగొని, కమ్యూనిస్టులు పైకమిటీలలో ముఖ్యంగా అ. భా. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులో గూడ ఐక్యత తీసుకు రావడానికి సంస్కరణ వాదులపై వత్తిడికలుగ చేశారు.

సంస్కరణ వాదులతో కలసిపనిజేయడానికి కమ్యూనిస్టులు ఆందోళన చేస్తున్నప్పటికిని కార్మికోద్యమంలో సంస్కరణ వాదులు అవలంబించే విచ్ఛిన్నమార్గంవలన కల్గేహానిని కార్మికులకు యెప్పటికప్పుడు తెలియజెప్పుచూ, కమ్యూనిస్టుపంథాను కార్మికవర్గము యెందుకు అనుసరించవలసింది ప్రచారంచేయుటమానుకొనలేదు; రిఫార్మిస్టులతో కలసిపనిజేయడమంటే వారు అవలంబించే విచ్ఛిన్నమార్గాన్ని బట్టబయలు చేయకుండా నోరుమూసుకుని కూర్చోవడంగాదు. అదివారు అవలంచేమార్గాన్నే అనుసరించడం, కమ్యూనిస్టు పంథాను విడనాడడం. అందుచేత రిఫార్మిస్టులతో కమ్యూనిస్టులు కలిసి పనిజేయుచున్నప్పుడు గూడరిఫార్మిస్టులు గావించే కార్మికోద్యమ ఐక్యతా విచ్ఛిన్నచర్యలగూర్చి బట్టబయలు చేయాలి అప్పుడే వారిపలుకుబడిని కార్మికుల్లోలేకుండా చేయగల్గుతాం; కార్మికోద్యమ ఐక్యతను నిర్మించుతాం.

రిఫార్మిస్టులు, కమ్యూనిస్టులు తాత్కాలికంగా కలసి పనిజేయుటకు అప్పట్లో వున్న అవకాశాలివి :—

(1) "రిఫార్మిస్టుల" పలుకుబడిక్రింద వున్న కార్మిక సంఘాలుగూడ కమ్యూనిస్టులతో కలసి పనిజేయుటకు అభిలషించుతున్నాయి. కార్మికులకందరికి సంబంధించిన జీతాలతగ్గింపు రద్దుకొరకు, అప్పట్లో ప్రభుత్వము, మిల్లుయజమానులు కార్మికులపైగావిస్తున్న తీవ్రమైనదాడిని అందరూ కలసి యెదుర్కొనుటకు కమ్యూనిస్టులు గావించే ఆందోళనతో కార్మికుల్లో పూర్తిసంచలనము పుట్టినది. సంస్కరణవాదులుగూడ ఈ సంచలనాన్ని గుర్తించవలసివచ్చింది

(2) ప్రభుత్వము ప్రకటించిన నూతన రాజ్యాంగ చట్టము ననుసరించి క్రొత్తయెన్నికలు రానున్నాయి. కాంగ్రెసుగూడ యెన్నికల్లో పాల్గొనుటకు నిశ్చయించింది. (1934 మే, పాట్నాలో జరిగిన వర్కింగ్ కమిటీ తీర్మానం) ఈ పరిస్థితుల్లో కార్మికోద్యమములో తమకున్న పలుకుబడిసన్నగిల్లేటట్లుప్రవర్తించడం శ్రేయస్కరంగాదు. కమ్యూనిస్టులతో కలసిపనిజేయుటను, కమ్యూనిస్టులుగావించే కార్మిక ఆందోళనలో పాల్గొనుటకు అంగీకరించకపోయినచో కార్మికోద్యమములో జాతీయసంస్కరణవాదుల (కాంగ్రెసు) స్థానంబలహీనపడి పోతుంది. అలాగాకుండా కార్మికుల కనీసకోర్కెలను బలపర్చుతూ కార్మికులు సాగించే ఆందోళనసూ బలపర్చితే తమస్థానాన్ని నిలబెట్టుకోవచ్చు కార్మికోద్యమములో తమకున్న పలుకుబడి, స్థానాన్ని ముందురానున్న అసెంబ్లీ యెన్నికలలో తమపక్ష అభ్యర్థులను గెలిపించుకోడానికి వినియోగించుకోవచ్చు. ఈ కారణములవలన జాతీయ సంస్కరణవాదులు పూర్తిగా కమ్యూనిస్టు వ్యతిరేకులుగా యిప్పటివరకూ వుంటూవచ్చినా కమ్యూనిస్టులతోకలసి పనిజేయడానికి అంగీకరించారు.

ఈ పరిస్థితుల్లో కార్మికోద్యమములో పై కమిటీలనుండి క్రింది కమిటీలవరకూ కార్మికుల అత్యవసర కోర్కెలను సాధించడానికి ఐక్యత యేర్పడింది. 1932 లో రైల్వే కార్మిక సంఘాలు, "ట్రేడ్ యూనియన్ ఫెడరేషన్ ఆఫ్ లేబరు"తో కలసిపోయాయి. 1934 లో, అ భా. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులో (లిబరల్ రిఫార్మిస్టులు వెళ్ళినతరువాత) యేర్పడ్డ వివిధగ్రూపులు ఐక్యమైయొకే అ. భా ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు సంస్థను పునః స్థాపించారు. 1935 లో కలకత్తాలో అ. భా. ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు సమావేశం జరిగింది. దానిలో అ. భా. ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసుకూ, "ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ ఆఫ్ లేబరు"కూ గూడ ఐక్యత కుదిరింది. కాని రెండూ వేరేవేరే సంఘాలుగానే వున్నాయి. 1936 లో పై రెండు సంఘాల ప్రతినిధులతోగూడిన యొక "జాయంటు బోర్డు" యేర్పడింది. చివరకు 1938 లో రెండు సంఘాలు తాత్కాలికంగా ఐక్యమగుటకు అంగీకరించాయి. "ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు"కు "ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్" అనుబంధ సంఘంగా చేయబడింది. ఆవిధంగా భారతదేశ కార్మికులందరికి ఒకే ఐక్య ట్రేడ్‌యూనియన్ కేంద్రం యేర్పడింది. భారతదేశ మొత్తంమీద కార్మికులందరకు అ. భా. ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు ప్రతినిధిగా పరిగణింపబడేటట్లును, కార్మికోద్యమములో చీలికలులేకుండా నుండేటట్లు అవకాశము యేర్పడింది. (ఈ పరిస్థితుల్లోగూడ గాంధీవాదుల పలుకుబడిక్రింద వున్న "అహమ్మదాబాద్ లేబరు అసోసియేషన్" ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులో చేరలేదు. ఇప్పటికిగూడా విడిగానే వుంది.)



రిఫార్మిస్టులు ఈ ఐక్యతను రానున్న యెన్నికలలో తమ అభ్యర్థుల విజయంకొరకు వుపయోగించుటకు ప్రయత్నించారు. ఈ విధంగా రెండు పంథాలు, కార్మికోద్యమమును ఐక్యపర్చుటకు బయలు దేరాయి.

అ. భా. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులో యేర్పడ్డ ఐక్యతద్వారా అన్నిప్రాంతాలలోను రిఫార్మిస్టులకు, కమ్యూనిస్టులకు కార్మికోద్యమములో కలసిపనిచేయుటకు అవకాశాలు యేర్పడ్డాయి. బొంబాయిలో ఝాబ్వాలా, ఝూయికరు వగైరాలతోను. కాన్పూరులో హరిహరనాథశాస్త్రి, మద్రాసులో గురుస్వామి, పి. ఆర్. కె. శర్మలతోను కలసిపనిజేయడం ప్రారంభించాము. ఈ విధంగా కార్మికోద్యమము అన్ని ప్రాంతాల్లోను ఐక్యపర్చబడి బలపడుతోంది. కేవలం జీతాలతగ్గింపుల రద్దుకొరకై పోరాడుటకు మాత్రమేగాక, రాజకీయ రంగములోగూడ కార్మికులు ప్రవేశించుచున్నారు. బొంబాయిలో నూతన రాజ్యాంగచట్టమునకు వ్యతిరేకంగా కార్మికప్రదర్శనాలు చేయబడ్డాయి. ప్రజా ప్రతినిధుల పరిషత్ ద్వారానే భారతదేశరాజ్యాంగము యేర్పరచబడవలయునని కార్మికులు రాజకీయ ప్రదర్శనాలుజరిపారు. ఈ ప్రదర్శనాలుగూడ కేవలం కార్మికవర్గంతోనే కూడుకొనిలేవు. ప్రజలందరూ ప్రదర్శనాల్లో పాల్గొనేటట్లు కార్మికవర్గంముందుగానే ప్రచారంగావించి ప్రజలందరితోకూడిన బ్రహ్మాండమైన ఐక్య ప్రదర్శనాలను లేవదీసింది.

## కమ్యూనిస్టుపార్టీ బహిష్కరించబడింది

కార్మికోద్యమములో యేర్పడ్డ ఐక్యతను, దానికి తీవ్రకృషి గావించిన కమ్యూనిస్టుపార్టీని బలహీనపర్చుటకు ప్రభుత్వం ముందుగానే జాగ్రత్తపడింది. ముందు ముందు రానున్న బహిరంగ అవకాశాలను ఉపయోగించుకొని కమ్యూనిస్టులు బలపడతారనే వుద్దేశ్యంతో పార్టీ శైశవావస్థలో వుండగానే పార్టీకి లీగల్ అవకాశాలు లేకుండాచేసింది 1934 వ సంవత్సరం జులై నెలలో పార్టీని బహిష్కరిస్తూ ప్రకటన గావించింది. కమ్యూనిస్టుపార్టీయేగాక, దాని పలుకుబడిలోనున్న కార్మిక సంఘాలు గూడ (రెడ్ ట్రేడ్‌యూనియన్లు, వర్కర్సు పబ్లిషింగ్ హౌస్, యంగ్ కమ్యూనిస్టులీగ్, బొంబాయిలో, మద్రాసులోను) నిషిద్ధ సంఘాలుగా ప్రకటించబడ్డాయి. కమ్యూనిస్టులపైనను, వారి ననుసరించేవారిపైనను నిర్బంధం బాగా తీవ్రపర్చబడింది. అనేక సోదాలు జరుపబడ్డాయి. పార్టీ బహిరంగ ప్రచార ఆందోళనలకు పూర్తిగా దెబ్బతగిలింది. సంస్కరణవాదుల కార్యకలాపాలు, తప్పుడు ప్రచారం కార్మికుల్లో మరల వ్యాపించుటకు అవకాశమేర్పడింది (కమ్యూనిస్టుపార్టీ బహిరంగ ప్రచారమును నిషేధించడంవలన.)

ఈ సమయంలోనే రాజకీయ రంగములోగూడ పూర్తి మార్పులువచ్చాయి. శాసనోల్లంఘన వుద్యమాన్ని వదలి, పార్లమెంటరీ చర్యలు అవలంబించుటకు కాంగ్రెసు తీర్మానించింది; (పాట్నా వర్కింగు కమిటీ తీర్మానం 1934). 1934 జూన్‌లో కాంగ్రెసు సంఘాలపైనున్న నిషేధం తొలగింపబడింది. కాంగ్రెసు నాయకుల్లో శాసనసభా కార్యక్రమమును అనుసరించి పనిజేయాలనే భావాలు బాగా హెచ్చాయి. కాంగ్రెసు యెసెంబ్లీ యెన్నికల్లో పాల్గొనడం, తరువాత కాంగ్రెసు మంత్రివర్గాలు యేర్పడే అవకాశములు కన్పించుతున్నాయి. బహిరంగంగా పనిజేసే అవకాశాలు హెచ్చు అయ్యాయి. ప్రజావుద్యమము పెంపొందే అవకాశంగూడా యేర్పడింది. ఈ అవకాశాల నుపయో

గించుకొని పార్టీ పనిజేయుటకు, లీగల్ అవకాశాలద్వారా అభివృద్ధి అయ్యే ప్రజా సంచలనమును కార్మికవర్గ పలుకుబడిక్రింద సంఘటితపర్చడం కొరకు కమ్యూనిస్టులు, కార్మికవర్గం తయారౌతోంది. ఒక నిశ్చితమైన రాజకీయ కార్యక్రమముపై ప్రజలనందరిని ఐక్యపర్చుటకు పార్టీ పూనుకొంటూంది. ఈ సమయంలో ప్రభుత్వం పార్టీని నిషేధించి, పెద్ద దెబ్బకొట్టింది.

కమ్యూనిస్టులు ఒక నిశ్చితమైన రాజకీయ కార్యక్రమముపై ప్రజలను సమీకరించడానికి కృషి చేస్తూ, యిందుకు కార్మికవర్గాన్ని రాజకీయంగా తర్ఫీదు జేయడానికి తీవ్ర కృషి ప్రారంభించారు. ఈ సమయంలోనే కార్మికోద్యమములోను, జాతీయ వుద్యమములోను కొన్ని మార్క్సిస్టు వ్యతిరేక పోకడలు, భావాలు బయలుదేరాయి. ఈ భావాలతోను, పోకడలతోను పనిజేసేవారుగూడ మార్క్సిస్టులమేనని చెప్పుకోవడం ప్రారంభించారు. కమ్యూనిస్టు పార్టీ బహిష్కరించబడడంవలన యిలా పనిజేసేవారికి యింకా హెచ్చు అవకాశాలుగల్గాయి. అయినప్పటికి కమ్యూనిస్టుపార్టీ రహస్యసాహిత్యంద్వారా మార్క్సిస్టు వ్యతిరేక పోకడలతో పోరాడి నిజమైన కార్మికపంథాను నిలబెట్టారు.

## కార్మికోద్యమములో బయలుదేరిన 'ఎకనామిష్టు' వాదనలతో కమ్యూనిష్టులు పోరాడుట

1928-29 సంవత్సరాల కార్మికోద్యమము నాటికన్నా 1933-34 కార్మికోద్యమము కార్మికుల్లో హెచ్చు రాజకీయ చైతన్యం కలుగజేసింది. ప్రభుత్వ నిర్బంధమునకు వ్యతిరేకంగాను యితర, రాజకీయ సమస్యలపై రాజకీయ ప్రదర్శనాలు జరుపడం, అప్పటి రాజకీయ సమస్యలపై తీవ్రచర్చలు జరుపడం, కార్మికులుగూడ రాజకీయరంగములో హెచ్చుగా పాల్గొనాలనేభావాలు కార్మికుల్లో వుదయించడం యివన్నీకార్మికులలో రాజకీయచైతన్యం అభివృద్ధి అవుతోందనే విషయాన్ని తెలియపర్చుతాయి. అంతేగాకుండా నూతన రాజ్యాంగ సంస్కరణలద్వారా (1935 ఇండియాచట్టం) జరుపబడే యెస్సెంబ్లీ యెన్నికలలో కార్మికులు యే వైఖరి అవలంబించవలసినదీ వగైరాసమస్యలపై తీవ్రచర్చలు చేయడం గూడ ప్రారంభించారు. ఈ పరిస్థితుల్లో రిఫార్మిస్టులుగూడ (బొంబాయిలో జమ్నదాస్ మెహ్తా; జాబ్‌వాలా) కార్మికుల్లో గల్గిన ఈ రాజకీయ చైతన్యాన్ని గుర్తించారు. కమ్యూనిస్టుల రాజకీయపలుకుబడి కార్మికుల్లో అధికమౌతోందనియు, దాన్ని నాశనం గావించకపోతే తమకు కార్మికుల్లో స్థానమే లేకుండా పోతుందని గూడ భయపడ్డారు. అందుకు వెనుకటి మాదిరిగా కార్మికులు రాజకీయాలతో సంబంధం యేమీ పెట్టుకోరాదనే వారి వాదనను మానుకున్నారు. ఒకకొత్తవాదనను లేవదీశారు. ఈ వాదన లేవదీయటానికికారణం అప్పుడు రానున్న అసెంబ్లీయెన్నికల్లో తమ పక్షఅభ్యర్థులకు హెచ్చు కార్మికుల ఓట్లను సంపాదించడంగూడాను. ఆవాదన యిది : బహిరంగంగా పనిచేసే ఒకరాజకీయ పార్టీని కార్మికులు యేర్పరచాలనియు, ఆపార్టీకార్మికుల రాజకీయ హక్కులను (యెన్నికల్లో కార్మిక ప్రతినిధులను గెలిపించడం వగైరా) కాపాడుటకు కృషిచేయాలనియు, వచ్చేయెన్నికల్లో కార్మికులు యే పంథా అనుసరించవలసినదీ ఆపార్టీనిర్ణయించాలనియు చెప్పడం మొదలెట్టారు. అట్టిపార్టీలేకపోయినచో బూర్జువా రాజకీయపార్టీలు (ముఖ్యంగా కాంగ్రెసు) కార్మిక అభ్యర్థులను ఎవరినీ నిలబెట్టదనియు, అందుచేత కార్మికులకు యెస్సెంబ్లీలలో సరియైన ప్రాతినిధ్యము వుండదనియు, ప్రచారం



చేశారు. 'వర్కర్సుపార్టీ' అనే బహిరంగ రాజకీయ (రిఫార్మిస్టుల "ఎలెక్షన్ పార్టీ") పార్టీనిస్థాపించాలని ప్రయత్నించారు. కాని బొంబాయి కార్మిక వర్గం సంస్కరణవాదులు వేసేయెత్తులు చాలవరకు గ్రహించగల చైతన్యముగలదగుట చేతవారి ప్రయత్నం నెరవేరలేదు. కార్మికవర్గం కమ్యూనిస్టుపార్టీయే తమ రాజకీయపార్టీ అని అనుభవముద్వారా తెలుసుకొనుటచేత, వారి ప్రయత్నాలు సఫలమవ్వలేదు.

బొంబాయిలో సంస్కరణ వాదులు గావించిన ప్రయత్నం నెగ్గకపోయినను, కార్మికవర్గ రాజకీయపార్టీలు అనిచెప్పుకొనే రెండు బహిరంగ రాజకీయపార్టీలు యీ కాలములోనే యేర్పడ్డాయి. అవి (1) బెంగాల్ లేబరుపార్టీ, దీని స్థాపకుడు దత్తముజుందారు. (2) కాంగ్రెసు సోషలిస్టుపార్టీ వీటిని గూర్చి వేరే వేరేఆలోచించుదాము.

## బెంగాల్ లేబరు పార్టీ

దత్తముజుందారు వాదన యిది :- "కమ్యూనిస్టుపార్టీ నేటి కర్తవ్యం రహస్యంగా పనిచేయుగల పార్టీగా తయారు అవడంగాదు; బహిరంగంగా పనిజేస్తూ అన్ని లీగల్ అవకాశాలను ఉపయోగించుకోగల పార్టీగా అది నిర్మింపబడాలి. నేడు కమ్యూనిస్టులు కమ్యూనిస్టుపార్టీని రహస్యంగా పనిజేయగలదిగా నిర్మించుటకు కృషిచేయడం పొరపాటు కమ్యూనిస్టుపార్టీ యిలా నిర్మింపబడితే బహిరంగంగా రాజకీయ ప్రచార, ఆందోళనలను సాగించడానికివున్న లీగల్ అవకాశాలను కమ్యూనిస్టులు పోగొట్టుకుంటారు. బూర్జువావర్గం ఆ అవకాశాలన్నిటిని ఉపయోగించుకొని దాని రాజకీయ ప్రభావాన్ని, పలుకుబడిని కార్మికుల్లో వ్యాపింపజేయడానికి గట్టి ప్రయత్నం చేస్తుంది; అలా జయప్రదం అవుతుంది గూడాను.

అందుచేత కార్మికులకు నేడు బహిరంగంగా పనిజేసే రాజకీయపార్టీ ఒకటి అవసరం. కార్మికవర్గ రాజకీయ పార్టీని నేడు బహిరంగంగా పనిచేయింపగల్గేటట్లు నిర్మించాలిగాని రహస్యంగా పనిజేసే పార్టీగా నిర్మించుటకు పూనుకోరాదు ఈ వుద్దేశ్యంతో "లేబరు పార్టీ"ని స్థాపించాలి.

అంతేగాకుండా రహస్యంగా పనిజేసే పార్టీ సభ్యులకు ప్రజాస్వామిక పద్ధతులు అలవడవు. కార్మికులు రాజకీయ రంగంలో పనిచేయడానికి సిద్ధమౌతున్నప్పుడు తదితర ప్రజాస్వామిక సంఘాలలో పనిజేయాల్సివస్తుంది. అందుకు యిప్పటినుండే కార్మికులను ప్రజాస్వామిక పద్ధతులలో తర్ఫీదు గావించాలి. ఇందుకు బహిరంగ రాజకీయపార్టీ వారికివుండడం అవసరం. ఈ పని రహస్యంగా పనిజేసే పార్టీలద్వారా జరుగదు. కాన "లేబరుపార్టీ"ని స్థాపించడానికి కార్మికులు వెంటనే తోడ్పడాలి." ఈ దృష్టితో దత్తముజుందారు బెంగాల్ లేబరు పార్టీని స్థాపించాడు దాని తరఫున "న్యూఫ్రంటు" (New front) అనే పత్రిక నొకదానిని ప్రకటించాడు. ఈ పార్టీని స్థాపించినప్పుడే భారతదేశ కమ్యూనిస్టు పార్టీ రహస్యంగానే పనిచేస్తున్నందులకు, కార్మికులలో బహిరంగ రాజకీయ ప్రచారంచేసే బహిరంగ రాజకీయ పార్టీని యేర్పరచనందులకు ఒక కరపత్రంలో విమర్శించాడు కూడాను.

దత్తముజుందారు వాదనగూర్చి పరిశీలించుదాం కమ్యూనిస్టు పార్టీ అప్పటికే బహిష్కరించబడింది, బలిష్ఠమైన రహస్యయంత్రం లేకపోతే కమ్యూనిస్టుపార్టీ పార్టీగా పనిజేసే అవకాశాలు లప్ప

టికే పోయాయి. కమ్యూనిస్టుపార్టీ బహిరంగంగాపని జేసే అవకాశాలున్నచోట్లగూడ కమ్యూనిస్టు పార్టీలు రహస్యంగా పనిజేయడానికి తయారైనప్పుడే పార్టీనిరాటంకంగా పనిజేయగల్గుతుంది. ఈవిషయాన్ని కామ్రేడ్ డెమిట్రాఫ్ 7 వ అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ మహాసభలో స్పష్టీకరించాడు. ఫేసిస్టుపరిపాలనవున్న జర్మనీ లాంటి దేశాలలోనేగాక ఫ్రాన్సులాంటి ప్రజాస్వామిక దేశాల్లోగూడ కమ్యూనిస్టుపార్టీలు రహస్యంగా పనిజేసేయంత్రాన్ని తయారుజేసుకోవాలనియు, ఆకస్మికంగా యుద్ధం వస్తే కమ్యూనిస్టుపార్టీలు చాలభాగం రహస్యంగా పనిజేయాల్సి వస్తుందనియు, అందుకు యిప్పటినుండి సిద్ధంగావాలనియు హెచ్చరించాడు. అందుచేత కమ్యూనిస్టుపార్టీ రహస్యంగా పనిజేయడము మానివేయడం అనేది పార్టీని ఆత్మహత్యచేయడం అవుతుంది. దీనినే "లిక్విడేషనిజమ్" అని రష్యన్ బోల్షివిక్‌లు అన్నారు. పార్టీరహస్యంగా పనిజేయాల్సిన అవసరాన్ని మర్చిపోరాదు. పార్టీ రహస్య బహిరంగ కార్యకలాపాలను సమన్వయంచేసుకోగల పార్టీ నిర్మాణమును తయారు జేసుకోవడమే కమ్యూనిస్టుల నిర్మాణ కర్తవ్యం అయివుంది. బహిరంగ ప్రచారమును మానివేయడం, దాన్ని గూర్చి అట్టేలెక్కచేయకపోవడం రహస్యపార్టీ యంత్రాన్ని నిర్మించడానికి నిరాకరించడం యెంత ప్రమాదమో అంతేప్రమాదం. పార్టీ, పార్టీపలుకుబడిక్రిందవున్న ప్రజాసంస్థల, తదితర ప్రజాసంస్థల ద్వారా బహిరంగ ప్రచారాన్ని సాగించుతూ వుండాలి. ప్రజలతో సన్నిహితసంబంధం ప్రజాసంఘాల ద్వారా పెట్టుకుని పనిజేస్తూవుండాలి. ఈ పనంతా అవిచ్ఛిన్నంగా సాగడం, ప్రభుత్వనిర్బంధాన్ని యెదుర్కొని జయప్రదంగా పార్టీపనిజేయడం వివిధరంగాల్లో పనిజేసే పార్టీకేడర్లను తయారుచేసి తర్ఫీతు యివ్వడం పార్టీ రహస్యయంత్రం, నిర్మాణయంత్రం వుంటేనే సాధ్యమౌతాయి. ఈ ముఖ్య విషయం మర్చిపోతే పార్టీనిర్మాణమే లేదు.

దత్తు ముజుందారు యీ ముఖ్యవిషయాన్ని మర్చిపోయి కమ్యూనిస్టుపార్టీ రహస్యంగా పని జేయ నవసరంలేదని అంటున్నాడు. బహిరంగంగా పనిచేయగల పార్టీగానే నిర్మించాలంటున్నాడు. అట్టి పార్టీ కార్మికవర్గ రాజకీయపార్టీగా, మార్క్సిస్టు పార్టీగామాత్రం పనిచేయజాలదు. బూర్జువా వర్గం పెట్టిన లీగల్ హద్దులలో పనిజేయ సమకట్టిన పార్టీ బూర్జువావర్గమును తొలగించి, సోషలిజమును, కార్మిక నియంతృత్వమును యెన్నటికి స్థాపించజాలదు. బూర్జువావర్గ రాజకీయ ప్రచార, ఆందోళన హద్దులను దాటి పనిజేయజాలదు.

దత్తు ముజుందారు అప్పుడే యింగ్లండునుంచి వచ్చాడు. అచ్చట బ్రిటిష్ కమ్యూనిస్టు పార్టీ తరపున కొందరి విద్యార్థులలో పనిజేశాడు. "మార్క్సిజము"ను అంగీకరిస్తున్నట్లు చెప్పుకొనుచున్నాడు. బొంబాయిలో జమ్నదాస్‌మెహ్తా, జాబ్‌వాలాలు మాదిరిగా కార్మికవర్గంలో సంస్కరణవాదిగా పరిగణింపబడలేదు. "రిఫార్మిస్టు"గా యిదివరలో పనిజేశాడనే నింద అతనిపైలేదు. పైగా బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ సభ్యుడుగా యింగ్లండులో పనిచేసినట్లుగూడ ప్రచారం చేసుకున్నాడు. దీనికి తోడు మరియొక ముఖ్య కారణంగూడ వుంది బొంబాయిలో కమ్యూనిస్టుపార్టీ బలకరముగా యున్నట్లుగా బెంగాల్‌లో లేదు; ఇచ్చట కార్మికుల్లో కమ్యూనిస్టుల పలుకుబడి అంతగాలేదు. ఈ సమయములోనే కమ్యూనిస్టుపార్టీ బహిష్కరించబడడంవలన బహిరంగంగా పనిజేసే అవకాశం బెంగాల్ కమ్యూనిస్టులకు తగ్గింది. బెంగాల్ "లేబరుపార్టీ" గ్రూపే నిజమైన కమ్యూనిస్టుగ్రూపు అని కార్మికుల్లో ప్రచారం సాగింది. కలకత్తా ఓడరేవు కార్మికుల్లో ప్రవేశించి, కొంత పలుకుబడిగూడ లేబరు



పార్టీగ్రూపు సంపాదించింది. అఖిలపార్టీ లేబరుపార్టీ యేర్పరచవలెనని దత్తుముజుందారు ప్రయత్నించినను ఆ ప్రయత్నం కొనసాగలేదు. అందుచేత లేబరుపార్టీ బెంగాల్‌లోనే యేర్పడింది.

ఈ పార్టీకి వ్యతిరేకంగా బెంగాల్ కమ్యూనిస్టు గ్రూపు 1934 - 35 సంవత్సరాలమధ్య కార్మికుల్లో ప్రచారముచేశారు. బెంగాల్ లేబరు పార్టీ మార్క్సిస్టు వ్యతిరేక సిద్ధాంతాలగూర్చి సిద్ధాంత పోరాటం చేయుటచే కార్మికవర్గ మిలిటెంట్సును అటువైపుకు పోకుండా చేయగల్గారు. కాని అసలు కార్మికుల్లో లేబరుపార్టీకి యేవిధమైన స్థానంలేకుండా చేయజాలకపోయారు. దీనికి కారణం కార్మికులందరితోను కమ్యూనిస్టులకు యింకా సంబంధాలు యేర్పడకపోవడమే.

## కాంగ్రెసు సోషలిస్టుపార్టీ

బహిరంగ కార్మికవర్గరాజకీయపార్టీలను స్థాపించాలనే నినాదముతో "ఆర్థిక తత్వమును" కార్మికుల్లో ప్రవేశపెట్టుటకు సంస్కరణవాదులు, దత్తుముజుందారు గావించిన ప్రయత్నాలు చూచాము. ఈ కాలములో యిలాంటి "రిఫార్మిస్టు" పోకడే జాతీయోద్యమములో మార్క్సిస్టు బురఖాతో బయలు దేరింది. కాంగ్రెసు సోషలిస్టుపార్టీ నాయకత్వము పైపోకడను కాంగ్రెసు వర్కర్లలో ప్రచారంగావించింది. జాతీయోద్యమములో పాల్గొని అనుభవముద్వారా జాతీయబూర్జువా పోరాటపద్ధతులతో పూర్తిగా అసంతృప్తిచెంది, సోషలిజంవైపుకు, కార్మికపంథావైపుకు మరలుచున్న విప్లవ యువకులలో యీ తప్పుడుపోకడ వ్యాపింప జేయబడినది. ఈ సంస్కరణవాద పోకడలతోగూడ కమ్యూనిస్టులు యెలాయెదుర్కొని నిజమైన కార్మికవర్గరాజకీయపార్టీ కమ్యూనిస్టుపార్టీయే అని ప్రచారముగావించారో క్లుప్తంగా తెలుసుకుందాము.

1930-33 సంవత్సరాలల్లో జరుపబడ్డ శాసనోల్లంఘనములో పాల్గొనిజైళ్లకువెళ్ళిన కాంగ్రెసు వర్కర్లకు జైళ్ళలో మార్క్సిజముగూర్చి అధ్యయన తరగతులు జరుపబడ్డాయి. గాంధీతత్వము, కాంగ్రెసు నాయకత్వము యెలా స్వాతంత్ర్యవుద్యమాన్ని అభివృద్ధిగానీయకుండా అడ్డుపడుచున్నాయో గాంధీతత్వము, గాంధిపోరాట పద్ధతు లన్నా మార్క్సిజము, కార్మికవర్గ పోరాటపద్ధతులు యెలా వుత్తమమైనవో ఈ అధ్యయనతరగతులద్వారా జైళ్లలోని కాంగ్రెసు వర్కర్లు తెలుసుకోగల్గారు. అధ్యయన తరగతులలో చెప్పిన సిద్ధాంతములకు, జాతీయోద్యమములో పాల్గొనగల్గిన అనుభవమునకు సరిపోయింది అందుచేత గాంధీతత్వముఅంటే అసంతృప్తిగల్గి మార్క్సిజమువైపుకు ఆకర్షింపబడ్డారు. ఇంకా దాన్నిగూర్చి పూర్తిగా అధ్యయనము చేయాలని, జైళ్ళనుండి బయటకు వెళ్లగానే కార్మికుల్లోను, రైతుల్లోను కార్మిక పోరాట పద్ధతులద్వారా పనిజేయాలని అభిలాషగల్గింది.

అప్పటికే కార్మికవర్గములో తగినంత పలుకుబడిగల్గి జాతీయ రంగములోగూడ చురుకుగా పనిచేయుటకు తయారగుచున్న కమ్యూనిస్టుపార్టీ యేర్పడివుంది. జైళ్ళనుండి బయటకు వస్తున్న విప్లవ యువకులతో కమ్యూనిస్టులకు సంబంధం యేర్పడుతోంది. కాని యింకా కమ్యూనిస్టు పార్టీ, అ. భా. పార్టీకేంద్రము యేర్పరచుకొని పార్టీ పత్రికను స్థాపించి, దేశమంతటా నిర్మాణయుక్తంగా పనిజేయగల స్థితిలో లేకపోవుటవలన వీరందరికి సరియైన రాజకీయ శిక్షణయిచ్చి, పార్టీలోనికి గొని రాలేకపోయింది. ఈ పరిస్థితులలోనే కాంగ్రెసు సోషలిస్టుపార్టీ యేర్పడింది.

కమ్యూనిస్టుపార్టీవైపుకు, కార్మికవర్గమువైపుకు మరలుచున్నట్టి, అస్పష్టమైన సోషలిస్టు భావాలుగల యీ జాతీయ యువకుల మధ్య కాంగ్రెసు సోషలిస్టుపార్టీ సరియైన మార్క్సిజమును ప్రచారముగావించక మార్క్సిస్టు సిద్ధాంత వ్యతిరేకమైన ప్రచారం గావించింది. అంతేగాకుండా కమ్యూనిస్టు పార్టీపై వ్యతిరేక ప్రచారం గావించింది. కమ్యూనిజమువైపుకు సహజంగా మరలుచున్న జాతీయ యువకులను, కార్మికవర్గం, కమ్యూనిజంలవైపుకు పోనీయకుండా కాంగ్రెసు సోషలిస్టుపార్టీ నాయకత్వము పెద్ద అడ్డంకుగా పనిజేసింది. జాతీయ బూర్జువా పంథాయెడల విముఖత్వం చెంది కార్మికవర్గ రాజకీయ పంథావైపుకు జాతీయ పోరాటశక్తులు ఆకర్షింపబడ్డప్పుడే కార్మికోద్యమమునకు, జాతీయోద్యమమునకు, కమ్యూనిస్టుపార్టీ పలుకుబడిక్రింద, సమన్వయము యేర్పడుతుంది; అప్పుడే జాతీయోద్యమముపై కార్మికవర్గ రాజకీయ నాయకత్వం స్థాపించుట కవకాశమేర్పడుతుంది. ఈ విధంగా జరగకుండా, జాతీయ బూర్జువావర్గ నాయకత్వం అనేక విధాల ప్రయత్నిస్తుంది. కాంగ్రెసు సోషలిస్టుపార్టీ నాయకత్వముగూడ సోషలిస్టు పదజాలముతో పై బూర్జువావర్గ పాత్రనే సాగించింది. ఇందుచేతనే కాంగ్రెసు సోషలిస్టుపార్టీ 1934 లో యేర్పడ్డప్పుడు ఆర్. పామీదత్తు "కాంగ్రెసు సోషలిజము అనే పదమే పరస్పర విరుద్ధమైనదనియు, కాంగ్రెసు సోషలిస్టుపార్టీ నాయకత్వము బూర్జువావర్గ పాత్రనే నిర్వహించుతోందనియు" తెలియపర్చాడు.

ఆ పాత్రయిది :—కార్మికోద్యమమునకు, జాతీయోద్యమమునకు సహజంగా యేర్పడుచున్న కలయికను రానీయకుండా అడ్డుపడింది; గాంధితత్వముతో విముఖత్వముచెంది కార్మికవర్గ రాజకీయ సిద్ధాంతమైన కమ్యూనిజము, మార్క్సిజమువైపుకు మరలుతున్న జాతీయయువకులను పెడమార్గాన పెట్టింది. కాంగ్రెసు సోషలిస్టు నాయకులు వుద్దేశ్యపూర్వకంగా యీ పనిని చేశారా లేదా అన్నది ముఖ్యమైన విషయంగాదు. కాంగ్రెసు సోషలిస్టుపార్టీ నాయకత్వం ప్రత్యేక సోషలిస్టుపార్టీని యేర్పరచడంద్వారా గల్గిన ఫలితం అది. సోషలిజంవైపుకు మరలుచున్న జాతీయ విప్లవ యువకులపై జాతీయ బూర్జువావర్గ పలుకుబడి పూర్తిగాపోకుండా కాంగ్రెసు సోషలిస్టుపార్టీ నాయకత్వం అడ్డుపడింది. కాంగ్రెసు సోషలిస్టుపార్టీ యేర్పడకుంటే వున్నట్టయిన వారందరూ నేరుగా కమ్యూనిస్టుపార్టీలోనికి వచ్చియుండెడివారు; ప్రారంభమునుండి సరియైన మార్క్సిస్టు తర్ఫీదు పొందేవారు.

కాంగ్రెసు సోషలిస్టుపార్టీలోనున్న సంస్కరణ వాదపోకడయేమి ? కమ్యూనిస్టుపార్టీపలుకుబడి క్రిందకు వస్తున్న యువకులను బూర్జువావర్గపలుకుబడిలోనేవుంచుటకు కార్మికవర్గమువైపుకు మరలకుండావుంచుటకు సోషలిస్టుపార్టీ స్థాపనతోద్దేశించింది. నిజమైన సోషలిస్టుపార్టీ కార్మిక వర్గముపై ఆధారపడకుండా బూర్జువావర్గంపై ఆధారపడకాలదు. అట్టిపార్టీసోషలిస్టులలో చీలికలు కలుగజేయడానికి కార్మికోద్యమమును, బూర్జువావర్గమునకు అనుబంధంగా వుంచుటకు మాత్రమే వుపయోగపడుతుంది. కార్మికోద్యమమును మార్క్సిస్టు, లెనినిస్టు పంథాను నడుపుటకు, కార్మికవర్గరాజకీయ పార్టీయైన కమ్యూనిస్టు పార్టీని అభివృద్ధిచేయుటకు తోడ్పడజాలదు. ఇదే కాంగ్రెసు సోషలిస్టుపార్టీలోవున్న సంస్కరణవాదపోకడ. బూర్జువావర్గ రాజకీయనాయకత్వమునకు ప్రత్యామ్నాయంగా కార్మికవర్గ రాజకీయ నాయకత్వాన్ని అభివృద్ధిగానీయకుండా యీ సంస్కరణవాద పోకడ అడ్డుపడుతోంది. కమ్యూనిస్టు పార్టీవైపుకు, కార్మికవర్గంవైపుకు మరలుచున్న జాతీయ యువకులను యెలా కమ్యూనిస్టు పార్టీవైపుకు పోనీయకుండా అడ్డుపడిందో, యెలా వారిలో సంస్కరణవాదం, అర్థికతత్వం కలుగజేయడానికి పనిజేసిందో చూద్దాం.



కమ్యూనిస్టుపార్టీ సిద్ధాంతములను విమర్శించుటద్వారా కాంగ్రెసు సోషలిస్టుపార్టీ నాయకత్వము తననిజస్వరూపము (మెన్షివిజము, అర్థికత్వము)ను బట్టబయలు చేసుకుంది. కమ్యూనిస్టుపార్టీనిగూర్చి రెండువిధాలుగా కాంగ్రెసు సోషలిస్టునాయకులు విమర్శించారు. 1. కాంగ్రెసునాయకత్వమును విమర్శిస్తూ వుండడంవలననూ, కాంగ్రెసులోను, జాతీయోద్యమములోను చేరకుండా వుండడమువలననూ కమ్యూనిస్టులు జాతీయరంగాన్నుండి విడబడిపోయారు. ఈతప్పును సవరించడానికిగాను సోషలిస్టులు కాంగ్రెసులోనే ఒక పార్టీని యేర్పరచాలి కాంగ్రెసు నాయకత్వము సోషలిస్టు కార్యక్రమము ప్రకారం పనిజేయునట్లు కాంగ్రెసుద్వారా ఆందోళన గావించాలి; కాంగ్రెసులో ఒక భాగంగా సోషలిస్టుపార్టీని యేర్పరచినప్పుడే యీ పని చేయగల్గుతాము. కాంగ్రెసు బైటనుండి కాంగ్రెసునాయకత్వమును విమర్శించుటద్వారా యీపని జేయలేము. కాంగ్రెసులో పనిజేస్తూ కాంగ్రెసు నాయకత్వముపై వత్తిడి కలుగజేసినచో కాంగ్రెసునాయకత్వము ప్రజా సామాన్య కోర్కెల ప్రకారం పనిజేయుట కవకాశముంటుంది. కమ్యూనిస్టులు జాతీయోద్యమములో పాల్గొనకపోవడంవలన సోషలిస్టు వుద్యమానికి గల్గినహాని కాంగ్రెసులో సోషలిస్టుపార్టీని యేర్పరుచుటద్వారానే తొలగించగల్గుతాము.

(2) జాతీయోద్యమముపై రాజకీయ నాయకత్వము బూర్జువావర్గమునకే వదిలివేయాలని, బూర్జువావర్గ రాజకీయ నాయకత్వమును అనుసరించిపోయేటట్లు మాత్రమే కార్మికవర్గమును రాజకీయంగా తయారుచేయాలనియు, కాంగ్రెసు సోషలిస్టుల నాయకత్వపు రెండవ విమర్శ సారాంశము : పోరాట సమయంలో సహజంగా బూర్జువావర్గ నాయకత్వము అవలంబించే గమనాన్ని కొంచెము తీవ్రపర్చడం, జాతీయ బూర్జువావర్గము ఆసాంతంవరకు పోరాటమును విడిచిపెట్టిపోకుండా పోరాడుటకు ఆందోళనచేస్తూ వుండడం-యివిమాత్రమే కార్మికవర్గ రాజకీయ బాధ్యతలుగా వుండాలి. ఈ దృష్టిలోనే బూర్జువా నాయకత్వమును విమర్శించాలిగాని, పోరాటంపైన, వుద్యమంపైనా దాని రాజకీయ ప్రభావాన్ని పలుకుబడిని క్షీణింపజేయడానికి, దానిస్థానే కార్మికవర్గ రాజకీయ పలుకుబడిని స్థాపించుటకు ప్రయత్నముచేయడం హానికరం; అలాజేస్తే జాతీయపోరాటమే బలహీనపడుతుందని వాదించారు. పైరెండు విమర్శలుకలపి పరిశీలించిన కాంగ్రెసు సోషలిస్టుపార్టీ నాయకుల "అర్థికతత్వం" మెన్షివిక్ పోకడ బోధపడుతుంది.

కాంగ్రెసు సోషలిస్టు నాయకత్వపు పై పంథాను కమ్యూనిస్టులు ప్రారంభంనుండీ విమర్శించారు నిజమైన మార్క్సిస్టు, లెనినిస్టు సిద్ధాంతాలను, కార్మికవర్గ పంథాను ప్రచారంచేశారు. కాని కమ్యూనిస్టుపార్టీ అప్పట్లో బలిష్టమైన అ. భా. పార్టీ కేంద్రాన్ని యేర్పరచి దేశవ్యాపిత ప్రచారమును గావించే స్థితిలో లేకపోవడంవలన, కాంగ్రెసు సోషలిస్టు నాయకులకు కమ్యూనిస్టు నాయకులకంటే అనేకరెట్లు బహిరంగంగా పనిజేసే అవకాశములుండుటచేతనూ కాంగ్రెసు సోషలిస్టుపార్టీ యేర్పడింది. అస్పష్టమైన మార్క్సిస్టు భావాలుగల్గి కమ్యూనిస్టుపార్టీవైపుకు మరలుచున్న జాతీయ విప్లవశక్తులు అన్నిటినికూడదీయుటకు కాంగ్రెసు సోషలిస్టుపార్టీ ఒక కేంద్రమైనది. అందుచేత దాని నాయకత్వము ప్రారంభమునుండి 'మెన్షివిక్ నాయకత్వము' అయిననూ, దానిలోచేరిన విప్లవ జాతీయశక్తులను నిజమైన సోషలిస్టులుగా మార్చుటకు, మెన్షివిక్‌భావాలు వారిలో కలుగకుండా చేయుటకుగాను, కాంగ్రెసు సోషలిస్టుపార్టీలో కమ్యూనిస్టులు చేరారు కమ్యూనిస్టుపార్టీ రాజకీయ బహిరంగవేదికగా పనిజేయించడానికి, అందులోజేరిన సభ్యులందరికి నిజమైన మార్క్సిస్టు సిద్ధాంత జ్ఞానాన్ని కలుగజేయడానికి కమ్యూనిస్టులు కృషిజేశారు. కాంగ్రెసు సోషలిస్టుపార్టీ నాయకులు సోవియట్ యూనియన్, కమ్యూ

నిస్టు అంతర్జాతీయ మహాసభగూర్చి గావించే మార్క్సిస్టు వ్యతిరేక ప్రచారాన్ని యెదుర్కొంటూ నిజమైన కార్మికఅంతర్జాతీయ తత్వాన్ని ప్రచారంజేశారు. కాంగ్రెసు సోషలిస్టు నాయకత్వముతోగూడ ఒక నిర్ణీతమైన కార్యక్రమముపై పనిజేయుటకు (విమర్శనా హక్కు విడనాడకుండానే, పార్టీ స్వతంత్ర తను నిలబెట్టుకొంటూనే, కృషిచేశారు. ఈ కాలంలోనే బొంబాయిలో కమ్యూనిస్టుగ్రూపు, అచ్చటి కాంగ్రెసు సోషలిస్టుపార్టీ కలసి నూతన రాజ్యాంగమునకు వ్యతిరేకముగా రాజకీయ ప్రదర్శనములు జరిపాయి. ఇలాగే యితర ప్రాంతములలోగూడ కలసి పనిజేయుటకు కమ్యూనిస్టులు కృషిచేశారు. ఇలా చేయకపోయినయెడల కాంగ్రెసు సోషలిస్టుపార్టీలోచేరిన జాతీయ విప్లవశక్తులన్నీ మెన్షివిక్ పంథా' అనుసరించే కాంగ్రెసు సోషలిస్టుపార్టీ నాయకత్వపు బలుకుబడిలోనే వుండిపోయేవారు.

ఈ విధంగా కార్మిక వుద్యమములోను, జాతీయరంగంలోను కార్మికవర్గ బహిరంగ రాజకీయ పార్టీలను యేర్పరచాలనే తప్పుడుపోకలతో కమ్యూనిస్టులు పోరాడారు. కార్మికవర్గం రాజకీయాల్లో ప్రవేశించి కాంగ్రెసు నాయకుల బూర్జువావర్గ పంథాను విమర్శిస్తూ వారినిజ పాత్రను బట్టబయలుచేస్తూ, జాతీయోద్యమముపై కార్మికవర్గం తన రాజకీయ పలుకుబడిని, నాయకత్వాన్ని స్థాపించుటకు ప్రయత్నించడంవలననే జాతీయోద్యమము బలహీనపడిపోతుందనే "మెన్షివిక్" వాదనను ఖండించుతూ వచ్చారు. పై వాదననే గావించుతూ కాంగ్రెసు సోషలిస్టు నాయకత్వము చేస్తున్న ప్రచారమును కమ్యూనిస్టులు యెదుర్కొని కమ్యూనిస్టుపార్టీ యెలా ఒకటే నిజమైన కార్మికవర్గ రాజకీయపార్టీయో, అది రహస్యంగా పనిజేసే పార్టీగానే యెందుకు వుండాలో, కమ్యూనిస్టుపార్టీ కార్మికవర్గంపై ప్రధానంగా ఆధారపడి మార్క్సిస్టు, లెనినిస్టు ఐడియాలజీతో పనిజేసే పార్టీగానే వుండాల్సిన ఆవశ్యకత గూర్చి స్పష్టపర్చారు. కార్మికవర్గ రాజకీయపార్టీ స్వతంత్ర రాజకీయ పంథాను అనుసరిస్తూ కేవలం కార్మికవర్గ దృక్పధముతోను; రహస్యపార్టీగాను పనిచేస్తూ కార్మికవర్గమున కనుగుణ్యమైన పోరాట పద్ధతులు, నిర్మాణపద్ధతులు యెలా అవలంబించవలసిందీ తెలియపర్చారు. నిజమైన మార్క్సిస్టుపార్టీని యేర్పరచుటకు కాంగ్రెసు సోషలిస్టుల పంథాగాని, బెంగాల్ లేబర్‌పార్టీ పంథాగాని యెలా పనికిరాదో స్పష్టపర్చారు. కాంగ్రెసు సోషలిస్టులు, దత్తముజుందారు, రిఫార్మిస్టు'లైన జమ్నదాస్‌మెహ్తా వగయిరాలు కార్మికవర్గ రాజకీయపార్టీలను యేర్పరచడానికి అవలంబించిన మార్క్సిస్టు వ్యతిరేక పంథాలను బట్టబయలుచేశారు.

## వివిధప్రాంతాల్లో పార్టీ కార్యకలాపాలు

1931 వ సంవత్సరంలో వచ్చిన నేతపరిశ్రమకార్మికుల సార్వజనికసమ్మెతో 1933 వ సంవత్సరాంతములో యేర్పడ్డ పార్టీకేంద్రము చెల్లాచెదరైపోయినదని యిదివరలో చెప్పబడింది దానితరువాత 1934 వ సంవత్సరాంతములో మరల అ. భా. పార్టీ కేంద్రాన్ని స్థాపించడానికి ఒక ప్రయత్నం చేయబడింది. ఒక ముఖ్యపార్టీనాయకుడు రహస్యంగాపనిజేయడానికి, రాష్ట్రగ్రూపులతో రహస్య 'కాంటాక్టులు' (సంబంధాలు) యేర్పరచడానికి ప్రయత్నించారు. కాని ప్రభుత్వ నిర్బంధమువలన (సమ్మెల సందర్భంలో) రాష్ట్రగ్రూపులలోని ముఖ్యులు అరెస్టు గావడంవలన యీ ప్రయత్నం ఫలించలేదు.

1935 వ సంవత్సరంలో వెనుకచేసిన ప్రయత్నాలకంటె హెచ్చు నిర్మాణయుక్తంగా, పార్టీ రహస్యకేంద్రాన్ని యేర్పరుచుటకు మరొక ప్రయత్నం జరిగింది. ముఖ్యపార్టీనాయకులు కొందరు



రహస్యంగా పనిజేయుట ప్రారంభించారు. రహస్య సాహిత్యోత్పత్తి చేయడానికి యేర్పాట్లుగూడా గావించబడ్డాయి. కాని యీ పర్యాయముగూడ ప్రభుత్వనిర్బంధమునకు గురికావలసివచ్చినది. పార్టీకి ఆర్థికంగాను, టెక్నికల్‌గాను పెద్దనష్టంగూడా సంభవించినది.

పార్టీ రహస్యకేంద్రములేనిదే పార్టీనిర్మాణ ప్రయత్నాలు కొంచమైనా సాగవనే అభిప్రాయము అనుభవంద్వారా నాయకులు బాగా గ్రహించారు. అయినప్పటికిని 1936 వ సంవత్సరంవరకు పార్టీ రహస్యకేంద్రం యేర్పరచజాలకపోయారు. పార్టీనిర్మాణము ముందుకు సాగలేదు.

పార్టీ, యంగ్ కమ్యూనిస్టులీగ్, రెడ్‌ఫ్లాగ్ కార్మికసంఘాలు వగైరా బొంబాయిలో నిషేధించబడ్డతరువాత బొంబాయి గ్రూపుకు బహిరంగంగా పనిజేసే అవకాశాలు పూర్తిగా తొలగిపోయాయి; రహస్యంగా యెలా పనిజేయాలో, యింక యితర బహిరంగంగా పనిజేసే పద్ధతులు యెలా అనుసరించాలో తెలియక గందరగోళములో పడిపోయారు. అదిగాక, 1934 సార్వజనిక సమ్మెతో పార్టీ ముఖ్యులందరూ జైళ్ళకంపబడ్డారు. అందుచేత 1934 నుండి 1935 ఆఖరువరకు బొంబాయి గ్రూపు పార్టీని నిర్మించడానికి హెచ్చు ప్రయత్నాలు జరుపలేదు. పార్టీ 'యునైటెడ్ ఫ్రంటు' యెత్తులను అనుసరించి కార్మికోద్యమములో మాత్రం పని ప్రారంభమైంది. పార్టీ నిర్మాణము మాత్రం అభివృద్ధి గాలేదు.

దత్తముజుందారు 'లేబరుపార్టీ' స్థాపించడంతో బెంగాల్‌లో పార్టీపని మరింత కష్టమయింది. పార్టీ బలిష్టము గాలేకపోవడంవలన ముఖ్యంగా కార్మికుల్లో (బొంబాయిలోవలె) హెచ్చు పలుకుబడి, స్థానం సంపాదించకపోవడంవలన దత్తముజుందారు "లేబరుపార్టీ" స్థాపనద్వారా కలుగజేసిన గందరగోళమును పార్టీ తట్టుకోవడంతోనే సరిపోయింది. ఈ పనిగూడ జయప్రదంగా సాగించలేకపోయినది. 'లేబరుపార్టీ' కలకత్తా ఓడరేవు కార్మికులమధ్య స్థానం సంపాదించగల్గింది. ఇంకా కొంతమంది కార్మికులనుండి కొందరు మిలిటెంట్లను తయారుచేయగల్గింది. దీనితో 'లేబరుపార్టీ' బెంగాల్ పార్టీకి పెద్ద సమస్య అయిపోయింది. దానికి వ్యతిరేకంగా సిద్ధాంత పోరాటము సాగించడము మాత్రమే బెంగాల్ పార్టీ చేయగల్గింది. కార్మికులలో పార్టీని వ్యాపింపజేయడంగాని, యిదివరకు సమ్మెలద్వారా పార్టీ పలుకుబడిలోనికి వచ్చిన కార్మికవర్గ మిలిటెంటు వర్కర్లను పార్టీ సభ్యులుగా తయారుచేయుటగాని, జరుగలేదు. అందుచేత పార్టీ నిర్మాణము యేమీ ముందుకుసాగలేదు.

ఇంక యితర రాష్ట్రాలలో పార్టీ గ్రూపులు అధ్యయన తరగతుల అవస్థలోనే యుండుటచేత పార్టీ నిర్మాణ ప్రయత్నాలు అంత యెక్కువగా జరుగలేదు; తమిళనాడు, ఆంధ్ర, మలబారు రాష్ట్రాలల్లో కాంగ్రెసు సోషలిస్టు పార్టీలు యేర్పడ్డాయి. ఈ పార్టీలను ప్రారంభమునుండి మార్క్సిస్టు, లెనినిస్టు పంథాను నడుపుటకు పార్టీ ప్రయత్నంచేసింది. ప్రారంభమునుండి యీ పార్టీలు కమ్యూనిస్టు పలుకుబడిలోనే వుండిపోయాయి.

### పార్టీ నిర్మాణ ప్రయత్నాల ఫలితాలు

(1) భారత దేశములోని కమ్యూనిస్టు గ్రూపులన్నిటిలో ముఖ్యమైన బొంబాయి గ్రూపులో 1932 - 33 మధ్య గల్గిన చీలికలను రద్దుగావించి సంపూర్ణమైన ఐక్యత యేర్పర్చడంవలన అఖిల భారత పార్టీ కేంద్రాన్ని యేర్పరచుటకు అవకాశాలేర్పడ్డాయి. తాత్కాలికంగా ఒక కేంద్ర కమిటీ గూడ యేర్పడింది.

(2) 'యునైటెడ్' ఫ్రంట్ యెత్తులతో తీవ్రమైన ప్రజాపుద్యమాన్ని నిర్మించడానికి అవకాశాలేర్పరచేందుకు అత్యవసరమైన కార్మికోద్యమ ఐక్యతను సాధించగల్గాం. మన పార్టీ తీవ్ర కృషి, చొరవవలననే యీ ఐక్యత యేర్పడింది. 1935 వ సంవత్సరములో అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులోను, గిర్నికంగారు యూనియన్‌లోనుగూడ పూర్వపు చీలికలుతొలగి ఐక్యత యేర్పడింది. భారతదేశ కార్మికోద్యమములో యీ రెండు సంస్థలు ప్రధాన భాగాలు. ఈ ఐక్యత యేర్పడుటకు, కార్మికోద్యమము అభివృద్ధి పొందుటకు అడ్డంకులుగావున్న సంస్కరణవాదుల పలుకుబడి కార్మికుల్లో క్షీణించుతోంది.

(3) కార్మికవర్గ రాజకీయపార్టీని బహిరంగంగా స్థాపించాలనే నెపముతో కార్మికోద్యమములో ప్రవేశపెట్టుచున్న మార్క్సిస్టు వ్యతిరేకపోకడలైన 'ఎరనామిజము', 'మెన్షివిజము' లను ప్రచారం గావించుచున్న బెంగాల్ లేబర్‌పార్టీ, కాంగ్రెసు సోషలిస్టుపార్టీ నాయకులతో కమ్యూనిస్టులు సిద్ధాంత పోరాటమును సాగించుచూ కార్మికవర్గ రాజకీయపార్టీ యెలా వుండాలో, కార్మికవర్గం దాని రాజకీయ పాత్రను యెలా నిర్వహించాలో స్పష్టముగా ప్రచారంచేశారు. కార్మికోద్యమములోను, సోషలిస్టు వుద్యమములోను ఐక్యత యేర్పరచడమంటే కార్మికవర్గం తన స్వతంత్ర రాజకీయపంథాను, పార్టీని వదలుకొని లీగల్‌పార్టీలను స్థాపించడంగాదనియు, బూర్జువావర్గ రాజకీయసిద్ధాంతాలకు తలయొగ్గడం గాదనియు తెలియపర్చారు. కమ్యూనిస్టుపార్టీ రహస్యంగాను, స్వతంత్రంగాను పనిజేస్తూ వున్నప్పుడే కార్మికవర్గమును రాజకీయంగా మార్క్సిస్టు దృక్పథములో తర్ఫీదుజేయ గల్గుతుందని స్పష్టపర్చారు. అలా తర్ఫీతుచేయడానికి తీవ్రకృషి గావించారు.

కాంగ్రెసు సోషలిస్టుపార్టీ నాయకులతోను, లేబరుపార్టీతోను సిద్ధాంతరీత్యా కమ్యూనిస్టులు పోరాడుచున్నప్పటికిని, అవి సోషలిస్టు భావాలుగల నిజమైన జాతీయ విప్లవశక్తులతో కూడియుండుట చేత, వాటితోకలసి, రోజువారీ రాజకీయ, ప్రజాకార్యములపైకి స్థానిక కాంగ్రెసుసోషలిస్టు, లేబరు పార్టీల గ్రూపులతో ఒడంబడికలు చేసుకుంటూ కమ్యూనిస్టులు పనిజేస్తున్నారు.

(4) ఈకాలములో పై ఫలితాలను గడించిననూ పార్టీ బలహీనత అలాగేవుంది; పార్టీ నిర్మాణము జరుగలేదు, నిజమైన పార్టీ కేంద్రమును యేర్పరచడం జరుగలేదు. (పార్టీ కేంద్రము నామకః కేంద్రముగానే వుంది.) భారతదేశములోని వివిధ విప్లవశక్తులను రాజకీయంగా, నిర్మాణయుక్తంగా ఐక్యపర్చగల్గే రాజకీయకేంద్రముగా పార్టీ పనిజేయజాలక పోవడం ముఖ్యమైనలోపం. 1933 లో యేర్పడ్డ పార్టీ కేంద్రముగూడ స్థిరముగా, నిరాటంకంగా పనిజేయజాలక పార్టీ నిర్మాణమును సాగించలేకపోయింది. ఇందుచేత స్థిరమైన పార్టీ కేంద్రాన్ని యేర్పరచజాలక పోవడంవలన కార్మికోద్యమముకో కమ్యూనిస్టులు గడచిన విజయాలను స్థిరపర్చుకోజాలకపోయారు. పార్టీ యూనిట్లను కార్మికవర్గంలోనికి, ప్రజాసామాన్యంలోనికి విస్తరింపజేయజాలకపోయారు. పార్టీ సభ్యులను తయారు చేయజాలకపోయారు. ఇదివరలోవున్న పార్టీ గ్రూపులుగూడ నిర్మాణయుక్తంగాను, సంఘటిత పద్ధతులలోను పనిచేయక యెవరంతటవారే వ్యక్తి ధోరణిలో పనిజేశారు. అందుచేత పార్టీకి అ. భా. రాజకీయ దృక్పథముగూడ (మార్క్సిస్టుదృక్పథము అలవడకపోయిననూ) యేర్పడక స్థానిక తత్వముతోనే పార్టీ పనిజేస్తూంది. ఈ బలహీనతవలన పార్టీ లీగల్ కార్యకలాపాలన్నీ బహిష్కరింపబడగానే యే విధంగా పనిజేయాలో తెల్సియక పార్టీ అంతా గందరగోళములో పడిపోయింది.

# అయిదవభాగం

## ( 1936 — 39 )

1935 వ సంవత్సరంలో ఒక రహస్య పార్టీకేంద్రం యేర్పడిందనియు. అది రహస్యంగా పనిజేస్తూ రహస్యపార్టీ సాహిత్యాన్నిగూడ ఉత్పత్తి చేయడానికి యేర్పాట్లు గావించిందని యిదివరలో చూచాం. 1936 ఆరంభంలో ఆ పార్టీకేంద్రం పట్టుబడింది. అది యెగిరిపోవడంవలన తాత్కాలికంగా పార్టీకి పెద్ద దెబ్బ తగిలినప్పటికి, దాన్ని యేర్పరచడంమూలాన ఒక ముఖ్య ఫలితం గల్గింది. 1936 వచ్చేసరికి అఖిల భారత రాజకీయ దృక్పథంతో కేంద్రపార్టీపనిని చేయగల పార్టీ నాయకులు కొందరు తర్ఫీదు చేయబడ్డారు. వీరందరితో గూడిన కేంద్రకమిటీ ఒకటి యేర్పడింది. ఈ కేంద్ర కమిటీకి, యిదివరలో యేర్పడ్డ కేంద్రకమిటీలకు చాల వ్యత్యాసముంది. ఇదివరకు కేంద్రకమిటీ సభ్యులలో దాదాపు అందరికి స్థానిక తత్వం ఉండేది. కేంద్ర పార్టీ పనినిగూర్చి ఆలోచించేవారే గాదు. తమ ప్రాంతాలలో ట్రేడ్ యూనియన్ పనిమాత్రం జేస్తూ దానిలోనే మునిగిపోయేవారు. అందుచేత వార్కి రాజకీయ సమస్యలను అఖిల భారత దృక్పధంతోను, సరియైన మార్క్సిస్టు దృష్టితోను ఆలోచించగల శక్తి వుండేదిగాదు. తమ ప్రాంతాలకు, అందులో తమ ప్రాంత కార్మికవర్గానికి అవి యేవిధంగా వర్తించుతాయా అనే సంకుచిత దృష్టితో ఆలోచించేవారు. దీనివలన అప్పుడు యేర్పడ్డ కేంద్ర కమిటీకి భారత రాజకీయాలను సమగ్రంగా మార్క్సిస్టు దృక్పధంతో పరిష్కరించి వివిధ ప్రాంతాల కమ్యూనిస్టు గ్రూపులకు తగిన సూచనలు, సలహాలు యివ్వగల రాజకీయ శక్తి వుండేదిగాదు. ఇప్పుడు యేర్పడ్డ కేంద్రకమిటీ అలాగాకుండా అ. భా. దృక్పధంతోను, మార్క్సిస్టు దృక్పధంతోను రాజకీయ సమస్యలన్నిటిని ఆలోచించి ఒక నిర్ణయానికి రాగల పరిపక్వం పొందింది. ఇట్టి కేంద్రపార్టీ నాయకత్వాన్ని నిర్మించుకోలేకపోవడమే అంతవరదాకా భారత రాజకీయాలలో కమ్యూనిస్టులు ఒక రాజకీయ శక్తిగా తయారుగాలేకపోవడానికి కారణమని అనుభవంద్వారా గ్రహించడంవలన యిప్పటికి అలాంటి కేంద్ర కమిటీ యేర్పడింది. కాని, యింకా యీ కేంద్రకమిటీ సభ్యులలో చాలభాగం ఆచరణలో యింకా వారి వారి రాష్ట్రాలపనిని వదలి కేంద్ర పార్టీపనికి తమ పూర్తికాలాన్ని వినియోగించడంలేదు. దీనికి కారణం వీరందరిని ఒక టీమ్‌లాగ పనిజేయిస్తూ,

యెప్పటికప్పుడు వారికి సలహాలిస్తూ వారిచేత కేంద్రపార్టీపనినే చేయించే పార్టీ కేంద్రం తయారు గాలేదు. 1936 లో యెగిరిపోయిన కేంద్రాన్ని మరల పునః స్థాపించడానికి ప్రయత్నాలు చేయబడ్డాయి.

1936 వ సంవత్సరం ఫిబ్రవరిలో లక్నోలో జరుపబడ్డ కాంగ్రెసు మహాసభ సమావేశకాలమందు భారత దేశములో ముఖ్య పార్టీ నాయకులందరూ సమావేశమయ్యారు ఆ సమావేశంలో ఒక కేంద్ర కమిటీని మరల నూతనంగా యెన్నుకున్నారు. అంతేగాకుండా ప్రథమ పర్యాయంగా కేంద్రపార్టీ రోజువారీ పనికొరకై తమ కాలాన్నంతా వినియోగించుతూ పనిజేస్తున్నవారిని ముగ్గురినీ "పొలిట్ బ్యూరో"గా యెన్నుకున్నారు. వీరు పార్టీ నాయకుల్లో ఉత్తమపార్టీ చైతన్యముగల్గి అందరికంటె హెచ్చు రాజకీయ పరిపక్వతను, మార్క్సిస్టుపరిజ్ఞానాన్ని గల్గినవారు. ఈ "పొలిట్ బ్యూరో" యే పార్టీకేంద్రంగా పనిజేస్తూంది. దాదాపు అప్పటినుండి అవిచ్ఛిన్నంగా ఆ పార్టీ కేంద్రమే పనిజేస్తూ వస్తూవుంది.

1936 లో పార్టీ కేంద్రంపోయిన తరువాత రాష్ట్రగ్రూపులతో సంబంధాలు తెగిపోయాయి. మరల యీ కేంద్రందిట్టమైన రహస్యసంబంధాలు యేర్పరచింది. పార్టీలో ముఖ్యంగా బొంబాయి, పంజాబు, బెంగాల్ రాష్ట్రాలగ్రూపుల్లోవున్న కలతలను తొలగించి పార్టీనంతను ఐక్యపర్చుటకు తీవ్ర ప్రయత్నం చేయబడింది, చాలవరకు జయప్రదం అయ్యింది గూడాను. పార్టీరహస్యమాస పత్రిక అయిన 'కమ్యూనిస్టు'ను తిర్గిప్రకటించడం పార్టీకేంద్రం ప్రథమ కర్తవ్యమైంది. ఈ పత్రికలేనిది పార్టీలో రాజకీయ ఐక్యతను నెలకొల్పడం, అప్పట్లో భారతరాజకీయ సమస్యలగూర్చి స్పష్టంగాపార్టీ సభ్యులకు ఒకఐక్యదృక్పథాన్ని యేర్పరచి పార్టీనంతను ఒకటీమ్‌లాగ అన్నిరంగాలలోను పనిజేయించడంసాధ్యంగాదు. అందుచేత "కమ్యూనిస్టు"ను తిర్గి ప్రచురించుటకు యేర్పాట్లుచేయబడ్డాయి. దాదాపు అప్పటినుండి "కమ్యూనిస్టు"ను విడవకుండా (పార్టీపైనిషేధం తొలగించేంతవరకు) ప్రకటించగల్గింది. పార్టీసభ్యులను, పార్టీయూనిట్లను రాజకీయంగా ఐక్యపర్చుటకు "కమ్యూనిస్టు" చాలతోడ్పడింది. వారిలోనున్న విభిన్నరాజకీయ దృక్పథాలను తొలగించి పార్టీపాలసీపై వారినందరిని ఐక్యపర్చి పార్టీ అంతటిలో ఒకవిధమైన రాజకీయైక్యత నెలకొల్పగల్గింది. ఈ రాజకీయఐక్యత పార్టీసభ్యులందరినీ చురుకుగా పనిచేయడానికి పుత్తేజపర్చింది. అందుచేత అప్పటి పార్టీ కేంద్ర నాయకత్వాన్ని రాష్ట్రములోని అన్ని గ్రూపులు పూర్తిగా అంగీకరించాయి. పార్టీ సెంటరును కాపాడడం, నిలబెట్టడం తమ ప్రథమకర్తవ్యమని బాగా పార్టీచైతన్యమున్న రాష్ట్రపార్టీ నాయకులు గుర్తించారు. సామాన్యపార్టీసభ్యులకు సెంటరు అంటే భక్తి, విశ్వాసం యేర్పడింది. ఈవిధంగా పార్టీ నిర్మాణములో ప్రథమ పర్యాయం నూతనమార్పు వచ్చింది. అన్నిరాష్ట్రాలలోని గ్రూపులను రాజకీయంగా ఐక్యపర్చి వాటికి నాయకత్వం వహించి ఒకనిర్ణీత పంథాను నడిపించగలపార్టీ కేంద్రం యేర్పడుటలో పార్టీ దేశవ్యాపితమైన రాజకీయ పలుకుబడిని సంపాదించి ఒకరాజకీయశక్తిగా పరిగణించబడుట ప్రారంభమైంది. పార్టీబాగా అభివృద్ధిగాంచుటకు అవకాశమేర్పడింది. ఇట్టిపార్టీ కేంద్రం ఇదివరలో యేర్పరచలేక పోవుటవలననే యెన్నివిప్లవ అవకాశములు వచ్చినమా (1920-22 1930-33) పార్టీ నిర్మాణం అభివృద్ధిగాలేదు. కార్మికోద్యమములో ప్రధానశక్తిగావున్నా ఒకరాజకీయ శక్తిగా తయారవ్వలేదు. ఎప్పటికప్పుడు ప్రభుత్వనిర్బంధానికి గురిఅయి అంతవరకు సాధించిన ఫలితాలన్నిటిని కోల్పోతూవచ్చాము. భారతదేశపు మొత్తంమీద బయలుదేరే ప్రతి రాజకీయ సమస్యను



కార్మికదృక్పథంతో పరిష్కరించగల రాజకీయ పరిపక్వతపొందిన పార్టీకేంద్రం లేకపోతే, భారత రాజకీయరంగంలో రాజకీయశక్తిగాపార్టీ యెన్నడూ తయారుగాలేదు; కేవలం కార్మికరంగంలో ఒక ప్రధాన ముఠాగా మాత్రమే వుండిపోతుంది. భారతదేశరాజకీయాభివృద్ధి జాతీయబూర్జువావర్గ హద్దులను దాటిపోదు. ఈ విషయాన్ని పార్టీ ముఖ్యులందరూ గ్రహించి అప్పుడు యేర్పడ్డ పార్టీకేంద్రాన్ని రాజకీయంగా నిర్మాణరీత్యా బలపర్చుటకు తోడ్పడడం ప్రారంభించారు.

నూతనంగా యేర్పడ్డ పార్టీకేంద్రాన్ని అతిముఖ్యమైన సమస్యలు యెదుర్కొన్నాయి కమ్యూనిస్టుపార్టీ రాజకీయశక్తిగా తయారవుతున్నప్పుడు ప్రతిసమస్యపై దాని రాజకీయాభిప్రాయముకొరకు ఒక కార్మికులేగాక భారత దేశములోని తదితరజాతీయశక్తులు యెదురుచూస్తూ వున్నప్పుడు, పార్టీ కేంద్రపు రాజకీయబాధ్యతలు రోజురోజుకు హెచ్చుఅవుచున్నాయి, ఆబాధ్యతలను నిర్వహిస్తూ ఒక కార్మికవర్గాన్నే గాకుండా భారత ప్రజానీకాన్నంతా రాజకీయంగా నడుపుతూ పనిజేయగల్గడమూ లేక పార్టీబాధ్యతలను నిర్వహించజాలక పార్టీ అభివృద్ధిని, దానితోపాటు భారతదేశ స్వాతంత్ర్యోద్యమమును విచ్ఛిన్నంగావించడమూ - అనేక్లిష్టసమస్య యెదుర్కొంది. అప్పటి పార్టీకేంద్రం రాజకీయ బాధ్యతల ప్రాముఖ్యతను పూర్తిగా గ్రహించాలంటే అప్పటి జాతీయఅంతర్జాతీయ పరిస్థితులను క్లుప్తంగా తెలుసుకోవాలి. ముఖ్యంగా అంతర్జాతీయ కమ్యూనిస్టు మహాసభగావించిన ముఖ్యనిర్ణయాలగూర్చి, వాటిని మనదేశ పరిస్థితులకు యే విధంగా అన్వయింపజేసి పనిజేస్తే మనస్వాతంత్ర్యోద్యమమును యెలా అభివృద్ధి చేయగల్గుతామో తెలుసుకోవడం అవసరం. ఆపరిస్థితులు అర్థంగాకుండా, అప్పటి జాతీయ, అంతర్జాతీయ రాజకీయనినాదాలు అర్థంగాకుండా పార్టీ సెంటరు గావించిన పార్టీనిర్మాణ ప్రయత్నాలగూర్చి అవగాహనం చేసుకోవడం సాధ్యంగాదు. అందుచేత వాటిని గూర్చి క్లుప్తంగా తెలుసు కుందాం.

## అంతర్జాతీయ కమ్యూనిష్టుపార్టీ

## 7 వ కాంగ్రెసు సమావేశము - "యునైటెడ్ ఫ్రంటు" యెత్తుగడలు

అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ 7 వ కాంగ్రెసు సమావేశం చరిత్రాత్మకమైనదనియు, ప్రపంచమందలి అన్ని దేశాల కమ్యూనిస్టుపార్టీలు అసమయములో యేర్పడ్డనూతన పరిస్థితుల్లో (జర్మనీలో ఫేసిస్టు పరిపాలన యేర్పడడం, రెండవ సామ్రాజ్యవాద యుద్ధానికి తీవ్రప్రయత్నాలు జరుపబడుచుండుటచేత ప్రపంచానికి యుద్ధప్రమాదం ఆసన్నమవడం) ప్రపంచప్రజల స్వాతంత్ర్యోద్యమాలను నూతన పంథాలోనడుపుటకు "యునైటెడ్ ఫ్రంటు" యెత్తులను అనుసరించి పనిజేయాలని ఆదేశించిందని యిదివరలోనే చూశాము. ఆ యెత్తులను భారత దేశమునకు అన్వయింపజేసి భారతదేశ కమ్యూనిస్టుపార్టీ స్వాతంత్ర్యోద్యమమును అభివృద్ధిజేయడానికి కృషిజేస్తోందనిగూడ చూశాం. "యునైటెడ్ ఫ్రంటు" యెత్తుల మూలసూత్రం గూర్చిస్పష్టంగా తెలుసుకోకపోతే "డీవియేషన్సు" (తప్పుమార్గాలు అవలంబించడం) లేకుండా పనిజేయడం జరుగదు. భారత దేశకమ్యూనిస్టుపార్టీ వివిధకాలాల్లో అవలంబించిన రాజకీయ, నిర్మాణపు వినాదాలు పూర్తిగా అవగాహనం చేసుకోవాలంటే, వాటికిముఖ్య మూలాధారమైన "యునైటెడ్‌ఫ్రంటు" యెత్తుల గూర్చి స్పష్టంగా తెలుసుకోవాలి.

### "యునైటెడ్ ఫ్రంటు" యెత్తుగడ:

"యునైటెడ్ ఫ్రంటు" యెత్తులగూర్చి తెలుసుకొనేముందు యునైటెడ్ ఫ్రంటు వుద్యమము యే పరిస్థితులలో ప్రారంభం అయిందో క్లుప్తంగా తెలుసుకుందాం.

1930 సంవత్సరంలో కేపిటలిస్టు దేశాలలో వచ్చిన ఆర్థిక సంక్షోభం బూర్జువావర్గ పునాదులను కదల్చివేసింది. తత్ఫలితంగా కేపిటలిస్టు దేశాలలోని కార్మికోద్యమము, వలస దేశాలలోని జాతీయోద్యమాలు నానాటికి విప్లవచైతన్యం పొందుచున్నాయి సోవియట్ రష్యాలోని సోషలిస్టు విజయ ప్రభావం ప్రపంచ ప్రజలందరిలోను విప్లవ చైతన్యం కలుగజేస్తోంది. అలాంటి విప్లవ జ్యోతిని నాశనం గావించడానికి సోవియట్ యూనియన్‌పై మిలిటరీవాడి చేయడానికి, తద్వారా తమకుగల్గిన ఆర్థిక రాజకీయ సంక్షోభాలను తొలగించుకోడానికి బూర్జువా పాలకవర్గాలు ప్రయత్నిస్తున్నాయి.

ఇందుకుగాను బూర్జువా పాలకవర్గాలు ఫాసిజాన్ని, బహిరంగ దౌర్జన్య క్రూర నియంతృత్వ పద్ధతిని అనుసరించాలని చూస్తున్నాయి. ధనస్వాములగు సామ్రాజ్యవాద శక్తులు, కార్మికవర్గాన్ని అణచిపెట్టడంద్వారా, మరో యుద్ధాన్ని తెచ్చిపెట్టడంద్వారా, సోవియట్ యూనియన్‌ను, చైనాను నాశనంచేసి, తిరిగి తమలోతాము పంచుకోవడంద్వారా ప్రజా విప్లవాలను అరికట్టవచ్చునని తలుస్తున్నారు. ఈవిధంగా ముఖ్య సామ్రాజ్యవాద దేశాలలో (బ్రిటన్, ఫ్రాంసు, అమెరికా, జర్మనీ, ఇటలీ, జపాన్) విప్లవ ప్రతీఘాత ఫాసిస్టు అనుకూల బూర్జువా వర్గాలు తీవ్ర ప్రయత్నాలు గావిస్తున్నాయి. జర్మనీలో ఫాసిజం అధికారంలోకి రావడం యీ ప్రయత్నాల ఫలితమే. దానితో ప్రపంచానికి ఫాసిస్టు ప్రమాదం, యుద్ధ ప్రమాదం, సోవియట్‌పై ఫాసిస్టుదేశాల దాడి ప్రమాదం మరింత హెచ్చు అయ్యాయి. కార్మికవర్గానికి, సామాన్య ప్రజలకు ఫాసిస్టు పరిపాలనవలన యెక్కువ కష్టాలు సంభవించాయి. సామాన్య పౌరసత్వ హక్కులు, జీవిత ప్రమాణమునకే భంగము వాటిల్లడంవలన ఒక కార్మికవర్గమేగాక ప్రజలందరూ (ఒక బూర్జువావర్గంతప్ప) ఫాసిస్టు పరిపాలన క్రింద బానిసత్వానికి గురి అయ్యారు.

ఫాసిజాన్ని బూర్జువావర్గం స్థాపించగల్గినా ఆ విజయం తాత్కాలికము మాత్రమే. ఫాసిస్టు విజయానికి కారణం ఒక కార్మికవర్గ బలహీనతయేగాదు. అది బూర్జువావర్గ బలహీనతనుగూడ తెలియజేస్తుంది. ఎందుకంటే బూర్జువావర్గం యిక ప్రజాస్వామ్య పద్ధతిప్రకారం పరిపాలన సాగించలేక కార్మికవర్గ విప్లవాలంటే భయపడి దౌర్జన్యంద్వారా, నియంతృత్వ విధానంద్వారా తన అధికారాన్ని నిలబెట్టుకోదలచింది. అంతేగాదు: ఫాసిస్టు నియంతృత్వ పరిపాలన బూర్జువావర్గము అంతటి ప్రయోజనాలను కాపాడడానికిగాక, యే కొద్దిమందో రియాక్షనరీ. గొప్ప ధనాఢ్యుల ప్రయోజనాలకు తతిమ్మా చిన్న చిన్న ధనాఢ్యులనుగూడ బలిజేస్తుంది. అందుచేత బూర్జువావర్గాన్నంతను జాతీయంగాగాని, అంతర్జాతీయంగాగాని ఐక్యపర్చలేదు. బూర్జువావర్గమునకు వుండే అంతరంగిక స్పర్థలు మరింత తీవ్రమౌతాయి. ఇందుచేత ఫాసిస్టు విజయాలు తాత్కాలికం మాత్రమే.

ఇంతమాత్రాన ఫాసిస్టు ప్రమాదంవలన నూతనముప్పు ప్రపంచ ప్రజలకు, స్వాతంత్ర్యోద్యమాలకు, వీటికి అండగావున్న సోవియట్ యూనియన్‌కు యేర్పడలేదనిగాదు; ఇందుచేతనే అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ 7 వ కాంగ్రెసు ఫాసిస్టు ప్రమాదాన్ని, యుద్ధప్రమాదాన్ని తక్కువ అంచనా వేయవద్దని ప్రపంచ ప్రజలను హెచ్చరించింది. ఫాసిస్టు ప్రమాదం అన్నిదేశాలకు (ప్రజలువూరు



కుంటే) ప్రాకుతుందని హెచ్చరించింది. కార్మికవర్గంలో ఐక్యత, ఆర్గనైజేషన్ ఉంటే, కమ్యూనిస్టు పార్టీలు ప్రజలందరిని ఫాసిజానికి వ్యతిరేకంగా సమీకరించి, ఐక్యపర్చి, ఫాసిజం అణగారిపోయేటట్లు సోవియట్ యూనియన్ శక్తిద్వారా, ప్రపంచ విప్లవోద్యమ ప్రభావంద్వారా తప్పక చేయగల్గుతుందనిగూడ కర్తవ్యాన్నిగూర్చి స్పష్టంచేసింది. ప్రతి దేశంలోని శ్రమజీవులలో అధికసంఖ్యాకులను ఫాసిజానికి వ్యతిరేకంగా కూడదీసినట్లయిన కార్మికవర్గం తప్పక ఫాసిజాన్ని ఓడించగల్గుతుందని కార్మికవర్గాన్ని ఉత్తేజపర్చింది. ఇందుకే "యునైటెడ్ ఫ్రంటు" యెత్తుగడద్వారా యునైటెడ్‌ఫ్రంటు ఉద్యమాన్ని నిర్మించడానికి కమ్యూనిస్టు పార్టీలకు అతి ప్రాముఖ్యమైన సలహాలు, సూచనలు 7 వ కాంగ్రెసు సమావేశంలో యివ్వబడ్డాయి.

### "యునైటెడ్ ఫ్రంటు" మూలసిద్ధాంతములు.

కార్మిక వర్గానికి, దానివిజయాలకు, శ్రమజీవులప్రాథమిక హక్కులకు వ్యతిరేకంగా ఫేసిస్టు ప్రమాదం ఎక్కువ అవుతున్న అసమయములో అంతర్జాతీయకమ్యూనిస్టు పార్టీ 7 వ కాంగ్రెసు యీ విధంగా హెచ్చరించింది.

ప్రస్తుత చారిత్రకదశలో ప్రపంచకార్మికోద్యమ ప్రధాన కర్తవ్యం అన్నిదేశాలకష్టజీవులను ఫేసిజానికి వ్యతిరేకంగాను, బూర్జువావర్గదాడికి వ్యతిరేకంగాను పోరాటంసాధించడానికి కార్మికవర్గాన్ని ప్రజలను ఐక్యపర్చడమే. ఈ సంయుక్త సంఘటన నిర్మించడంలో ఆ కార్మికులు ఏఆర్గనైజేషన్‌కు చెందినప్పటికీ, వారిలో అధికసంఖ్యాకులు కేపిటలిజాన్ని రూపుమాపే కార్మికవర్గ విప్లవంకోసం కలిసి పోరాడడానికి యింకా అంగీకరించక పోయినప్పటికీ, వారితోకలసి ఫేసిజానికి వ్యతిరేకంగా ఐక్యతను నిర్మించాలి. ఫ్యాక్టరీలోగానీయండి, స్థానికంగా గానీయండి, జిల్లాలోగానీయండి, దేశం మొత్తం మీద గానీయండి, అంతర్జాతీయంగాగానీయండి, వివిధరకాలరాజకీయ భావాలుగల కార్మికులందరితోను ఫేసిజానికి వ్యతిరేకంగా సంయుక్త సంఘటన కొరకు ఒకకొత్తపద్ధతిలో అంగీకారానికి రావలసియుంటుంది. ఈ నూతన పరిస్థితులను కార్మికవుద్యమములో గొనిరావడానికి కమ్యూనిస్టులపై అత్యధిక బాధ్యతపడుతోంది.

"యునైటెడ్ ఫ్రంటు" కార్యక్రమాన్ని యీ మూలసిద్ధాంతాల ననుసరించి సాగించాలని 7 వ కాంగ్రెసు నిర్ణయించింది.

(1) కేపిటలిస్టు దేశాలలో కార్మికవర్గఆర్థిక రాజకీయహక్కులను కాపాడుకోవడం, ముఖ్యంగా ఫేసిజానికివ్యతిరేకంగా రాజకీయహక్కులను కాపాడుకోవడం, ప్రజాసామాన్యమంతటిలోను కదలిక కలిగించడంకోసం వారికి అత్యంత అవసరమైనట్టి, వారిపోరాట పటిమను మరికొంత ఉన్నతస్థాయికి తీసుకొనిపోయేటట్టి కోర్కెలను తీసుకోవాలి. ఎప్పుడో రాబోయే కార్మిక విప్లవం, నియంతలత్వం కొరకు పనిజేయడాన్నే ప్రథమ షరతుగా పెట్టరాదు. ప్రస్తుతం వారి నెదుర్కొంటున్న కేపిలిస్టు దోపిడీని, ఫేసిస్టుదౌష్ట్యాన్ని యెలాయెదిరించిపోరాడాలో రోజురోజువారికి చూపాలి. సంయుక్తకార్యాచరణద్వారా కార్మిక సంఘాలలోను, ప్రజాసామాన్యంలోను ఐక్యతకోసం ప్రయత్నించాలి. మనం తీసుకొనే కోర్కెలు, కార్యక్రమము ఆర్థిక సంక్షోభ బాధ్యత అంతా బూర్జువా వర్గంమీదనే పడేటేవిగాను, ఫేసిజాన్ని, మరోయుద్ధప్రయత్నాలను బలహీనపర్చేవిగాను వుండాలి. పరిస్థితులుమారినప్పుడు

తదనుగుణ్యంగా మన పోరాటపద్ధతులను త్వరితంగా మార్చుకొనుకోడానికి కార్మిక వర్గాన్ని తయారు చేయాలి."

(2) "పై సూచనలతో కార్మికోద్యమములో ఐక్యతను చేకూర్చాలి. ఇందుకు సోషల్ డెమాక్రాటు పార్టీలతోను, రిఫార్మిస్టు ట్రేడ్‌యూనియన్లతోను కార్మికవర్గ శత్రువులకు వ్యతిరేకంగా పోరాటంలో తాత్కాలిక అగ్రిమెంట్లుగాని, దీర్ఘకాల అగ్రిమెంట్లుగాని యేర్పరచుకోడానికి ప్రయత్నించాలి. ఇట్లా ప్రయత్నించినను ఒకవేళ నాయకులతో అగ్రిమెంట్లు త్వరగా రాకపోతే క్రింది సంఘాలతో కలిసి పనిజేయడానికి అగ్రిమెంట్లు వచ్చేంతవరకు వేచియుండనవసరంలేదు. పై విధంగా ప్రయత్నిస్తూనే వాళ్ల పలుకుబడిక్రిందవున్న క్రింది సంఘాలతో కలసి కమ్యూనిస్టులు పనిజేస్తూ క్రిందినుండి కార్మికోద్యమ ఐక్యతను నిర్మించాలి క్రిందినుండివచ్చే కార్మికోద్యమ ఐక్యతే సరియైనదని పై నాయకులతో అగ్రిమెంటులు చేసుకోవడానికి అసలు ప్రయత్నం జేయడమే మానివేయరాదు. పై నాయకులతో గావించే అగ్రిమెంటులు, క్రింది సంఘాలను చురుకుగా పనిజేయించడానికి, క్రిందినుండి ఐక్యతను నిర్మించడానికి యెంతో మార్గాన్ని సులభమొనర్చుతాయి."

"సోషల్ డెమాక్రాటు పార్టీలతోను, రిఫార్మిష్టు ట్రేడ్‌యూనియన్‌లతోను కమ్యూనిస్టులు అగ్రిమెంటులకొరకు కృషిజేయడమంటే, కమ్యూనిస్టులు తమ నిత్యకార్యక్రమమైన కమ్యూనిస్టు తర్ఫీదు, ఆర్గనైజేషన్‌పని, ప్రజలను సమీకరించేపని వదిలిపెట్టమనిగాదు. ఈ విషయంలో యెంత బలిష్టంగావుంటే అంత త్వరగా కార్మికోద్యమ ఐక్యతను నిర్మించగల్గుతారు."

"కమ్యూనిస్టులు, కార్మికోద్యమ ఐక్యతకొరకు, యునైటెడ్‌ఫ్రంటు వుద్యమముకొరకు యితర సంస్థలతో అంగీకరించిన షరతులను విశ్వాసంతో పూర్తిజేస్తారు. ఇతర పార్టీలు వాటిని నిర్వర్తించక ఉద్యమాన్ని, పోరాటాన్ని పాడుజేయడానికి ప్రయత్నిస్తే అట్టి చర్యలను బహిరంగపర్చుతారు; పర్చాలి. దీనివలన అగ్రిమెంటు చెడిపోతే వెంటనే ప్రజాసామాన్యానికి యదార్థాన్ని తెలియజేయాలి. ఐక్యతను పునరుద్ధరించడానికి తిర్గి ప్రయత్నాలు గావించాలి."

(3) "ఈ కార్మికవర్గ సంయుక్తసంఘటన వేరు వేరు పరిస్థితులలో వేరు వేరు విధాలుగా వుండవచ్చును. కొన్ని ప్రత్యేక కోర్కెలను సాధించడానికి యేర్పడవచ్చును. వాటిని సాధించేంత వరకే తక్కువకాలం అగ్రిమెంటు యేర్పరచుకోవచ్చును. లేక తదనంతరం మరల దానినే పొడిగించవచ్చును. అందరికి సంబంధించిన ఆందోళనకొరకు సంయుక్త కార్యాచరణకు దిగవచ్చు. ప్రత్యేక పరిశ్రమలలోగాని, వాటి శాఖలలోగాని హక్కులకోసం సంయుక్తకార్యాచరణ అంగీకరించబడవచ్చు. ఒకస్థానిక లేక జిల్లా లేక జాతీయ కోర్కెలకోసం యునైటెడ్‌ఫ్రంటు యేర్పడవచ్చు. ఇలాగే కార్మికుల, ప్రజల ఆర్థిక రాజకీయ హక్కులకొరకు స్థానికంగాను, జిల్లా మొత్తంమీదను, సంయుక్తసంఘటనలు యేర్పరచుకోవచ్చు. ముఖ్యోద్దేశ్యం అన్నివిధాల కార్మికులను, ప్రజలను అందరినీ తమ తక్షణకోర్కెలపై సమీకరించి వారిలో విశాలమైన ఐక్యతను గొనిరావడం."

(4) "సంయుక్త సంఘటనా కార్యక్రమాన్ని సాగించడానికి యేర్పరచే సంయుక్త సంఘాలు సాధ్యమైనంతవరకు యేకగ్రీవంగా యేర్పరచబడిన సంఘాలుగా వుండాలి. పార్టీసంఘాలుగా వుండరాదు. హెచ్చుగా అన్నిపక్షాల ప్రాతినిధ్యం వహించిన పార్టీయేతర సంఘాలుగా వుండాలి. అవుడే



ప్రజల నందరనీ సమీకరించడానికి ఆ సంఘాలు శక్తివంతంగా వుంటాయి. ఆ సంఘాల్లో గావించే నిర్ణయాలు హెచ్చుగా యేకగ్రీవంగా అంగీకరించబడే నిర్ణయాలుగా వుండాలి.

(5) "కార్మికోద్యమ ఐక్యత సంపూర్ణంగా రావాలంటే వివిధ రకాల కార్మిక సంఘాలు వుండరాదు. ప్రతి పరిశ్రమలోను ఒకే కార్మిక సంఘం యేర్పడేటట్లు, అందుకు ఆ పరిశ్రమలో వున్న వివిధ కార్మిక సంఘాలను ఒకే సంఘంగా ఐక్యపర్చుటకు కమ్యూనిస్టులు కృషిజేయాలి. ఇందుకు కమ్యూనిస్టులు తమ పలుకుబడిక్రింద వున్న "రెడ్ ట్రేడ్ యూనియనుల"ను రద్దుగావించి వాటిని రిఫార్మిస్టు ట్రేడ్ యూనియన్‌లతో కలిపివేయడానికి సంసిద్ధత చూపాలి. ఐక్య ట్రేడ్ యూనియన్ వుద్యమాన్ని, కార్మికులందరికీ స్థానికంగా జిల్లా మొత్తంమీద, దేశ మొత్తంమీద ప్రతినిధిగా ఒకే ట్రేడ్ యూనియన్ సంస్థను నిర్మించడానికి కమ్యూనిస్టులు ప్రత్యేక శ్రద్ధతీసుకొని పనిజేయాలి."

"ఇలాంటి ఐక్య ట్రేడ్ యూనియన్ వుద్యమాన్ని నిర్మించడానికి కమ్యూనిస్టులు పనిజేయడమంటే కమ్యూనిస్టు పంథాను కార్మికుల్లో ప్రచారంజేసే హక్కును, రిఫార్మిస్టులు గావించే విచ్ఛిన్న చర్యలను విమర్శించే హక్కును కమ్యూనిస్టులు ఒదులుకోవడం అనిగాదు. ఈ హక్కును ఒదులుకోవడం అంటే కమ్యూనిజం, కార్మిక విప్లవంకొరకు కృషిజేయడం శాశ్వతంగా మానివేయడం అవుతుంది. అందుచేత కమ్యూనిస్టులు యీ హక్కును ఒదులుకోరు."

పై సూచనల ననుసరించి కార్మికోద్యమ ఐక్యతను యేర్పరచుటకు కమ్యూనిస్టులు కృషిగావించాలి. ఈ ఐక్యతను ఆధారంగాగొని ఫాసిజానికి, యుద్ధానికి వ్యతిరేకంగా విశాలమైన ప్రజా ఐక్యత, ఫాసిస్టు యుద్ధ వ్యతిరేక వుద్యమాలను నిర్మించాలి. ఇవి నిర్మించకుండా కమ్యూనిస్టులు కార్మికోద్యమాన్ని యెంత బలిష్టమొనర్చినను, ఫాసిజాన్ని, యుద్ధాన్ని నివారించలేరు. తమ హక్కులను ఫాసిస్టుల దాడినుండి, బూర్జువావర్గ దాడినుండి రక్షించుకోజాలరు. విశాల ఫాసిస్టు వ్యతిరేక, యుద్ధ వ్యతిరేక సంయుక్త ప్రజాసంఘటనను సాధించడానికి కార్మిక వుద్యమ ఐక్యతను సాధించడం యెంతేని అవసరం. యెందుచేతనంటే కార్మికవర్గం అన్నివర్గాలకంటే హెచ్చు విప్లవ చైతన్యంకలది అగుటచేత యీ ఫాసిస్టు వ్యతిరేక వుద్యమానికి నాయకత్వం వహించి నడుపుతుంది. అలాంటప్పుడు దానిలో సంపూర్ణ ఐక్యత సాధించబడితే దాని ప్రభావం యితరవర్గాల ప్రజలపైగూడ పడి త్వరగా విశాలమైన ప్రజా ఐక్యతను సాధించడానికి అవకాశం చిక్కుతుంది. శత్రువులుపన్నే పన్నాగాలన్నిటిని తన వర్గ ఐక్యతలో సులభంగా యెదుర్కొగలుగుతుంది. అందుచేత కార్మికవర్గ ఐక్యతను సాధించడం యునైటెడ్‌ఫ్రంటు వుద్యమ ప్రథమ కర్తవ్యంగా వుండాలని అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ 7 వ కాంగ్రెసు సమావేశం స్పష్టపర్చింది.

కాని దానిని అపార్థంచేసుకోరాదు, కార్మికవర్గఐక్యత వచ్చేంతవరకు ఫేసిస్టువ్యతిరేక, యుద్ధ వ్యతిరేకప్రజాసంఘటనను నిర్మించడానికి పూర్తిగా ప్రయత్నించరాదనే తప్పువాదన బయలుదేరవచ్చు. దానిఅర్థం అదిగాదు. కార్మికవర్గ ఐక్యతను నిర్మించడం, విశాల ఫేసిస్టువ్యతిరేక, యుద్ధవ్యతిరేక ప్రజాసంయుక్త సంఘటనను నిర్మించడం ఒకేకాలాన జరుగుతూవుండాలి. ఒకదాని నిర్మాణం రెండవ దాని నిర్మాణమునకు తోడ్పడుతుంది. ఒక దానికొకదానికి పరస్పర సంబంధముందని మర్చిపోరాదు. ముఖ్యంగా గమనించ వలసినది కార్మిక వర్గఐక్యతను సాధించగల్గితే ఫేసిస్టు వ్యతిరేక ప్రజాఐక్యతను

సాధించడం సులభం అవుతుందనే విషయము. అంతమాత్రాన కార్మిక వర్గఐక్యత వచ్చేంతవరకు ఫేసిస్టు వ్యతిరేక ప్రజాఐక్యతను నిర్మించడానికి కృషియేమీ చేయవద్దనిగాదు.

## ఫేసిస్టు వ్యతిరేక, యుద్ధవ్యతిరేక ప్రజాఐక్యత

కమ్యూనిస్టులు కార్మిక వర్గనాయకత్వం క్రింద రైతులు, మధ్యతరగతి పట్టణ ప్రజలు, అణచి పెట్టబడిన అన్నిజాతుల ప్రజలలోను ఐక్యతను నిర్మించడంలో విశాలమైన ప్రజాబాహుళ్యంతో కూడిన ఫాసిస్టువ్యతిరేక సంఘటనను నిర్మించడానికి పూనుకోవాలి. ఇది కార్మికవర్గ ప్రధానకోర్కెలతో కలసే, ప్రజలందరి కోర్కెలను తెలియజేసేదిగాను, బలపర్చేదిగాను వుండాలి. ముఖ్యంగా రైతులను, పట్టణ మధ్యతరగతి ప్రజలను వారిని దోచుకునే ఫేసిజానికి వ్యతిరేకంగా సమీకరించాలి. వారిపై విధించబడే భరించరాని పన్నులు, మక్తాలు, అప్పులు, దరిద్రం - వీటికి వ్యతిరేకంగా వారిని ఆర్గనైజ్ చేసి ఐక్యపర్చాలి. మధ్యతరగతి ప్రజల్లోను, మేధావంతులలోను, చిన్నచిన్న ఉద్యోగస్థుల లోను ప్రతిచోట పనిజేయాలి, రోజురోజుకు ఎక్కువ అవుచున్న జీవిత వ్యయప్రమాణం తగ్గించుటకు, వారి జీతాలకోతలను రద్దుగావించడానికి వారిని ఆర్గనైజ్ చేయాలి. విజ్ఞానాన్ని నాశనంగావించే ఫాసిజానికి వ్యతిరేకంగా అభివృద్ధినికోరే విజ్ఞానులను ఫాసిష్టువ్యతిరేక పోరాటములోనికి గొనిరావాలి.

రాజకీయ సంక్షోభాలలో పాలకవర్గాలు శక్తివంతమైన ప్రజా వుద్యమాలను తట్టుకోలేని స్థితిలో వున్నప్పుడు కమ్యూనిస్టులు ఆ బూర్జువా, ఆర్థిక రాజకీయ దుస్థితిని మరింత తీవ్రపర్చి ఆ పాలకవర్గం లోని రాజీవాదులకు తావులేకుండా చేయాలి. పాలకవర్గంలో కార్మికవర్గ హక్కులను కాపాడే ఫాసిస్టు వ్యతిరేకులెవరైనావుంటే వారిని బలపర్చి వారి సహాయంతో యునైటెడ్‌ఫ్రంటు ప్రభుత్వాన్ని యేర్పరచుటకు కార్మికవర్గం కృషిజేయాలి.

## వలసదేశాలలో సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్యసంఘటన :

బానిసదేశాలుగాగాని, సగం వలసదేశాలుగాగానివున్న దేశాలలో కమ్యూనిస్టుల ముఖ్యకర్తవ్యం సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజా ఐక్యసంఘటనను నిర్మించడం. అందుకు ఆ దేశాలలో రోజురోజుకు యెక్కువ అగుతున్న సామ్రాజ్యవాద దోపిడీనుండి, క్రూరబానిసత్వాన్నుండి విముక్తిపొందడానికి, సామ్రాజ్యవాదులను తరిమివేసి దేశ స్వాతంత్ర్యము సంపాదించడానికి సాగించే ఉద్యమములోకి ఎక్కువ జనసామాన్యాన్ని తీసుకురావాలి. స్పష్టమైన సామ్రాజ్యవాద వ్యతిరేక కోర్కెలమీద దేశంలోని విప్లవ జాతీయసంస్థలకు, రిఫార్మిస్టు సంస్థలకు సంయుక్త కార్యాచరణలో ఐక్యతను నిర్మించడానికి చొరవ కమ్యూనిస్టులే తీసుకోవాలి.

సామ్రాజ్యవాద దేశాలలోని కార్మికవర్గం తమ దేశ ప్రజల శ్రేయస్సుకోసం, దేశాన్ని సామ్రాజ్యవాదుల బానిసత్వాన్నుండి విముక్తి గావించడానికి జరుపబడే స్వాతంత్ర్యోద్యమాల్లో పూర్తిగా పాల్గొని వాటితో సహకారంచెయ్యాలి. అగ్రశ్రేణిలో వుండి దేశ స్వాతంత్ర్యంకొరకు పోరాడాలి.



## కమ్యూనిస్టుపార్టీలు నిర్మాణరీత్యా, సిద్ధాంతరీత్యా బాగా బలపడాలి :

కమ్యూనిస్టుపార్టీలు తమ్ముతాము సర్వతోముఖంగా బలపరచుకొని దిట్టపర్చుకోవాలని అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ 7 వ కాంగ్రెసు ప్రత్యేకంగా హెచ్చరించింది. ఎందుచేతనంటే యునైటెడ్ ఫ్రంటు వుద్యమానికంతకు కమ్యూనిస్టుపార్టీ జీవకర్రలాంటిది. కమ్యూనిస్టుపార్టీలు చొరవతీసుకుని, చురుకుగా పనిజేస్తేనే కార్మికోద్యమ ఐక్యతగాని, ఫాసిస్టువ్యతిరేక, యుద్ధవ్యతిరేక ప్రజా ఐక్యతగాని యేర్పడడం సంభవమౌతుంది. అందుచేత చొరవతో పనిజేయడంలోను, మార్క్సిస్టు లెనినిస్టు సూత్రాలపై ఆధారపడి పాలసీని అమలుజరపడంలోగాని, వాటిని ఆయా ప్రత్యేక పరిస్థితులకు అన్వయింపజేయడంలో ఫాసిజానికి, యుద్ధానికి వ్యతిరేకపోరాటంలో యెక్కువ శ్రామిక జనసామాన్యం పాల్గొనేటట్లు చేయడంలోను కమ్యూనిస్టుపార్టీలు బాగా తర్ఫీదుపొందాలి.

యునైటెడ్‌ఫ్రంటువుద్యమంఅభివృద్ధి అవుతూవున్నకొద్ది నూతనక్లిష్టసమస్యలను పార్టీయెదుర్కోవలసివస్తుంది. వాటిని స్థానికంగానే అత్యంత రాజకీయ, నిర్మాణపు చొరవతో యెదుర్కొనగల్గేటట్లు కమ్యూనిస్టు పార్టీ సభ్యులు, స్థానికనాయకులు తర్ఫీదు చేయబడకపోతే యునైటెడ్ ఫ్రంటు వుద్యమము విచ్ఛిన్నం అవుతుంది. అందుచేత పార్టీ సభ్యులందరూ రాజకీయంగాను, నిర్మాణరీత్యా పైవిధముగా తయారు అగుటకు యిప్పటినుండే వివిధ దేశాల కమ్యూనిస్టు పార్టీలు పూనుకోవాలి.

కమ్యూనిస్టుపార్టీ సభ్యులు కొందరిలో వున్న సెక్టేరియన్ దృక్పథాన్ని పూర్తిగా పోగొట్టుకోవాలి. యునైటెడ్‌ఫ్రంటు వుద్యమము అభివృద్ధి అయ్యేటప్పుడు పార్టీసభ్యులు తమకిష్టమొచ్చిన పద్ధతులతోగాక, మార్క్సిస్టు, లెనినిస్టు సిద్ధాంతాల ననుసరించి వివిధ రకాలైన పద్ధతులను, యెత్తులను అవలంబించి పనిజేస్తూవుండాలి. పరిస్థితుల కనుగుణ్యముగా మన పద్ధతులను మార్చుకోజాలక "పిడుగుకి, దయ్యానికి ఒకే మంత్రం" జపించడం పరిస్థితులనుండి, ప్రజలనుండి వేరుపడిపోవడం అవుతుంది. ప్రజల విప్లవ చైతన్యాన్ని వున్నదానికంటె యెక్కువ అంచనా వేయడం, ఫాసిస్టు ప్రమాదం ఒకమూల అలముకొని వస్తున్నప్పటికిని దానిని అరికట్టివేశామని ఆత్మ సంతృప్తిపడడం, స్పష్టంగా గోచరించుచున్న విషయాలనుబట్టి పరిస్థితులను అంచనా వేయకుండా తమ కోర్కెల ననుసరించి అంచనా వేయడం - సెక్టేరియన్ దృక్పథంలోని ముఖ్య లక్షణాలు. ఈ దృక్పథంతో పనిజేయడమంటే ఆచరణలో ప్రజలకు నాయకత్వము వహించడానికి బదులు ఒక చిన్న సంకుచితపార్టీ గ్రూపును నడపడం అవుతుంది. ప్రజా పాలసీని ప్రచారం జేయడానికి బదులు అతివాద పదజాలముతోకూడిన ప్రచారం జేయడమౌతుంది. ఈ దృక్పథం ఉండబట్టే ప్రజా సంస్థలుగా ఫాసిస్టు ప్రజాసంస్థలు మారుచున్నను, రిఫార్మిస్టు సంస్థలు ప్రజా పలుకుబడిని కలిగివున్ననూ, వాటిలోజేరి పనిజేయడానికి పార్టీసభ్యులు యింకా నిరాకరిస్తున్నారు. ఇందుచేత యీ సెక్టేరియనిజం చాలచోట్ల పార్టీ అభివృద్ధిని అరికట్టుతోంది. లెనిన్‌చెప్పినట్లుగా యీ సెక్టేరియనిజం కుర్రచేష్టగా (Infantile-disarder) మాత్రమే వుండుటలేదు; పార్టీ అభివృద్ధికి పెద్ద నిరోధంగా తయారయింది. దీన్ని పార్టీలోనుండి రూపుమాపాలి; అలా చేయనిదే యునైటెడ్‌ఫ్రంటు వుద్యమాన్ని అభివృద్ధి జేయడమట్లుంచి అసలు నిర్మించనేలేము.

రెండవ "డీవియేషన్" మితవాద అవకాశవాదం (Rightism) యునైటెడ్‌ఫ్రంటు యెత్తుగడలు యెక్కువ విరివిగా అనువర్తింపచేసేటప్పుడు, పార్టీలోనికి క్రొత్త 'రిక్రూట్లు' (సభ్యులు)

హెచ్చుగావచ్చేటప్పుడు యీ ప్రమాదం పార్టీలోనికి రావచ్చు. యునైటెడ్‌ఫ్రంటు, సంయుక్తకార్యాచరణ - వీటి అవశ్యకతను గురించి సోషల్‌డెమాక్రాటు వర్కర్లను ఒప్పించవలసి వుంటుంది. అనుభవంలో నేర్చుకునే గుణపాఠాల ఉదాహరణలద్వారా మితవాదపాలసీకి, కమ్యూనిస్టుపాలసీకిగల వ్యత్యాసాన్ని, కమ్యూనిస్టుపాలసీ యెట్లుసరియైనదో వారికిచూపాలి. ఇటువంటిప్రయత్నంలో వారితోఐక్యత చేకూరాలనే ఆతృతతో కమ్యూనిజానికి, రిఫార్మిజానికిగల ప్రధానమైన భేదాలను విడిచిపెట్టి, అవకాశవాదనలకు దిగరాదు అందుచే యిట్టిమితవాద దిగజారుడును ఖచ్చితంగా యెదుర్కోవాలి. ఆచరణలో సోషల్‌డెమాక్రసీ యెట్లు రిఫార్మిజానికి, వర్గశత్రువైన బూర్జువాతో చేతులుకలపడానికి దారి తీస్తుందో వారికి స్పష్టంచేయాలి. ఫాసిజాన్ని నాశనంగావించడంలోను, యునైటెడ్‌ఫ్రంటును నిర్మించడంలోను, సోషలిజం నెలకొల్పడంలోను శాంతి యుతమైన, లీగల్ పద్ధతులద్వారా సాధించగలమనే భ్రమను తొలగించాలి. ఆభ్రమకు పార్టీసభ్యులే గురిఅవరాదు. పార్టీ పాత్రను కించపర్చడంగాని, నిశ్చితమైనకార్యాచరణకు పూనుకోవలసి వచ్చినప్పుడు తటపటాయించడంగాని, ఊగిసలాడడం మొదలైన స్వభావాల్నియేమాత్రం పార్టీసహించరాదు. పొడసూపగానే వాటిని రూపుమాపాలి.

కార్మికవర్గ శ్రేయస్సుకోసమూ, విప్లవ విజయంకోసము నేడు ఒకేఒక కార్మికవర్గ రాజకీయ పార్టీ ప్రతిదేశంలోను వుండుట అవసరం. అందుకొరకు సోషలిస్టులను, మార్క్సిస్టులను ఐక్యపర్చడానికి ప్రయత్నించాలి. కాని యిలా ఐక్యపర్చేటప్పుడు నిజమైన కార్మికవర్గ రాజకీయపార్టీకి ఆధారభూతమైన మార్క్సిస్టు లెనినిస్టు సిద్ధాంతాలపైననే ఆ సోషలిస్టుఐక్యతను నేకూర్చాలి. ఎలాగోఅలాగు ఒకే ఒక కార్మికవర్గ రాజకీయపార్టీని స్థాపించాలనే ఆతురతతో మూలసిద్ధాంతాలను జారవిడువరాదు. అలాచేయడం సోషలిస్టుఐక్యతకొరకు పనిజేయడంగాదు. కార్మికవర్గంలో విభిన్న సోషలిస్టుసిద్ధాంతాలపైన విభజనగొనివచ్చి దాని రాజకీయైక్యతను విచ్ఛిన్నం చేయడమౌతుంది. అందుచేత సోషలిస్టు ఐక్యతను నిర్మించడానికి, ఒకేఒక కార్మికవర్గ పార్టీని ఏర్పరచడానికి యీ క్రింది షరతులను కమ్యూనిస్టులు ఇతర సోషలిస్టు పార్టీలచే అంగీకరింపచేయాలి. అప్పుడే ఐక్యపార్టీని యేర్పరచాలి.

(1) ఇలా ఏర్పడ్డ ఐక్యపార్టీకి మార్క్సిజము—లెనినిజములు మూలసిద్ధాంతములుగావుండాలి.

(2) బూర్జువావర్గంతో తమ సంబంధాలను పూర్తిగా వదులుకోవాలి. కార్మిక విప్లవంద్వారా బూర్జువా ప్రభుత్వాన్ని కూలద్రోయవలెననే మార్క్సిస్టు సిద్ధాంతాన్ని అంగీకరించాలి దానిస్థానే కార్మికుల సోవియట్ల ప్రభుత్వాన్ని నెలకొల్పుటకు అంగీకరించాలి.

(3) సామ్రాజ్యవాద యుద్ధాలలో తమ బూర్జువా ప్రభుత్వాలకు ఏ విధమైన సహాయం చేయకుండా వుండుటకు అంగీకరించాలి.

(4) డెమాక్రటిక్ సెంట్రలిజం సూత్రంపై పార్టీ పనిజేయాలి.

(5) సోవియట్ యూనియన్ విప్లవపాత్రను అంగీకరిస్తూ ఫాసిస్టులు, సామ్రాజ్యవాదులు దాడి చేసినప్పుడు రక్షించడానికి పూనుకోవాలి;

పై షరతులు అంగీకరింపబడేంతవరకు కమ్యూనిస్టుపార్టీలు తమ నిర్మాణమును రద్దుగావించి యితర సోషలిస్టుపార్టీలతో కలిసి ఐక్యకార్మికవర్గ రాజకీయపార్టీని ఏర్పరచడానికి పూనుకోరాదు. పై విధమైన ఐక్యపార్టీని యేర్పరచడానికి ఆ పార్టీల రెంక్ అండ్ ఫైల్ సభ్యులలో తీవ్రప్రచారం గావించాలి.



**పార్టీకేడర్లు**

యునైటెడ్‌ఫ్రంటు వుద్యమము అభివృద్ధి అయినకొలదీ పార్టీలోనికి నూతన సభ్యులు ప్రవాహంగావస్తారు. పార్టీప్రజాపార్టీగా మారడానికి అవకాశం వుంది. కాని నిత్యం వచ్చేనూతన సభ్యులనుండి పార్టీఆర్గనైజర్లుగాను, తమజీవితకాలాన్నంతా వినియోగించే హోల్‌టైమర్లుగాను తయారుచేయకపోతే, ఇదివరకేవున్న కొద్దిమంది పార్టీ ఆర్గనైజర్లు రోజురోజు విశాలమౌతున్న పార్టీ, ప్రజావుద్యమాన్ని నడపడం సాధ్యంగాదు. అప్పుడు పార్టీఅభివృద్ధి ఆగిపోతుంది దానితో యునైటెడ్‌ఫ్రంటువుద్యమము గూడ విచ్ఛిన్నమౌతుంది. కానపార్టీ సభ్యులనుండి వివిధరంగాలలో పనిజేయగల, రాజకీయపరిపక్వం గల పార్టీకేడర్లను తర్ఫీతు చేయడం, వున్నవారిని యింకావున్నతమైన పార్టీపనులకు తర్ఫీతుచేయడం నిత్యం జరగకపోతే పార్టీనిర్మాణం బలపడదు; అందుచేత పార్టీకేడర్లను తయారుచేయడానికి, అభివృద్ధిచేయడానికి. వాటికితగినమార్క్సిస్టు లెనినిస్టు సిద్ధాంతపరిజ్ఞానం కలుగజేయడానికి పార్టీపూనుకోవాలి. ఇదివరకు మామూలుగావున్న పార్టీ సభ్యులతోను, పార్టీ ఫంక్షనరీలతోనే సంతృప్తిపడి కూర్చోడం పార్టీని నిర్మించడం గాదని పార్టీనిర్మాణమును నిరోధించడమని 7వ కాంగ్రెసు హెచ్చరించింది.

పై విధంగా ప్రతి దేశములోని కమ్యూనిస్టు పార్టీలను పునర్నిర్మించాలనియు, తద్వారా వాటిని బాగా బలిష్ఠముగావించుట పార్టీ నిర్మాణపు కర్తవ్యమనియు తీర్మానించింది.

## జాతీయ పరిస్థితులు

అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ 7 వ కాంగ్రెసు సమావేశంలో నిర్ణయింపబడిన "యునైటెడ్ ఫ్రంటు" యెత్తుగడల మూల సిద్ధాంతముల ననుసరించి భారతదేశంలో సామ్రాజ్యవాద వ్యతిరేక సంయుక్త సంఘటనను నిర్మించడానికి కమ్యూనిస్టులు గావించిన ప్రయత్నాలు తెలుసుకొనేముందు ఆ రోజుల్లో భారతదేశంలోవున్న రాజకీయ పరిస్థితులను క్లుప్తంగా తెలుసుకోవడం అవసరం.

**ప్రజల్లో నూతన చైతన్యం :**

భారతదేశంలో నూతన రాజ్యాంగ విధానమును ప్రవేశపెట్టడానికి, తద్వారా తన సామ్రాజ్యవాద కౌగిలిని మరింత బిగించడానికి ప్రభుత్వం తీవ్ర కృషిచేస్తోంది. ఇందుకుగాను ప్రభుత్వానికి వ్యతిరేకత లేకుండా చేసుకోడానికి నిర్బంధవిధానాన్ని అవలంబించింది. అన్ని తరగతుల ప్రజల్లోను తీవ్ర అసమ్మతి గలిగింది. ఫెడరేషన్ విధానాన్ని అమలు జరుపనీయకుండా వుండాలనే దీక్ష ప్రజల్లో గల్గింది. ఫెడరేషన్‌వ్యతిరేక ఉద్యమముచుట్టూ అన్ని తరగతుల ప్రజలు సమీకరించబడ్డారు.

1930 - 33 శాసనోల్లంఘనోద్యమము విఫలమైనతరువాత కాంగ్రెసు పరిస్థితులను సింహావలోకనంగావించి 1934 లో పాట్నాలో శాసనోల్లంఘనాన్ని అపుజేస్తూ జాతీయోద్యమాన్ని అభివృద్ధి జేయడానికి నూతనపంథా అవలంబించింది శాసన సభలద్వారాగూడ పోరాటాన్ని సాగించాలని తీర్మానించి, శాసన సభా కార్యక్రమాన్ని అనుసరించడానికి పూనుకొంది. కాంగ్రెసు కార్యోత్సాహమంతా పార్లమెంటరీ రంగంలోనికి మార్చబడింది. 1934 సంవత్సరాంతంలో కేంద్ర శాసనసభ యెన్నికలలో పాల్గొనుటతో కార్యోత్సాహమంతా పార్లమెంటరీ రంగానికి మారింది. శాసనోల్లంఘనం విఫలమైన తదుపరి మరల ప్రజల్లో వుత్సాహాన్ని, వుద్యమాన్ని క్రమేణా అభివృద్ధిజేయడానికి పార్ల

మెంటరీ కార్యక్రమం అవలంబించడం అభివృద్ధిదాయకమైన కార్యోత్సాహాన్నంతా కాంగ్రెసు మితవాదనాయకులు పార్లమెంటరీ రంగానికే మార్చడంవలన, బైటప్రజల్లో నూతనంగా ఫెడరేషన్‌కు వ్యతిరేకంగా బయలుదేరుచున్న ప్రజా సంచలనాన్ని సంఘటితపర్చడానికి కాంగ్రెసుఅప్పట్లో ప్రజా కార్యక్రమము యివ్వకపోవడంవలన, ఉత్త పార్లమెంటరీ కార్యక్రమము ప్రజానీకంలో యెట్టి అభిరుచినీ, వుత్సాహాన్ని, లేవదీయజాలకపోయింది.

లక్నో కాంగ్రెసు (1936) నాటికి యీపరిస్థితులలో కొంతమార్పువచ్చింది. ఉత్తపార్లమెంటరీ కార్యక్రమమును అనుసరించి పనిజేయడమేగాక, నూతన రాజ్యాంగ చట్టమునకు (ఫెడరేషన్‌కు) వ్యతిరేకంగా చెలరేగుచున్న ప్రజా సంచలనాన్ని సంఘటితపర్చడానికి పూనుకొని శాసనసభలలోను, వాటివెలుపల ప్రజాపోరాటాన్ని కాంగ్రెసు అభివృద్ధిజేయాలని లక్నో కాంగ్రెసులో నిర్ణయించబడింది. అంతేగాకుండా భారతదేశ స్వాతంత్ర్య వుద్యమము ప్రపంచ ప్రజల స్వాతంత్ర్య పోరాటములో ఒక అంతర్భాగమనియు, ప్రపంచ ప్రజలతోకలసి భారతప్రజలు పోరాడినప్పుడే భారతదేశ స్వాతంత్ర్యం లభించుతుందని తెల్పుతూ, అనాడు ప్రపంచప్రజలు గావిస్తున్న ఫాసిస్టు వ్యతిరేక - యుద్ధవ్యతిరేక పోరాటంలో భారతప్రజల స్వాతంత్ర్య పోరాటాన్ని అంతర్భాగంగాజేయాలని తీర్మానించబడింది. భారతదేశానికి స్వాతంత్ర్యము గడించుటేగాక, ఫాసిజాన్ని రూపుమాపడానికి, సామ్రాజ్యవాద యుద్ధానికి వ్యతిరేకంగాను ప్రజలను సమీకరించడానికి కాంగ్రెసు నిశ్చయించి భారతదేశ ప్రజల స్వాతంత్ర్య పోరాటముయొక్క అంతర్జాతీయ స్వభావాన్ని, ఫాసిస్టు వ్యతిరేకతను, సామ్రాజ్యవాద యుద్ధ వ్యతిరేకతను వ్యక్తపర్చింది. ఇంతేగాకుండా కాంగ్రెసుకు బైటను యేర్పరచబడ్డ ప్రజా సంఘాలతో (కార్మిక, కర్షక, యువజనసంఘాలు) కాంగ్రెసు దగ్గిర సంబంధంపెట్టుకొని వాటిలో సన్నిహిత సంబంధాన్ని అభివృద్ధిచేయాలనియు, ప్రజలు తమ వర్గసంఘాలు యేర్పరచుకోడానికి హక్కుందనియు కాంగ్రెసు అంగీకరించింది. దీనితో ప్రజలతోను, ఆర్థిక సామాజిక ప్రయోజనాలతోను తగిన సన్నిహితసంబంధం పెట్టుకుంటేనే కాంగ్రెసు బాగా ప్రజాసంస్థగాదనేభావం ప్రదర్శితమైంది.

ఈ కార్యక్రమాన్నే యింకా స్పష్టంగా 1936 డిశెంబరులో జరిగిన ఫైజపూరు కాంగ్రెసులో కాంగ్రెసు అంగీకరించింది. రైతుల నిజమైన కోర్కెలపై ఆధారపడిన ఒక వ్యవసాయ కార్యక్రమమును కాంగ్రెసు యేర్పరచడానికి ప్రయత్నాలు జరిగాయి. తాత్కాలికంగా ఒక వ్యవసాయ కార్యక్రమముగూడ అంగీకరించబడింది.

## కాంగ్రెసు వెలుపల ప్రజా సంరంభం :

కమ్యూనిస్టుపార్టీ ప్రచార ఫలితంగాను, కార్మికోద్యమ ప్రభావమువలననూ, జాతీయోద్యమములో పాల్గొన్న యువకుల్లో చాల మార్పుగల్గింది. గాంధితత్వముయెడల పూర్తి అసంతృప్తి గల్గింది. 1930-33 శాసనోల్లంఘనం విఫలమవడానికి కారణం బూర్జువా పోరాటపద్ధతులేనని గ్రహించారు. జైళ్ళనుంచి బైటకురాగానే సోషలిజంవైపుకు. కార్మికవర్గంవైపుకు వీరందరూ మరలడం ప్రారంభించారు. ముఖ్యంగా గ్రామాలనుండి జైళ్లకువెళ్ళిన యువకులు కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమములో పాల్గొనుటకు నిరాకరించి రైతులలోను, కూలీలలోను, యువకుల్లోను కమ్యూనిస్టుపార్టీ ప్రజా కార్యక్రమము ననుసరించి పనిజేయడం ప్రారంభించారు దానితో రైతుసంఘాలు, యువజనసంఘాలు, విద్యార్థిసంఘాలు బయలుదేరాయి. రైతుసంఘాలు రైతుల దైనందిన ఆర్థిక యిబ్బందులను తొల



గించడానికి ప్రయత్నించేటప్పటికి, రైతుల్లో యెన్నడూలేని సంచలనం ప్రారంభమైంది. నూతన చైతన్యం బయలుదేరింది. అలాగే విద్యార్థులలోను. యువకుల్లోనుగూడ. ఈ ప్రజా సంఘాల్లో పనిజేసేవారంతా కమ్యూనిస్టుపార్టీ, కార్మికవర్గపు ప్రభావం, పలుకుబడిక్రిందనేవున్నారు. వీరందరూ జాతీయోద్యమములో పాల్గొన్నవారగుటవలన వీరి కార్యకలాపాల ప్రభావం కాంగ్రెసుపైగూడ పడింది. కాంగ్రెసు సంఘాలు యీ ప్రజా వుద్యమానికి నాయకత్వం వహించాలని, బాగా దాన్ని అభివృద్ధి చేయడానికి పూనుకోవాలనే వత్తిడి కాంగ్రెసు నాయకత్వంపై వచ్చింది. అందుచేతనే కాంగ్రెసు లక్నో, ఫైజపూరు కాంగ్రెసులలో నూతన కార్యక్రమాన్ని అంగీకరించవలసివచ్చింది.

స్థానికంగా బయలు దేరిన ప్రజావుద్యమము అఖిలభారత స్వరూపం దాల్చింది. లక్నోకాంగ్రెసు (1936) నాటికి అఖిలభారత రైతుసంఘం యేర్పడింది. కార్మికోద్యమములో సంపూర్ణఐక్యత యేర్పడింది విద్యార్థి సంఘాలకు అఖిల భారత స్వరూపం రాకపోయినను ప్రతిరాష్ట్రంలో బయలుదేరాయి. ఈ విధంగా కాంగ్రెసుకు వెలుపల కమ్యూనిస్టుపార్టీ ప్రజాకార్యక్రమం ననుసరించి కార్మికోద్యమ ప్రభావంతో (బూర్జువావర్గ నాయకత్వముతో నిమిత్తం లేకుండా) ప్రజానాయకత్వం క్రింద స్వతంత్ర ప్రజావుద్యమము అభివృద్ధిగావడం ప్రారంభమైంది.

## కాంగ్రెసు సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తులన్నిటికి కేంద్రముగా మారింది :

కాంగ్రెసు లక్నోలోను, ఫైజ్‌పూరులోను (1936) యేర్పరచిన కార్యక్రమముతో కాంగ్రెసు ప్రతిష్ట, పలుకుబడి పూర్తిగా హెచ్చింది. కాంగ్రెసు చుట్టూయెన్నడూ జరుగినంత ప్రజాసమీకరణజరిగింది. భారతదేశములోని సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులన్నిటినీ కూడగట్టగల ఏకైకసంస్థఅయింది. కాని యింకాకాంగ్రెసు సంఘాలు సర్వత్రా యీకార్యక్రమాన్ననుసరించి పనిజేయడానికి పూనుకోలేదు. సోషలిస్టులు, సోషలిస్టు అభిమానుల అధీనంలోవున్న కాంగ్రెసు సంఘాలు మాత్రం యీకార్యక్రమాన్ననుసరించి పనిజేస్తున్నాయి. దానికికూడ కాంగ్రెసు మితవాద నాయకులు యెన్నో అడ్డంకులు కల్పిస్తూవున్నారు.

కాంగ్రెసు సామ్రాజ్యవాదవ్యతిరేక శక్తులకు కేంద్రంగామారినా యింకా కాంగ్రెసునాధారముగాగొని సామ్రాజ్యవాదశక్తులన్నిటినీ కాంగ్రెసు కార్యక్రమముపై ఐక్యపర్చి బలిష్టమైన జాతీయైక్య సంఘటన యింకా నిర్మింపబడలేదు: దానిని కాంగ్రెసు ద్వారా నిర్మించడానికి యెంతో అవకాశం యేర్పడింది. ఈ విషయాన్నే విపులీకరించుతూ కామ్రేడ్సు దత్తు, బ్రాడ్లీలు 1936 జనవరిలోఒకథీసిస్ ప్రకటించారు. కాంగ్రెసులోవచ్చిన మార్పులనుబట్టి, కాంగ్రెసుకు భారతదేశంలో వున్నస్థానంబట్టి కాంగ్రెసుద్వారా సామ్రాజ్యవాద వ్యతిరేక సంయుక్తసంఘటనను యెలా నిర్మించవచ్చునో, కమ్యూనిస్టులు, కార్మిక వర్గం యిందుకు తక్షణమే పూనుకోవలసిన అవసరం యెంతవుందో స్పష్టంగా తెలియ పర్చారు.

కాంగ్రెసు సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తులకు కేంద్రముగా మారడమేగాకుండా, విప్లవభావాలు, సోషలిస్టు భావాలుగల యువకుల్లో చాలమందికిగూడ కాంగ్రెసే కేంద్రంగావుంది. కాంగ్రెసు సోషలిస్టుపార్టీ కాంగ్రెసులో ఒక భాగంగా అప్పటికే యేర్పడింది. వీరుగాక సోషలిస్టు సానుభూతిగల అతివాదులలో హెచ్చుమంది కాంగ్రెసులోనే వుండిపోయారు.

1936 ఏప్రియల్‌లో జరిగిన లక్నో కాంగ్రెసునుండి జాతీయ కాంగ్రెసు ఆధునిక చరిత్ర ప్రారంభమైంది. ఇక్కడనుండి తీవ్రగతిని అభివృద్ధి పొందింది. 1937 సంవత్సరంలో జరిగిన అసెంబ్లీ యెన్నికల ఫలితంగా కాంగ్రెసు ప్రతిష్ఠ యెన్నోరెట్లు పెరిగింది ఎన్నికల ప్రచార ఫలితంగా బ్రహ్మాండమైన ప్రజాసంరంభం బయలుదేరింది. ఎన్నికలఅనంతరం కాంగ్రెసు సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తులకు మరింత కేంద్రంగా మారిపోయింది. జాతీయ సంయుక్త సంఘటన కాంగ్రెసు ద్వారా నిర్మించుటకు యెన్నో అవకాశాలు గల్గాయి.

## సంయుక్త జాతీయ సంఘటన రోజులు - పార్టీ నిర్మాణ ప్రయత్నాలు
## ( 1936 - 38 )

జాతీయ కాంగ్రెసుద్వారా సంయుక్త జాతీయ సంఘటనను నిర్మించడానికి అవకాశం యేర్పడిందని పైనచూశాం. ఈ అవకాశాన్ని వుపయోగించుకొని కాంగ్రెసుద్వారా విశాలమైన సంయుక్త జాతీయ సంఘటనను నిర్మించడం కమ్యూనిస్టుపార్టీ అప్పటి ప్రధమ కర్తవ్యం. కమ్యూనిస్టుపార్టీ చొరవతీసుకొని యిందుకు పూనుకోకపోతే జాతీయైక్య సంఘటన యేర్పడడం అసంభవం. ఎందుచేతనంటే యునైటెడ్ ఫ్రంటు వుద్యమము ప్రతి దేశంలోనుగూడ కమ్యూనిస్టుపార్టీ చొరవదీసుకొని పనిజేసినప్పుడే అభివృద్ధి అవడం, బూర్జువావర్గంగాని, దానికి తోకలుగావుండే సోషల్ డెమాక్రట్లు, రిఫార్మిస్టులుగాని యునైటెడ్ ఫ్రంటు వుద్యమాన్ని నిర్మించడానికి చొరవతీసుకొని పనిజేయకపోవడం చరిత్ర ప్రసిద్ధమైన విషయమే. కమ్యూనిస్టు పార్టీలు బలంగా వుండడాన్నిబట్టి, కార్మికోద్యమ ఐక్య సంఘటననుబట్టి యునైటెడ్‌ఫ్రంటు వుద్యమము అభివృద్ధి పొందుతూవుంటుంది.

కాన భారత దేశంలోగూడ సంయుక్త జాతీయ సంఘటనను కాంగ్రెసుద్వారా నిర్మించే బాధ్యత కమ్యూనిస్టు పార్టీపైన పడింది. 1937 జనవరిలో దత్తు, బ్రాడ్లీ థీసిస్ వచ్చినా, అది యింకా స్పష్టపర్చబడందే పార్టీ సభ్యులు కార్యాచరణకు పురికొల్పబడేటట్లులేరు. 1937 మార్చివరకు అప్పటిపార్టీ కేంద్రం దత్తు, బ్రాడ్లీల థీసిస్‌ను ఆధారంగాగొని కాంగ్రెసుద్వారా సంయుక్త జాతీయ సంఘటనను నిర్మించడానికి స్పష్టమైన కార్యక్రమము తయారుచేయడానికి, దానిపై పార్టీ సభ్యులందరిని ఐక్యపర్చి కార్యాచరణకు దింపడానికి పూనుకొంది. 1937 మార్చిలో లప్పటి "పొలిట్‌బ్యూరో" "సంయుక్త జాతీయ సంఘటన" కార్యక్రమాన్ని ప్రకటించింది. కాంగ్రెసులోను, కాంగ్రెసుబయట ప్రజా సంఘాలలోను "యునైటెడ్‌ఫ్రంటు" యెత్తులను యెలా కొనసాగించవలసిందీ, యెలా సంయుక్త జాతీయ సంఘటనను నిర్మించవలసిందీ యీ కార్యక్రమం స్పష్టంగా తెల్పింది. కాంగ్రెసులో సభ్యులుగా కమ్యూనిస్టులందరూ జేరాలి కాంగ్రెసు సంఘాలు చురుకుగా సంయుక్త జాతీయ సంఘటనా కార్యక్రమము ననుసరించి పనిజేసేటట్లు ప్రయత్నించాలి. బైటనున్న ప్రజా సంఘాలతో సన్నిహిత సంబంధం పెట్టుకొనేటట్లు చేయాలి. తద్వారా కాంగ్రెసు బైట ప్రజా సంఘాలద్వారా జరుపబడుచున్న ప్రజావుద్యమాన్ని, కాంగ్రెసుద్వారా జరుపబడు జాతీయవుద్యమాన్ని సమన్వయంజేసి ఒక బలిష్ఠమైన జాతీయసంఘటనను నిర్మించడానికి కాంగ్రెసు సంఘాలను సాధనాలుగా తయారయ్యేటట్లు కృషిచెయ్యాలి. ఇది కాంగ్రెసులో కమ్యూనిస్టులు గావించాల్సినపని ప్రజాసంఘాలు తమవర్గస్వార్థాలు



కాపాడుకోడానికి మాత్రమేగాకుండా సంయుక్త జాతీయ సంఘటనా కార్యక్రమాన్నంతా సాధించడానికి తమ వర్గ ప్రజలను సమీకరించి ఐక్యపర్చడానికిగూడ పనిజేసేటట్లు చేయాలి.

సంయుక్త జాతీయసంఘటనా వుద్యమములో ప్రజాసంఘాలు తమ యావచ్ఛక్తితో, తమ స్వతంత్ర పంథాతో ముందు శ్రేణిలోవుంటూ పాల్గొనకపోతే జాతీయ సంఘటనే యేర్పడదని వాటికి చెప్పాలి. అలాంటప్పుడు తమ వర్గ కోర్కెలకొరకు జరిపే పోరాటాలుగూడ జయప్రదం గావని హెచ్చరించాలి. ప్రజా సంఘాలు తమ స్వతంత్ర పలుకుబడిని ఆధారంగాగొని, స్వతంత్ర పంథాతో సంయుక్త జాతీయ సంఘటనా కార్యక్రమాన్ని సాధించడానికి రాజకీయంగా ముందుకు రాకపోవడం కేవలం "ఆర్థికతత్వ"మే అవుతుంది. ఇది ఒక తప్పుపోకడ. మరొక తప్పుపోకడ యేమంటే, జాతీయ బూర్జువా నాయకత్వం యిచ్చే రాజకీయ కార్యక్రమాన్ని బలపర్చుతూ ప్రజాసంఘాలు బూర్జువావర్గమునకు అనుబంధంగామాత్రమే వుండాలి; ప్రత్యేకసంఘాలుగా యేర్పడిననూ ప్రత్యేక రాజకీయపంథా వుండరాదు; స్వతంత్ర రాజకీయ శక్తిగా తయారవగూడదు. బూర్జువావర్గ రాజకీయ హద్దులలోనేప్రజా సంఘాలు తమ ఆర్థిక హక్కులకొరకు పనిజేసుకోవాలి. బూర్జువావర్గ రాజకీయ నాయకత్వాన్ని పూర్తిగా అంగీకరించాలి; ఇది మెన్షివిజం ఈ రెండు తప్పుపోకడలతో పోరాడుతూ ప్రజా సంఘాలు సంయుక్త జాతీయ సంఘటనా వుద్యమములో తమ సరియైన పాత్రను నిర్వహించడానికి కృషిజేస్తూవుండాలి. ఇది ప్రజాసంఘాలలో పనిజేసే కమ్యూనిస్టులపని. ఇటు కాంగ్రెసులోను, అటు ప్రజాసంఘాలలోను సంయుక్త జాతీయ సంఘటనను నిర్మించడానికే కమ్యూనిస్టులు పనిజేస్తూవుండాలి. ఇదే 1937 మార్చిలో పొలిట్‌బ్యూరో యిచ్చిన సంయుక్త జాతీయ సంఘటనా కార్యక్రమము యొక్క ముఖ్యసారాంశం.

ఈ కార్యక్రమముతో పార్టీనంతా పనిజేయించడం, అందుకు తగిన పార్టీనిర్మాణమును యేర్పరచడం అప్పటిపార్టీముఖ్యకర్తవ్యమని పైన చూశాం. 1936లోనే పార్టీయిందుకు పూనుకొన్నప్పటికిని 1938వ సం॥ ప్రారంభంవరకు పార్టీనంతటినీ సంయుక్త జాతీయసంఘటనా కార్యక్రమమునను సరించి పూర్తిగా కార్యాచరణకు దింపజాలకపోయింది. ఇందుకుకారణం పార్టీసభ్యులలో యింకా సెక్టేరియన్ ధోరణులు మిగిలివుండడమే. కాంగ్రెసు ద్వారా జాతీయ సంఘటనను నిర్మించగలమనే ఆత్మవిశ్వాసం వారిలో కల్గక పోవడమే.

ఆరోజుల్లో బయలుదేరిన ప్రజాసంరంభం యొక్కనూతన స్వభావాన్ని, దానికి వెనుకవున్న ముఖ్యమూలశక్తులను తెలుసుకోజాలక పోవడమే అప్పటిపార్టీ సభ్యులలో దిగబడివున్న సెక్టేరియనిజమునకు, ఆత్మవిశ్వాసం లేకపోవడానికి కారణం. 1934-1937 ల మధ్యబయలుదేరిన ప్రజా వుద్యమాన్ని నిర్మించుచున్నవారందరిపై కమ్యూనిస్టుపార్టీ, కార్మికోద్యమముల రాజకీయ ప్రభావం వుందనియు, వారిని ప్రత్యక్షంగాగాని పరోక్షంగాగాని నడిపించుతూవుంది కార్మికవర్గం, కమ్యూనిస్టుపార్టీఅనే విషయాన్ని గుర్తించడంలేదు. ఇంకోముఖ్యవిషయమేమంటే నూతన పంథాలో (కార్మికవర్గరాజకీయ పలుకుబడి క్రింద) యీ ప్రజావుద్యమము నిర్మింపబడుచున్ననూ దీనివలన కాంగ్రెసుప్రతిష్ఠ, పలుకుబడిబాగా హెచ్చుతోంది. (జాతీయోద్యమములో పాల్గొన్నయువకులే యీవుద్యమాన్ని నిర్మించడానికి పనిజేస్తున్నారు గాబట్టి) కాంగ్రెసు యీ నూతన ప్రజావుద్యమానికంతకు కేంద్రంగా మారిపోతోంది. (కాంగ్రెసు నాయకత్వం యేమీపనిజేయకుండా కూర్చునప్పటికిని) తత్ఫలితంగా కాంగ్రెసు కార్య

క్రమమే ప్రజాకార్యక్రిమముగా మారవలసివచ్చింది. (లక్నో, ఫైజ్‌పూరు.) ఈ విధంగా కాంగ్రెసులోను, నూతనంగా బయలుదేరిన ప్రజావుద్యమ స్వభావంలోను వచ్చిన ముఖ్యమార్పును గ్రహించకుండా వెనుకటివలెనే కాంగ్రెసు బూర్జువాఆర్గనైజేషన్ అని, దానిద్వారా ప్రజావుద్యమాన్ని, జాతీయ సంఘటనను నిర్మించడం అసంభవమని సెక్టేరియన్ దృకృధంతో పార్టీ సభ్యులలో కొంతమంది వున్నారు. కాంగ్రెసు సభ్యులుగా గూడ చేరుటకు నిరాకరించారు. ఇలాంటి వారందరితో తీవ్రంగా పోరాడవలసివచ్చుటచేత కాంగ్రెసుద్వారా సంయుక్తజాతీయ సంఘటనను నిర్మించడానికి పూనుకోవడానికి 1937 వరకు పార్టీచర్చించుతూనే కూర్చోవలసివచ్చింది. 1937 వ సంవత్సరం నాటికైనా ఒక నిశ్చితమైన కార్యక్రమము యివ్వగల్గడానికి కారణం 1936 లోనే అఖిలభారత రాజకీయ దృక్పధంతో, మార్క్సిస్టు - లెనినిస్టు పంధాను భారత రాజకీయ సమస్యలను చర్చించగల పార్టీ కేంద్రం యేర్పడి యుండడము. ఈ కేంద్రమే లేకపోయిన యెడల జాతీయసంయుక్త సంఘటనా రోజుల్లోపార్టీ గడించిన విజయాలు యేవీ లభించేవిగావు. కమ్యూనిస్టుపార్టీ ఒకప్రధాన రాజకీయశక్తిగా తయారయ్యేదిగాదు.

1936 లో యేర్పడ్డ పార్టీకేంద్రం 1936-37 సంవత్సరాలలోపల పార్టీసభ్యులందరినీ సంయుక్తి జాతీయ సంఘటనా కార్యక్రమముపై ఐక్యపర్చి 1938-39 సంవత్సరాల్లో పార్టీఅంతా ఒక టీమ్‌లాగ పనిజేసేటట్లు పునాదివేసింది. పార్టీకేంద్రం రాజకీయంగా, నిర్మాణరీత్యా యింకా హెచ్చు అనుభవాన్ని గడించింది. పార్టీకేంద్రం, పార్టీ రహస్యపత్రిక "కమ్యూనిస్టు" నిరాటంకంగా కొనసాగే యేర్పాట్లు యింకా భద్రంజేయుబడ్డాయి. ప్రథమపర్యాయంగా అఖిలభారత సంస్థలలో పార్టీ ఫ్రాక్షన్సును యేర్పరచగల్గింది. అఖిలభారత కాంగ్రెసు కమిటీలో, అ. భా. కిసాన్ సంఘంలోను, కాంగ్రెసు సోషలిస్టు పార్టీలోను పార్టీ ఫ్రాక్షన్సు యేర్పడ్డాయి. కేంద్రపార్టీ సలహాలతో, అ. భా. రాజకీయ దృక్పధంతో తమ తమ రంగాలలోని సమస్యలను పరిష్కరించుతూ పనిజేయడం సాగించాయి

పార్టీ సాధించిన కార్యాలు :

(1) పార్టీ కేంద్రం మరింత బలపడింది. రాజకీయంగా, నిర్మాణరీత్యా మరింత అనుభవాన్ని గడించింది.

(2) రాష్ట్రి కమ్యూనిస్టు గ్రూపులన్నిటితో పార్టీకేంద్రం రహస్య సంబంధాలు యేర్పరచుకొని యెప్పటికప్పుడు వాటిని అన్ని సమస్య ల్లో నడుపుతూవుంది. పార్టీ కేంద్రమంటే రాష్ట్రగ్రూపులకు విశ్వాసం, భక్తి హెచ్చుఅయి, క్రమశిక్షణతో పనిజేయడం ప్రారంభించాయి.

(3) పార్టీ అంతా రాజకీయంగా స్పష్టమైన కార్యక్రమముపై ప్రథమ పర్యాయంగా ఐక్యపర్చబడింది. జాతీయైక్య సంఘటనా కార్యక్రిమాన్ని పార్టీసభ్యులందరూ పూర్తిగా అంగీకరించి కార్యరంగంలోకి ఆత్మవిశ్వాసంతో పనిజేయడం ప్రారంభించారు. (అసెంబ్లీ యెన్నికలు)

(4) పార్టీ కేంద్రం యిదివరకంటే క్రమపద్ధతిని పనిజేయడం ప్రారంభించింది రాష్ట్ర గ్రూపులకు ప్రతి రాజకీయ సమస్యపైనను పార్టీ దృక్పధాన్ని తెలియపర్చుతూ సర్క్యులర్సు, పార్టీ సాహిత్యము ("కమ్యూనిస్టు"గాక) రెగ్యులర్‌గా పంపడం ప్రారంభించింది.



(5) అన్ని ప్రజాసంస్థలలోను ఒకే పాలసీతో పనిచేయడానికి పార్టీ అ. భా. ప్రజా సంఘాలన్నిటిలోను పార్టీ ఫ్రాక్షన్సు యేర్పరచింది. ఈ ఫ్రాక్షన్సును పార్టీకేంద్రం యెప్పటికప్పుడు నడుపుతూ వుండడానికి తగిన యేర్పాట్లు గావించింది. ఈ విధంగా పార్టీ అన్నిరంగాలలో ఒకే పాలసీతో, అ. భా. రాజకీయ దృక్పధంతో పనిజేయడం ప్రారంభించింది.

(6) పై ఫలితాలవలన పార్టీ భారతరాజకీయాలలో ఒక ప్రధాన రాజకీయశక్తిగా తయారగుటకు అవకాశం యేర్పడింది. 1937 వచ్చేసరికి పార్టీ ప్రజాంటుకుబడి అన్నిరంగాలలో (ఒక కార్మిక రంగంలోనేగాక) విస్తరించుతోంది, అన్ని రాష్ట్రాల్లోనూ పార్టీ కార్యకలాపాలు హెచ్చాయి.

పార్టీ బలహీనతలు

భారత రాజకీయాలకు సంబంధించిన రాజకీయ సమస్యలన్నిటిని పరిష్కరించుతూ పార్టీసభ్యులకు యెప్పటికప్పుడు పార్టీపాలసీని తెలియపర్చుతూ తద్వారా పార్టీసభ్యులలో రాజకీయైక్యతను యేర్పరచడానికి యిదివరకుకంటె చాల హెచ్చుకృషిని జేస్తోంది. ఇలాంటిపార్టీకేంద్రం అప్పటి పరిస్థితుల్లో యేర్పరచగల్గడం గొప్పవిజయమే కాని యింకాబలహీనత యేమంటే పార్టీరాజకీయ పాలసీని (జాతీయైక్యంఘటనను నిర్మించడం) పార్టీసభ్యులందరూ సరిగా అర్థంజేసుకోలేదు. దాన్ని తమతమ ప్రాంతాలలో అన్వయింపజేయడంలో పార్టీసభ్యులందరూ ఒకే ఆచరణను అనుసరించడం లేదు. అందుచేత నిజమైన రాజకీయైక్యత యింకారాలేదు. దీనికి కారణం పార్టీపాలసీని తెలుసుకోడానికి పార్టీరహస్య పత్రిక ఒక్కటేమార్గం అవడం, అదినెలకొక పర్యాయం రాష్ట్రాలకు వెళ్లడం వలన యీ లోగా వార్కిగావలసిన సలహాలుగాని, సూచనలుగాని పార్టీ కేంద్రం యిచ్చేస్థితిలో లేకపోవడం, పార్టీకేంద్రంనుండి రాష్ట్రాలకు పార్టీపాలసీని విశదీకరించడానికి కేంద్రపార్టీ ప్రతినిధులు తరచువెళ్లజాలకపోవడం (ఎప్పుడో రాష్ట్రిపార్టీనాయకుల మధ్య వ్యక్తిగత చీలికలు బయలుదేరినప్పుడుతప్ప.) పార్టీసభ్యులను ప్రతిసమస్యపై నడుపుతూ, వారితో బాగా సన్నిహితసంబంధాన్ని (రాజకీయంగా, నిర్మాణరీత్యా) పెట్టుకోగల్గిన పార్టీనిర్మాణం యింకా అభివృద్ధిగాకపోవడం పార్టీబలహీనత. పార్టీ సభ్యులలో యింకా కమ్యూనిస్టు క్రమశిక్షణగూడ యేర్పడలేదు.

## జాతీయైక్య సంఘటనా రోజులు—పార్టీ నిర్మాణ ప్రయత్నాలు

### ( 1938 – 39 )

### పార్టీ కార్యకలాపాలు భారతదేశమంతటా వ్యాపించాయి - పార్టీ రాజకీయశక్తిగా తయారయింది.

జాతీయైక్య సంఘటనా నినాదాల ననుసరించి అతివేగంగా అభివృద్ధిగాంచుచున్న ప్రజా వుద్యమమును నడుపుటకు పార్టీకేంద్రం గావించిన పార్టీనిర్మాణం యే మాత్రం సరిపోవుటలేదని 1937 ఆగస్టులో పార్టీ నాయకత్వం గుర్తించింది. అప్పటికి పార్టీ జనరల్ రాజకీయ నినాదాలపై పార్టీ సభ్యులలో రాజకీయైక్యత యేర్పడ్డమాటనిజమే. కాని అంతమాత్రమే చాలదు. ముఖ్య రాష్ట్రాలన్నిటిలో పార్టీ యేర్పడింది. పార్టీసభ్యులు ప్రజలకు నాయకత్వంవహించి వివిధరంగాల్లో పనిజేస్తున్నారు.

పార్టీ జనరల్‌పాలసీ ననుసరించి పనిజేస్తున్నప్పటికీ అనేక ప్రత్యేక స్థానిక సమస్యలు వుదయించు చున్నాయి. వీటన్నిటిని పరిష్కరించి తగు సూచనలు యెప్పటికప్పుడు యిస్తేనేగాని వారు ముందడుగు వేయడానికి అవకాశంలేదు. స్థానికంగా బయలుదేరే సమస్యలను స్థానికపార్టీ సభ్యులుగాని, రాష్ట్రకమిటీలుగాని సమగ్రముగా పరిష్కరించుకోగల రాజకీయ పరిపక్వత యింకా రాలేదు. రాష్ట్ర కమిటీలు యేర్పడ్డా అవి యింకా నామమాత్రంగానేవున్నాయిగాని స్థానికపార్టీ సభ్యులను ప్రతి చిన్న సమస్యలలోను సూచనలిచ్చి నడుపగల స్థితిలోలేవు.

రాష్ట్రకమిటీలు కొన్ని (ఆంధ్ర, బెంగాల్, పంజాబ్) తమ దేశభాషలలో పార్టీ పత్రికలనుగూడ స్థాపించాయి. వాటికి ప్రతివారం పార్టీకేంద్రం భారతరాజకీయాలకు సంబంధించిన ప్రతిసమస్యమీద, స్థానికంగావచ్చే సమస్యలమీద సూచనలు యిచ్చి నడపకపోతే వాటంతటవే పార్టీ పత్రికలను నడుపుకోగల శక్తిలేదు. ఇవి పార్టీనిర్మాణరీత్యా పార్టీ కేంద్రాన్ని యెదుర్కొన్న సమస్యలు

అంతేగాకుండా 1937 అస్సెంబ్లీ యెన్నికలనంతరం, కాంగ్రెసు రాష్ట్రాల్లో మంత్రివర్గాలను స్థాపించిన తరువాత, పార్టీకేంద్రం రాజకీయంగా పరిష్కరించవలసిన సమస్యలు చాలా హెచ్చాయి. కాంగ్రెసు మంత్రివర్గాలు అవలంబించే పాలసీగూర్చి యెప్పటికప్పుడు పార్టీ పాలసీని స్పష్టపర్చవలసివచ్చింది. ప్రతి రంగంలోను ప్రజా సంఘాలద్వారా అభివృద్ధి అవుతున్న ప్రజా వుద్యమాన్ని యెప్పటికప్పుడు నడుపుతూ సలహా లివ్వాల్సివుంది. ప్రజా రంగాలకుగూడ జనరల్ పాలసీ యిస్తే చాలడంలేదు. వేర్వేరు రంగాలకు, వేర్వేరు విధాలగా స్పష్టమైన కార్యక్రమమిస్తేనేగాని ఆ రంగాలలో పనిజేసే కార్మేడ్సు సరిగా పనిజేయలేకపోతున్నారు. ప్రజా పోరాటాలనుగూర్చి గూడ పార్టీకేంద్రం యెప్పటికప్పుడు ఆపోరాటాలలో పాల్గొంటూవున్న కామ్రేడ్సుకు సలహాలిస్తుంటే తప్పితే అవి జయప్రదంగా సాగేటట్టులేవు.

ఈ విధంగా పార్టీ కేంద్రాన్ని రాజకీయంగాను, నిర్మాణరీత్యా అనేక సమస్యలు యెదుర్కొన్నాయి. వీటిని పరిష్కరించడానికి పార్టీకేంద్రం నిర్మించిన పార్టీ నిర్మాణంగాని రహస్యంగా ఉత్పత్తి జేసే సాహిత్యంగాని యేమీ సరిపోవుటలేదు.

**"నేషనల్‌ఫ్రంటు" ప్రచురించబడుట.**

పార్టీసభ్యులను, యూనిట్లను పార్టీ జనరల్ పాలసీపైననే రాజకీయంగాఐక్యపర్చడం సాధ్యంగావడం లేదనీ, యెప్పటికప్పుడు స్థానికంగా ఉద్భవించే సమస్యలను రాజకీయంగా పరిష్కరించి వారికి తగిన సూచనలు, సలహాలు యిస్తూ నడుపుతూవున్నప్పుడే నిజమైన రాజకీయైక్యత యేర్పడుటకు అవకాశముందని పైన చూశాం. ఇది పార్టీ యేనెలకొకపర్యాయమో రహస్యపత్రికను ప్రచురించడంద్వారా సాధ్యంగాదు. అందుకు ప్రతివారం లీగల్‌గా వెలువడే పార్టీ వారపత్రిక వుండుట చాల అవసరం. అందుచేత యింగ్లీషులో "నేషనల్‌ఫ్రంటు" అనే వారపత్రికను పార్టీకేంద్రం ప్రచురించడానికి నిశ్చయించింది.

ఆకాలంలో కాంగ్రెసు మంత్రివర్గాలు పరిపాలన జేస్తుండడం వలన పార్టీ లీగల్ వారపత్రికను ప్రచురించడానికి లీగల్ అవకాశాలున్నాయి. వాటిని పూర్తిగా వుపయోగించుకొని ముందడుగు వేయకపోతే పార్టీనిర్మాణం అభివృద్ధిగాదు; ప్రజావుద్యమమును వున్నత స్థాయికి తీసుకుపోవడానికి వీలుండదు. కాన పార్టీకేంద్రం 1938 జనవరిలో "నేషనల్‌ఫ్రంటు"ను ప్రచురించింది.



"నేషనల్‌ఫ్రంటు"ను పార్టీకేంద్రం ప్రచురించడంవలన పార్టీ నిర్మాణము బాగా ముందుకు పోయింది. ఇది భారతదేశ పార్టీనిర్మాణంలో ఒకచరిత్రాత్మకమైన ఘటన. "నేషనల్‌ఫ్రంటు"ను ప్రతివారం నడపడంలో పార్టీకేంద్రం మరింత రాజకీయంగా, నిర్మాణరీత్యా బలపడింది. అన్నివిధాలా కేంద్రపార్టీ నాయకత్వం రాజకీయ నిర్మాణపు ఐక్యతను సాధించగల్గింది. అలాగే ముఖ్యరాష్ట్రాల్లో "నేషనల్‌ఫ్రంటు" ప్రచురించబడిన తరువాత రాష్ట్ర నాయకత్వాలు రాజకీయంగా యెన్నోరెట్లు ఐక్యపడ్డాయి. రాష్ట్ర, కేంద్ర నాయకత్వాలకు వున్న రాజకీయ అంతరం బాగా తగ్గింది దానివలన పార్టీ భారతదేశ మొత్తంమీద రాజకీయంగా ఐక్యపర్చబడ్డ ఒక టీమ్‌లాగ పనిజేయడం ప్రారంభించింది.

"నేషనల్‌ఫ్రంటు" యే కొద్దిమంది పార్టీనాయకుల పత్రిగా గాక భారతదేశము అంతటా కమ్యూనిస్టు వుద్యమ పత్రికగా గుర్తించబడింది. కార్మిక, కర్షక, యువజన, విద్యార్థి, కాంగ్రెసు సంఘాలద్వారా దినదినం అభివృద్ధి గాంచుతూ ఒక ప్రత్యేక రాజకీయశక్తిగా తయారగుచున్న కమ్యూనిస్టు వుద్యమంయొక్క పత్రికగా అందరిచే గుర్తించబడింది.

ప్రజాసంఘాలలో పనిజేసే పార్టీసభ్యులకు, పార్టీపాలసీ ననుసరించి పనిజేసే పార్టీయేతరులకు, దేశభక్తులకు నేరుగా పార్టీపాలసీని ప్రతివారం అన్ని సమస్యలపైననూ అందజేస్తూ వుంటూవుండేది. ప్రతివారం వివిధరంగాల్లోని ప్రజావుద్యమాభివృద్ధిగూర్చి, భారతదేశము మొత్తముమీద జాతీయ సంయుక్త సంఘటనా వుద్యమముగూర్చి స్పష్టంగా ప్రజలందరికి తెలియపర్చుతూ, ఒకచోట అనుభవము మరొకచోటికి తెలియపర్చుతూవుండేది. జాతీయ, అంతర్జాతీయ సంఘటనలగూర్చి ప్రతివారం విశదీకరిస్తూ జాతీయంగా, అంతర్జాతీయంగా జాతీయైక్యతావుద్యమము, ఫేసిస్టు, యుద్ధ వ్యతిరేకవుద్యమాలు యెలా అభివృద్ధి అవుతూవుందీ, వాటి అభివృద్ధికి యెవరు అడ్డంకుగావుందీ బహిరంగపర్చుతూ పార్టీసభ్యుల, రాజకీయ పరిజ్ఞానమున్న ప్రజల రాజకీయవిజ్ఞానాన్ని ఒక క్రమపద్ధతిలో అభివృద్ధి పర్చుతూవుంది. జాతీయైక్యసంఘటనా వుద్యమముపై ప్రభుత్వం గావించే ప్రతి చిన్న నిర్బంధాన్ని, అడ్డంపను బహిర్గతముచేస్తూ ప్రతివారం ప్రభుత్వ పాలసీ నిజస్వరూపాన్ని ప్రజలకు బట్టబయలు జేస్తూండేది. అలాగే జాతీయైక్యతావుద్యమానికి కాంగ్రెసు మితవాద నాయకత్వం, కాంగ్రెసు మంత్రివర్గాలు తమ రాజీపంథాతో గావించే విచ్ఛిన్నచర్యలనుగూడ నిర్భయంగా బహిరంగపర్చుతూ ప్రజల కర్తవ్యాన్ని తెలియపర్చుతూవుండేది.

ఈ విధంగా "నేషనల్‌ఫ్రంటు" పార్టీ నాయకత్వం పలుకుబడిక్రింద వివిధ ప్రజారంగాల్లో ప్రజా వుద్యమమును, ఆందోళనను అభివృద్ధిజేయడానికి, దేశంమొత్తంమీద కమ్యూనిస్టుపార్టీ ఒక రాజకీయశక్తిగా తయారగుటకు బాగా తోడ్పడింది. జాతీయైక్య సంఘటనను నిర్మించడానికి నాయకత్వం వహించి పనిజేసింది.

## ఈ కాలంలో పార్టీ సాధించిన విజయాలు

"నేషనల్‌ఫ్రంటు" ప్రతివారం పార్టీ సభ్యులకు యిచ్చే రాజకీయ సూచనలు, సలహాల ననుసరించి (Political guidance) వివిధప్రజారంగాల్లోనూ, భారతదేశ మొత్తంమీదను ప్రజా సంరంభం బాగా హెచ్చయింది. తత్ఫలితంగా పార్టీ జాతీయరంగంలోను, కార్మిక, కర్షక, విద్యార్థి వగయిరా ప్రజారంగాల్లోను ముఖ్యమైన కొన్ని విజయాలు సాధించింది.

**జాతీయ రంగం :**

ఫెడరేషన్‌కు వ్యతిరేకంగా, ప్రజా ప్రతినిధి పరిషత్‌ను స్థాపించడానికి, అనుకూలంగా జాతీయ ప్రజా పోరాటాన్ని అభివృద్ధిజేయడానికి అంగీకరించిన అతివాదులందరిని కాంగ్రెసులోపల జాతీయైక్య సంఘటనా నినాదంపై ఐక్యపర్చడానికి చొరవతీసుకొని కమ్యూనిస్టులు పనిజేశారు. చాలమట్టుకు అతివాదులను యిందుకు కూడగట్టారు. కాంగ్రెసు సోషలిస్టుపార్టీలో ఒక ప్రధాన భాగంగావుండి అందులోని సోషలిస్టులందరిని మార్క్సిజము - లెనినిజమువైపుకు, కార్మికవర్గ పంథాకువైపుకు ఆకర్షించి కాంగ్రెసు సోషలిస్టు నాయకులనుండి వారిని వేరుచేయగల్గారు. సోషలిస్టులను చాలభాగం కమ్యూనిస్టుపార్టీ రాజకీయ పాలసీపైన ఐక్యపర్చడంద్వారా సోషలిస్టు ఐక్యతను విచ్ఛిన్నం గావీయకుండా చూసారు, ఇంతేగాకుండా కాంగ్రెసు సంఘాలకు ప్రజాసంఘాలకు సన్నిహితసంబంధం యేర్పడేటట్లు కృషిజేసి కొన్నిచోట్ల జయం పొందారు. (కాన్పూరు, ఖాండేష్, కలకత్తా) కాంగ్రెసు మంత్రివర్గాలు ప్రభుత్వ నిరంకుశోద్యోగులకు వ్యతిరేకంగా బలంగా పోరాడుటకు వాటిని బైట ప్రజావుద్యమాన్ని అభివృద్ధిజేయుటద్వారా బలపర్చారు. (ఆంధ్రలో రైతుయాత్ర, బొంబాయిలో, కాన్పూరులో కార్మిక ప్రదర్శనాలు, సమ్మెలు; దేశమంతటా విద్యార్థి ప్రదర్శనాలు వగయిరా) కాంగ్రెసు సంఘాలకు, ప్రజా సంఘాలకు సన్నిహితసంబంధం యేర్పరచడానికి ప్రజా సంఘాల తరఫున జరుపబడిన పోరాటాలను నిజమైన ప్రజా పోరాటాలుగా జేయుటకు కాంగ్రెసుసంఘాలు పూనుకొనేటట్లు చేశారు. (మలబారు, కాన్పూరు, ఖాండేష్, బెంగాల్) ఈ విధంగా కమ్యూనిస్టులు జాతీయరంగంలో సాధించిన విజయాల ఫలితంగా కాంగ్రెసులోను, జాతీయరంగంలోను వారు రాజకీయశక్తిగా పరిగణింపబడ్డారు. ప్రజా రంగాలలో హెచ్చుభాగం కమ్యూనిస్టు నాయకత్వం నెలకొల్పబడింది.

**కార్మికరంగం :**

1936-37 లలో కార్మికసమ్మెలు బాగా హెచ్చాయి. ఈ సమ్మెలకు ప్రజాదరణ సంపాదించబడింది. కాన్పూర్ సమ్మె, కలకత్తా జూట్‌పరిశ్రమలో సమ్మెలు కార్మికరంగంలో పార్టీకి గొప్ప విజయాలను సాధించాయి. కార్మికోద్యమ ఐక్యత కొరకు కృషి కొనసాగింపబడుతూనే వుంది. కొంతజయముగూడ లభించింది. ఈ సందర్భంలో అఖిల బెంగాల్ జూట్‌వర్కర్సు యూనియన్ ఏర్పడడం, కాన్పూరు మజ్‌దూర్ యూనియన్‌లో సోషలిస్టులతోను, కాంగ్రెసువాదులతో ఐక్యత యేర్పరచడం జి. ఐ. పి. రైల్వేయూనియన్‌లో గల్గవచ్చిన ఐక్యత - ముఖ్య విజయాలు. అ. భా. ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసుకు నేషనల్ ఫెడరేషన్ ఆఫ్ లేబర్‌కు ఐక్యత మరింత బలపడింది. ఐక్య కార్మికోద్యమములో క్రమేణా పార్టీబలం, ప్రత్యేక పలుకుబడి హెచ్చుతోంది. క్రొత్త ప్రదేశాలకు కార్మికోద్యమము పార్టీ నాయకత్వము క్రింద వ్యాపించింది. (మలబార్, మద్రాసు, బెంగాలులో కొన్ని ప్రదేశాలు) షోలాపూర్, ఖాండేష్‌లలోని కార్మికోద్యమము పార్టీకి పట్టుగొమ్మ అయింది. భారతదేశ మొత్తంమీద, యీ విధంగా, పార్టీ కార్మికవర్గ పలుకుబడి హెచ్చింది. బొంబాయి, కాన్పూరు, ఖాండేష్, వగైరా బాగా రాజకీయాభివృద్ధి వున్న ప్రదేశాలలో కార్మికులు జాతీయైక్యతా వుద్యమానికి పట్టుగొమ్మగా వుంటూ ప్రజలను ఐక్యపర్చుచున్నారు. క్రొత్తగా అనేకమంది కార్మికవర్గమునుండి మిలిటెంట్లు పార్టీవైపుకు ఆకర్షింపబడు చున్నారు. కాని వీరి నందరినీ పార్టీ నిర్మాణములోనికి గొనిరాలేకపోవడం అప్పటి గొప్ప బలహీనత,



అందుచేత పార్టీకి కార్మికవర్గంపై పలుకుబడివున్నా పార్టీలో కార్మికసభ్యత్వం చాల కొద్దిగామాత్రమే వుండిపోయింది.

**రైతురంగం :**

రైతు వుద్యమము 1930 లో వచ్చిన ఆర్థిక సంక్షోభఫలితంగా రైతుల్లోగల్గిన తీవ్రఅసంతృప్తి వలననూ, 1930-33 సంవత్సరాలల్లో జరిగిన శాసనోల్లంఘనంద్వారా రైతుల్లో జనించిన చైతన్య ఫలితంగా 1935 నుండి భారతదేశమంతటా రైతువుద్యమము బయలుదేరింది. అయితే యిచ్చట గమనించాల్సిన ముఖ్యవిషయ మొకటుంది. కాంగ్రెసునాయకత్వమే యీవుద్యమాన్ని లేవదీయలేదు. స్వతంత్ర వుద్యమముగా బయలుదేరింది. శాసనోల్లంఘనంలో పాల్గొన్న రైతుయువకులు, అతివాద భావాలుగల కాంగ్రెసువర్కర్లు కాంగ్రెసుపోరాటపద్ధతులతో అసంతృప్తిజెంది నూతన పోరాటపద్ధతుల కొరకు వెతకడం ప్రారంభించారు. కార్మికసమ్మెలు, కార్మికోద్యమముద్వారా ఉత్తేజపడి ఆ పద్ధతుల ద్వారా రైతువుద్యమాన్ని నిర్మించడానికి స్వతంత్రంగా పూనుకున్నారు. అందుచేత కిసాన్ వుద్యమము కార్మికవర్గ పలుకుబడిక్రింద, కమ్యూనిస్టుపార్టీ పలుకుబడిక్రింద స్వతంత్ర వుద్యమముగా అభివృద్ధి అయింది. 1920-22 సంవత్సరాలలో కాంగ్రెసునాయకత్వంక్రిందను, దానంతటదే అభివృద్ధి అయిన కిసాన్ వుద్యమానికి, యీ కాలములోని కిసాన్ వుద్యమానికి అది భేదం.

పార్టీ యూనిట్లువున్న ప్రాంతాలన్నిట్లో కిసాన్ వుద్యమాన్ని నిర్మించాము. పార్టీ నాయకత్వం క్రింద అనేక రైతు పోరాటాలు నడిపాము. లక్షలాదిరైతులు ఎఱ్ఱజెండాక్రింద పనిజేశారు. 1927-29 సంవత్సరాలల్లో కార్మికోద్యమము పార్టీ నాయకత్వము క్రింద యెలా అభివృద్ధిచెందిందో 1937-39 సంవత్సరాలల్లో కిసాన్ వుద్యమముగూడ అలాగే పార్టీ పలుకుబడిక్రింద, యెఱ్ఱజెండాక్రింద వృద్ధిజెందింది.

కిసాన్ నాయకులలో కమ్యూనిస్టులేగాకుండా కాంగ్రెసువాదులు అతివాద జాతీయవాదులు కాంగ్రెసు సోషలిస్టులుగూడ వున్నారు. వీరందరిలో చీలికలు యేమీ కలుగకుండా కిసాన్ నాయకత్వంలో ఐక్యతవుండేటట్లు కమ్యూనిస్టులు బాగా కృషిచేశారు. కిసాన్ వుద్యమము జాతీయోద్యమమునకు ప్రత్యర్థిగా అభివృద్ధిగాకుండా పార్టీ చూసింది. స్వతంత్ర ప్రజావుద్యమముగా అభివృద్ధిజేస్తూ, జాతీయైక్యతా వుద్యమములో ఒక ప్రధానభాగంగా వుండేటట్లు పార్టీ చూసింది. 1938-39 లో కిసాన్ వుద్యమము తీవ్రగతిని అభివృద్ధిఅయి గొప్ప ప్రజావుద్యమమైయింది. కాంగ్రెసు మంత్రులు రైతుల కోర్కెలు తీసుకుని వాటిని త్వరగా సాధించడానికి వారిపై ఒత్తిడి తీసుకురాబడింది. అందుచేత కిసాన్ వుద్యమాన్ని కాంగ్రెసు మంత్రులు హర్షించలేదు. కాంగ్రెసుకు, కిసాన్ సభలకు చీలికలు తీసుకురావడానికి అనేక ప్రయత్నాలు మితవాదులు, మంత్రులు ప్రయత్నించారు. కిసాన్‌సభలోవున్న జాతీయ అతివాదులు యీ చర్యలకు రెచ్చిపోయారు. కాని కిసాన్ వుద్యమము అటు మితవాదుల చర్యలనుండి యిటు అతివాదుల చర్యలనుండి విచ్ఛిన్నముగాకుండా జాతీయైక్యసంఘటన విచ్ఛిన్నం గాకుండా కమ్యూనిస్టులు తీవ్రకృషి గావించారు. ఆ విధంగా జేస్తూ కిసాన్ వుద్యమ వ్యాప్తికి యెంతో తోడ్పడ్డారు.

కాని కొన్ని లోపాలుగూడ కమ్యూనిస్టులు చేశారు.

(1) కిసాన్ వుద్యమము కార్మికోద్యమమునకు ముఖ్య అండగావుండాలనే ప్రధాన సూత్రాన్ని సిద్ధాంతరీత్యా, ఆచరణలోను ముఖ్యకిసాన్ నాయకులు, కేడరు గ్రహించేందుకు కమ్యూనిస్టుపార్టీ కృషిజేయలేదు. (2) కిసాన్ మిలిటెంట్లను నిజమైన కిసాను కేడరుగాను, పార్టీసభ్యులుగాను అభివృద్ధి జేయడానికి పార్టీ పూనుకోలేదు. అందుచేత కిసాన్ వుద్యమములో పార్టీపలుకుబడి వ్యాపించినట్లుగా పార్టీ నిర్మాణము అభివృద్ధిగాలేదు. కిసాన్ వుద్యమముగాగూడ ఆందోళనదశలోనే వుండిపోయింది, గాని సంఘటిత పద్ధతులలో నిర్మింపబడలేదు. అందుచేత సామ్రాజ్యవాదయుద్ధకాలములో కిసాన్ నాయకులు ప్రభుత్వ నిర్బంధానికి గురి అయ్యేసరికి కిసాన్ వుద్యమాన్ని నడిపేకేడరే లేకపోయింది.

## విద్యార్థిరంగం :

ఈకాలంలోనే విద్యార్థి వుద్యమము నిర్మింపబడింది. ప్రారంభంనుండి విద్యార్థి వుద్యమము కమ్యూనిస్టులు, సోషలిస్టుల నాయకత్వంక్రింద పలుకుబడిక్రిందనే వుంటూ వచ్చింది.

1927-29 యువజనోద్యమములో బాగా పనిజేసిన కేడరు అంతా విద్యార్థివుద్యమములోకి వచ్చారు; అదే విద్యార్థివుద్యమముగా మారింది. 1934-35 లో బెంగాల్లో రాష్ట్రమంతటా వ్యాపించి, తరువాత భారతదేశమంతటా విద్యార్థివుద్యమము ప్రాకింది. మద్రాసులో జరిగిన ద్వితీయ అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్ సమావేశంలో సోషలిస్టులు విద్యార్థివుద్యమములో చీలికలు తీసుకువచ్చి కమ్యూనిస్టులను తరిమివేయాలని ప్రయత్నించారు. కాని పార్టీ, తదితర అన్నిరంగాలలో వలెనే యిచ్చటగూడా ఐక్య విద్యార్థి వుద్యమమును నిర్మించడానికి పూనుకొంది. విద్యార్థి వుద్యమ ఐక్యతను కాపాడగల్గింది. పార్టీ నాయకత్వముక్రింద విద్యార్థి వుద్యమ ఐక్యతను కాపాడుతూ విద్యార్థి వుద్యమాన్ని అన్ని రాష్ట్రాలకు వ్యాపింపజేసింది. జాతీయ వుద్యమములో విద్యార్థి వుద్యమము బాగా మిలిటెంటు పాత్రవహించింది. కమ్యూనిస్టు నాయకత్వంక్రింద బెంగాల్‌లో అండమాన్ ఖైదీల విడుదలకొరకు గావించిన ఆందోళన అద్వితీయమైనది. భారతదేశ విద్యార్థి వుద్యమానికంతకూ అది యెంతో వుత్తేజాన్ని కలుగజేసింది.

విద్యార్థి రంగంలో పార్టీ సాధించినది యేమంటే విద్యార్థి వుద్యమ ఐక్యతను కాపాడుతూ దాని వ్యాప్తికి, విస్తరణకు తీవ్రకృషి జేయడం. పార్టీ నాయకత్వంక్రింద విద్యా స్వాతంత్ర్యముకొరకు, విద్యార్థి హక్కులకొరకు, విద్యార్థులపై గావించే నిర్బంధానికి వ్యతిరేకంగా విద్యార్థిపోరాటాలు ఎన్నో జరుపబడి జయప్రదమయ్యాయి. విద్యార్థి ప్రజాసామాన్యమునంతను వైజ్ఞానిక వగైరా ప్రచార పద్ధతులద్వారా విద్యార్థి వుద్యమానికి ఆకర్షించడానికి, తద్వారా జాతీయోద్యమములో పాల్గొనేటట్లు చేయడానికి పార్టీ తీవ్రకృషి గావించి విద్యార్థుల విశ్వాసాన్ని యెంతో చూరగొంది. పార్టీ ప్రతిష్ట, పలుకుబడి విద్యార్థులలో చాల విపరీతంగా అభివృద్ధి అయ్యాయి.

## సోషలిస్టు ఐక్యతను నెలకొల్పడానికి కమ్యూనిస్టుల కృషి :

అప్పుడు గాంధితత్వము అంటే అసంతృప్తిజెంది సోషలిజంవైపుకు, కార్మికవర్గంవైపుకు ఆకర్షింపబడుచున్న జాతీయ యువకులను సరియైన మార్క్సిస్టు - లెనినిస్టు పంథాన తర్ఫీతుజేసి వారి



నందరిని అప్పటికే యేర్పడివున్న కార్మికవర్గ రాజకీయపార్టీ అయిన కమ్యూనిస్టుపార్టీలో సంఘటించడానికి కాంగ్రెసు సోషలిస్టుపార్టీ యేర్పడడంవలన పెద్ద అడ్డంకు అయిందనియు, యీ విధంగా కాంగ్రెసు సోషలిస్టుపార్టీని యేర్పరచినవారు సోషలిస్టు వుద్యమానికే, కార్మికవర్గ రాజకీయ పార్టీకే హానిజేసారని పామీదత్తు 1934 లో (కాంగ్రెసు సోషలిస్టుపార్టీ యేర్పడ్డప్పుడు) చెప్పాడని యిదివరలో చూశాం. దాన్ని పార్టీలో అపార్థంచేసుకున్నారు. కాంగ్రెసు సోషలిస్టుపార్టీ సోషలిస్టుపార్టీయేగాదని, సోషలిస్టు పదజాలాన్ని వుపయోగించే అతివాదుల సంఘంమాత్రమే అని కాంగ్రెసు సోషలిస్టుపార్టీని అనడం పారంభించారు. ఇది తప్పువాదన. పామీదత్తు చెప్పింది కాంగ్రెసు సోషలిస్టుపార్టీ సోషలిస్టు పార్టీయేగాదనిగాదు. సోషలిస్టు భావాల్తో కూడుకునివున్న వారందరూ ఒకే పార్టీలో (అది కమ్యూనిస్టుపార్టీ) వుండాలనియు, రెండు కార్మికవర్గ రాజకీయపార్టీ లుండరాదనియు, కాంగ్రెసు సోషలిస్టు పార్టీని యేర్పరచకుండా సోషలిస్టు భావాలుగలవారి నందరినీ కమ్యూనిస్టుపార్టీలో చేర్చాలనియు, కాంగ్రెసు సోషలిస్టుపార్టీని స్థాపించమంటే పైదానికి విరుద్ధంగా జేయడమనీ స్పష్టపర్చాడు. ఇది నిజమైన సోషలిస్టుపార్టీని నిర్మించడంగాదు; నిజమైన సోషలిస్టుపార్టీని (కమ్యూనిస్టుపార్టీని) బలహీనపర్చడం అవుతుందని కాంగ్రెసు సోషలిస్టు సంస్థాపకులకు విజ్ఞప్తిజేశాడు. కాని కమ్యూనిస్టుపార్టీ నిర్మాణము బలహీనంగా వుండుటచేత సోషలిస్టు భావాలుగల జాతీయ యువకులందరినీ పార్టీలో సంఘటితపర్చలేక పోయింది. వారందరూ వేరే పార్టీగా (కాంగ్రెసు సోషలిస్టుపార్టీగా) సంఘటితపర్చబడ్డారు. ఈ పరిస్థితులలో కమ్యూనిస్టులపని రెండుపార్టీలకు మధ్య ఐక్యత యేర్పరచి ఒకే ఒక సోషలిస్టుపార్టీని యేర్పరచడం; అది సాధ్యంగాక పోతే సోషలిస్టు ఐక్యతకు అడ్డంగావున్న నాయకుల పలుకుబడిని క్షీణింపజేసి వారిని రేంక్ అండ్ ఫైల్ సోషలిస్టులనుండి వేరుజేసి వారి నందరిని పార్టీలో యిముడ్చుకొని పార్టీ నిర్మాణమును బాగా బలపర్చడం.

ఈ వైఖరితో కాంగ్రెసు సోషలిస్టుపార్టీలో కమ్యూనిస్టులు పనిజేశారు. కాంగ్రెసు సోషలిస్టు పార్టీ నాయకత్వం (హెచ్చుభాగం) బూర్జువా సంస్కరణ వాద పోకడతో పనిజేస్తోంది. (సోషలిస్టు పార్టీ కార్మికవర్గంపై ఆధారపడ నవసరంలేదు. అందుచేత దాన్ని స్వతంత్రరాజకీయశక్తిగా అభివృద్ధి జేసి జాతీయరంగంలో స్వతంత్రపంథాతో పాల్గొని జాతీయోద్యమముపై బూర్జువావర్గమునకున్న పలుకుబడిని క్షీణింపజేసి కార్మికవర్గ రాజకీయ పలుకుబడిని హెచ్చుజేయడానికి అంగీకరించరు. జాతీయ బూర్జువా రాజకీయనాయకత్వమును తొలగించడానికి అంగీకరించరు.) అందుచేత కాంగ్రెసు సోషలిస్టుపార్టీ నాయకత్వం ఒకేఒక కార్మికవర్గ రాజకీయ పార్టీని యేర్పరచడానికి ఎన్నడూ అంగీకరించలేదు. అందుచేత కాంగ్రెసు సోషలిస్టునాయకుల పలుకుబడి రేంక్ అండ్ ఫైల్ సభ్యులపై లేకుండా జేసి వారిని పార్టీలోనికి ఆకర్షించడానికే ప్రయత్నించారు. ఈ వుద్దేశ్యంతో కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో జేరి స్థానిక యూనిట్లను చాలచోట్ల నిజమైనపార్టీ యూనిట్లుగా పార్టీపంథాలో పనిజేయించారు. కమ్యూనిస్టుపార్టీసభ్యులే కాంగ్రెసు సోషలిస్టుపార్టీ యూనిట్లను యేర్పరచవలసినప్రదేశాల్లో (మద్రాసు, తమిళనాడు) వాటిని మొదటినుండి కమ్యూనిస్టుపార్టీపంథాలోనే పనిజేయించారు. కేరళరాష్ట్రంలో మొదటినుంచీ పార్టీసంబంధం పెట్టుకొని అచ్చటి కాంగ్రెసు సోషలిస్టుపార్టీని కమ్యూనిస్టుపార్టీగా అభివృద్ధిజేసింది. తదితర ప్రదేశాల్లో (కాంగ్రెసుసోషలిస్టు నాయకులే కాంగ్రెసు సోషలిస్టుపార్టీని స్థాపించినచోట్ల) స్థానిక యూనిట్లలో సోషలిస్టుపార్టీ కార్యక్రమాన్ని అక్షరాలఅనుసరిస్తూ బాగా కాంగ్రెసు సోషలిస్టుపార్టీకి విశ్వాసపాత్రులుగా పనిజేసి అచ్చటి రేంక్ అండ్ ఫైలు సభ్యుల నందరినీ పార్టీ

వైపుకు ఆకర్షించగలిగారు. ఈ విధంగా 1937-39 సంవత్సరాలకు మధ్య పార్టీ కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో బాగా పనిజేసే రేంక్ అండ్ ఫైల్ సభ్యులను పార్టీవైపుకు లాగింది. 1938 లో కాంగ్రెసు సోషలిస్టుపార్టీ నాయకులు కమ్యూనిస్టుల పలుకుబడిని గుర్తించి కాంగ్రెసు సోషలిస్టుపార్టీలోనుండి తరిమివేయాలని ప్రయత్నించారు. కాని కాంగ్రెసు సోషలిస్టుపార్టీలోనే కమ్యూనిస్టులకున్న బలాన్ని బట్టి యేమీ జేయజాలకపోయారు. సామ్రాజ్యవాదయుద్ధం వచ్చేసరికి, కమ్యూనిస్టుల కృషిఫలితంగా కాంగ్రెసు సోషలిస్టుపార్టీ సభ్యులు చాలమంది పార్టీవైపుకు ఆకర్షించబడ్డారు. వీరిపై కాంగ్రెసు సోషలిస్టు నాయకుల బూర్జువా సంస్కరణవాద పలుకుబడి పూర్తిగా క్షీణించి మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంత పలుకుబడి హెచ్చింది. కాంగ్రెసుసోషలిస్టుపార్టీ నాయకులు, కొద్దిమంది కరుడుగట్టినవారి అనుచరులు తప్ప కాంగ్రెసు సోషలిస్టుపార్టీలో యెవరూ మిగలలేదు. పూర్తి సోషలిస్టు ఐక్యత సాధించజాలక పోయినప్పటికి, కాంగ్రెసు సోషలిస్టుపార్టీ నాయకత్వం బూర్జువా సంస్కరణవాదాన్ని సోషలిస్టులు అందరూ పూర్తిగా గ్రహించడంవలన వారు పూర్తిగా సోషలిస్టు లందరినుండి వేరుబడి పోయారు. ఈ విధంగా సోషలిస్టు ఐక్యత కాపాడబడింది.

పార్టీ వివిధరంగాలలో సాధించిన విజయాలను చూశాం. దేశ వ్యాపితమైన యీ విజయాలను సాధించడంవలన పార్టీ భారతదేశ రాజకీయరంగంలో ఒక శక్తిగా తయారై చాల రాజకీయ ప్రతిష్టను సంపాదించింది. 1928-29 సంవత్సరాలలో దేశమంతటా ఆకస్మికంగా బయలుదేరుచున్న కార్మిక సమ్మెలను కమ్యూనిస్టులు నడిపారు. వర్గకలహ సిద్ధాంతాల ననుసరించి పనిజేసే గొప్ప కార్మికోద్యమాన్ని భారతదేశమంతటా నిర్మించారు. బూర్జువా ప్రజాతంత్ర విప్లవ నినాదాలను ప్రచారం గావించి వాటిపై కార్మికులను, కర్షకులను విప్లవభావాలు గల యువకులను దేశమంతటా సమీకరించారు. రాష్ట్రాలలో కమ్యూనిస్టు గ్రూపులు యేర్పడ్డాయి; వాటితో సంబంధాలు పెట్టుకొని పనిజేస్తున్న భారత కమ్యూనిస్టునాయకులు కొందరు తయారయ్యారు. అఖిలభారత రాజకీయ దృక్పథంతోగాక ట్రేడ్ యూనియన్ దృక్పథంతోనే యీ నాయకులు పనిజేస్తుండేవారు. కమ్యూనిస్టుపార్టీ నిర్మాణంయొక్క అస్థిపంజరం ఏర్పడింది. కార్మికవర్గంలో బాగా పునాది యేర్పడడంవలన నిజమైన కార్మికవర్గ రాజకీయ పార్టీగా అభివృద్ధి అవడానికి ఆధారం యేర్పడింది. ఇది 1928-29 సంవత్సరాల నాటిస్థితి.

1938-39 లో, 10 సంవత్సరాల అనంతరం, కమ్యూనిస్టుపార్టీ కేవలం ఒక కార్మికవర్గానికే గాక, జాతీయ వుద్యమాన్నంతనూ నడుపుటకు తయారైంది. కార్మికవర్గం దాని పార్టీ అయిన కమ్యూనిస్టుపార్టీ ఒక కార్మికవర్గాన్నేగాక భారత ప్రజానీకాన్నంతా బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సమీకరించి జాతీయైక్య సంఘటనను నిర్మించగల రాజకీయ పంథాతో జాతీయ రంగంలో ప్రవేశించింది. కేవలం రాజకీయ పంథా చూపెట్టడమేగాకుండా ఆ పంథాతో జాతీయైక్య సంఘటనను ఆచరణలో నిర్మించుతోంది. ఈ విధంగా కమ్యూనిస్టుపార్టీ కార్మికోద్యమములో ప్రధానశక్తిగా వుండడమేగాక జాతీయరంగంలో ఒక శక్తిగా అభివృద్ధి అవుతోంది, కార్మికుల్లోనేగాక, కర్షకుల్లోను విద్యార్థుల్లోను, మేధావంతుల్లోను, మధ్యతరగతి ప్రజల్లోను జాతీయ కాంగ్రెసులోను పార్టీకి పునాది యేర్పడింది. కార్మికవర్గంలో యేర్పడ్డ పునాది యింకా బలపడింది.



### పార్టీ నిర్మాణంలో బలహీనతలు

పార్టీ సాధించిన విజయాలు, పార్టీ పలుకుబడి యెలా వృద్ధి అయిందీ పైన చూశాం. కాని పార్టీ నిర్మాణ రీత్యా యెంత అభివృద్ధి అవ్వాలో అంత అవ్వలేదు. పార్టీ పలుకుబడి, ప్రతిష్టలతో పోల్చిచూస్తే పార్టీ నిర్మాణాభివృద్ధి దాదాపు యేమీ లేదనే చెప్పాలి. ఈ బలహీనత యెలా వచ్చిందో తెలుసుకోవాలి. పార్టీని పనిజేయించే విధానంలోనే యీబలహీనత వుత్పన్నమైనది. కాన పార్టీ వివిధ రంగాలలో యెలా పనిజేసిందీ తెలుసుకుందాం.

## పార్టీ రంగం

### పార్టీ కేంద్రం పనిజేసిన విధం :

1936 లో యేర్పడ్డ పార్టీకేంద్రానికన్నా "నేషనల్‌ఫ్రంటు" ప్రచురించిన తరువాత దానిని నిర్వహించడానికి తయారైన పార్టీకేంద్రం హెచ్చు రాజకీయపరిపక్వతను, రాజకీయైక్యతను గడించిన మాట వాస్తవమే. నిర్మాణరీత్యా యిదివరకంటే క్రమపద్ధతిని పార్టీకేంద్రం పనిజేస్తున్న మాటగూడ వాస్తవమే. కాని అప్పటి పార్టీకేంద్రం కేవలం "నేషనల్‌ఫ్రంటు" సంపాదకవర్గంగా మాత్రమే పనిజేసింది. వాస్తవంగా దాని కాలాన్ని చాలభాగం "నేషనల్‌ఫ్రంటు"ను ప్రచురించడానికి, దాన్ని మేనేజ్ చేయడానికి వినియోగించిందేగాని పార్టీని నిర్మించడానికి పూర్తికాలాన్ని వినియోగించలేదు. వివిధ రాష్ట్రాలలో పార్టీ కమిటీలను క్రమపద్ధతిని, నిర్మాణయుక్తంగా యెప్పటికప్పుడు నడిపించడానికి వాటి పనిని తనిఖీచేస్తూ వాటిని పార్టీపద్ధతిలో పనిచేయించడానికి తగిన శిక్షణ, తర్ఫీదు వాటికి యివ్వడానికి పార్టీకేంద్రం జేసిన కృషి నామమాత్రమే. "నేషనల్‌ఫ్రంటు" ద్వారా ప్రతివారం రాజకీయ పాలసీ యిచ్చినంతమాత్రాన సరిపోదు. దాన్ని రాష్ట్రాలలోని పరిస్థితులకు అన్వయింపజేసి అచ్చటి పార్టీ యూనిట్లను, సభ్యులను ఒకే రకమైన ఆచరణ గలిగియుండేటట్లు చేయడానికి తగిన రాజకీయ పరిపక్వత, నిర్మాణబలము రాష్ట్ర కమిటీలకు లేదు. వాటికి దాన్ని కలుగచేయడానికి పార్టీకేంద్రం కృషిజేయలేకపోయింది. అందుచేత రాష్ట్రకమిటీలకు రాజకీయచొరవ, మార్క్సిస్టు పరిజ్ఞానము అభివృద్ధిగా లేదు. తమ రాష్ట్రాలలో ప్రజావుద్యమమునకు పార్టీ నాయకత్వం వహించగలశక్తి కమిటీలకు రాలేదు; క్రింది కమిటీలకు ప్రాక్టికల్, రాజకీయ నాయకత్వం వహించి పార్టీలో సంపూర్ణ ఐక్యతను నిర్మించజాలకపోయాయి. దీనికి కారణం పార్టీకేంద్రం కేవలం "నేషనల్‌ఫ్రంటు" సంపాదకీయవర్గంగా పనిజేయడానికే కాలాన్నంతా వినియోగించడం.

అప్పటి పార్టీకేంద్రస్టాఫ్ పెరగనిదే, సెంట్రల్‌కమిటీసభ్యులందరూ నామకః సభ్యులుగాగాక పార్టీ కేంద్రపనికే తమకాలాన్ని వినియోగించడానికి తయారవ్వనిదే, అందుకు తగిన రాజకీయ నిర్మాణపు పరిపక్వాన్ని సంపాదించనిదే అప్పటి పార్టీకేంద్రం పై విధంగా పనిజేయడం అసంభవం; వారి భౌతికశక్తికి మించినపని. గ్రహించాల్సిన విషయం అప్పటి పార్టీకేంద్రం పార్టీ కేంద్రపనిని చూడడానికి సెంట్రల్‌కమిటీ సభ్యులందరినీ సరిగా తర్ఫీదు చేయలేకపోవడం. దాని అవసరాన్ని గుర్తించినా "డ్రిఫ్టు" అవడం తప్పు. "పొలిట్‌బ్యూరో" యే సెంట్రల్‌కమిటీ పనులన్నీ చేస్తూవుంది. అందుచేత సహజంగా సెంట్రల్‌కమిటీ నిర్వహించాల్సిన పార్టీపనులు నిర్వహించబడలేదు. భౌతికంగా సాధ్యమైనది, అత్యవసరమైనది. "నేషనల్‌ఫ్రంటు"ను రెగ్యులర్‌గా ప్రచురించడం జరిగింది. పార్టీ నిర్మా

ణపు పని యిదివరకు వలెనే వెనుకబడిపోయింది. సెంట్రల్‌కమిటీ సభ్యులను సమావేశపర్చి వారు పార్టీ కేంద్రపనికి వినియోగపడేటట్లు తయారుచేయడానికి "పొలిట్‌బ్యూరో" ప్రయత్నించింది. కాని అది ప్రయత్నంగానే వుండిపోయింది. 1938 లో రెండుపర్యాయములు, 1939 లో ఒకపర్యాయం సెంట్రల్‌కమిటీ మీటింగులు యేర్పరచబడ్డాయి. సెంట్రల్‌కమిటీ సభ్యులలో అప్పటి రాజకీయ సమస్యలపై (కాంగ్రెసు, కాంగ్రెసు సోషలిస్టుపార్టీలయెడల పార్టీవైఖరి; హిందూ - ముస్లిమ్ సమస్యపై పార్టీ వైఖరి) మరింత రాజకీయైక్యత యేర్పరచడానికి యివి తోడ్పడ్డవిగాని వాటిని నిజమైన సెంట్రల్ కమిటీలుగా పనిజేయించి పార్టీనిర్మాణమును అభివృద్ధిజేయడానికి తోడ్పడలేదు. సెంట్రల్‌కమిటీ సభ్యులమధ్య కేంద్ర పార్టీపనుల విభజనే యెన్నడూ జరుగలేదు. ఒకవేళ జరిగినా స్థానికతత్వంతో తమరాష్ట్రాలకు వెళ్ళినతరువాత రాష్ట్రపనుల్లో మునిగి వీటినిగూర్చి మర్చిపోయేవారు. వారిని తనిఖీ చేయడానికి "పొలిట్‌బ్యూరో"గూడ పెద్దగా కృషిజేయలేదు. ఈ విధంగా సెంట్రల్‌కమిటీకిబదులు "పొలిట్‌బ్యూరో" పనిజేసింది. "పొలిట్‌బ్యూరో" గూడ "నేషనల్‌ఫ్రంటు" సంపాదకవర్గంగా మాత్రమే పనిజేసింది. గాని పార్టీకేంద్రంగా పని చేయజాలకపోయింది. అఖరుకు తాము అరెస్టు అయితేవారిస్థానంలో పార్టీకేంద్రాన్ని "నేషనల్‌ఫ్రంటు"ను నడిపే మరోకేంద్ర నాయకత్వాన్నిగూడ తర్ఫీదుజేయలేదు. అలాగే రాష్ట్రకమిటీలను క్రమపద్ధతిగా నడుపుటకు గాను వాటి కార్యదర్శులకు స్కూళ్ళుపెట్టి శిక్షణ యివ్వలేదు. పార్టీ నిర్మాణపు పని అంతా అట్లే వుండిపోయింది.

## రాష్ట్రకమిటీలు పనిజేసిన విధం :

పార్టీకేంద్రంలోని బలహీనతలు రాష్ట్రకమిటీలలో మరింత హెచ్చుగా ప్రతిబింబించాయి. పార్టీ కేంద్రంలో కనీసం "పొలిట్‌బ్యూరో" లో సంపూర్ణ రాజకీయైక్యత వుంది. రాష్ట్రకమిటీ సభ్యులలో ఆ రాజకీయైక్యతగూడ వుండేది గాదు. కేంద్రపార్టీ పాలసీని తమ ప్రాంతాల్లో వివిధరకాలుగా అన్వయించుతూ పనిజేయడంవలన ఒకే రకమైన ఆచరణ పార్టీ సభ్యులందరిలో వుండేదిగాదు. కేంద్ర పార్టీ రాజకీయ నినాదాలు నామకః అంగీకరించినా ఆచరణలో వివిధరకాలుగా అమలు జరపటంవలన పార్టీఅంతా ఒకేవిధంగా రాజకీయంగా ఐక్యపరచబడలేదు. అంతేగాకుండా పార్టీనంతను ఒకేరకంగా నడపగల రాజకీయ, నిర్మాణపు పార్టీనాయకత్వం తయారుగాలేదు. రాష్ట్రపార్టీ నాయకులంటే భక్తి, విశ్వాసాలున్నా పార్టీ సభ్యులందరిలో పూర్తి క్రమశిక్షణ యుండేదిగాదు.

రాష్ట్రకమిటీ అంతా కమిటీగా పనిజేసేదిగాదు. ఏపార్టీ కార్యదర్శో, బాగా చొరవవున్న మరొక సభ్యుడో రాష్ట్రపార్టీ పనినంతా చూసేవారు. రాష్ట్రపార్టీ పత్రిక నడపడం దగ్గరనుండి పార్టీ ఆఫీసులు శుభ్రపర్చుకునేంతవరకు ఒకేవ్యక్తి తంటాలు పడుతుండేవాడు. తతిమ్మా సభ్యులు, రాష్ట్ర కమిటీ సమావేశాలప్పుడు తమతమ జిల్లాసమస్యలు వచ్చినప్పుడు తప్ప యితరచర్చలలో పాల్గొనక పోవడం జరిగేది. ఇందువలన రాష్ట్రకమిటీసభ్యుల కందరికైన రాష్ట్రమంతటి పార్టీపరిస్థితులు తెలిసేవి గావు; రాష్ట్రదృక్పథం అలవడలేదు. జిల్లా, స్థానికతత్వమే మెండుగా సభ్యులలో వుండేది. ఈ విధంగా రాష్ట్రపార్టీ నాయకత్వం నిజమైన రాష్ట్రపార్టీ నాయకత్వంగా వుండేది. జిల్లాలోని ముఖ్యులతో గూడిన సమాఖ్యలాగ రాష్ట్రకమిటీ వుండేది.

ఇక జిల్లా కమిటీలు నామకః వుండేవి. కాంగ్రెసు సోషలిస్టుపార్టీలో ఫ్రాక్షన్సుగానో, లేక యితర ప్రజారంగాల పార్టీ ఫ్రాక్షన్సుగానో పనిజేసేవి. జిల్లాలోని ప్రజావుద్యమాల నన్నింటిని



నడుపుతూ, వాటిని నడిపేపార్టీ సభ్యులకు, పార్టీ యూనిట్లకు యెప్పటికప్పుడు స్థానికసమస్యలపై సలహాలు, సూచనలిస్తూ నిజమైన జిల్లాకేంద్రంగా పనిజేయలేదు.

ఇక పార్టీ ఒక పద్ధతిలోనైనా పనిజేసిందా అంటే అదీ సున్న. పార్టీ స్థానికయూనిట్లు యేర్పరచడం, వాటిని పార్టీ పద్ధతులలో పనిజేయించడం పని విభజనజేసుకొని పనిజేయడం, తరువాత దాన్ని పార్టీ కమిటీలు తనిఖీజేయడం యేమీ వుండేదిగాదు. అసలు సెల్లులే యేర్పడలేదు. (చాల కొద్దిచోట్ల తప్ప) పైకమిటీలకు రిపోర్టులు పంపడంగాని, సభ్యత్వ రుసుము చెల్లించడంగాని, పార్టీ సభ్యులను క్రమశిక్షణలో వుంచడంగాని, వగైరా కనీస పార్టీకర్తవ్యాలను నెరవేర్చడంగూడ వుండేది గాదు. ఈవిధంగా పార్టీకి ఒక "ఫారం" (నిర్మాణయుక్తమైన రూపం) యేర్పడలేదు.

పార్టీని నిర్మించాలని, పార్టీసభ్యులను, పార్టీయూనిట్లను వాటివాటి రాజకీయనిర్మాణపు కర్తవ్యాలను నిర్వహించడానికి యెప్పటికప్పుడు తర్ఫీదుచేస్తుండాలని ప్రాథమికపార్టీ నిర్మాణసూత్రాన్ని పార్టీ పైకమిటీలే నిర్లక్ష్యం జేస్తుండేవి. పార్టీ నిర్మాణము లేనిది, ఆందోళన, వుద్యమము యెంతవున్నా అది సరియైన విప్లవపరిస్థితిగా మారజాలదనియు, దాన్ని అలా మార్చడానికి పార్టీ చైతన్యపూర్వకంగా పనిజేయనిదే యే విప్లవము జయప్రదంగాదనే విషయాన్ని పార్టీ నాయకులే మర్చిపోయారు.

అన్నిటికన్నా ముఖ్యవిషయము ఒకటి వుంది. పార్టీకి వచ్చిన లీగల్ అవకాశాలు తాత్కాలికమేననే విషయాన్ని కేంద్ర కమిటీనుండి క్రింది పార్టీ యూనిట్లవరకూ మర్చిపోయాయి. సామ్రాజ్యవాదయుద్ధం యేర్పడుబడితే అప్పుడు రావడానికి అవకాశం వున్నదనే విషయం పార్టీపత్రికలలో సూత్రప్రాయంగా వల్లించబడిందిగాని యుద్ధమొస్తే పార్టీ నిర్మాణరీత్యా యేఏర్పాట్లు గావించుకోవాలో ఆలోచించనేలేదు. యుద్ధమొచ్చాక ముఖ్యమైన పార్టీకేంద్రాలు (కేంద్రం, రాష్ట్ర నాయకులు, యింక యితర ముఖ్యపార్టీనాయకులు) రహస్యంగా పనిజేయడానికి తగిన టెక్ బందోబస్తులు యేమీ యేర్పరచలేదు. పార్టీఅంతా రహస్యంగా పనిచేయడానికి సిద్ధంగావుండాలనే హెచ్చరికే పార్టీసభ్యులకు లేకపోవడంవలన రహస్యపరిస్థితులలో పనిజేయాల్సి వచ్చేటప్పటికి పార్టీ యంత్రం యేమీ పనిజేయక తాత్కాలికంగా స్తంభించింది. ఈ నిర్లక్ష్యంవలన సామ్రాజ్యవాద యుద్ధమొచ్చాక ముఖ్యపార్టీనాయకులలో హెచ్చుభాగం ప్రభుత్వ నిర్బంధానికి గురి అయ్యారు. పార్టీపని యెంతో దెబ్బతినిపోయింది.

## ప్రజారంగాలు :

పార్టీని నిర్మించడంలో యెంత నిర్లక్ష్యం చేయబడిందో, అదేవిధంగా ప్రజారంగాల నిర్మాణం పూర్తిగా వదిలివేయబడింది. ప్రతి ప్రజారంగంలోను బ్రహ్మాండమైన ఆందోళన, తాత్కాలిక పోరాటాలు లేవదీయబడ్డాయి. గాని దానివలన గలిగిన ఫలితాలను స్థిరపర్చడానికి, ఆయారంగాలు స్థిరంగా పనిజేయడానికి తగిన నిర్మాణమును అభివృద్ధి జేయలేదు.

ఏ ప్రజారంగంలోను అవి స్థిరంగా పనిజేయడానికి తగిన యేర్పాట్లుచేయలేదు. తాత్కాలికంగా ఆందోళన జేయడానికి; పోరాటాలు సాగించడానికి ప్రజలను తాత్కాలికంగా సమీకరించడం, వాలంటీర్లను తాత్కాలికంగా ఆపని ముగిసేంతవరకు ప్రోగుజేయడం జరిగేది. ఆందోళన, పోరాటం జరిగేంతవరకూ అహర్నిశలు పని జేస్తుండేవాళ్ళం. అది ముగిసినతరువాత మరల యేదో ఆందోళన లేవదీయాల్సిన అవసరం వచ్చేంతవరకో, పోరాటం దానంతటదే వచ్చేంతవరకో మరల ఆరంగం అంతా చప్పబడి వుండేది. ప్రజలతో సంబంధ ముండేదిగాదు. పనిజేసిన వాలంటీర్లకు తగిన రాజ

కియ శిక్షణయిచ్చి, ఆరంగాన్ని వారి స్వంతచొరవతోనే నిర్వహించుకోగల శక్తివంతులుగా తయారు జేయడానికి ప్రయత్నమే జేయబడేదిగాదు. అందుచేత ప్రజా సంరంభం, పోరాటంరోజుల్లో తప్ప, నాయకులు పూనుకున్నప్పుడు తప్ప ప్రజాసంఘాలు మామూలు రోజుల్లో యేమీ పనిజేయకుండా మూలపడివుండేవి. ఎందుచేతనంటే వాటిని రెగ్యులర్‌గా మామూలురోజుల్లో గూడ సక్రమముగా పనిజేయించే శక్తిగల కేడర్లను తయారుచేయడం నిర్లక్ష్యం చేయబడింది. ఈ విధంగా ప్రజాసంఘాలను యెచ్చటి కచ్చట తమ స్వంత చొరవతో రెగ్యులర్‌గా (ఏ పోరాటసమయములోనోగాక) పని జేయించగల ప్రజారంగాల కేడర్లను యే రంగంలో గూడ తయారుచేయలేదు. ప్రజారంగాల పని అంతా నాయకుల మీదనే ఆధారపడివుండేది. నాయకులు చొరవతో పనిజేస్తే చురుకుగా పనిజరిగేది. చొరవలేని నాయకులున్నచోట్ల ప్రజారంగాలు మూలబడేవి. చొరవవున్న నాయకులున్నా, వారు అరెస్టు గావించబడితే అసలు రంగమే మూలపడేది. ప్రజలదగ్గరకువెళ్ళి పనిజేసేవాళ్ళే వుండేవారు కారు. ఈ విధంగా ప్రజారంగాల పని అంతా ఆందోళనా దశలోనే వుండిపోయింది; నిర్మాణదశకు మార్చలేదు. ఈ బలహీనత సామ్రాజ్యవాదయుద్ధకాలం వచ్చేసరికి బాగా పార్టీని క్రుంగదీసింది.

ఇక ప్రజాసంఘాలలో పార్టీ నిర్మాణమును వృద్ధిచేయాలనే విషయమే గుర్తించబడలేదు. ఒక్కొక్క పార్టీనాయకునకు, ఒకొక ప్రజారంగం అతని 'జమిందారీ'గా వదిలిపెట్టబడేది. ప్రజా పోరాటాలద్వారా, ఆందోళనద్వారా ముందుకువస్తున్న వేలకువేలు మిలిటెంట్లను పార్టీసభ్యులుగా తర్ఫీదుచేయడంగూర్చి యేమీ శ్రద్ధవహించలేదు. అందుచేత ప్రజారంగాలలో పలుకుబడి ఆరంగాల్లో పనిజేసేపార్టీ నాయకుని వ్యక్తిగత పలుకుబడిగామాత్రమే వుండిపోయిందిగాని పార్టీ పలుకుబడిగా స్థిరపర్చబడలేదు. దీనివలన పార్టీ నిర్మాణం ప్రజారంగాల్లో యేమీ అభివృద్ధి గాలేదు. మిలిటెంట్సు అందరిని పార్టీసభ్యులుగా తయారుజేసి వున్నట్లయిన పార్టీనిర్మాణము యెన్నోరెట్లు అభివృద్ధి పొందడమేగాకుండా వీరందరిపై యింకా నిలిచివున్న అన్నిరకాల బూర్జువావర్గ పలుకుబడులు (అతివాద జాతీయవాదుల పలుకుబడి, కాంగ్రెసు సోషలిస్టునాయకుల మెన్షివిక్ పలుకుబడి) త్వరలో క్షీణింపజేసి త్వరగా జాతీయైక్య సంఘటననునిర్మించగల్గేవాళ్ళం; జాతీయ బూర్జువావర్గ పలుకుబడిని నాశనం చేసి వుండేవాళ్ళం. ఈ బలహీనతే తరువాత కాంగ్రెసు మితవాద నాయకులు ఒకప్రక్కన, అతివాద జాతీయవాదులు మరొకప్రక్కన జాతీయైక్యసంఘటనను విచ్ఛిన్నము గావిస్తుంటే వారి విచ్ఛిన్న చర్యలను సకాలంలో ఆపి జాతీయైక్య సంఘటనను కాపాడలేకపోయాం.

ఈ విధంగాపార్టీ రాజకీయప్రతిష్ఠ ఎంతో అభివృద్ధి అయినా పార్టీ నిర్మాణరీత్యా చాల బలహీనంగా వుండిపోయింది. దీనికంతకూ కారణం జాతీయైక్య సంఘటనను నిర్మించడంలో పార్టీనిర్మాణం యెంత ముఖ్యపాత్ర వహించుతుందో పార్టీనాయకులు గుర్తించలేకపోవడం. కార్మిక,కర్షక,విద్యార్థి ప్రజాపోరాటాలను లేవదీస్తే, వాటిని ప్రజాపోరాటాలుగా మార్చగల్గితే, జాతీయోద్యమము దానంతటదేలేస్తుందని, అప్పుడు తప్పక జాతీయ బూర్జువావర్గం గూడ యీ జాతీయ సంరంభంలో పాల్గొనాల్సివస్తుందని, ఆ విధంగా జాతీయైక్యసంఘటన నిర్మింపబడి జాతీయవిప్లవము సాధించబడుతుందని భావించి ప్రాప్తకాలజ్ఞతను వెల్లడించాం. జాతీయైక్యసంఘటనను నిర్మించడానికి పార్టీనిర్మాణము యెంతోబలిష్టంగా వుండాలనియు, అప్పుడే మితవాదులు, అతివాద జాతీయవాదులుగావించే విచ్ఛిన్నచర్యలను జయప్రదంగా యెదుర్కొగల్గుతామనియు, అందుకుగాను ప్రారంభంనుండి పార్టీనిర్మాణమును అన్ని రంగాల్లోను నిర్లక్ష్యం చేయకుండా ప్రధానపార్టీకర్తవ్యంగా తీసుకోవాలనే ప్రధానవిషయం నిర్లక్ష్యం చేయబడింది.



ఈకాలంలో పార్టీనిర్మాణమునకు సంబంధించిన ముఖ్యలోపాలను క్లుప్తంగా యీక్రిందివిధంగా చెప్పవచ్చును.

(1) పార్టీలో రాజకీయైక్యత యేర్పడింది; కాని పార్టీ నిర్మింపబడలేదు. దేశమంతటా పార్టీ నిర్మాణం వ్యాప్తిజెందలేదు.

(2) ఈ కాలంలో యువకులు చాలమంది నూతనంగా చేరారు. వారికిగాని, యిదివరకు వున్న పాత పార్టీ సభ్యులకుగాని మార్క్సిస్టు సిద్ధాంత జ్ఞానం యివ్వలేకపోయాం, రాజకీయ పరిస్థితులను, వాస్తవిక దృష్టితో, మార్క్సిస్టు దృక్పథంతో అర్థం జేసుకోవడం వలననే పార్టీ రోజురోజూ నినాదాలను యివ్వగల్గుతోందనీ, తాము నిత్యం గావించే కార్యకలాపాలను మార్క్సిస్టు దృక్పథంతో యెలా అర్థం జేసుకోవాల్సినదీ వారికి బోధించలేకపోయాము. వారిచేత పనులు చేయించాముగాని వారంతటవారే పనులు స్వంత చొరవతో చేయగలిగేవారినిగా వారిని తయారు జేయలేదు. అందుచేత వారు పార్టీయిచ్చే రాజకీయనినాదాలను ఆచరణలో పెట్టగల్గారే గాని తమంతటతామే అట్టి నినాదాలను యేర్పరచుకోగలిగిన మార్క్సిస్టు దృక్పథాన్ని అలవర్చుకోలేకపోయారు.

(3) కార్మికసంఘాలు తదితరప్రజాసంఘాల్లో చురుకుగా పనిజేసేవారినుండి పార్టీసభ్యులగాను, పార్టీ నాయకులుగాను తయారుచేయలేదు. అందుచేత కార్మికసంఘాల్లో పనిజేసే పాత కార్మిక నాయకులు, ట్రేడ్‌యూనియన్ నాయకులుగానే వుండిపోయారు. (బొంబాయిలో 5000 మంది మిలిటెంట్లు వుంటే పార్టీసభ్యులుగా 50 మందిమాత్రమే జేర్చుకోబడ్డారు.) క్రొత్తగా కార్మికవర్గంనుండి వచ్చినవారు కార్మిక సంఘాలతరఫున పనిజేసే ఆందోళన పరులుగానే వుండిపోయారు.

(4) పార్టీ నిర్వాహకులను తయారుజేయలేదు. పార్టీ యూనిట్ల కార్యదర్శులకు వారివారి ప్రత్యేక పనులను నిర్వహించడానికి తర్ఫీదు యివ్వలేదు. ప్రజాసంఘాల్లో పనిజేస్తున్న పార్టీ నాయకులకు పార్టీపంథాలో వారివారివిధులను నిర్వహించడానికి తర్ఫీదు యివ్వలేదు. పార్టీనిర్మాణపు ప్రత్యేక (టెక్‌వగైరా) కేడర్లను వేరువేరు పనులు నిర్వహించడానికి తర్ఫీదు చేయలేదు. కలగా పులగాపుగా నిర్మాణరహితమైన పద్ధతులలో పార్టీసభ్యులు పనిజేయడానికి యిది దారితీసింది.

(5) పార్టీపద్ధతులను యెవరికీ నేర్పలేదు. పార్టీ యూనిట్లు యేయే పనులు గావించాలో నిర్ణయించలేదు; అందుచే మరల తనిఖీగూడ లేకుండా పోయింది. సమిష్టిగా పార్టీసభ్యులు అందరిచేత పార్టీ యూనిట్లద్వారా పనులు చేయించలేకపోవడం వలన పార్టీ సభ్యుల్లో ప్రతి ఒక్కరూ 'గాకుండా యే కొద్దిమందో పార్టీపనులన్నీ చేస్తుండేవారు. క్రమశిక్షణతో పనిజేయడానికి బదులు పని తప్పించుకోడానికి యిది మార్గమైంది. స్థానికంగా యెవరి యిష్టంవచ్చినట్లు వారు పనిజేస్తుండేవారు. పార్టీ నిర్మాణమునకు సంబంధించినంతవరకు దాదాపు వెనుకటి పద్ధతులే అవలంబిస్తూ వుండేవారు. పైకమిటీలు క్రింది కమిటీలను తనిఖీచేస్తుండడం, క్రిందికమిటీలకు సకాలంలో సరియైన సలహాలు యిస్తూ వాటిని క్రమపద్ధతిని పని జేయిస్తూవుండడం జరగలేదు. అందుచేత కేంద్రీకృత పార్టీ నిర్మాణములో ప్రతిపార్టీ యూనిట్ తక్కిన యూనిట్లతో కలసి పార్టీ మొత్తపు బాధ్యతలన్నిటిని సమిష్టిగా నెరవేర్చాలనే భావము అలవడలేదు. ఆచరణలో పూర్వపు స్థానిక తత్వమే పార్టీ నిర్మాణములో ద్యోతకమౌతూవచ్చింది.

# ఆ ర వ భా గ ము

## రెండవ సామ్రాజ్యవాదయుద్ధానికి పూర్వంవున్న పరిస్థితులు

## (1939 – 1941 జూన్‌వరకు)

**అంతర్జాతీయంగా**

1934-39 సంవత్సరాల మధ్య ఫేసిస్టురాజ్యాల దురాక్రమణ హెచ్చయింది. 1935 లో ఇటలీ అబిసీనియాపై దాడిసలిపి ఆక్రమించుకుంది. 1936 వేసవిలో ఇటలీ జర్మనీలు స్పెయిన్‌లో సైనికుల్ని పంపి అప్పటి ప్రజాప్రభుత్వంపై తిరుగుబాటుజేస్తూ విద్రోహి ఫ్రాంకోను బలపర్చాయి; విద్రోహాన్ని సంఘటనపర్చాయి. జర్మనీ ఉత్తర స్పెయిన్‌లో, స్పానిష్ మొరాకోలోనూ, ఇటలీ దక్షిణ స్పెయినులో, బాలిరిక్ దీవులలోను (మధ్యధరాసముద్రంలోని) కోటలు కట్టసాగినాయి. మంచూరియాను ఆక్రమించిన జపాన్ 1937 లో ఉత్తర, మధ్య చైనాలపై దాడిసలిపి పీకింగ్ టీన్‌సిన్, షాంగైలను స్వాధీనపర్చుకుంది. ఆక్రమించుకున్న స్థలాలనుండి విదేశీ పెట్టుబడిదారులను నెట్టివేయ ప్రారంభించింది. 1938 ప్రారంభంలో జర్మనీ ఆస్ట్రియాను ఆక్రమించింది. 1938 అక్టోబరులో జకోస్లోవేకియా, సుడెటెన్ రాజ్యాన్ని ఆక్రమించింది. 1938 సంవత్సరాంతాన జపాన్ కాంటన్‌ను, 1939 సంవత్సర ప్రారంభంలో హైనాన్ దీవులను ఆక్రమించింది.

ఈవిధంగా తెలియకుండానే రెండవ సామ్రాజ్యవాద యుద్ధఛాయలను ఫేసిస్టురాజ్యాలు వివిధ జాతులమధ్యకు వ్యాపింపజేశాయి. ఇది యెలా సాధ్యమైంది? బ్రిటన్, అమెరికా, ఫ్రాంసు దేశాలలోని సామ్రాజ్యవాదప్రభుత్వాలు, బాహాటంగా ఫేసిస్టురాజ్యాలు చిన్నరాజ్యాలపై జరుపుచున్న దురాక్రమణను అరికట్టడానికి, శాంతిని నిలబెట్టడానికి పూర్తిగా నిరాకరించాయి. సోవియట్‌యూనియన్ వివిధదేశాలలోని ప్రజలు, కమ్యూనిస్టులు, కార్మికవర్గం నాయకత్వంక్రింద శాంతిని కాపాడడానికి, ఫేసిస్టు దురాక్రమణను అరికట్టడానికి, యుద్ధంరాకుండా నివారించడానికి గావిస్తున్న ప్రయత్నాలతో సహకారం జేయడానికి నిరాకరించారు; పైగా ఫేసిస్టువ్యతిరేక ప్రజాసంఘటన తమతమ దేశాల్లో



యేర్పడకుండా సోషల్ డెమోక్రాటునాయకుల సహాయంతో విచ్ఛిన్నం గావించారు. దాడిసల్పే ఫేసిస్టు రాజ్యాలను ప్రజలూ, సోవియట్‌యూనియన్, శాంతినికోరే అన్నిరాజ్యాలు—కలసి ఒక ఫేసిస్టు వ్యతిరేక కూటమిగా యేర్పడి నిరోధించడానికి ఒప్పుకోలేదు. ఫేసిస్టురాజ్యాలు గావించే దురాక్రమణ గూర్చి తాము ఏమీ కలుగజేసుకోరాదనే కుటిలనీతితో "తటస్థత" అవలంబించాయి.

ఈ "తటస్థ" విధానం వుద్దేశ్యమిది. చిన్న రాజ్యాలను ఫేసిస్టు రాజ్యాలకు బలియిచ్చుట ద్వారా సంతృప్తి పరిచి, ఆఖరుకు ఫేసిస్టు రాజ్యాలను సోవియట్‌యూనియన్‌పైన దాడిచేసేటట్లు జేయడం, తద్వారా సోవియట్‌యూనియన్‌ను నాశనం గావించి, ప్రజా విప్లవాలను అణచివేసి తమ సామ్రాజ్యాలను భద్రంగా నిలబెట్టుకోడానికి యీ "తటస్థ" విధానంద్వారా ఆశించాయి. ఈ విధంగా ఫేసిస్టు రాజ్యాలకు, తమకు యేర్పడ్డ సామ్రాజ్యవాద స్పర్థలను, వైరుధ్యాలను తమకు హానిలేకుండా తొలగించుకోవాలని ఆశించాయి. కాని సోవియట్ యూనియన్ అపార ఆర్థిక మిలిటరీ, నైతిక బలాలు, ప్రపంచ కార్మిక విప్లవోద్యమాల ప్రభావము బ్రిటిష్, అమెరికన్, ఫ్రెంచి సామ్రాజ్యవాదుల యీ అపాయకరమైన రాజకీయకుట్ర జయప్రదం గానీయకుండా అపగల్గాయి; తీరని అపజయంతో యీ కుట్ర అంతమయింది.

ఈకుట్ర ప్రపంచ అపఖ్యాతికరమైన మ్యూనిక్ ఒడంబడికతో అంతిమస్థాయికి జేరింది. యీ ఒడంబడిక చేసుకొని బ్రిటిష్, ఫ్రెంచి ప్రభుత్వవేత్తలు "శాంతిని వుద్ధరించా"మని చెప్పుకున్నారు; చిట్టచివరకు జర్మనీని సోవియట్ యూనియన్‌పై దాడి గావించడానికి తాము యింతకాలమునుంచి గావించిన ప్రయత్నం ఫలించిందని ఉప్పొంగిపోతూ చంక లెగురవేశారు.

కాని మ్యూనిక్ ఒడంబడిక ఫలితాలు యేమి? హిట్లరు సోవియట్ యూనియన్‌పై దాడిచేయలేదు హిట్లరుకు సోవియట్ సైనిక, ఆర్థికబలం పూర్తిగా తెలుసు. సోవియట్ యూనియన్‌లోకి తానుపంపిన పంచమాంగదళాన్నంతా సోవియట్ పట్టుకుని పూర్తిగా రూపుమాపివేసింది. ఈవిధంగా చెక్కుచెదరని ఐక్య సోవియట్‌యంత్రాన్ని ఢీకొనడానికి హిట్లరు వెనుకాడాడు. యూరప్‌లో ముందు తన సంపూర్ణ ప్రాబల్యాన్ని స్థాపించుకోడానికి నిశ్చయించుకున్నాడు. 1939 మార్చి 15 వ తేదీన జెకోస్లోవేకియాలో మిగిలిన భాగాన్ని ఆక్రమించుకున్నాడు. 1939 ఆగస్టు 23 వ తేదీన సోవియట్ యూనియన్‌తో పరస్పర నిరాక్రమణసంధి గావించుకున్నాడు.

దీనితో బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్యవాద పరిపాలకులు తాము పన్నినకుట్ర తమకే యెదురైందని, హిట్లరు సోవియట్ యూనియన్‌పైగాక, తమ దేశాలపైననే యుద్ధం సాగించుతాడని పై ఘటనలతో తెలుసుకున్నారు. ఈవిధంగా ఫేసిస్టురాజ్యాలను, వాటిచేత సోవియట్‌పై దాడిచేయించడానికనే కుట్రతో ప్రారంభంనుండి బలపర్చుతూ బ్రిటిష్, ఫ్రెంచి, అమెరికన్ సామ్రాజ్యవాద ప్రభుత్వాలు రెండవ సామ్రాజ్యవాద యుద్ధాన్ని తెచ్చిపెట్టారు. ఫేసిజాన్ని, యుద్ధప్రమాదాన్ని తొలగించి శాంతిని నెలకొల్పుటకు, ప్రజలు, సోవియట్‌యూనియన్ గావించే విప్లవ ప్రయత్నాలను భగ్నంజేస్తూ ఫేసిస్టులను, యుద్ధోన్మాదులను పూర్తిగా బలపర్చారు. ఇది సామ్రాజ్యవాదుల క్యాంపులో జరుగుచున్న పరిస్థితులు. ఇక ప్రజలక్యాంపులో శాంతిని కాపాడడానికి, ఫేసిజాన్ని నిరోధించడానికి గావిస్తున్న ప్రయత్నాలను క్లుప్తంగా చూద్దాం.

ప్రజలక్యాంపులో శాంతిని కాపాడడానికి, యుద్ధంరాకుండా చేయడానికి, ఫేసిజాన్ని అంతం జేయడానికి చేయబడ్డ ప్రయత్నాలు రెండువిధాలు. (1) సోవియట్ యూనియన్ గావించిన ప్రయత్నాలు. (2) ప్రజలు కార్మికవర్గం, కమ్యూనిస్టుపార్టీల నాయకత్వంక్రింద "పాప్యులర్ ఫ్రంటుల"ను నిర్మించడానికి గావించిన ప్రయత్నాలు. ముందు సోవియట్‌యూనియన్ గావించిన ప్రయత్నాలు యేమో చూద్దాం.

(1) 1927-34 సంవత్సరాలమధ్య జరిగిన ఆయుధవిసర్జన సభలలో సంపూర్ణ ఆయుధ విసర్జన కావాలని ప్రతిపాదించింది. దానిని నిరాకరించినప్పుడు, ఆయుధ విసర్జనకు కొన్ని ముఖ్యసూచనలు చేసింది. వానినిగూడ సామ్రాజ్యవాద దేశాలు తిరస్కరించాయి.

(2) నానాజాతిసమితినుండి జర్మనీ, ఇటలీ, జపానులు వెడలిపోయి ప్రపంచ పునర్విభజనకు, యుద్ధానికి పూనుకొంటున్నప్పుడు, యుద్ధంరాకుండా ఆపుజేయడం బ్రిటన్, ఫ్రాంసులకు లాభకారిగా వుండినది. అందుచేత వాటిని కలుపుకొని సోవియట్‌యూనియన్ జర్మనీ, ఇటలీ, జపానులు గావించే దురాక్రమణచర్యలను నానాజాతిసమితిద్వారా అరికట్టడానికి నానాజాతిసమితిలోజేరి బ్రిటన్, ఫ్రాంసులు గావించే ప్రయత్నాలను బలపర్చడానికి సోవియట్‌యూనియన్ పూనుకొంది. కాని, ఫ్రాంసు, బ్రిటన్‌లు నానాజాతిసమితి బలాన్ని, ప్రతిష్టను సోవియట్‌ప్రవేశమును ఆధారంగా గొని హెచ్చించడానికి బదులు క్షీణింపజేయడానికే తోడ్పడ్డాయి. ఈవిధంగా నానాజాతిసమితిలో సోవియట్‌యూనియన్ గావించే శాంతి రక్షణ ప్రయత్నాలకు నిరోధం గల్పించాయి.

(3) ఫేసిస్టు యుద్ధరాజ్యాలకు వ్యతిరేకంగా ప్రజాతంత్ర శాంతికూటమిని ఏర్పరచడానికి, సమిష్టి భద్రతా సూత్రాన్ని బలపర్చడానికి తీవ్రకృషిజేసింది.

(4) ఫేసిజానికి వ్యతిరేకంగా, యుద్ధానికి వ్యతిరేకంగా "పాప్యులర్ ఫ్రంటు" ఉద్యమాలను "పాప్యులర్ ఫ్రంటు" ప్రభుత్వాలను బలపర్చింది.

(5) తన సరిహద్దులలోనున్న రాజ్యాలతో నిరాక్రమణపు టొడంబడికలు జేసుకొంది. పెట్టుబడిదారీ రాజ్యాలతోటి ఒడంబడికల విలువ అట్టే లేకపోయినప్పటికి, అలాంటి ఒడంబడిక యున్నప్పుడు, వాటిని రద్దుజేసుకోకుండా అకారణంగా తనపై దాడివెడలినచో ఆదాడి వెడలిన దేశంలోని ప్రజలకు ఆ ప్రభుత్వాల అక్రమపుచర్య సులభంగా తెలుస్తుంది. తద్వారా ప్రజల విప్లవచైతన్యం చాల పెంపొందుతుంది.

(6) ఫ్రాంసు, జెకొస్లోవేకియాలతో ఒడంబడిక జేసుకుని ఫేసిస్టు వ్యతిరేకకూటమిని యేర్పరచడానికి తీవ్రకృషి జేసింది. మ్యూనిక్ ఒడంబడిక సమయంలో జర్మనీని జెకొస్లోవేకియా నిరోధించడానికి తయారయితే, ఫ్రాంసు రాకపోయినా, సోవియట్‌యూనియన్ జెకొస్లోవేకియాకు సహాయం జేయడానికి సిద్ధపడింది. కాని జెకొస్లోవేకియా ప్రభుత్వం, బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్యవాద ప్రభుత్వాల వత్తిడికి లొంగిపోయి జర్మనీ దురాక్రమణను నిరోధించడానికి అంగీకరించక జర్మనీకి లొంగిపోయింది.

(7) జర్మనీకి వ్యతిరేకంగా బ్రిటన్‌తో సోవియట్‌యూనియన్ ఒక పరస్పర సహాయక ఒడంబడిక జేసుకోడానికి యెంతో తీవ్రంగా కృషిజేసింది. కాని బ్రిటిష్ సామ్రాజ్యవాద ప్రభుత్వం



జర్మనీతో సోవియట్‌ను పోరాటములో యిరికించి తాను జడ్డునవుండి చూడడానికే ప్రయత్నం జేయడంవలన సోవియట్ గావించిన కృషిఅంతా విఫలమయింది. కాని బ్రిటిషసామ్రాజ్యవాదుల కుట్ర అంతా బహిర్గత మొనర్చబడింది.

సోవియట్ పై ప్రయత్నాలు పూర్తిగా జయంపొందకపోవడానికి కారణం బ్రిటన్‌లో లేబరు పార్టీ, అలాగే యితరదేశాలలో సోషలిస్టుపార్టీలు, కమ్యూనిస్టుపార్టీలతోను, తదితర ప్రజాపార్టీలతోను కలసి తమతమ దేశాలలోని ఫేసిస్టుఅనుకూల ప్రభుత్వాలను కూలద్రోయజాలకపోవడమే. అయినను సోవియట్ సామ్రాజ్యవాదయుద్ధాన్ని రాకుండా జేయడానికి ప్రయత్నాలను మానుకోలేదు.

ఇక ప్రజలు కమ్యూనిస్టుపార్టీల నాయకత్వముక్రింద, కార్మికవర్గ నాయకత్వముక్రింద "పాప్యులర్‌ఫ్రంటు"ను నిర్మించడానికి గావించిన ప్రయత్నాల ఫలితం చూద్దాం.

సోవియట్‌యూనియన్, కమ్యూనిస్టు పార్టీలనాయకత్వం క్రింద 1934-38 సంవత్సరాల మధ్య ఫేసిజానికి, సామ్రాజ్యవాదయుద్ధానికి వ్యతిరేకంగా ప్రజలను సమీకరించడానికి బ్రహ్మాండమైన ప్రజా ఐక్యతా వుద్యమము బయలుదేరింది. 1934-36 సంవత్సరాలమధ్య ఫ్రాంసులో "పాప్యులర్ ఫ్రంటు" వుద్యమము ఫ్రెంచి కార్మికవర్గం, కమ్యూనిస్టుపార్టీల నాయకత్వంక్రింద నిర్మింపబడింది. 1934 ఫిబ్రవరి 6 వ తేదీన ఫ్రెంచి ఫేసిస్టులు ఫేసిస్టునియంతృత్వాన్ని ఫ్రాంసులో స్థాపించడానికి గావించిన ప్రయత్నాలు ఫ్రెంచికార్మికవర్గం తనబలాన్ని ప్రదర్శించడంద్వారా, యితర వర్గప్రజలను ఫేసిస్టులకు వ్యతిరేకంగా ఐక్యపర్చడం ద్వారా పూర్తిగా భగ్నంగావించి ఫ్రాంసును ఫేసిస్టు క్రూర నిర్బంధ విధానం నుండి రక్షించింది. ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ కార్మికుల్లో పూర్తి ఐక్యతను తీసుకురాగలిగింది. కమ్యూనిస్టులు, సోషలిస్టులు, రాడికల్‌సోషలిస్టులు (పెటి బూర్జువాపార్టీ) - మూడుపార్టీలు కలిసి ఫ్రెంచి "పాప్యులర్ ఫ్రంటును" యేర్పరచాయి. 1936 యెన్నికల్లో "పాప్యులర్‌ఫ్రంటు" పక్షం విజయంపొందింది. బ్లూమ్ (సోషలిస్టునాయకుడు) నాయకత్వాన "పాప్యులర్ ఫ్రంటు" ప్రభుత్వం యేర్పడింది. "ఫ్రెంచి పాప్యులర్ ఫ్రంటు" ఉద్యమముద్వారా కార్మికులు అనేక ఆర్థిక, సాంఘిక హక్కులు గడించారు.

స్పెయినులో :

1930 మునిసిపల్ ఎన్నికలలో ప్రజాపక్షాలు అత్యధికంగా గెలుపొందినాయి. యీ ప్రజాసంరంభాన్ని చూచి స్పెయినురాజు ఆల్ఫాంజో దేశాన్ని వదలి పారిపోయాడు. అజానా నాయకత్వంక్రింద రిపబ్లికు ఏర్పడి స్పెయిను రైతుల కనుకూలంగా స్పెయిను జమీందారుల, మఠాధికారుల పొలాలను కొద్దిగా పంచింది. ఇది రైతులను తృప్తిపరచలేదు. కాని స్పెయిను జమీందారులు, మఠాధికారులు ప్రభుత్వానికి వ్యతిరేకంగా పనిచేసి తీవ్ర ఆందోళన చేశారు. 1933 లో జరిగిన యెన్నికలలో ప్రజాపార్టీలన్నీ కలసి పనిచేయనందున ముఖ్యంగా యానార్కిస్టు సిండికలిస్టులు ఎన్నికలను బహిష్కరించినందున స్పెయిను ఫాసిస్టులగు మితవాదులకు మెజారిటీ వచ్చింది. ఈ మితవాదుల ప్రభుత్వం అజానా ప్రభుత్వం గావించిన కొద్ది సంస్కరణలనుగూడ రద్దుగావించింది. క్రమేణా ఫాసిస్టుప్రభుత్వాన్ని యేర్పాటుచేయడానికి ప్రయత్నించసాగింది. దీనికి వ్యతిరేకంగా 1934 అక్టోబరులో స్పెయిను కార్మికులు (General Strike) సాయుధ తిరుగుబాటు తీసుకొనివచ్చారు. ఒక్క అస్టూరియా

గమలలోతప్ప మిగిలిన స్థలాలలోని తిరుగుబాట్లు అణచివేయబడినాయి. కాని అస్టూరియా గనుల వనివాండ్ర పోరాటము ఫాసిస్టులను పూర్తిగా తమ అధికారాన్ని స్థాపించడానికి శక్తిలేనివారినిగా చేసి వేసింది. తిరిగి 1936 లో ఎన్నికలను జరుపవలసివచ్చింది. యీ ఎన్నికలనాటికి స్పెయిన్ ప్రజా పార్టీలన్నీ కమ్యూనిస్టుల ప్రయత్నంవల్ల "పాప్యులర్ ఫ్రంటు"ను యేర్పాటు చేయగల్గాయి. స్పెయినులోని కమ్యూనిస్టులు, సోషలిస్టులు, అనార్కిస్టు. సిండికలిస్టులు, రాడికల్‌పార్టీ (పెటీబూర్జువా) కలసి పాప్యులర్ ఫ్రంటుగా యేర్పడినాయి. ఎన్నికలలో పాప్యులర్ ఫ్రంటు విజయం గాంచింది. యీ పాప్యులర్ ఫ్రంటు ప్రభుత్వము స్పెయిను ప్రజల కనుకూలమయిన చట్టాలు చేయసాగింది. దీనికి వ్యతిరేకంగా 1936 జూలై 17 వ తేదీని స్పెయిన్ జమీందారులు, బూర్జువావర్గము ఫ్రాంకో నాయకత్వాన తిరుగుబాటు చేశారు. ఈ తిరుగుబాటు యిటలీ, జర్మనీల యొక్క ప్రత్యక్ష ఆయుధ సహాయంచేతనూ, బ్రిటిష్, ఫ్రెంచి ప్రభుత్వాల Non - Intervention పాలసీవల్లనూ. స్పెయిను ప్రజా ప్రభుత్వానికి ఆయుధాలు దొరకకపోవడం వల్లనూ. 1939 ఏప్రిల్‌లో విజయంపొందింది.

**ఇంగ్లండు :**

1931 లో కార్మిక ప్రభుత్వాన్ని బడద్రోయడానికి యింగ్లీషు బూర్జువావర్గం పెట్టుబడి ధనాన్ని విదేశాలకు ఎగుమతి చేయసాగింది. పౌను విలువ పడిపోనారంభించింది. లేబరుపార్టీనాయకుడు రామ్సేమాగ్డనాల్డు లేబరుపార్టీని వదలి కన్సర్వేటివు (Bourgeoisic) పార్టీలో చేరిపోయినందున జాతీయప్రభుత్వం యేర్పాటయింది. ఈపార్టీ కార్మికుల నిరుద్యోగభృతిని తగ్గించింది. ఆభృతినిగూడ Means test కు గురిచేసింది. (అంటే ఇతర ఆదాయ మేమాత్ర మున్నప్పటికి కుటుంబములో మరెవ్వరైనా సంపాదించుతూంటే యీభృతిని తగ్గించేశారు. దీనినే Means test అంటారు. అంటారు. దీనికి వ్యతిరేకంగా నిరుద్యోగులు అనేక ఆకలియాత్రలు గావించి ఆందోళనచేశారు. దేశీయ వ్యవహారాలలోనూ, అంతర్జాతీయ వ్యవహారలలోనూ. అభివృద్ధి నిరోధక విధానాన్న వలంబించుతూన్న జాతీయ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పాప్యులర్ ఫ్రంటును యేర్పాటుచేయడానికి కమ్యూనిస్టుపార్టీ ప్రయత్నించింది. కాని బ్రిటిష్ లేబరుపార్టీ దానికి అంగీకరించక పోవుటచే కమ్యూనిస్టుపార్టీ ప్రయత్నాలు విఫలమయ్యాయి.

**అమెరికా :**

అమెరికాలో Unskilled కార్మికులమధ్య. నీగ్రోకార్మికులమధ్య సంఘటనగావించి ఒక పరిశ్రమలో పనిచేసే కార్మికుల నందరినీ ఒకే యూనియనుగా నేర్పాటు చేయసాగారు. C.I.O. (Congress of industrial organisation) అమెరికా కార్మికులకు మిలిటెంటుసంస్థగా నేర్పడింది. దీని నాయకత్వాన Steel industry లోనూ, మోటారుకారు యంత్ర పరిశ్రమలలోనూ, యిట్లే యింకనూకంపెనీ యూనియను లున్నటువంటి పరిశ్రమలలో సమ్మెలు సాగి యూనియన్లు యేర్పడ్డాయి. అమెరికాలో యిదివరకెన్నడూ లేనటువంటి కార్మికసంఘటన, చైతన్యం, సంచలనం గలిగింది. అమెరికాలోగూడ Workas and peasants పార్టీని అమెరికా బూర్జువాపార్టీలైన Radical party and democratic party లకు ప్రతిగా మూడవ పార్టీని యేర్పాటుచేసే ప్రయత్నాలు సాగాయి.



ఇవిగాక వలసదేశాలలోగూడ యిదేకాలములో సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా జాతీయోద్యమము అభివృద్ధి అవుతోంది. ఈజిప్టు. పాలస్తయిన్, ఇరాన్, క్యూబా. ఫిలిప్పైన్ దీవులు. మొరాకో (ఫ్రెంచి), లిబియా దేశాలలోగూడ జాతీయోద్యమములు సామ్రాజ్యవాదమునకు వ్యతిరేకంగా అభివృద్ధి అవుతున్నాయి. మనదేశంలో యీకాలంలో బయలుదేరిన ప్రజాసంరంభం, నిర్మింపబడుచున్న జాతీయైక్యతా వుద్యమముగూర్చి యిదివరకే చూశాము. చైనాలో జపాన్‌కు వ్యతిరేకంగా, చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంక్రింద జాతీయైక్యతా వుద్యమాన్నిగూడ చూశాము. 1937 సంవత్సరాన తరం చైనా కమ్యూనిస్టుపార్టీకి, చంగ్-కై-షేక్‌కు జపాన్ దురాక్రమణను నిరోధించడానికి జరిగిన ఒడంబడికతో చైనా జాతీయైక్యతావుద్యమము అనేకరెట్లు అభివృద్ధిచెందింది. చైనా జాతీయైక్యతతోనే జపాన్ ఆధునిక మారణసైన్యాన్ని, తనవద్ద హెచ్చు ఆధునిక యుద్ధపరికరాలు లేకపోయినా జయప్రదంగా యెదిరించగల్గుతోంది.

ఈవిధంగా ప్రపంచమంతటా 1934-39 సంవత్సరాలమధ్య ఫేసిజానికి, యుద్ధానికి వ్యతిరేకంగా కమ్యూనిస్టుపార్టీ, సోవియట్ యూనియనుల నాయకత్వముక్రింద బ్రహ్మాండమైన ప్రజావుద్యమాలు అభివృద్ధి అయ్యాయి. కాని సామ్రాజ్యవాదయుద్ధాన్ని రానీయకుండా యీ వుద్యమాలు చేయజాలకపోయినాయి. దీనికికారణం, కమ్యూనిస్టుపార్టీలు ఫేసిజానికి అనుకూలంగావున్న సామ్రాజ్యవాద ప్రభుత్వాలను కూలద్రోయడానికి తగినంత ప్రజా ఐక్యతను నిర్మించజాలకపోవడం; "పాప్యులర్ ఫ్రంటు" వుద్యమాలు జయప్రదముగాపకుండా ద్రోహంజేస్తున్న సోషల్‌డెమాక్రాటుల, సోషలిస్టుల, లేబరుపార్టీనాయకుల పలుబడి యీ వుద్యమాలపై పూర్తిగా తొలగించి వారు విచ్ఛిన్నచర్యలు చేయకుండా ఆపజాలకపోవడం; యీ పనులన్నీ నిర్వహించడానికి కమ్యూనిస్టుపార్టీలు నిర్మాణరీత్యా బాగా బలంగాను, స్థిరంగాను వుండే పార్టీనిర్మాణమును నిర్మించుకోజాలకపోవడం—కమ్యూనిస్టుపార్టీల యీ బలహీనతలవలన, సోషల్ డెమోక్రాటుల,సోషలిస్టుల, లేబరుపార్టీ నాయకుల విచ్ఛిన్నచర్యల వలన, బ్రిటిష్, ఫ్రెంచి, అమెరికన్ సామ్రాజ్యవాదుల కుట్ర చర్యలవలన రెండవ సామ్రాజ్యవాద యుద్ధంరాకుండా ఆపలేకపోయాము. కాని ఒక ఫలితంమాత్రం కల్గింది. సోవియట్ యూనియన్ బలమువలననూ, పైనవివరించిన ప్రపంచ ప్రజా వుద్యమాలవలన రెండవసామ్రాజ్యవాదయుద్ధం సోవియట్‌పై దాడిగాగాక, సామ్రాజ్యవాద దేశాలకు, ఫేసిస్టు దేశాలకు మధ్య సామ్రాజ్యవాద యుద్ధంగా మాత్రం పరిణమించింది. దీనివలన సోవియట్ యూనియన్‌కు తాత్కాలికంగా విరామముచిక్కింది. మిలిటరీగా, ఆర్థికంగా యింకా యెక్కువ బలపడడానికి అవకాశం యేర్పడింది. ప్రపంచ సామ్రాజ్యవాదం మొత్తంమీద బాగా బలహీనపడిపోయింది. ఈ పరిస్థితులలో రెండవ సామ్రాజ్యవాద యుద్ధం ప్రారంభమయింది.

**జాతీయ పరిస్థితులు :**

ఫాసిజానికి వ్యతిరేకంగాను, యుద్ధము రాపీయకుండాజేసి శాంతిని కాపాడడానికి ప్రపంచమంతటా జరుపబడిన పోరాటంపైన చూశాం. ఆ పోరాటం గూడ రెండుదశలుగా వున్నట్లే మనదేశంలో గూడ జాతీయైక్య సంఘటనను నిర్మించడానికి జరుపబడ్డ పోరాటం రెండువిధాలుగావుంది. 1934-37 ఆఖరువరకు ఒకదశ; 1938 నుండి 1939 ఆఖరువరకు రెండవదశ. మొదటిదశలో జాతీయైక్యసంఘటన వుద్యమము చాలవృద్ధిపొందింది; గొప్ప విజయాలుగూడ సాధించబడ్డాయి. పండిత జవహారి

జాతీయోద్యమమునుండి కమ్యూనిస్టులవరకు ఒకే ఆందోళన గావిస్తూండేవారు: ఫెడరేషను (పథకాలము) నువ్యతిరేకించుతూ వుండేవారు. బానిసరాజ్యాంగ విధానం అంతంచేయడానికి అందరూ ఐక్యంగావాలి; సంపూర్ణ స్వాతంత్ర్యమును, ప్రజాతంత్ర పరిపాలనను సంపాదించడానికి అందరూ ఐక్యంగావాలి; ప్రజా ప్రతినిధుల పరిషత్‌ను సమావేశపర్చుటకు జాతీయైక్యత నెలకొల్పాలి; కార్మికకర్షక హక్కులను సంపాదించడానికి, పౌరస్వాతంత్ర్యహక్కులను నిలబెట్టుకోడానికి ప్రజలందరూ ఐక్యంగావాలి-యివి ఆ రోజుల్లో జాతీయైక్య సంఘటనా వుద్యమ నినాదాలు. వీటిని అందరూ ఉచ్చరించుతూ వుండేవారు. ఈ దశలో యీ నినాదాలనుగాని, జాతీయైక్య సంఘటనా వుద్యమాన్ని నిర్మించడానికి కమ్యూనిస్టులు గావించే ప్రయత్నాలనుగాని కాంగ్రెసు మితవాద నాయకులెవరూ నిరోధించలేదు; మొదలు నుండా చూస్తూ వూరుకొనేవారు. ఎందుచేతనంటే యీ దశలో జాతీయైక్య సంఘటన కార్యక్రమము యేర్పరచబడుతోందేగాని దాని ననుసరించి అన్ని రంగాల్లో పని ప్రారంభంగాలేదు. ఇంకా మంత్రివర్గాలను కాంగ్రెసు యేర్పరచలేదు; అవి యేర్పడడానికి, వాటిని స్థిరపర్చుకోడానికి ప్రజా సంరంభం, వుద్యమము కొంతవరకు అవసరం. అందుచేత జాతీయైక్య సంఘటనా నిర్మాణముకొరకు కమ్యూనిస్టు నాయకత్వంక్రింద, అతివాదుల నాయకత్వంక్రింద దేశమంతటా బయలుదేరుచున్న ప్రజావుద్యమాన్ని నుపయోగించుకొని జాతీయైక్య సంఘటనలో తన స్థానాన్ని బలపర్చుకోడానికి బూర్జువావర్గం ఆశించింది. అందుచేత యీ దశలో (1934-37) జాతీయైక్యసంఘటనా నినాదముల ననుసరించి చెలరేగిన ప్రజా సంరంభమును, వుద్యమాన్ని కాంగ్రెసు మితవాద నాయకత్వం యెదిరించలేదు.

కమ్యూనిస్టులకు, సోషలిస్టులకు జాతీయ అతివాదులకుగూడ వున్న వైరుధ్యాలు యీ దశలో పైకిరాలేదు. ఇంకా జాతీయైక్య కార్యక్రమాన్ని యేర్పరచడం దశలోనే వుండుటవలన యీ దశలో అవి బొడసూపలేదు. జాతీయైక్య సంఘటన వుద్యమాన్ని నిర్మించుతూ పనిజేస్తున్న రెండవదశలో అవి వచ్చాయి. ఇప్పుడు అందరూకలసి జాతీయైక్యసంఘటనా కార్యక్రమాన్ని యేర్పరచారు. జాతీయైక్య సంఘటనను పూర్తిగా నిర్మించడానికి పునాదివేశారు. (ఇవన్నీ వెనుకటి భాగంలో చూశాం.)

రెండవదశ ప్రారంభమయింది. (1938 నుండి 1939 ఆఖరువరకు) హరిపుర కాంగ్రెసు (1938 ప్రారంభంలో) సమావేశంలో మితవాదులు జాతీయైక్య నిర్మాణమును విచ్ఛిన్నం గావించ ప్రయత్నించారు. అప్పటికి కాంగ్రెసు మంత్రివర్గాలు యేర్పడ్డాయి. ఇక వాటిని స్థిరపర్చుకోవాలి. జాతీయైక్య సంఘటనా వుద్యమమును ఆధారంగాగొని మంత్రివర్గాలను నిజమైన ప్రజా కోర్కెలకొరకు పోరాడే ప్రజా మంత్రివర్గాలుగా గావించుకోడానికిబదులు, ప్రభుత్వాధికారులను, జమీందారులను, పెట్టుబడిదారులను సంతృప్తిపర్చి వారితో రాజీగా పోవడంద్వారా తమ మంత్రివర్గాలను బలపర్చుకోడానికి ప్రయత్నించారు. ఈ ప్రయత్నాలను కాంగ్రెసు మితవాద నాయకత్వం అంగీకరించి బలపర్చింది. ఇందుకుగాను శాసనసభల వెలుపల జరుపబడే ప్రజాపోరాటాలు, ఆందోళన అంటే అసమ్మతి చూపెట్టడం ప్రారంభించారు. కాంగ్రెసుసంఘాలు, కమ్యూనిస్టులు, అతివాదులు గావించే ప్రజాపోరాటాలకు, ఆందోళనకు సహాయకారిగా వుండకుండా వుండేందుకు, మంత్రివర్గ రాజీ మార్గాన్ని బలపర్చే సాధనాలుగా వుండేందుకు, కాంగ్రెసుసంఘాలలోనికి కమ్యూనిస్టులు, అతివాదులు రాకుండాను, వున్నవాళ్లను తొలగించడానికి తీవ్రప్రయత్నాలు చేయబడ్డాయి. ఈ విధంగా రెండవదశలో జాతీయైక్య సంఘటనా వుద్యమమును విచ్ఛిన్నం గావించి బలహీనపర్చుటకు కాంగ్రెసుమితవాదులు ప్రయత్నాలు సాగించారు.



1937-39 సంవత్సరాలలో కమ్యూనిస్టులు, కాంగ్రెసు సోషలిస్టులు, అతివాద కాంగ్రెసువాదుల నాయకత్వంక్రింద బయలుదేరిన కార్మిక కర్షక ప్రజాసంరంభం, వుద్యమముచూచి కాంగ్రెసుమంత్రులు, మితవాదనాయకులు గాభరాపడ్డారు. ఈ ప్రజావుద్యమమంతా జాతీయోద్యమముగా, కాంగ్రెసు సహకారంతో జరుపబడుచుండుటవలన మరింత భయపడ్డారు ఈ ప్రజావుద్యమము ద్వారా ప్రజలు కాంగ్రెసునాయకులను ఫెడరేషనుకు వ్యతిరేకంగా, ప్రజాతంత్ర పరిపాలనను నెలకొల్పడానికి ఐక్య జాతీయోద్యమాన్ని కాంగ్రెసుద్వారా సాగించాలనే ప్రజాకోర్కె వెల్లడి అయింది. కమ్యూనిస్టులు గూడ అప్పుడుకోరింది కాంగ్రెసునాయకత్వంను తొలగించి మితవాద కాంగ్రెసునాయకులను కాంగ్రెసు నుండి తరిమివేయడంగాదు; అతివాదులు, మితవాదులు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు-అందరూకలసి జాతీయైక్యసంఘటనను నిర్మించుకొని, దానికి ఐక్యనాయకత్వమును నెలకొల్పుకొని కాంగ్రెసుద్వారా జాతీయైక్య పోరాటమును గొనిరావాలనియు, ఇందుకు కాంగ్రెసునాయకత్వం పూర్తిగా పూనుకోవాలనియు కోరారు. ఈ నినాదంతో జాతీయైక్య పోరాటంకొరకు ఆందోళన గావిస్తూ దానికి ప్రాతిపదికగా ప్రజాపోరాటాలను, వుద్యమాన్ని నిర్మిస్తున్నారు. ప్రభుత్వ నిరంకుశోద్యోగులకు, జమీ దార్లకు, పెట్టుబడిదార్లకు లొంగిపోకుండా ప్రజల ఆర్థిక రాజకీయహక్కులకొరకు గట్టిగా పోరాడమని, అట్టివారి పోరాటానికి బైట తాము నిర్మించే జాతీయైక్య వుద్యమపు బలమంతా యిస్తామని తెల్పుతూ కమ్యూనిస్టులు కాంగ్రెసు మంత్రులను కోరారు.

ఈ కార్యక్రమముతో కమ్యూనిస్టులు గావిస్తున్న ఆందోళన, నిర్మించుచున్న జాతీయైక్యతా వుద్యమము తమ రాజీపంథాను ప్రజలముందు బహిర్గతంచేస్తోంది; తత్ఫలితంగా జాతీయోద్యమముపై తమ నాయకత్వము, పలుకుబడి క్రమంగా క్షీణించిపోయే పరిస్థితి యేర్పడింది; క్రమక్రమేణా అతివాదులు ముఖ్యంగా కమ్యూనిస్టుల పలుకుబడి, రాజకీయపాలసీ ప్రజల్లో బలపడేపరిస్థితులేర్పడ్డాయి. అందుచేత యీ జాతీయైక్యతా వుద్యమ నిర్మాణమునకు ముఖ్యకారకులైన కమ్యూనిస్టులను కాంగ్రెసు ప్రజాసామాన్యంతో కలసి పనిజేయకుండా వుండుటకు అడ్డంకులు ప్రారంభించారు. (రైతుసంఘాలు గావించే పోరాటాలను కాంగ్రెసుసంఘాలు బలపర్చరాదు. మంత్రులను కాంగ్రెసుసంఘాలు విమర్శించరాదు. పౌరస్వాతంత్ర్య హక్కులు-వాటిపై కాంగ్రెసుగావించిన తీర్మానాలు.) ఇంతేగాకుండా నేరుగా కార్మికపోరాటాలపైనను, రైతుపోరాటాలపైనను, విద్యార్థిపోరాటాలపైన కాంగ్రెసుమంత్రులు దాడులు ప్రారంభించారు; లాఠీచార్జీలు, కాల్పులు ప్రజలపై జరపడం ప్రారంభించారు. ప్రభుత్వ నిరంకుశోద్యోగుల చర్యలను సమర్థించుతూ ప్రజా వుద్యమాలను బలహీనపర్చారు. ఈ విధంగా ఈదశలో జాతీయైక్య సంఘటనా వుద్యమములో అతివాదులకు, కాంగ్రెసు మితవాదులకు స్పర్థలు హెచ్చాయి. జాతీయైక్యసంఘటనను విచ్ఛిన్నం గావించడానికి మితవాద కాంగ్రెసునాయకులు తీవ్ర ప్రయత్నం గావించారు. అయినప్పటికి వీరి చర్యలకు కాంగ్రెసు అతివాదులు, సోషలిస్టులు రెచ్చిపోకుండా అతివాద ఐక్యతను కమ్యూనిస్టులు కాపాడగల్గినంతవరకు మితవాద కాంగ్రెసువాదుల విచ్ఛిన్నచర్యలు అంత ఫలించలేదు.

జాతీయైక్య వుద్యమము అభివృద్ధి పొందుతూనేవుంది. త్రిపురీ కాంగ్రెసుకు బోసు అధ్యక్షుడుగా యెన్నుకోబడడం దాన్నే తెలియపర్చుతుంది. జాతీయైక్య సంఘటనలో అతివాదుల విజయం యిది. కాని యీ విజయానికి సరియైన పునాదిలేదు. కమ్యూనిస్టులు యీ విషయం గుర్తించారు. కాని

జాతీయ అతివాదులు, కాంగ్రెసు సోషలిస్టులు యీ విషయాన్ని గ్రహించక జాతీయైక్య సంఘటనా వుద్యమముపై పూర్తి పెత్తనం అతివాదులకు వచ్చిందనియు, దాన్నింకా ముందుకు తీసుకుపోవడానికి అడ్డంకుగావున్న కాంగ్రెసు మితవాదులను తొలగించితే జాతీయవిప్లవము సాధించవచ్చుననీ తలచారు. కమ్యూనిస్టులు జాతీయ అతివాదులపై వాదనను వ్యతిరేకించారు. కాంగ్రెసు మితవాదులను జాతీయైక్య సంఘటన వుద్యమమునుండి తరిమివేయడంగాదు యిప్పుడు చేయాల్సింది. జాతీయైక్య వుద్యమాన్ని యింకా అభివృద్ధి జేయడానికి దానిపై అతివాదులు, మితవాదులు కలపివున్న ఐక్య నాయకత్వమును నెలకొల్పవలయునని చెప్పారు. ఆ విధంగానే జాతీయైక్య సంఘటన వుద్యమముపై యింకా పలుకుబడి, నాయకత్వము కల్గివున్న కాంగ్రెసు మితవాదుల రాజీ పంథాను అమలు జరుగకుండా జేయగల్గుతామని, విప్లవ పోరాట పంథా జాతీయైక్య సంఘటనా వుద్యమ పంథాగా అంగీకరింపబడేటట్లు చేస్తామని హెచ్చరించారు. లేకపోతే జాతీయైక్య సంఘటన యింకా బలహీనంగా వున్న సమయంలో కాంగ్రెసు మితవాదులు మరింత బలహీనం జేయడానికి తోడ్పడతామనిగూడ హెచ్చరించారు.

కాని జాతీయ అతివాదులు కమ్యూనిస్టుల హెచ్చరికను గమనించలేదు; కాంగ్రెసు సోషలిస్టు నాయకులు కమ్యూనిస్టులతో కలవలేదు. ఈవిధంగా అతివాద ఐక్యత విచ్ఛిన్నమైంది. కాంగ్రెసు మితవాదులు యీ బలహీనతను వుపయోగించుకొని జాతీయైక్య సంఘటనను విచ్ఛిన్నం గావించారు. కాంగ్రెసు వర్కింగుకమిటీలో ఒకే అభిప్రాయం గలవారే వుండాలనే మిషతో అదివరకున్న అతివాదులందరినీ దానినుండి తరిమివేశారు. అతివాదులను కాంగ్రెసునుండి "క్రమశిక్షణ లేదనే" మిషతో తొలగించారు. మితవాదుల యీ విచ్ఛిన్నచర్యలకు రెచ్చిపోయి బోసుముఠా "ఫార్వర్డు బ్లాకు"ను స్థాపించి రెండోప్రక్కనుండి జాతీయైక్య విచ్ఛిన్నానికి పూనుకొంది. కాంగ్రెసు సోషలిస్టు నాయకులు అటు బోసు విచ్ఛిన్న చర్యలుగాని, యిటు కాంగ్రెసు మితవాద విచ్ఛిన్న చర్యలుగాని యెదుర్కొనకుండా కమ్యూనిస్టు వ్యతిరేకప్రచారం జేయడం ప్రధానంగా పెట్టుకున్నారు.

కమ్యూనిస్టుపార్టీ అతివాదుల మధ్య ఐక్యత నెలకొల్పజాలక పోవడం, అతివాదుల నందరినీ పార్టీలో యిముడ్చుకొని వారికి తగిన మార్క్సిస్టు సిద్ధాంతజ్ఞానం, బోల్షివిక్ క్రమశిక్షణ నేర్పడానికి తగినపార్టీ నిర్మాణం చేయజాలకపోవడం జాతీయైక్యసంఘటన విచ్ఛిన్నం గావడానికి ఒక ముఖ్య కారణం. కమ్యూనిస్టుపార్టీయే అతివాదులలో చాలమందిని త్రిపురీకాంగ్రెసుకుముందే పార్టీలోఇముడ్చుకోడానికి హెచ్చుకృషి జేసినట్లయిన త్రిపురీనాటికి అతివాదులలో ఒకే రాజకీయపాలసీ, ఒకే క్రమశిక్షణ యుండేది. బోసు, కాంగ్రెసు సోషలిస్టునాయకులూ తమ ఫాక్షనల్ తగాదాలకొరకు ప్రయత్నించినా వారికి పెద్ద బలముండేదిగాదు. అతివాదులందరూ కమ్యూనిస్టులనే అనుసరించేవారు. (పార్టీలో వుండేవారు గాబట్టి) ఈ విధంగా అతివాద ఐక్యత కాపాడబడేది. మితవాదుల విచ్ఛిన్న ప్రయత్నాలు విఫలమయ్యేవిగావు. కమ్యూనిస్టుపార్టీ నిర్మాణ బలహీనతే మరల యిచ్చటగూడ జాతీయైక్య సంఘటన పూర్తిగా సాధించడానికి అడ్డుపడింది.



# సామ్రాజ్యవాద యుద్ధకాలం

## పార్టీ నిర్మాణ ప్రయత్నాలు (1939-1941 జూన్)

సామ్రాజ్యవాద యుద్ధ కాలాన్నంతటిని రెండుభాగాలుగా భాగించవచ్చును. (1) 1939 సెప్టెంబరునుండి 1940 సెప్టెంబరువరకు. (2) 1940 అక్టోబరునుండి 1941 జూన్‌వరకు. ఈ రెండుదశలు పార్టీ నిర్మాణ ప్రయత్నాలలో రెండు విభిన్న దశలను తెలియపర్చుతాయి. ఈ రెండు దశలలోను పార్టీ కార్యకలాపాలు యెలావున్నాయో తెలుసుకునేముందు రెండవ సామ్రాజ్యవాద యుద్ధంరావడంతో అంతర్జాతీయంగాను, జాతీయంగాను గల్గిన మార్పులు, వివిధరాజకీయ పార్టీలు యుద్ధంవలన అవలంబించిన వైఖరులు, కమ్యూనిస్టుపార్టీ యిచ్చిన కార్యక్రమముగూర్చి తెలుసుకోవడం అవసరం. ఈ పరిస్థితులనుగూర్చి తెలుసుకున్నప్పుడే కమ్యూనిస్టుపార్టీయొక్క నిర్మాణ ప్రయత్నాల ప్రాముఖ్యత మరీ బాగా బోధపడుతుంది.

### రెండవ సామ్రాజ్యవాదయుద్ధం - అంతర్జాతీయ కార్మికవర్గ కర్తవ్యం:

అబిసీనియా, స్పెయిన్, చైనాలపై దండయాత్రలతో ప్రారంభమైన రెండవ సామ్రాజ్యవాద యుద్ధం యిప్పుడు పెద్దదయింది. బ్రిటన్, ఫ్రాంసు, జర్మనీ పెద్దకేపిటలిస్టు దేశాలమధ్య యుద్ధంగా మారింది. ప్రపంచానికంతకు పా ,కే ప్రమాదం యేర్పడింది. ఈకాలంలోని యుద్ధం, దానిస్వభావాన్ని బట్టిచూసినా, సారాంశాన్ని బట్టిచూసినా, అది సామ్రాజ్యవాదయుద్ధమనీ, అక్రమయుద్ధమనీ తేలుతుంది. యుద్ధంజేస్తున్న కేపిటలిస్టు పాలకవర్గాలు తమ అసలు ఆశయాలు కప్పిపుచ్చి ప్రజలను మోసగించడానికి యెన్ని తప్పుడు నినాదాలిచ్చినా, ప్రచారంచేసినా యుద్ధ స్వభావం తెలుస్తూనేవుంది. లెనిన్ చెప్పినట్లు "యుద్ధ స్వభావం నిర్ణయించేది ఎవరు దండెత్తారు లేక శత్రువు యే పక్షానవున్నాడు అనే దాన్నిబట్టిగాదు· యుద్ధంజేసే వర్గాలు ఏవి? ఆ యుద్ధంలో అనుసరించబడే పాలసీ ఏమిటి? అనే వాటినిబట్టి యుద్ధస్వభావం నిర్ణయించబడుతుంది." 1914 లోవలెనే యుద్ధం సామ్రాజ్యవాద బూర్జువా వర్గంచే సాగించబడుతోంది. ఆ యుద్ధం ప్రపంచాన్ని తిరిగి పంచుకోడానికీ, ప్రపంచపెత్తనంకోసమూ సామ్రాజ్యవాదులమధ్య జరుగుతూవచ్చిన పెనుగులాటయేతప్ప మరోటికాదు. ప్రపంచపెత్తనంకోసం, కాలనీలకోసం, ముడిసరుకులకోసం, సముద్రమార్గాలకోసం, ఇతర దేశాలను, ప్రజలను బానిసలు గావించడంకోసం జరిగే యుద్ధం అది. గత ప్రపంచ యుద్ధ ఫలితంగా జర్మనీకిగల కాలనీలు ఊడగొట్టబడ్డాయి. జర్మనీ తిర్గి తనకు అవి కావాలనీ అందుకు ప్రపంచం తిరిగి పంచబడాలని కోరుతోంది. ఎవరిమట్టుకువారు తమక్రింద యెక్కువ దేశాలు, ఎక్కువ ప్రజలు బానిసలుగా వుండాలని, తమ సామ్రాజ్యం సుస్థిరంగా వుండాలని, ఎదిరి సామ్రాజ్యవాద ప్రభుత్వాలు తమమీదనే ఆధారపడే లాగు జేయాలని పోరాడుతున్నారు. యుద్ధ సారాంశం బయటబడేది యిక్కడే. సామ్రాజ్యవాదులు, వారితోకల ననుసరించి పోతూవున్న సోషల్ డెమాక్రాటు నాయకులు, లేబరుపార్టీ నాయకులు, "ప్రజాస్వామ్యరక్షణకు" "స్వాతంత్ర్యంకొరకు" "అంతర్జాతీయ న్యాయసిద్ధాంతాలను రక్షించడానికి" "చిన్నదేశాల ప్రజల స్వాతంత్ర్యం కాపాడడానికి" జరుగుతోందంటున్నారు. ఎంతమాత్రమూ నిజంగాదు. అది యూరప్‌లో పెత్తనంకోసం, ఆఫ్రికాలోని, యితర ప్రపంచంలోని వలసరాజ్యాలను పంచు

కోడానికి, నూనెకోసం, బొగ్గుకోసం, ఇనుముకోసం, రబ్బరు మొదలయిన వాటికోసం జరిగే సామ్రాజ్యవాదయుద్ధం. కక్షిదారులు, తటస్థంగావున్నవారుకూడ యుద్ధానికిబాధ్యులే. యుద్ధంలో బహిరంగంగా పాల్గొనకపోయినప్పటికీ చాల కేపిటలిస్టుదేశాలు ఏ పక్షానికిచెందినదీ సామ్రాజ్యవాద బూర్జువావర్గ ఆశయాలనుబట్టి నిర్ణయింపబడింది. వారి తటస్థ విధానం వట్టిబూటకం.

రెండవ సామ్రాజ్యవాద యుద్ధక్రమములో రెండు దశలు స్పష్టంగా గోచరించాయి. మొదటి దశలో ఇటలీ, జర్మనీ, జపాన్ దేశాలు దురాక్రమణదారులుగా ముందుకువచ్చారు. చిన్న రాజ్యాలపై దండయాత్రలు ప్రారంభించారు. బ్రిటన్, ఫ్రాంసు, అమెరికాలాంటి కేపిటలిస్టు దేశాలు ఫాసిస్టు దురాక్రమణ ముందు వెనుకకు తగ్గి, తమ ప్రత్యర్థులైన ఫాసిస్టు రాజ్యాలతో సంఘర్షణ తప్పించుకొని వారిని సోవియట్ యూనియన్‌వైపుకు మరల్చాలని ప్రయత్నించాయి.

1939 సెప్టెంబరు అనంతరం బ్రిటన్, ఫ్రాంసులే చొరవతీసుకొని తమతమ దేశాల ప్రజలను జర్మనీకి వ్యతిరేకంగా యుద్ధంలోకి దించాయి. తమ పక్షానికి యెక్కువ రాజ్యాలను త్రిప్పుకోడానికి ప్రయత్నించాయి. ఆకుట్ర ఫలించకపోవడంవలన బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్యవాదులే 1939 సెప్టెంబరులో ప్రారంభమైన యుద్ధాన్ని యెక్కువకాలం సాగించడానికి, ఎక్కువదేశాలకు వ్యాపింపజేయడానికి కృషిజేశారు.

ఈవిధంగా నలువైపులావ్యాపింపజేయబడిన రెండవసామ్రాజ్యవాదయుద్ధం పెట్టుబడిదారీ ప్రపంచములోవున్న ప్రధాన స్పర్థలను మరింత తీవ్రపర్చింది. యుద్ధము కొనసాగింపబడినకొలదీ సామ్రాజ్యవాద ప్రభుత్వాలమధ్య స్పర్థలు బాగా ఎక్కువయాయి. సామ్రాజ్యవాద దేశాలకు, కాలనీలకు మధ్య స్పర్థగూడ బాగా హెచ్చయింది. ఈ విధంగా బూర్జువావర్గ సమాజములోవున్న వర్గ సంబంధాలు బట్టబయలు గావించబడ్డాయి. దోచుకొనబడే ప్రపంచానికీ—దోచుకొనే కొలదిమంది ధనాఢ్యులకు మధ్యగల స్పర్థ రాజకీయంగా, ఆర్థికంగా - అన్నివిధాలా బాగా తీవ్రమయింది పెట్టుబడిదారీ విధానములోనే పెద్ద సంక్షోభం యేర్పడింది. యుద్ధముజేసే దేశాల్లోనేగాక అన్ని కేపిటలిస్టు దేశాలలోను కార్మికవర్గంమీద, కష్టజీవులైన ప్రజాసామాన్యంమీదను క్రూర నిర్బంధవిధానం అనుసరించబడింది. యుద్ధానికిపూర్వం (1939 కి పూర్వం)ఒక్క ఫాసిస్టుదేశాలలోనేవున్న క్రూరనిర్బంధ పరిపాలనావిధానం యుద్ధం ఆరంభమైనాక (1939 సెప్టెంబరు అనంతరం) బూర్జువా ప్రజాస్వామ్య దేశాలనబడే దేశాలన్నిటిలోనూ విచ్చల విడిగా సాగింపబడింది.

మార్పుజెందిన యీ క్రొత్తపరిస్థితులలో కార్మికవర్గాన్ని యెదుర్కొంటున్న కర్తవ్యంగూడ క్రొత్త స్వభావం పొందింది. యుద్ధానికి పూర్వం కార్మికవర్గ కర్తవ్యం సామ్రాజ్యవాద యుద్ధాన్ని రాకుండా జేయడం, యుద్ధ కాంక్షితులను అణిచివేయడం; యుద్ధం ఆరంభమయ్యాక యుద్ధాన్ని అంతంజేయడానికి, యుద్ధానికి వ్యతిరేకంగా ప్రజలను సమీకరించడం వారి ప్రధానకర్తవ్యం. యుద్ధం రాకపూర్వం పెట్టుబడిదారులు కార్మికులపై గావించేదాడిని ఫాసిస్టు విప్లవ ప్రతిఘాతాన్ని అరికట్టడం వీటికొరకు కార్మికవర్గం కృషిజేస్తులదేది. యుద్ధం వచ్చాక ప్రజలపై నిరాఘాటంగా ప్రవేశపెట్టబడుచున్న క్రూర నిర్బంధ దోపిడీ పరిపాలనను వ్యతిరేకించుతూ నిశ్చితమైన ప్రజాపోరాటం సాగించడం దాని కర్తవ్యమైనది. యుద్ధభారాన్ని కష్టజీవులపై పడకుండా కాపాడవలసిన బాధ్యత కార్మికవర్గంపై పడింది.



యుద్ధ ఫలితంగా నూతనంగా వచ్చిపడ్డ కష్టాలను నివారించుకోడానికి, యుద్ధాన్ని త్వరలో అంతంజేయడానికి, శాంతిని నెలకొల్పగల ప్రజాప్రభుత్వాన్ని స్థాపించేందుకు ప్రజలందరినీ సమీకరించి ప్రజావుద్యమమును అభివృద్ధిజేయాల్సిన బాధ్యత కార్మికవర్గంపై పడింది. ఈ ప్రజావుద్యమాన్ని యుద్ధానికి పూర్వం సాధించిన ప్రజావిజయాలు ప్రజాఐక్య సంఘటనావుద్యమ అనుభవాన్ని ఆధారంగా తీసుకొని కార్మికవర్గం నూతన పరిస్థితుల కనుగుణ్యంగా సాగించింది.

యుద్ధమొచ్చాక సోషల్ డెమాక్రాటు నాయకులు సామ్రాజ్యవాద ప్రభుత్వాలతో "యుద్ధం సాగించడానికి" చేయులు కలిపి ప్రభుత్వ క్రూరనిర్బంధ దోపిడీని పూర్తిగా బలపర్చుచుండుటచేత యుద్ధానికిపూర్వం వారితో కలసి "పాప్యులర్‌ఫ్రంటు"లో పనిజేసినట్లు, యుద్ధమొచ్చాక వారితో జాతీయైక్యసంఘటన నిర్మించడం సాధ్యంగాలేదు. పైనుండి జాతీయైక్యతను నిర్మించడానికిబదులు క్రిందినుంచి నిర్మించాల్సిన అవసరం వచ్చింది. అందుచేత నూతన జాతీయైక్య సంఘటనా యెత్తుగడలతో యుద్ధ వ్యతిరేక వుద్యమాన్ని సాగించాల్సిన అవసర మొచ్చింది. ఈ వుద్యమానికి కమ్యూనిస్టులు తప్ప మరే అభివాదపార్టీ ప్రారంభంలో కలసిరాలేదు. తతిమ్మా అన్ని సోషల్ డెమాక్రాటు పార్టీలు బూర్జువావర్గంలో చేయులు కలిపి యుద్ధం సాగించడానికి తోడ్పడ్డాయి. అందుచేత కమ్యూనిస్టుపార్టీల బాధ్యతలు చాల హెచ్చాయి.

తాత్కాలికంగా యుద్ధానికి పూర్వమున్న ప్రపంచ కార్మికోద్యమ ఐక్యత; ఫాసిస్టు వ్యతిరేక ప్రజాకూటమి చెల్లా చెదరైపోయింది; పాప్యులర్‌ఫ్రంటు విచ్ఛిన్నముగావించబడింది. కార్మికవర్గం, కమ్యూనిస్టుపార్టీలు ఒంటరిగా యుద్ధ వ్యతిరేక వుద్యమాన్ని సాగించవలసివచ్చింది.

యుద్ధము - మనదేశంలోని వివిధపార్టీల బోల్తాలు :

కాంగ్రెసు నాయకత్వం :

యుద్ధం ప్రారంభం గావడంతో యుద్ధానికి పూర్వమున్న పరిస్థితులు అన్నివిధాలా మార్పుజెందాయి. వ్యక్తులకు, పార్టీలకు, రాజకీయ నినాదాలకు పరీక్ష సమయమొచ్చింది. యుద్ధముయెడల, దాన్ని కొనసాగిస్తూ వున్న ప్రభుత్వంయెడల నిశ్చితమైన వైఖరి ప్రతిపార్టీ యేర్పరచుకోవలసివచ్చింది. ఏ సమస్యపైననూ తాటస్థ్యముగా యుండుట అసంభవమైంది.

మనది బానిసదేశం అగుటచేత యుద్ధంవలన సామాన్యకష్టజీవులకు కలిగే కష్టాలు మన దేశంలో యింకా హెచ్చాయి. ఒకవైపున సామ్రాజ్యవాదానికి, మరోవైపున యావత్తు భారతజాతికి మధ్యప్రధానమైన వైరుధ్యం యిదివరకేసాగుతూవుంది. యుద్ధం ప్రారంభంగావడంతో యీ పరస్పర వైరుధ్యంమరీ తీవ్రమయింది. యుద్ధాన్నికొనసాగించడానికి బ్రిటీషు పరిపాలకులుమనలనుమరీయింకా యెక్కువగా దోచుకోవలసివస్తోంది. యుద్ధారంభంకాగానే యెక్కువగా స్తోత్రింపబడిన డెమాక్రసీ అంతర్ధానమయింది: ఆర్డినెన్సురాజ్యం ప్రారంభమైంది. ప్రజాప్రతినిధులైన మంత్రులు పదవులనుంచి విరమించారు, గవర్నరు సలహాదారుల పరిపాలన నెలకొల్పబడింది. ఇండియా బడ్జెటు పూర్తిగా యుద్ధ బడ్జెటుగా మారింది. భారతప్రజలనుండి యుద్ధ ఖర్చులు వసూలుచేయబడుతున్నాయి. భారత పెట్టుబడిదారులు యుద్ధం ఫలితంగా హెచ్చు లాభాలను పొందాలని చూస్తున్నారు కాని అధికలాభాల పన్ను వారిపై విధింపబడి వారి లాభాలన్నీ తిర్గి యుద్ధంకొరకు ప్రభుత్వం గుంజుతోంది. భారత పరి

క్రమాభివృద్ధి పూర్తిగా అరికట్టబడింది. అందుచేత భారత పెట్టుబడిదారులుగూడ యుద్ధం అంటేను, ప్రభుత్వ విధానం అంటేనూ పూర్తి అసంతృప్తి జెందివున్నారు. విదేశ ఫ్యాక్టరీ సరుకుల ఖరీదులు విపరీతంగా పెరిగాయి; కానివానితోపాటు భారతదేశ రైతాంగపు ముడివస్తువులకు ధరలుపెరుగకుండా అరికట్టబడింది. ఈ విధంగా భారత ప్రజానీకమంతా కూలీలనుండి పెట్టుబడిదారులవరకూ యుద్ధమొచ్చాక ప్రభుత్వ వ్యతిరేకత హెచ్చుకావడం మొదలుపెట్టింది.

కాంగ్రెసు మితవాదులకు, సంస్కరణవాదులకు యుద్ధానికి పూర్వమున్న పార్లమెంటరీ భ్రమలను సామ్రాజ్యవాదుల ప్రవర్తన భగ్నం గావించింది. సామ్రాజ్యవాదం దానంతటదే స్వాతంత్ర్యం యివ్వదనీ, పోరాడి తెచ్చుకోవాలనీ అందరికి స్పష్టమైంది.

ప్రభుత్వం యుద్ధం కొనసాగించడానికి భారత దేశంలో కొనసాగించిన ఆర్థిక రాజకీయ విధానంతో అది అన్నితరగతుల ప్రజలనుండి పూర్తిగా వేరుపడిపోయింది. అన్నితరగతులను ఆర్థికంగా దోపిడి చేయకుండాను, రాజకీయంగా నిర్బంధాలు ప్రయోగించకుండాను యుద్ధప్రయత్నాలను ప్రభుత్వం కొనసాగించలేని స్థితికివచ్చింది. అందుచేత ప్రభుత్వమంటే యిదివరకెన్నడూలేని అసంతృప్తి, తిరుగుబాటు భావం ప్రజల్లో గలిగింది. అంతర్జాతీయంగాగూడ ప్రభుత్వం చాల క్లిష్టపరిస్థితుల్లో పడింది. ఆర్థికంగా తనకున్న ప్రపంచ పెత్తనమంతా పోయింది; అమెరికాకు లొంగిపోవలసి వచ్చింది. యూరప్‌పై రాజకీయంగా వున్న కాస్తపెత్తనంగూడ యుద్ధంతోపోయింది. సోవియట్‌యూనియన్‌పై జర్మన్ దాడిగావించి తన సామ్రాజ్యాన్ని సురక్షితంగా వుంచుకుందామనే కుత్సితాభిలాష పూర్తిగా భగ్నమైంది. తన సామ్రాజ్యమే వూడిపోయే అపాయం యేర్పడింది. ఈవిధంగా బ్రిటిష్‌సామ్రాజ్యవాదం యిదివర కెన్నడూ లేనంత బలహీనంగా యుద్ధమొచ్చాక తయారైంది. ఈ అనుకూల పరిస్థితుల నాధారంగా గొని కాంగ్రెసు నాయకత్వం భారతదేశ ప్రజాపోరాటాన్ని గొనిరావడానికి, దానిని జయప్రదంగా కొనసాగించడానికి పూర్తి అనుకూలపరిస్థితు లేర్పడ్డాయి.

కాని కాంగ్రెసు నాయకత్వం బూర్జువావర్గ నాయకత్వము అగుటచేత, భారతదేశ ప్రజావ్యాపిత ప్రజాపోరాటాన్ని తీసుకురావడానికి నిరాకరించింది. ఎందుచేత? బూర్జువావర్గం స్వాతంత్ర్యంకోసం నిజమైన ప్రజాపోరాటాన్ని యుద్ధసమయంలో ప్రారంభించజాలదు. ఏమంటే ఒక్క వెల్లువతో అది విప్లవపోరాటంగా మారి, సంస్కరణవాదుల హద్దులను తుడిచిపెడుతుంది. అంతేగాకుండా జాతీయ వుద్యమముపై దాని పలుకుబడి క్షీణించుతుంది; కార్మిక కర్షక ఉద్యమాలు బలపడి వాటి పలుకుబడి జాతీయోద్యమముపై హెచ్చుతుంది. సామ్రాజ్యవాదాన్ని బూర్జువావర్గం ద్వేషించినా, అంతకన్నా హెచ్చుగా ప్రజాసామాన్యాన్ని చూచి ద్వేషించుతుంది; ప్రజావుద్యమము అంటే భయపడుతుంది. జాతీయలాభాలకంటే అది తన వర్గలాభాలను ప్రధానంగా చూచుకొంటుంది. తన అనుచరులపై వున్న పలుకుబడినే గోల్పోతున్న సమయంలో తనకంటే సామ్రాజ్యవాద వ్యతిరేకులైన వర్గాలు తన పలుకుబడిలో లేనపుడు వానిపై ఆధారపడి పోరాటం ప్రారంభించేకంటే, సామ్రాజ్యవాదంతో బేట్టుగా రాజీ చేసుకొని దానికి లొంగిపోవడానికే చూస్తుంది. సామ్రాజ్యవాదానికి యెదురు తిరగడానికి బదులు, సామ్రాజ్యవాద వ్యతిరేక వుద్యమానికే యెదురు తిరుగుతుంది. సామ్రాజ్యవాదంతో రాజీపాలసీ విధానాన్ని యిందుకే సిద్ధపర్చుతుంది.



పై ముఖ్యసిద్ధాంతాల ననుసరించి కాంగ్రెసు నాయకత్వం భారతదేశ వ్యాపిత ప్రజాపోరాటాన్ని తీసుకురావడానికి బదులు ప్రభుత్వంతో రాజీ చేసుకోడానికి ప్రభుత్వంవైపు నిరీక్షిస్తూ కూర్చుంది. కాంగ్రెసు నాయకత్వపు యీపాలసీ యధేచ్ఛగా నెరవేరడానికి కాంగ్రెసులో యింకా మిగిలివున్న అతివాదులను, కమ్యూనిస్టులను దానినుండి తొలగించి దాన్ని తనరాజీపాలసీకి అనువైన సాధనంగా జేశాడు.

కాని ప్రభుత్వం కాంగ్రెసు నాయకత్వపు రాజీహస్తాన్ని గూడ త్రోసిపుచ్చింది. (పూనాలో జరిగిన అఖిలభారత కాంగ్రెసుసంఘసమావేశంలో (1940 సెప్టెంబరు) జాతీయప్రభుత్వాన్ని నెలకొల్పితే ప్రభుత్వంతో సహకారంచేస్తామని తీర్మానించబడింది. ఈకోర్కెనుగూడ ప్రభుత్వం నిరాకరించింది.) దానితోరాజీ ఆశలు విచ్ఛిన్నమయ్యాయి. అయినా పోరాటం ప్రారంభించడానికి కాంగ్రెసు నాయకత్వం నిరాకరించింది. రాజీ కుదరనప్పుడు నిస్తబ్ధతను సాగించడం, తద్వారా ప్రభుత్వంపై ఒత్తిడి తీసుకురావడం ఒక్కటే (అది నామకః సత్యాగ్రహం సాగించడంద్వారా అయినా సాగించవచ్చు; పోరాటం లేకుండా వేచిస్తూ కూర్చోవడం గావచ్చు.) బూర్జువా పోరాటపద్ధతి అందులో ప్రజాపోరాటాన్ని రానివ్వకుండాజేస్తూ రాజీకొరకు ప్రాకులాడుతూవున్నప్పుడు - అది ఒకటే మార్గం.

పూనా అ. భా. కాంగ్రెసు సమావేశం అయిన తరువాతను యీనిస్తబ్ధతను వ్యక్తి సత్యాగ్రహం సాగించడంద్వారా కాంగ్రెసు నాయకత్వం సాగించింది. విప్లవ పోరాటాన్ని రానివ్వకుండా తప్పించడానికి, ప్రభుత్వంతో రాజీ చేసుకోడానికి మరొక మార్గంగామాత్రమే యీ సత్యాగ్రహ పోరాటం గొనిరాబడింది. అందుచేత కాంగ్రెసులో యిదివరకున్న జాతీయైక్యతను విచ్ఛిన్నం చేయడానికి ప్రభుత్వం అతివాదులపై యింకా దాడి హెచ్చుజేయడానికి యిది తోడ్పడింది.

ఈ విధంగా కాంగ్రెసు నాయకత్వం యుద్ధమొచ్చాక జాతీయ విచ్ఛిన్న చర్యలు గావించింది; జాతీయైక్యతను నిర్మించడానికి ముందుకు రాలేదు. బూర్జువావర్గం తన వర్గక్షేమం నిమిత్తం జాతీయ పోరాటాన్ని తప్పించ ప్రయత్నించింది. కాని అందువలన యుద్ధం పోరాట సమస్యను ప్రధానం గావించుటతో బూర్జువావర్గ పోరాట వ్యతిరేక స్వభావం క్రమక్రమంగా బయటపడింది.

జాతీయోద్యమానికి నాయకత్వం బూర్జువావర్గం చేతులలోనే యింకా వుందిగాబట్టి మన జాతీయ పోరాటం అప్పుడు ప్రారంభంగాలేదు. అందుచే నేషనల్‌ఫ్రంటులోని బూర్జువా పలుకుబడిని తొలగించి, కార్మికవర్గంయొక్క రాజకీయశక్తిని వృద్ధిచేయాల్సిన కర్తవ్యం సోషలిస్టులందరిపైనాపడింది. పోరాటశక్తులను బలపర్చి జాతీయపోరాటం (బూర్జువావర్గ విచ్ఛిన్న చర్యలు యెన్ని జరుగుచున్నా) తప్పనిసరి అయ్యేటట్లు చేసే బాధ్యత వారిపైబడింది. ఇందుకు, బూర్జువావర్గం తన చేతగానితనాన్ని ప్రదర్శించాక, జాతీయోద్యమ క్షేమంకోసం కనీసం కమ్యూనిస్టులు, సోషలిస్టులుకలసి సోషలిస్టు ఐక్యతను నిర్మించడానికి, జాతీయైక్య సంఘటనా వుద్యమాన్ని నిర్మించడానికి, బూర్జువావర్గపు పిరికితనాన్ని బట్టబయలుజేయడానికి ముందుకు రావలసింది. కాని కాంగ్రెసు సోషలిస్టులు యే విధంగా బూర్జువావర్గమునకు తోకలయ్యి పూర్తిగా మెన్షివిక్‌లుగా తయారయ్యారో చూద్దాం.

### కాంగ్రెసు సోషలిస్టుపార్టీ బోల్తా :

యుద్ధానికి ముందే కాంగ్రెసు సోషలిస్టులకు, కమ్యూనిస్టులకు తీవ్ర భేదాభిప్రాయాలు వచ్చినా యింకా ఐక్యత పూర్తిగా చెడలేదు; ఇంకా జాతీయ సమస్యలపై కలసే పనిజేస్తున్నారు; యుద్ధం

వచ్చాక యీ ఐక్యత యింకా యెక్కువజేసి బూర్జువావర్గ రాజీ పంథాతో ఐక్యంగా పోరాడవలసింది. కాని కాంగ్రెసు సోషలిస్టు నాయకుల సోషలిజానికి జాతీయంగాను, అంతర్జాతీయంగాను నిజమైనపరీక్ష వచ్చింది. యుద్ధం వచ్చాక కమ్యూనిస్టులను, వారి కార్యక్రమాన్ని తిట్టుతూ గాంధీజంతో కలసిపోయింది. సోవియట్ - జర్మన్ నిరాక్రమణ ఒడంబడిక జరగ్గానే కాంగ్రెసు సోషలిస్టు నాయకులు తమ నిజస్వరూపాన్ని బయటబెట్టారు. ప్రపంచమంతా సోషల్ డెమాక్రాటులవలె ఆ సంధిని చేసుకున్నందుకు సోవియట్‌యూనియన్‌ను విరోధభావంతో చూశారు. సోవియట్ సరిహద్దులను రక్షించడానికి, యుద్ధం ప్రోత్సహించేవారి యెత్తులను భగ్నంచేయడానికి సోవియట్ యూనియన్ అలా చేసిందని అంగీకరించక, హిట్లరుతోకలసిపోయిందని ఆక్షేపించారు. తరువాత రెడ్‌ఆర్మీ, పోలండులో ప్రవేశించడాన్ని "రెడ్ ఇంపీరియలిజమ్"గా ఖండించారు. కోట్లకొలది యూక్రేనియన్లు, బైలోరష్యన్లకు స్వాతంత్ర్యం యివ్వడానికి రెడ్‌ఆర్మీ ఆచర్య గావించిందని చూడలేకపోయారు. ఈవిధంగా ఫిన్‌లాండ్, బాల్టిక్‌రాజ్యాల విషయాల్లోగూడా సోవియట్‌యూనియన్ చర్యనుఖండించారు. ఇదంతా వారి సోషలిజాన్ని, కార్మిక అంతర్జాతీయ తత్వాన్నిగాదు తెల్పేది; బూర్జువాలిబరల్‌తత్వాన్ని, సోషల్ డెమాక్రాటు ద్రోహబుద్ధిని తెలియపర్చుతోంది. వారి సోషలిజం వారిని సోవియట్‌కు అండగా నిలపలేదు. పైగా ప్రజాస్వామిక అభిప్రాయమును సోవియట్‌ను దూరంచేయడానికి, సోవియట్‌పై యుద్ధానికి సన్నాహంగా ప్రపంచ బూర్జువాపత్రికలుగావించే దుష్ప్రచారాన్ని, నిందలనువారు ప్రచారంజేశారు.

జాతీయోద్యమానికి సంబంధించినంతవరకు యుద్ధం రాగానే వారు వెంటనే సత్యాగ్రహం తమ పార్టీ నాయకత్వాన జరుపాలనుకొన్నారు. తరువాత గాంధీజీ నాయకత్వంకోసం వేచియుండాలనుకొన్నారు. దీనిఅర్థం ఏమిటి? బూర్జువావర్గంపై తీవ్ర జాతీయవాదుల తిరుగుబాటు లేదా బూర్జువా నాయకత్వమునకు లొంగిపోవడం యివే వీరి పద్ధతులు. జాతీయోద్యమానికి వారు చూపగలిగింది సత్యాగ్రహంతప్ప మరోదిగాదు. కార్మికవర్గపంథా అయిన ప్రజావ్యాపితపోరాటపంథాను వీరు అనుసరించలేక పోయారు. ఈ విధంగా వీరు మెన్షివిక్‌పంథా అనుసరించారు.

బూర్జువావర్గ నాయకత్వాన్ని అనుసరిస్తూ కమ్యూనిస్టులను నిందించడమే పనిగా పెట్టుకున్నారు. అందుకు తమపార్టీని, తమ మెన్షివిక్‌పాలసీని. కమ్యూనిస్టు వ్యతిరేక పాలసీని అమలు జరుపడానికి ఒక సాధనంగా తయారుజేయడానికి బూర్జువా పద్ధతే అవలంబించారు కాంగ్రెసు నాయకత్వం తన రాజీ పంథాను అనుసరించడానికి కాంగ్రెసు సాధనంగా వుండుటకు కాంగ్రెసునుండి కమ్యూనిస్టులను, అతివాదులను తొలగించి సత్యాగ్రహులతోకూడిన సంఘంగాజేసినట్లు, వారుగూడా పార్టీనంతా రద్దు గావించిసత్యాగ్రహ పోరాట సంఘాలుగా పునర్నిర్మించారు. దీనితో పార్టీ రద్దయి, బూర్జువావర్గాన్ని నాయకులను అనుసరించే సంఘాలు వెలశాయి. ఈ విధంగా కాంగ్రెసు సోషలిస్టు నాయకులు యుద్ధమొచ్చాక బూర్జువావర్గ అనుచరులుగా మారారు. సోషలిస్టు ఐక్యతను విచ్ఛిన్నం గావించారు.

## ఫార్వర్డుబ్లాక్ అపర్చ్యునిజం :

బోసుఫార్వర్డుబ్లాకును యేర్పరచేటప్పుడు, మరొక తీవ్రవాదపార్టీని నిర్మించవద్దని కమ్యూనిస్టులు అతనికి సలహా యిచ్చారు. తీవ్రజాతీయవాదం బూర్జువా రాజకీయ పార్టీకిమాత్రమే పునాది కాగలదు. కాని కాంగ్రెసువంటి జాతీయసంస్థ యిదివరకే వున్నప్పుడు, అది కాంగ్రెసులో చీలికలు తెస్తుందనియు,



కాంగ్రెసుకు ప్రత్యామ్నాయసంస్థగా తయారవుతుందనియు, ఆ విధంగా జాతీయైక్య సంఘటనను విచ్ఛిన్నం గావించుతుందని కమ్యూనిస్టులు హెచ్చరించారు.

ఫార్వర్డుబ్లాకు ప్రధాననినాదం జాతీయపోరాటం. కాని యిది అసలు నినాదంగాదు. జాతీయపోరాటనినాదాన్ని వర్కింగుకమిటీని విమర్శించడానికే వినియోగించారు. దేశవ్యాపిత జాతీయపోరాటాన్ని నిజంగా గొనిరావాలనిగాదు వీరు కోరింది. ఈ విషయం యుద్ధమొచ్చాక మరీ స్పష్టమైంది. హక్ ప్రభుత్వం బెంగాలులో క్రూరనిర్బంధ పరిపాలన చేస్తూవున్నప్పుడు. పౌరసత్వ హక్కుల కొరకు బెంగాలులో పోరాటం తీసుకరావలసిందిగాను. దానికి తాము పూర్తిగా తోడ్పడతామని కమ్యూనిస్టులు బోసును కోరారు. బెంగాల్ కాంగ్రెసు నాయకత్వాన బోసు ఆపోరాటమే ప్రారంభించితే అది భారత దేశమంతటి నిస్తబ్ధతను తొలగించి వుండేది. దేశమంతటా పోరాటశక్తులను బలపర్చి, నిస్తబ్ధతను తొలగించి జాతీయపోరాటాన్ని దగ్గరకు తెచ్చేది. కాంగ్రెసు నాయకత్వం యీ పోరాటాలతో మాకేమీ నిమిత్తం లేదని వూరుకోడానికి వీలులేదు. తప్పక జాతీయపోరాటాన్ని ప్రారంభించే అవకాశాలు యేర్పడేవి. కాని బోసు అల్లాంటిదేమీ చేయలేదు. అల్లా పోరాటాన్ని ప్రారంభించడానికి నిరాకరించాడు. బోసు - గాంధి యిద్దరు జరపాల్సిన పోరాటాన్ని వేరువేరు పంథాలద్వారా తప్పించుకున్నారు. వేరువేరు నినాదాలక్రింద యిద్దరూ - పోరాట వ్యతిరేక మార్గాన్ని అనుసరించారు.

అంతేగాకుండా కలకత్తా కార్పరేషన్ యెన్నికలకోసం హిందూమహాసభతో రాజీపడ్డాడు. కార్పరేషన్ మేయరు ఎన్నికలో ముస్లిమ్‌లీగ్‌తో రాజీపడ్డాడు. ఇవన్నీ బెంగాల్‌ప్రభుత్వం ఆర్డినెన్సు పరిపాలనజేస్తూ రాష్ట్రమంతటా పౌర స్వాతంత్ర్యాన్ని చండాడుచున్నప్పుడు జరిగాయి. వర్కింగు కమిటీ జాతీయపోరాటం తీసుకురావడంలేదని ఉత్తమాటల్లో ఖండించుతూ, ఫార్వర్డుబ్లాకు జాతీయపోరాటాన్ని దేశమంతటా ఆర్గనైజ్ జేస్తోందని అది టామ్‌టామ్ చేసేరోజుల్లో జరిగింది. ఇంతకన్నా బూర్జువా అపర్చ్యునిజం వుండబోదు. మాటల్లో అతివాద పదజాలం వుపయోగించినా చేష్టల్లో అంతా బూర్జువావర్గ ఫక్కీయే; పైగా అంతులేని అపర్చ్యునిజం. ఈ అపర్చ్యునిజమే తుదకు బోసుని జపాన్ చెంతజేరి మాతృదేశాన్ని జపాన్‌ఫాసిస్టుల బానిసత్వానికి గురిజేయడానికిగూడదారితీసింది. ఈవిధంగా అవమానకరంగా బోసుపార్టీ యుద్ధమొచ్చాక పల్టీకొట్టింది.

## యుద్ధం - కమ్యూనిస్టుపార్టీ :

యుద్ధంరాగానే దాన్ని సామ్రాజ్యవాద యుద్ధంగా ప్రకటించి దానితో భారత ప్రజలకు యేమీ నిమిత్తంలేదని కమ్యూనిస్టుపార్టీ స్పష్టంజేసింది. (అప్పటికి "నేషనల్‌ఫ్రంటు" ప్రకటించబడుతూనే వుంది. దానిలో యుద్ధముయెడల పార్టీ వైఖరి వెల్లడించింది). భారత ప్రజలందరూ యుద్ధాన్ని వ్యతిరేకించి, యుద్ధ అవకాశంగా యేర్పడ్డ విప్లవ పరిస్థితులను వుపయోగించి స్వాతంత్ర్యాన్ని గడించుటకు పూనుకోవాలని విజ్ఞాపన గావించింది యుద్ధాన్ని సాగిస్తూవున్న బ్రిటిష్ సామ్రాజ్యవాదుల వంతంజేసి భారత స్వాతంత్ర్యం గడించడానికి గానుప్రజలను సాయుధ విప్లవ తిరుగుబాటుకు తయారు జేయాలనియు అందుకు కార్మికవర్గం ముందుకువచ్చి పనిజేయాల్సిన బాధ్యతను చూపెట్టింది. ప్రజలను విప్లవ సాయుధతిరుగుబాటుకు తయారుజేయడానికిగాను, స్థానిక కార్మిక కర్షక ప్రజా పోరాటాలను అభివృద్ధిజేయాలి; యుద్ధంవలన గల్గే ఆర్థిక, రాజకీయ కష్టాల నాధారంగాగొని స్థానికంగా ప్రజలను ఆర్గనైజ్‌చేయాలి. వాటినన్నిటిని ఆర్గనైజ్‌చేయడానికి కార్మికవర్గం చొరవదీసుకుని నిరంతరం కృషి

చేస్తూ వుండాలి; ప్రజలను వుత్తేజపర్చడానికి, సమీకరించడానికి కార్మికవర్గం యుద్ధవ్యతిరేక రాజకీయ ప్రదర్శనాలు, ప్రొటెస్టు సమ్మెలు గావిస్తూ వుండాలి. వాటన్నిటి ఫలితంగా దేశమంతటా ప్రజాపోరాటాలు ఆర్గనైజ్డుగా బయలుదేరుతాయి. వాటిద్వారా జాతీయైక్య సంఘటన యింకా బలపడుతుంది; జాతీయ సంఘటనలోవున్న బూర్జువావర్గ ప్రజా పోరాట వ్యతిరేకతను యీ పోరాటాలద్వారా ప్రజలకు బహిర్గతం గావించి ప్రజలపై దానికున్న పలుకుబడిని క్రమక్రమేణా క్షీణింపజేసి జాతీయోద్యమముపై పూర్తి కార్మికవర్గ పలుకుబడిని స్థాపించవచ్చును. ఈ క్రమముద్వారా కార్మికవర్గం ముందుకువచ్చి పనిజేస్తుంటే అంత్యాశయమైన సాయుధ విప్లవ తిరుగుబాటు గొనిరావడానికి తద్వారా భారతదేశ స్వాతంత్ర్యం గడించడానికి వీలుంటుంది. ఇది కార్మిక పంథా.

కార్మికవర్గం స్థానికంగా కార్మిక కర్షక ప్రజాపోరాటాలను, యుద్ధవ్యతిరేక పోరాటాలను సాగించగలస్థితినే వుందిగాని యింకా జాతీయోద్యమముపై బూర్జువా వర్గమునకే అధికారం వుంది; పలుకుబడి వుంది; కార్మికవర్గం దేశవ్యాపిత జాతీయ పోరాటాన్ని వెంటనే తీసుకురాలేని స్థితిలోవుంది. దేశవ్యాపిత పోరాటాన్ని తీసుకు రాగల కాంగ్రెసు నాయకత్వం అందుకు నిరాకరించుతోంది. ఇట్టి సమయములో బోసుముఠాలాగ కాంగ్రెసుకు వేరుగా పోరాన్ని తీసుకురావడానికి ప్రయత్నించడంగాని, కాంగ్రెసు సోషలిస్టు నాయకుల్లాగ సత్యాగ్రహంను కాంగ్రెసు సోషలిస్టుపార్టీ నాయకత్వంక్రింద ప్రారంభించడం, బూర్జువావర్గం పోరాటం ప్రారంభించేంతవరకు ఏమీ చేయకుండా కూర్చుని వుండడం-యివి యేవీ సరియైన జాతీయపంధాగావు; ఏవీ జాతీయైక్యసంఘటనను నిర్మించడానికిగాని, జాతీయోద్యమముపై బూర్జువా వర్గమునకున్న పలుకుబడిని క్షీణింపజేయడానికిగాని తోడ్పవు జాతీయ పోరాటము ఎన్నడూ రాదు. అందుచేత కమ్యూనిస్టులు చెప్పింది యిది. విప్లవవర్గం అయిన కార్మికవర్గం తనంతట తనే జాతీయపోరాటం ప్రారంభించ గలిగినంతగా బలపడలేదు. అందుచే చేయవలసినది యేమంటే జాతీయోద్యమముపై కార్మికవర్గ పలుకుబడి వృద్ధిచేయాలి; పోరాటశక్తులనుబలపర్చాలి; రాజీకి ప్రాకులాడుచున్న బూర్జువాను ప్రజలనుండి దూరంచేయాలి. స్థానిక, ఆర్థిక హక్కుల పోరాటాలద్వారా భారత ప్రజల నందరిని జాతీయ పోరాటంలోనికి క్రమేణా తీసుకువచ్చి కార్మికవర్గంవారిని నడపాలి. ఇందుకోసం కార్మికవర్గ సిద్ధాంతాలను - అంటే సోషలిజాన్ని - అంగీకరించే వారినందరినీ ఐక్యపర్చటకు పూనుకోవాలి. కార్మికవర్గం యీ పనులన్నీ చేయకుండా బూర్జువావర్గ పలుకుబడిని జాతీయోద్యమముపై తొలగించజాలదు; జాతీయ పోరాన్నితతిమా ప్రజలందరికి నాయకత్వం వహించందే ప్రారంభించలేదు; ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాయుధవిప్లవ తిరుగుబాటును గొనిరాలేదు. కార్మికవర్గంకు ఆశక్తి వచ్చేంతవరకూ స్థానిక ఆర్థిక, రాజకీయహక్కుల పోరాటాలను తన నాయకత్వంక్రింద నడుపుతూ తద్వారా ప్రజలను సమీకరించుతూ వారిని రాజీకి ప్రాకులాడే బూర్జువావర్గ పలుకుబడినుండి దూరంజేస్తూ నూతన జాతీయైక్యసంఘటనను నిర్మించడానికి. పనిజేయడానికి కార్మికవర్గం పూనుకుంది. కాంగ్రెసుద్వారా యిదివరకు సాధించిన జాతీయైక్యతను పునాదిగా తీసుకుని పనిజేసినప్పుడే ఈ జాతీయైక్య సంఘటనను నిర్మించి కార్మికవర్గానికి జాతీయపోరాటాన్ని నడిపించగలశక్తి వస్తుంది. గాని కాంగ్రెసు ద్వారా నిర్మింపబడిన జాతీయైక్యతను విచ్ఛిన్నం చేయడంవలన గాదు. అందుచేత కాంగ్రెసుద్వారానే జాతీయపోరాటాన్ని ప్రారంభించాలనియు, ఏ కార్మికవర్గమో, లేక అతివాదపార్టీలో కలసి ప్రారంభించినయెడల అది నిజమైన దేశవ్యాపిత జాతీయపోరాటం గాదని హెచ్చరించి అట్టి విచ్ఛిన్న చర్యలను యెదుర్కొంది.



ఈ విధంగా కమ్యూనిస్టులు యిటు జాతీయ బూర్జువా రాజీ పలుకుబడిని క్షీణింపజేయడానికి, అటు జాతీయ అతివాదుల జాతీయైక్య విచ్ఛిన్న చర్యలను బట్టబయలు జేస్తూ, కాంగ్రెసు సోషలిస్టుల మెన్షివిక్ పంథాను బహిరంగ పర్చుతూ నిజమైన కార్మిక పంథాను యేర్పరచింది. ఈ పంథాతో స్వతంత్రశక్తిగా పనిజేయడం ప్రారంభించింది.

## ఈ దశలో కమ్యూనిస్టుపార్టీ కార్యకలాపాలు

యుద్ధం ప్రారంభంకాగానే నిజమైన యుద్ధ వ్యతిరేక కార్యక్రమముతో, నిజమైన జాతీయ పంథాను యిచ్చింది కమ్యూనిస్టులే కమ్యూనిస్టుపార్టీ కార్మికవర్గంమీద, కార్మికవర్గ రాజకీయ సిద్ధాంతాలయిన మార్క్సిజము - లెనినిజములపై ఆధారపడి వుండుటవలన, యుద్ధముయెడల సరియైన దృక్పథం వెల్లడించగల్గింది. ఈ దృక్పథంతో ప్రారంభంనుండి పనిజేసింది. 1939 అక్టోబరు 2 వ తేదీన 90 వేల కార్మికులు యుద్ధానికి వ్యతిరేకంగా రాజకీయ సమ్మె గావించారు. అదే యుద్ధమొచ్చాక జరిగిన మొదటి రాజకీయ సమ్మె. ఇంతవరదాకా భారత కార్మికవర్గం రాజకీయ సమస్యలపై స్థానికంగానే సమ్మెలు చేసింది. 1940 వ సంవత్సరం స్వాతంత్ర్య దినోత్సవమునాడు ముఖ్య పారిశ్రామిక కేంద్రాలన్నిటిలోను కార్మికులు రాజకీయ సమ్మెలు జేశారు. యుద్ధ యిబ్బందులకు వ్యతిరేకంగా కార్మికవర్గం పోరాటం ప్రారంభించారు. ధరలు హెచ్చు అవడంవలన, యుద్ధ అలవెన్సులకోసం దేశమంతటా సమ్మెలు జరుపబడ్డాయి. నాయకత్వం నిర్ణయించిన రోజుకుముందుగానే 50 వేలమంది బొంబాయి కార్మికులు పోలీసు నిర్బంధాలకు వ్యతిరేకంగా సమ్మె జేశారు. 1940 మార్చి 4 వ తేదీన సమ్మె ప్రారంభ దినంనాడు బొంబాయి వస్త్ర పరిశ్రమ కార్మికులలో నూటికి 90 మంది సమ్మెలో జేరారు. మూడవరోజునుంచి సమ్మె యితర పరిశ్రమలకు ప్రాకజొచ్చింది. భారత కార్మికవర్గం భారత ప్రజలందరికీ పోరాట విధానాన్ని చూపుతూ ముందుకుసాగింది. 1940 స్వాతంత్ర్యదినోత్సవం నాడు దేశమంతటా విద్యార్థులు కమ్యూనిస్టు నాయకత్వముక్రింద జయప్రదంగా సమ్మెలు జేశారు. కార్మికేతరులు కార్మికవర్గ విధానమగు ప్రజా పోరాట విధానాన్ని అవలంబించసాగారు.

ఈవిధంగా కార్మికవర్గ పంథా ఒక్కటే నిజమైన యుద్ధవ్యతిరేక పంథాగాను, నిజమైన ప్రజా పోరాటపంథాగాను స్పష్టపడింది. కమ్యూనిజం, కార్మికవర్గసిద్ధాంతాలు క్రమక్రమంగా ప్రజల్లో పలుకుబడి సంపాదించుతోంది. కాంగ్రెసువాదులు క్రమక్రమంగా బూర్జువా నాయకత్వంయొక్క బోల్తా కలుగజేసిన గందరగోళాన్నుంచి బయటపడటానికి కార్మికపంథా ఒకటేమార్గమని గ్రహింపసాగారు. కమ్యూనిస్టుపార్టీ పలుకుబడి బాగా వ్యాపించుతోంది. అందుచేత బ్రిటిష్‌ప్రభుత్వపు నిర్బంధవిధానం పార్టీపై కేంద్రీకరించబడింది. ప్రభుత్వం కమ్యూనిజంలోను, కమ్యూనిస్టుల పాలసీ కార్యక్రమములలో తన అస్తిత్వానికే ప్రమాదమున్నదని బాగా గ్రహించింది. 1940 మార్చినుండి కమ్యూనిస్టుపార్టీపై తీవ్ర నిర్బంధాన్ని ప్రయోగించింది. 1940 మార్చి 6 వ తేదీన కేంద్రప్రభుత్వం, దేశములో వున్న కమ్యూనిస్టు ముఖ్యులందరినీ పట్టుకోవలసిందిగా, ఉత్తర్వుప్రకటించింది. దానితో పూర్తినిర్బంధం పార్టీపై ప్రయోగింపబడింది.

## ఈ దశలో పార్టీ నిర్మాణ ప్రయత్నాలు

యుద్ధం ప్రారంభం కాగానే పార్టీ ముఖ్యనాయకులు, పార్టీ కేంద్రం, రాష్ట్రపార్టీ నాయకులు రహస్యముగాపనిజేయడానికి పార్టీ రహస్యకేంద్రాలను రాష్ట్రాలలోగూడ యేర్పరచడానికి ప్రయత్నాలు జేయబడ్డాయి. యుద్ధం రాగానే పార్టీని రహస్యంగా పనిజేయించాల్సిన ముఖ్య కర్తవ్యాన్ని పార్టీ వెంటనే గుర్తించడంసరియైనా ఆచరణలోమాత్రం యుద్ధానికిపూర్వం పార్టీని పనిజేయించే ప్రాథమిక నిర్మాణపద్ధతులే అవలంబించబడ్డాయి. యుద్ధమొచ్చాక పూర్తిగా నూతన పార్టీయంత్రాన్ని నిర్మించాలనియు, నూతన నిర్మాణపద్ధతుల నవలంబించాలనే చైతన్య లేకపోయింది వెనుకటిపార్టీ నిర్మాణపద్ధతులే అవలంబించి పార్టీనాయకులలో హెచ్చు భాగాన్ని పార్టీ కోల్పోయింది.

పార్టీరహస్యంగా పనిజేయడమంటే యేనాయకులో చాటునవుండిపనిజేయడంగాదనియు, పార్టీ కేంద్రకమిటీనుండి క్రిందిసెల్లువరకుపార్టీనిర్మాణమేరహస్యయంత్రంగామారినప్పుడేసాధ్యమౌతుందని గుర్తించలేదు. అందుచేత యుద్ధం ప్రారంభంలో చాల రాష్ట్రాలలో రహస్యంగావున్న పార్టీనాయకులు 5, 6 నెలలైనతరువాత మరల బహిరంగంగా వచ్చి పనిజేయడం, కార్మికపోరాటాలలో పాల్గొనడం జరిగింది. ఈ విధంగా ఒకఆంధ్ర, మలబార్‌రాష్ట్రంలో తప్పమిగతా రాష్ట్రాలలో పార్టీరహస్యకేంద్రాలు యేర్పరచలేకపోయారు. పార్టీ కేంద్రంగూడ 1940 మార్చివరకు గూడ దాదాపు బహిరంగంగా పని జేస్తూనేవుంది. కాని ఆ కాలములో పూర్తి చెక్ యేర్పాట్లు గావించుకుని తరువాత సిరాటంకంగా పార్టీ కేంద్రాన్ని నిజమైన రహస్యకేంద్రంగా పనిజేయగల్గారు. హెచ్చు రాష్ట్రాల్లో మాత్రం రహస్య పార్టీ కేంద్రాలు యేర్పరచలేదు.

### పార్టీ పనిజేసిన విధం :

యుద్ధం వచ్చాక పార్టీకి బహిరంగంగా పనిజేసే అవకాశాలు వుండవనియు, యుద్ధానికిపూర్వం బహిరంగంగా ఆందోళన గావించే పద్ధతులు అవలంబించడమంటే ప్రభుత్వ నిర్బంధానికి పార్టీని గురిచేయుటేననే ప్రధాన విషయాన్ని పార్టీ మర్చిపోయింది. యుద్ధకాలములో యే మాత్రం బహిరంగ ఆందోళనకు ప్రభుత్వం అనుమతి యివ్వదనియు, అందుకు పార్టీ ప్రజాసంఘాలను వెనుకటి పద్ధతులలో పనిజేయించలేమని గుర్తించలేదు. చివరకు పార్టీ నాయకులుగాని, ప్రజా నాయకులుగాని బహిరంగంగా తిరగడానికిగూడ వీలుండదనియుగూడ పార్టీ గుర్తించలేదు. యుద్ధకాలములో పార్టీ నాయకులు, ప్రజా నాయకులు బహిరంగ వుపన్యాసాలద్వారా పార్టీపాలసీని ప్రజలకు, పార్టీసభ్యులకుగూడ అందజేసేవారు. పార్టీలీగల్ పత్రికద్వారా పార్టీపాలసీ అందజేయబడేది. పార్టీనిర్మాణములేకపోయినా బహిరంగ అవకాశాలుండడంవలన, పార్టీపాలసీ పై విధంగా ప్రజలకు, పార్టీ సభ్యులకు అందజేయబడేది. యుద్ధమొచ్చాక పార్టీ నాయకులపై తీవ్ర నిర్బంధం వుపయోగించబడింది. వారు బహిరంగముగా తిర్గి యుద్ధానికిపూర్వమువలె స్వేచ్ఛగా వుపన్యసించడానికి అవకాశాలు పోయాయి. పార్టీలీగల్ పత్రిక ఆగిపోయింది. అందుచేత పార్టీ సభ్యులకు, ప్రజలకు అసలు పార్టీపాలసీ జేరే విధమే కనిపించలేదు. బలిష్టమైన రహస్య పార్టీ నిర్మాణముద్వారా పార్టీ ఆర్గనైజర్లు, పార్టీ కేడర్లు పనిజేస్తే యీ పని సాధ్యమౌతుంది. రహస్యపార్టీ పత్రికను వుత్పత్తిజేసి దాన్ని సరిగా పార్టీ సభ్యులకు అందజేయ గల్గితే యీ పని సాధ్యమౌతుంది. ఇందుకు రహస్యంగా పనిజేయగల రాజకీయ నిర్మాణపు



శక్తిగల పార్టీ నాయకులు, పార్టీ కేడర్లు వుంటేనే సాధ్యమౌతుంది. ఈ యేర్పాట్లు అన్నీ యుద్ధానికి పూర్వం యేర్పరచుకోజాలకపోవడంవలన, అసలు పార్టీనిర్మాణమే లేకపోవడంవలన యుద్ధమొచ్చాక పార్టీ దెబ్బతిన్నది. పార్టీకి ప్రజలకు సంబంధం పోయ్యింది. పార్టీ సామాన్యసభ్యులకు పార్టీపాలసీ అందజేయడమే పెద్ద సమస్య అయింది. పార్టీసభ్యులను రాజకీయంగా ఐక్యముగా వుంచటమే కష్టమైంది. అందుచేత యీదశలో పార్టీని నిర్మించడానికంటె పార్టీని హెచ్చుగాకోల్పోవడమే జరిగింది.

యుద్ధానికి పూర్వం పార్టీ నిర్మాణ బలహీనతలే యుద్ధంరాగానే పార్టీ దెబ్బతినడానికి కారణం. పార్టీనాయకులు యుద్ధానికిపూర్వం పార్టీ నిర్మాణవిషయంలో గడించిన అనుభవాన్ని వుపయోగించుకొని పార్టీని నిర్మించడానికి పూనుకోకపోవడం, యింకా పార్టీ వ్యతిరేకపంధాలో ఈయుద్ధమొచ్చాకగూడ పనిచేయడం పార్టీ దెబ్బతినడానికి హెచ్చుగా సహాయపడ్డాయి. వెనుకటి ఆందోళనా పద్ధతులతోనే, కేవలం ట్రేడ్‌యూనియన్ దృక్పథంతోనే పనిజేయడంవలన పార్టీ దాగా దెబ్బతిన్నది. పార్టీ పాలసీ పూర్తిగా సరియైనదయిననూ, దాన్ని ప్రజలలోనికి గొంపోయి వారిని దానివైపుకు ఆకర్షింపజేయడానికి తగిన నిర్మాణము, సాధనము యున్నప్పుడే దాని ఫలితం కనపడుతుందనియు, అందుకు పార్టీకి నిర్మాణరీత్యా యిదివరలో వున్న బలహీనతలను యుద్ధమొచ్చాక అయినా తొలగించుకోవడం ప్రథమకర్తవ్యమని గ్రహించలేదు. యుద్ధకాలములో పార్టీపాత్రను గ్రహించలేదు. పార్టీనిర్మాణము బలముగా లేనిది యెంత విప్లవ అవకాశాలు వచ్చినా అవి వుపయోగపడవు అనే ముఖ్యసూత్రాన్ని మర్చిపోయారు.

### పార్టీని పనిచేయించుటలో అవలంబించిన తప్పుపంధాలు :

(1) యుద్ధ ఫలితంగా యేర్పడ్డ హెచ్చుధరలు, హెచ్చు జీవితప్రమాణమువలన కార్మికులలో హెచ్చు జీతాలకొరకు తీవ్ర ఆందోళన అప్రయత్నముగానే బయలుదేరింది.

దీని ఫలితంగా యుద్ధభృతులకొరకు సమ్మెలు దేశమంతటా వ్యాపించాయి. పల్లెటూళ్ళలో వ్యవసాయకూలీలలోగూడ ఆందోళన, సమ్మెలు ఆరంభమయ్యాయి. దీనితోపాటు ప్రభుత్వ నిర్బంధం హెచ్చైచ పౌరసత్వహక్కులు తగ్గిపోయాయి. విద్యార్థులు వేనకువేలు ప్రభుత్వ నిర్బంధానికి వ్యతిరేకంగా సమ్మెలుచేయడం ప్రారంభించారు.

ఈ ప్రజా వుద్యమము, యుద్ధఫలితంగా బయలుదేరిన తాత్కాలిక ఆకస్మిక కార్మిక, విద్యార్థి సమ్మెలను ఆర్గనైజ్ జేస్తే జాతీయపోరాటం వస్తుందనీ, విప్లవోద్యమము బయలుదేరిందనియు దానికి కమ్యూనిస్టులు వెంటనే నాయకత్వం వహించి బహిరంగంగా నడపాలని భావించి వారు యీతాత్కాలిక ప్రజా వుద్యమములో మునిగిపోయారు పార్టీ నిర్మాణ మే స్థితిలోవుందో, యేది ప్రథమ కర్తవ్యమో గూడ గుర్తించకుండా, యీసమ్మెలలో పాల్గొనకపోతే విప్లవ పరిస్థితు లంతమొందుతాయని తలచారు. అందుచేత వాటిని తీవ్రపర్చిన విప్లవము చేరువకొస్తుందని భావించి పార్టీశక్తినంతా యీ సమ్మెలలో వ్యయపర్చారు.

యుద్ధమున్నంతకాలము యీ విప్లవ పరిస్థితులుంటాయనియు, ప్రజలకు ప్రభుత్వానికి స్పర్ధ నానాటికి పెంపొందుతుందనియు, అశాంతి యింకా ప్రబలుతుందనియు, ఆ అశాంతిని సంఘటితపరచి విప్లవోద్యమమును సాగించుటకు బలిష్టమైన పార్టీ నిర్మాణము అవసరమనియు, దానిపై పార్టీశక్తిని కేంద్రీకరించాలనే దూరదృష్టి, మార్క్సిస్టుదృష్టి పార్టీకి లేకపోయింది. పార్టీ నిర్మాణ ఆవశ్యకతను

సిద్ధాంతరీత్యా గుర్తించిననూ, ఆచరణలో 'యెకనామిష్టుల', 'ట్రేడ్‌యూనియన్‌నిష్టుల' దృక్పథమును పార్టీ అనుసరించింది. ఈ కార్మిక సమ్మెలు దాటిపోతే విప్లవ పరిస్థితులు అంతమొందుతాయని భయపడింది. బూర్జువావర్గ రాజకీయ పలుకుబడి యీ సమ్మెలను ఆర్గనైజ్‌జేసినంతమాత్రానే నాశనమైపోతుందని భావించింది. ఈ తప్పు దృక్పథ ముండుటచేతనే పార్టీనిర్మాణముపైననూ, కార్మికవర్గమునుండి, జాతీయవాదులనుండి పార్టీవైపుకు మ్రొగ్గిన వర్కర్లకు, మిలిటెంట్లకు పార్టీచైతన్యము, పార్టీ శిక్షణ యిచ్చి దేశవ్యాపితమైన కేంద్ర రహస్యపార్టీ యంత్రాన్ని యేర్పరచలేకపోయింది. దీనికి కారణం జాతీయవిప్లవములో పార్టీయొక్క పాత్రను సరిగా అర్థంచేసుకోకపోవడమే. ఇది ప్రధానమైన తప్పుపోకడ.

దీనివలన పార్టీయే ప్రభుత్వ నిర్బంధవిధానమునకు గురిఅయింది; పార్టీ నిర్మాణరీత్యా బాగాదెబ్బతింది. పార్టీ నిర్మాణయుక్తంగా బలముగాలేకపోవుటవలన బూర్జువావర్గం తన "నిస్తబ్ధత" విధానంతో ప్రభుత్వ వ్యతిరేకశక్తులలో నిరుత్సాహం వ్యాపింపజేసి జాతీయైక్యతను విచ్ఛిన్నం చేయగల్గింది. దానివలన జాతీయోద్యమముపై దాని పలుకుబడి క్షీణించలేదు సరిగదా తన నాయకత్వం నిలబెట్టుకోవడంలో జయమొందింది.

జాతీయ సంస్కరణవాదం :

(2) సిద్ధాంతరీత్యా యీ తప్పుపోకడకు వ్యతిరేకముగా యెల్లప్పుడు పోరాడాలనే వాదన చేస్తునే వున్నాము. కాని ఆచరణలో యీ పోకడకు మనమే లొంగిపోయాము.

యుద్ధ వ్యతిరేకసభలను బహిరంగముగా యేర్పరచవలయుననియు, రిక్రూట్‌మెంటుకు వ్యతిరేకంగా పికిటింగు చేయాలనియు, స్వాతంత్ర్య దినోత్సవములాంటి రాజకీయదినోత్సవములనాడు రాజకీయ ప్రదర్శనముకొరకు, పార్టీ ప్రతిష్టకొరకు యుద్ధ వ్యతిరేక, ప్రభుత్వవ్యతిరేక ప్రదర్శనాలు, బహిరంగసభలు చేయాలనియు వాదించాము. అలా చేశాము. దాని ఫలితంగా ముఖ్య పార్టీనాయకులను గోల్పోయాము. (మద్రాసు, ఆంధ్ర, తమిళనాడు.) ఈ సమయములోనే కిసాన్ వుద్యమమును, విద్యార్థి వుద్యమములను, వ్యవసాయకూలీ వుద్యమాలను పూర్తిగా వదిలివేశాము. అన్నిటికంటె ముఖ్యమైనది పార్టీ రహస్యముగా పనిచేయుటకు, పార్టీ ముఖ్యుల రహస్యజీవితానికి వలయు యేర్పాట్ల మాట మర్చిపోయాము. పార్టీ ముఖ్యకేడర్లకు రహస్యకాలములో యెలా పనిజేయాలో తెల్పే రాజకీయ, టెక్నికల్ పద్ధతులగూర్చి ఆలోచించనేలేదు. అసలు రాష్ట్ర, జిల్లా పార్టీ నాయకులే ఈ రహస్యపు జీవితాన్ని యెలా గడపాలో, అందుకు యే రాజకీయ టెక్నికల్ శిక్షణ పొందాలో జరుగలేదు. పార్టీ నిర్మాణపు యీ కర్తవ్యమేమీ నెరవేర్చకుండానే ప్రభుత్వ వ్యతిరేక, యుద్ధ వ్యతిరేక వుద్యమాన్ని ప్రారంభించాం. దీనినే లెనిన్ "అమెట్యూరిజమ్" (కుఱ్ఱచేష్టలు) అన్నాడు. ఈ ప్రవర్తన యెలా జాతీయ సంస్కరణ వాదమౌతుంది?

"యుద్ధ వ్యతిరేక ప్రచారాన్ని, రిక్రూట్‌మెంటు వ్యతిరేక వుద్యమాన్ని బహిరంగముగా సాగిస్తే ప్రజల దృష్టిని ఆకర్షించుతుంది. జాతీయ దృక్పథము గలవారి నందరిని ఆకర్షించుతుంది. దానితో కాంగ్రెసుసంఘాలు, నాయకులు యీ వుద్యమములో పాల్గొనకైనా పాల్గొనాలి; లేకపోతే వారి పలుకుబడి పూర్తిగా నశించుతుంది. దేశమంతా యిలా ప్రారంభించితే కాంగ్రెసునాయకత్వము పోరాటాన్ని ప్రారంభించుతుంది. ఆవిధంగా కాంగ్రెసు నాయకత్వమును పోరాటములోనికి నెట్టవచ్చు



ననియు, అప్పుడు దేశవ్యాపిత జాతీయపోరాటము వస్తుందనియు, దాన్ని విప్లవపోరాటముగా మార్చుట కవకాశ ముంటుందనియు వీరి వాదన దీని సారాంశం బూర్జువా నాయకత్వములోను, బూర్జువావర్గ పోరాటశక్తిలోను యింకా పూర్తిగా నమ్మకం పోలేదు. పార్టీ నిర్మాణముకన్నా బూర్జువావర్గమును పోరాటములోనికి నెట్టుకురావడానికి యెక్కువ ప్రాముఖ్యతయివ్వడం అన్నమాట. ఇది మెన్షివిజము. సిద్ధాంతరీత్యా కార్మికవర్గ నాయకత్వ మంగీకరించిననూ, ఆచరణలో బూర్జువావర్గ నాయకత్వమును నిలబెట్టుటకు ప్రయత్నించుటే అవుతుంది.

వ్యక్తి సత్యాగ్రహము యెడలగూడ కొందరు పార్టీసభ్యుల దృక్పథము యీ పోకడనే ప్రస్ఫురించింది. సత్యాగ్రహం ప్రారంభించిన ఆదిలో కొందరు పార్టీసభ్యులు దానిలో పాల్గొని దానిద్వారా బూర్జువావరముపై (కాంగ్రెసు నాయకత్వముపై) వత్తిడి గలుగచేసి దేశవ్యాపితపోరాటాన్ని గొనిరావచ్చుననే వాదన చేశారు. (కాంగ్రెసు సోషలిస్టుల వాదన)

పై రెండువాదనలు జాతీయ విప్లవములో పార్టీపాత్రను, కార్మికవర్గపాత్రను నిరాకరించుచున్నాయి. అందుచేత పార్టీ నిర్మాణావశ్యకతను గుర్తించవు. జాతీయ వుద్యమముపై బూర్జువావర్గ రాజకీయ పలుకుబడి పోకుండా వుండేందుకే సహాయపడతాయి.

జాతీయ అతివాదం :

(3) ఈ పోకడ హెచ్చుగా బెంగాల్‌లో వ్యక్తమయింది. పార్టీయొక్క పెట్టీబూర్జువా స్వభావం వలన యీ పోకడ వుద్భవించుతుంది. పెటీబూర్జువా అతివాదముయొక్క ప్రభావము పార్టీపైపడటం వలన యీ పోకడ పార్టీలోనికి వచ్చింది. గాంధీవాదముపై పూర్తి అసంతృప్తిచెంది, సోషలిజము యెడ యొక విధమైన అనిశ్చిత సానుభూతియున్న పెటీబూర్జువా జాతీయ యువకులు కార్మికవర్గపార్టీలో చేరడం తటస్థించింది. వీరింకా కార్మిక శిక్షణనుగాని, కార్మికవర్గ రాజకీయాలుగాని పూర్తిగా అవగాహన మొనర్చుకోలేదు. కమ్యూనిస్టుపార్టీ రాజకీయపాలసీ వీరిని ఆకర్షించినది; ఈ పాలసీద్వారానే ప్రభుత్వమును అంతమొందించవచ్చుననే విషయం గుర్తించారు. కాని దాని నిర్మాణ [illegible] పూర్తిగా గుర్తించలేదు. గాంధీజమునకు, మితవాదులకు వ్యతిరేకులుగా యున్న వారందరికి యొక పోరాట కార్యక్రమమిచ్చి వారిని కమ్యూనిస్టుల నాయకత్వముక్రింద పోరాటములోనికిదించిన గాంధీ పలుకుబడి దానంతటదే పోతుందని, జాతీయపోరాటం తానంతటదే ప్రారంభమౌతుందని వారి భ్రమ. అందుచేత పార్టీని నిర్మించడానికి పూనుకోడానికన్నా, గాంధికి, మితవాదులకు వ్యతిరేకులైనవారందరిని పోరాటములోనికిదించగల్గితే పార్టీ ప్రతిష్ట, బలము హెచ్చుతుందని, విప్లవము జయమొందుటకవకాశా లేర్పడుతాయని వీరు వాదించారు. పార్టీలోని పెట్టీబూర్జువా పద్ధతులను విసర్జించుటకును, కార్మిక పద్ధతులపై పార్టీని నిర్మించుటకు బదులు వీరు పార్టీని పెట్టీబూర్జువా అతివాదపంథాను నిర్మించుటకు యత్నించారు. వీరి పంథాకు చరిత్రలో పెట్టీబూర్జువా అతివాదులకు పట్టినగతే పట్టుతుంది. బూర్జువావర్గమునకు లొంగిపోవడం, కార్మికవర్గమును తమ పెట్టీబూర్జువా పద్ధతులతో విచ్ఛిన్నం గావించి బలహీనపర్చడం వీరి చారిత్రక పంథా.

పార్టీలోని యీ ముఖ్య తప్పుపోకడలు అన్నీ యొకే స్థానమునుండి వుద్భవించుచున్నాయి. పార్టీ కమ్యూనిస్టుపార్టీగా పిలువబడుచున్ననూ వాస్తవమునకు యిప్పుడు పార్టీ పునాది కార్మికవర్గ పునాదిగాదు. కమ్యూనిస్టుపార్టీ సిద్ధాంతా లంగీకరించినంతమాత్రాన కమ్యూనిస్టులుగా పిలవబడజాలరు.

వారి ఆచరణ, వారి రాజకీయ, నైతిక, భౌతిక ప్రవర్తనగూడ కార్మికవర్గమునకు అనుగుణ్యముగా వుండినప్పుడే నిజమైన కమ్యూనిస్టులుగా పనిజేయగల్గుతారు. ఈమార్పు యొకదఫా వచ్చేదిగాదు. మన పార్టీ గాలిలోనుండి సృషింపబడలేదు. గత 20 సంవత్సరముల జాతీయ, కార్మికోద్యమముల ఫలితంగా వుద్భవించినది. అందుచేత మనపార్టీ అతివాద పెట్టీబూర్జువా యువకులు, మేధావులు, మిలిటెంటు ట్రేడ్ యూనియన్, కర్షక వుద్యమములలోని విప్లవభావములుగల యువకులతోగూడినదై వున్నది. అందుచేత సిద్ధాంతరీత్యా మనపార్టీ మార్క్సిస్టు దృక్పథము నంగీకరించిననూ, ఆచరణలో మార్క్సిస్టుప్రవర్తకంటె పెట్టీబూర్జువా దృక్పథముతోగూడిన ప్రవర్తనే ప్రతిబింబించుచున్నది. దీనికి కారణం పార్టీ సభ్యులు, నాయకులుగూడ యింకా తమ పెట్టీబూర్జువా మానసికప్రవృత్తిని విడనాడలేదు; మార్క్సిస్టు ప్రవృత్తికి, పెట్టీబూర్జువా ప్రవృత్తికి తీవ్రసంఘర్షణ జరుగుతోంది. అదే ఆచరణలో కనుపించుతోంది.

ఈ అంతస్సంఘర్షణ ఫలితంగా పార్టీ నిర్మాణము అత్యంత అవసరమైన కాలములో వెనుకబడిపోయింది. ఇంకా పార్టీని నిర్మించవలసిన ఆవశ్యకత, నిర్మించకపోతే వచ్చే దుష్ఫలితాలు, మనం పెట్టీబూర్జువాతత్వము విడనాడకపోవడంచేత, మనం గుర్తించడంలేదు. అందుచేత నిరంతరం పార్టీని నిర్మించుటకు నిరాకరించడం, తప్పించుకోవడం జరిగింది. యుద్ధానికిపూర్వం అవలంబించిన బహిరంగ ఆందోళనా పద్ధతులే అవలంబించి పార్టీకి గొప్ప దెబ్బను గొట్టాము.

పార్టీలోని యీ తప్పు పోకడలన్నీ పార్టీని కడు నిస్సహాయస్థితికి గొనివచ్చాయి. ప్రస్తుతం పార్టీ యీస్థితిలో వుంది. "ప్రస్తుత పరిస్థితుల ననుసరించి, పార్టీపై చరిత్రయే బాధ్యతను విధించినదో ఆబాధ్యతను నెరవేర్చుటకు (విప్లవమును గొనివచ్చుటకు) తగినట్లుగా పార్టీని పునర్నిర్మాణము గావించగల్గేటట్లుగాను, యీ విప్లవ పరిస్థితులను దేశస్వాతంత్ర్య సంపాదన కుపయోగించుకొనేటట్లుగాను మనలను (పార్టీసభ్యులను, పార్టీని) తయారు చేయగల్గే మార్క్సిస్టు దృక్పథముతోగూడిన, ఆచరణ యోగ్యమైన రాజకీయాలు, ఆచరణను పార్టీ అలవర్చుకోలేదు. పార్టీలోని పెట్టీబూర్జువా పోకడలే (జాతీయ సంస్కరణవాదం, బూర్జువా నిర్మాణపద్ధతులు) మార్క్సిస్టు కార్మికపద్ధతులను అనుసరించకుండా చేశాయి అందుచేత పార్టీని నిర్మించకుండా డ్రిఫు అయ్యాము. కార్మికపద్ధతులను అలవర్చుకోకుండా అతి ప్రాథమిక (Primitive) అమెట్యూరిష్ (కుర్రచేష్టలు) నిర్మాణపద్ధతుల నవలంబించి పార్టీని బలహీన పర్చాము.

యుద్ధం వచ్చాకగూడ బహిరంగంగా మనం కొంతవరకు పనిజేయవచ్చుననే పైజాతీయ బూర్జువా ధోరణులు మనలో వుండటచేత, సామ్రాజ్యవాదమునకు సంభవించిన దుస్థితి ప్రాముఖ్యతను గ్రహించకపోవుటవలన, మన పార్టీ నాయకులను చాలమందిని 1940 ఏప్రియల్ వచ్చేసరికి ప్రభుత్వ నిర్బంధానికి గురిజేశాం. నూతన దశకు అనువైన బలిష్టమైన రహస్యపార్టీని నిర్మించే కార్యానికి త్వరగా పూనుకోలేదు. అందుచే యుద్ధమొచ్చాక కొన్ని నెలల్లోనే దేశమంతటా మననాయకులు చాలమంది అరెస్టు గావించబడ్డారు. పార్టీనిర్మాణమును అభివృద్ధి జేసుకోకుండా వెనుకటిపద్ధతుల్లోనే యుద్ధమొచ్చాకగూడ యుద్ధ వ్యతిరేక ఆందోళన గావించడంవలన మధ్యరకం పార్టీనాయకులుగూడ అరెస్టు గావించబడ్డారు పార్టీ నాయకులు అరెస్టు అయినతరువాతగూడ పార్టీ యింకా ఆ బహిరంగ ఆందోళన గావించడం మానలేదు. తాత్కాలిక కార్య సాఫల్యతకొరకు అంత్యలక్ష్యాన్ని మర్చిపోవడం, అంత్యలక్ష్యం దానంతటదే యేదో చేసినంతమాత్రాన లభ్యమౌతుందని విశ్వసించడం - యివి తాత్కా-



లిక లాభాలకొరకు ఆశయాలను వదులుకునే సంస్కరణవాదులు చేయాల్సిన పనులుగాని బోల్షివికులు గావించాల్సినవి గావు. జాతీయ నాయకులలో వున్న సత్యాగ్రహ భ్రమలన్నిటికి మన పార్టీసభ్యులు లోనయ్యారు.

విప్లవ సాధనంగా వుండవలసిన రోజుల్లో వీటి ఫలితాలవలన, పార్టీ గట్టి దెబ్బతింది. విప్లవాన్ని సాధించగల్గేది బలిష్టమైన పార్టీయే అనియు, అది లేకపోతే యెంత విప్లవకర పరిస్థితులున్నా విప్లవం రాదనే మూలసూత్రం మర్చిపోయాము.

## పార్టీ రహస్య నిర్మాణమును యేర్పరచుటకు ప్రయత్నం :

పార్టీ కేంద్రంలోవున్న ముఖ్య కామ్రేడ్సు కొందరు ప్రభుత్వ నిర్బంధమునకు గురి అయిననూ పార్టీకేంద్రం పూర్తిగా దెబ్బతినిపోలేదు; దెబ్బతట్టుకొని మరల పార్టీ రహస్యకేంద్రాన్ని యేర్పరచగల్గింది. ఈ రహస్యకేంద్రం సరిగా పనిజేయాలంటే రాష్ట్రాల్లో రహస్యకేంద్రాలు యేర్పడింది వీలులేదు. యుద్ధమొచ్చాక మొదటి 6 మాసాల్లోగల్గిన అనుభవాన్ని వుపయోగించుకొని కేంద్రపార్టీ రహస్యకేంద్రం బాగా కట్టుదిట్టంతో పనిజేయడం నేర్చుకుంది. నిజమైన రహస్యకేంద్రంగా తయారయింది. కాని కేంద్రపార్టీ ఒక్కటే యీ విధంగా పనిజేస్తేచాలదు. రాష్ట్రకమిటీలుగూడ యిలాంటి రహస్య కేంద్రాలు యేర్పడితేనేగాని పార్టీ అంతటా కట్టుదిట్టంగా పనిజేయగల రహస్య యంత్రాన్ని నిర్మించడానికి, నిర్బంధానికి గురికాగా మిగిలివున్న పార్టీ నాయకులను కాపాడుకోనడానికి వీలుండదు. కేంద్రపార్టీ రహస్యకేంద్రం బలంగావున్నా రాష్ట్రకమిటీల రహస్యకేంద్రాలు కట్టుదిట్టంగా పనిజేయకపోతే వాటికున్న బలహీనతలనుబట్టి అసలు పార్టీకేంద్రాన్నే ధ్వంసంచేయడానికి వీలుంటుంది. అందుచేత రాష్ట్రకమిటీలకు కనీసం పార్టీకేంద్రంతో దిట్టమైన రహస్య సంబంధాలు యేర్పడాల్సిన అవసరం గల్గింది. ఈ కార్యానికి పార్టీకేంద్రం పూనుకుంది. ఇంకొక విషయంగూడవుంది. పార్టీపై ప్రభుత్వ దాడి ప్రారంభమైన తదుపరి, పార్టీ బహిరంగ కార్యకలాపాలన్నీ కట్టుబడ్డాయి. పార్టీ యే పనిజేసినా రహస్యయంత్రంద్వారానే చేయాల్సివచ్చింది. ముఖ్యంగా పార్టీలీగల్‌పత్రిక (నేషనల్‌ఫ్రంటు) ఆగిపోయిన తరువాత పార్టీపాలసీని పార్టీసభ్యులకు, ప్రజలకు అందజేసే మార్గమే పోయింది. రహస్య పార్టీ పత్రికను గొనిరాకపోతే పార్టీసభ్యులు రాజకీయంగా గందరగోళంలో పడాల్సివస్తుంది. ఏది పార్టీ పాలసీయో తెల్పేమార్గముండదు. అప్పుడు పార్టీ అంతటా ఏకసూత్రంలో పనిజేయడానికి బదులు విభిన్నమార్గాలలో పనిజేయడం జరుగుతుంది. పార్టీసభ్యులలో యింకపరకూవున్న బూర్జువా తప్పుపోకడలన్నీ మరింత బలపడి పార్టీయే నిర్మాణయుక్తంగా విచ్ఛిన్నమౌతుంది. అందుచేత రహస్యపార్టీ పత్రికను ప్రకటించడం కేంద్రపార్టీయొక్క ప్రథమ కర్తవ్యమయింది. కాని రహస్య పత్రికను ప్రకటించడమంటే, అందులో ప్రభుత్వం పార్టీనంతా విచ్ఛిన్నం గావించాలని యెంతో దీక్షతో పనిజేస్తున్నప్పుడు నిప్పుతో చెలగాటము అన్నమాట రహస్యపత్రికే పార్టీనంతా ధ్వంసంచేయడానికి (సరియైన టెక్నికల్ యేర్పాట్లు లేకపోతే), దారితీయవచ్చు. అందుచేత పార్టీపత్రికను ప్రకటించడానికి కావలసిన డబ్బు వగయిరా యేర్పాట్లు గావించడమేగాకుండా, దాన్ని ప్రతి పార్టీసభ్యునకు అందజేయడానికి తగిన భద్రమైన పంపక యంత్రాన్నిగూడ తయారుజేసినప్పుడే రహస్య సాహిత్యోత్పత్తి పార్టీ అభివృద్ధికి తోడ్పడుతుంది. అందుచేత యీ దృష్టితోగూడ కేంద్రపార్టీ, రాష్ట్రకమిటీలు రహస్య కేంద్రాలు యేర్పరచుకోవడానికి, పార్టీ రహస్యపత్రికను పార్టీసభ్యులందరికి సరిగా, భద్ర

ముగా అందజేయడానికి తగిన రహస్యయంత్రాలను యేర్పాటుజేసుకోడానికి ముందుగా పూనుకోవాలని రాష్ట్రకమిటీలను హెచ్చరించింది.

కేంద్రపార్టీ సూచనల ననుసరించి రాష్ట్రకమిటీలు రహస్య కేంద్రాలను యేర్పాటు చేశాయి. కాని యీ యేర్పాట్లు సరియైనవిగావని తరువాత తరువాత స్పష్టమైంది. కేంద్రపార్టీ రహస్య పత్రికను తదితర సాహిత్యాన్ని వుత్పత్తి జేయడం, ముఖ్యరాష్ట్రాలలో రహస్యకేంద్రాలు పనిజేయడం ప్రారంభ మయింది. దానితో పార్టీ నిర్మాణములో కొత్తదశ ఆరంభమైంది. ప్రభుత్వ నిర్బంధవిధానమును తట్టుకోడానికి, రహస్య పరిస్థితుల కనుగుణ్యంగా పార్టీని పనిజేయించడానికి, పార్టీ రహస్య, బహిరంగ కార్యకలాపాలను సమన్వయం గావించడానికి తగిన పార్టీని నిర్మించడానికి కేంద్రపార్టీ పూనుకుంది. ఎన్నోదెబ్బలు తిన్నతరువాతనైనా అనుభవం తెచ్చుకొని పార్టీకేంద్రం యీ పనికి పూనుకోవడం వలన సరియైన పంథాలో పార్టీని నిర్మించడానికి ప్రాతిపదిక యేర్పడింది. ప్రభుత్వం ఎంత ప్రయత్నించినా మన పార్టీని రూపుమాపలేకపోయింది. ఈకాలంలో పార్టీని నిర్మించడానికి పూనుకోవడం వలన యెంతో అనుభవాన్ని గడించి కొంతవరకు నిర్మాణరీత్యా బలపడ్డాము గూడాను.

### రాష్ట్రాల్లోని పార్టీ రహస్య కేంద్రాలు : వాటి బలహీనతలు

దాదాపు అన్ని రాష్ట్రకమిటీలకు రహస్యకేంద్రాలు యేర్పడ్డా, అవి చాల బలహీనంగా వున్నాయి. పార్టీ నాయకులను దాచడానికి మాత్రం కొన్ని రహస్యచోట్లు సంపాదించారేగాని పార్టీనంతటిని రహస్యంగా పనిజేయించడానికి రహస్య యంత్రాన్ని నిర్మించలేదు. అందుచేత వీటి బలహీనతలు కేంద్రపార్టీ రహస్య సాహిత్యాన్ని పార్టీ సభ్యులకు ప్రజలకు పంచడంలో బైటబడ్డాయి. అంతేగాకుండా యింకా రాష్ట్రకమిటీల నాయకుల్లో లీగల్ భ్రమలు పోలేదు. రహస్య కాలంలో పనిజేసే పద్ధతులు బహిరంగ కాలంలో పనిజేసే పద్ధతులకు చాల వ్యత్యాస ముంటుందనే విషయాన్ని గ్రహించలేదు. రహస్యంగా వున్నారేగాని రహస్యకేంద్రాలకు బహిరంగంగా పనిజేసే ప్రజానాయకులను నేరుగా పిలిపించుకొని మాట్లాడడం, అచ్చటనుండే నేరుగా వారికి వుత్తరప్రత్యుత్తరాలు నడపడం. సమ్మెలు యేవైనా వస్తే వాటిని రహస్యంగా వున్న కామ్రేడ్సు నడపడం వగైరా పనులు చేస్తుండేవారు. దానివలన ప్రభుత్వం రహస్య కేంద్రాలను తేలికగా పట్టుకోవడానికి అవకాశం గలిగింది. దానికి తోడు రాష్ట్రాల్లోగూడ రహస్య కరపత్రాలు వేయడం, రహస్య పార్టీపత్రికలను ప్రకటించడంగూడ జరిగింది. కేంద్రపార్టీ వుత్పత్తిజేసే రహస్య సాహిత్యాన్ని పార్టీసభ్యులందరికీ పార్టీ నిర్మాణమునకేమీ హానిలేకుండా అందజేయజాలని స్థితిలో వున్నప్పుడు, రాష్ట్రాల్లో అదనంగా జరిగిన రహస్య సాహిత్యోత్పత్తివలన ప్రభుత్వ నిర్బంధం మరింత హెచ్చయింది. రహస్య సాహిత్యోత్పత్తి జేయడమంటే ప్రభుత్వ దాడిని ఆహ్వానించడమన్నమాట. ఆ దాడిని తట్టుకోవడానికి తగిన పార్టీనిర్మాణము లేకుండా రహస్య సాహిత్యోత్పత్తి గావించడమంటే వున్నపార్టీనిగూడ ప్రభుత్వానికి అప్పజెప్పడ మౌతుంది. అందుచేత పైతప్పుమార్గాలవలన రాష్ట్రాల్లో యేర్పడ్డ రహస్యకేంద్రాలు హెచ్చుకాలం పనిజేయలేదు. 1940 సెప్టెంబరునుండి యీ కేంద్రాలు ఒకదానివెనుక మరొకటి యెగిరిపో జొచ్చాయి. రాష్ట్రాల బలహీనతవలన కేంద్రపార్టీ రహస్య కేంద్రానికిగూడ కొంత దెబ్బ తగిలింది. బొంబాయి, మహారాష్ట్ర, తమిళనాడు, పంజాబు కేంద్రాలు యెగిరిపోయాయి బెంగాల్ మలబారు, గుజరాతు కేంద్రాలు పోకపోయినా ముఖ్యనాయకులు అరెస్టుగావడంవలన బాగా బలహీన



పడ్డాయి. ఆంధ్రపార్టీ రహస్యకేంద్రం మాత్రం ప్రభుత్వదాడికి గురి అవకుండా ప్రారంభమునుండి సురక్షితంగా పనిచేయగలిగింది.

మరల పార్టీ కేంద్రాన్ని పెద్ద సమస్య యెదుర్కొంది. చాల రాష్ట్రాల్లో ప్రథమ, ద్వితీయ శ్రేణుల పార్టీనాయకులు అరెస్టుగాబడ్డారు. దిగబడివున్న పార్టీకేడర్లు అనుభవంలేనివారు. (రాజకీయంగాను, నిర్మాణరీత్యాగూడ) వీరితో మరల పార్టీకేంద్రాలను రాష్ట్రాల్లో యేర్పరచవలసివచ్చింది. ఈ కర్తవ్యాన్ని నిర్వహించితేనేగాని పార్టీకేంద్రం యేపని చేయజాలకపోయింది. ముందుదశతో పార్టీ నిర్మాణపు పై కార్యాన్ని నిర్వహించడానికి పార్టీకేంద్రం శక్తినంతా కేంద్రీకరించింది.

యుద్ధమొచ్చాక 6 మాసాలవరకు పార్టీ నిర్మాణమునకు యేమీ పూనుకోకపోవడం, ఆతరువాత పార్టీతిన్న దెబ్బను గుర్తించి రహస్యపార్టీ నిర్మాణమునకు పూనుకోవడానికి ప్రయత్నించినా యింకా పార్టీముఖ్యులలో (ముఖ్యంగారాష్ట్రాల్లో) లీగల్‌భ్రమలు వుండుటవలన, పార్టీని నిర్మించుటకు కుర్రచేష్టలు అవలంబించుటవలన పార్టీ మరల నిర్మాణరీత్యా గొప్పదెబ్బ తింది. దీనితో పార్టీ ప్రచారరంగాల పనులన్నీ మూలబడ్డాయి; పార్టీకి ప్రజలకు సంబంధం తెగిపోయింది. పార్టీ వేరుచేయబడింది. పార్టీ అస్తిత్వాన్ని కాపాడుకొనుటే ప్రధానసమస్య అయింది. సామ్రాజ్యవాద యుద్ధకాలం రెండవదశ ఆరంభమయ్యేటప్పటికి పార్టీ నిర్మాణపు స్థితి అది.

## సామ్రాజ్యవాద యుద్ధకాలం రెండవదశ.

(1940 అక్టోబరునుండి 1941 జూన్‌వరకు)

### పార్టీ నిర్మాణ ప్రయత్నాలు :

ఈ దశలో జాతీయ అంతర్జాతీయ పరిస్థితి మరింత అధ్వాన్నమైంది. హిట్లరు యూరప్‌నంతా ఆక్రమించుకొని మధ్య ప్రాచ్య దేశాలకు ప్రత్యక్ష ప్రమాదాన్ని తెచ్చిపెట్టాడు. దీనితో బ్రిటిష్‌సామ్రాజ్యవాదం పూర్తిగా బలహీన పడిపోయింది. బ్రిటిష్ సామ్రాజ్యవాదమునకు అప్పుడు గలిగిన రాజకీయ, మిలిటరీముప్పు దాని చరిత్రలో యెన్నడూ సంభవించలేదు. అన్నివిధాల హిట్లరుదే పైచెయ్యి అయింది.

ఈ పరిస్థితుల్లో తన బలహీనస్థానాన్ని మరింత కట్టుదిట్టం జేసుకోడానికి భారతదేశంలో బ్రిటిష్ ప్రభుత్వం దారుణ నిర్బంధవిధానం ప్రయోగించింది. ఇదివరకు కమ్యూనిస్టులమీదనే కేంద్రీకరించబడ్డ నిర్బంధం యిప్పుడు భారతజాతి అంతటిమీద ప్రయోగించబడుతోంది. రాజకీయంగా బూర్జువావర్గము భారతదేశములో తన అధికారాన్ని యీషన్మాత్రమైనా సడలించడానికి అంగీకరించుట లేదు. అన్నివిధాల బూర్జువావర్గాన్ని, భారతప్రజలను తనకు లొంగిపోవాలనీ, తాను సాగించే యుద్ధప్రయత్నాలకు నోరు కదల్పకుండా సహాయంజేసి సామ్రాజ్యాన్ని నిలబెట్టాలని వాంఛించుతోంది. అందుచేత భారత ప్రజల అన్ని వర్గాలనుండి బ్రిటిష్‌ప్రభుత్వం దూరమైపోయింది. తనస్థానం అంతర్జాతీయంగాను, జాతీయంగాను బలహీనపడుచున్న కొలదీ ఆర్థిక, రాజకీయ నిర్బంధాలను భారతప్రజలపై హెచ్చుజేసింది. అందుచేత కాంగ్రెసు నాయకత్వం రాజీకై ఎంత ప్రాకులాడిననూ అసంభవమైంది.

బ్రిటిష్ ప్రభుత్వంతో రాజీకై యెదురుచూస్తూ 'నిస్తబ్ధత'ను కొనసాగిస్తూ కూర్చునివున్న కాంగ్రెసునాయకత్వంకు ఎల్లకాలం అదేరకమైన 'నిస్తబ్ధత'ను కొనసాగించడం అసంభవమైంది. జాతీయోద్యమముపై తన నాయకత్వం నిలబెట్టుకోవడమే కష్టమైంది. కాని దేశములో నానాటికి యుద్ధానికి, ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రబలుతూవున్న అశాంతిని సంఘటిత పద్ధతులద్వారా దేశవ్యాపిత ప్రజా పోరాటము తీసుకురావడానికి అప్పుడుగూడా నిరాకరించింది. జాతీయ శ్రేయస్సుకంటె తన బూర్జువా వర్గ శ్రేయస్సునే ముందుపెట్టుతుంది. ఇదివరకునుండీ సాగిస్తున్న 'నిస్తబ్ధత'ను మరోమార్గంలో సాగించడానికి నిశ్చయించింది. ఈ దృష్టితోనే "వ్యక్తి సత్యాగ్రహోద్యమము"ను ప్రారంభించడానికి నిశ్చయించింది. ఈ మార్గం అటు జీవన్మరణ సమస్యలోపడి హిట్లరు ఉచ్చులో చిక్కుకొనియున్న బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని బెదిరించి బూర్జువా హక్కులను సంపాదించుకోడానికీ, ఇటు నిస్తబ్ధతతో విసుగుచెంది యేదో రకమైన కార్యక్రమమును యేర్పరచాలని కోరుచున్న కాంగ్రెసు ప్రజా సామాన్యమును సంతృప్తిపర్చి తన పలుకుబడిక్రింద వుంచుకోడానికి యీ మార్గం వుపయోగిస్తుందని కాంగ్రెసు నాయకత్వం ఆశించింది. సత్యాగ్రహం ప్రారంభమైంది ఏదో కార్యక్రమము యివ్వబడిందనే వుద్దేశ్యంతో ప్రారంభములో కొంతమంది పాల్గొన్నా ఒక్క సంయుక్తరాష్ట్రాలలోతప్ప మరెచ్చటా ప్రజల్లోగాని కాంగ్రెసు ప్రజాసామాన్యంలోగాని వుత్సాహాన్ని రేకెత్తించలేదు. ప్రభుత్వంకు జాతీయోద్యమాన్నంతటిని పూర్తి నిర్బంధానికి గురి చేయడానికి అవకాశ మిచ్చింది. దేశములో అతివాద నాయకులు, కాంగ్రెసు నాయకులందరూగూడ అరెస్టు గావించబడ్డారు.

'వ్యక్తి సత్యాగ్రహం'గూర్చి ప్రారంభంలోనే పార్టీ స్పష్టపరిచింది. బూర్జువావర్గ నాయకత్వం యింతవరకు సాగించుతూవున్న 'నిస్తబ్ధత'ను మరో రూపంలో సాగించడానికి సాధనంగా 'వ్యక్తి సత్యాగ్రహం' ప్రారంభింపబడిందనియు, అందుచేత అది జాతీయపోరాటంగాని, దాని సోపానము గాని కాదని స్పష్టపర్చింది; పైగా జాతీయోద్యమ ప్రథమ, ద్వితీయ, తృతీయ శ్రేణులనాయకత్వాన్ని ప్రభుత్వ నిర్బంధానికి గురిచేసి జాతీయోద్యమమును పూర్తిగా బలహీనపర్చుటకే యిది వుపయోగపడుతుందిగాని ప్రజలనందరినీ జాతీయపోరాటములోనికి గొనిరావడానికి యేమాత్రం వుపయోగపడదని స్పష్టపర్చింది. ఇందుచేత కమ్యూనిస్టులు దీన్ని బలపర్చడంగాని, దానిలో పాల్గొనడంగాని జేయరాదనియు, యుద్ధఫలితంగా రోజురోజూ తీవ్రమౌచున్న స్థానిక కష్టాల నాధారంగా తీసుకొని ప్రజలందరితోగూడిన స్థానిక పోరాటాలను గొనిరావడానికి దానికి తగిన పార్టీకేడర్లను, పార్టీనిర్మాణమును అభివృద్ధిజేయడానికి పార్టీసభ్యులు కృషిజేయాలని ప్రకటించింది. అప్పుడేగనుక పార్టీ వ్యక్తిగత సత్యాగ్రహంలో పాల్గొంటే పార్టీఅంతా ప్రభుత్వ నిర్బంధానికి గురిఅయ్యేది. యీ కాలంలో ప్రభుత్వం అరెస్టు చేయగా మిగిలిన పార్టీసభ్యులను తర్ఫీదుచేయడానికిగాని, రహస్యపార్టీ నిర్మాణము నిర్మించుటకుగాని యేమాత్రం అవకాశం లేకుండా పోయేది. ప్రజాయుద్ధకాలంలో పార్టీపైబడ్డ కర్తవ్యాలను నిర్వహించడానికిగూడ పార్టీకి శక్తిలేకపోయేది. ఈ దూరదృష్టితో పార్టీ వ్యక్తి సత్యాగ్రహోద్యమములో పాల్గొనకుండా పార్టీని నిర్మించడానికి, ప్రజలను స్థానిక పోరాటాల ద్వారా రాజకీయ రంగంలోనికి గొనిరావడానికి, వారిలో ప్రభుత్వ దారుణ నిర్బంధమువలన గలిగిన నిరుత్సాహాన్ని తొలగించి సామ్రాజ్యవాద వ్యతిరేక తత్వాన్ని నిలబెట్టడానికి దానిశక్తినంతా కేంద్రీకరించింది. దాని వలన వ్యక్తి సత్యాగ్రహోద్యమములో పాల్గొని దాని నిష్ఫలతను గ్రహించిన వారందరు నిరుత్సాహపడి రాజకీయ రంగంనుండి విరమించుకోకుండా పార్టీ ఆపగలిగింది. కాని వారినందరిని కార్యాచరణ



లోకి దింపి పనిజేయించజాలకపోయింది. ఎందుచేతనంటే పార్టీ అప్పటికే బాగా దెబ్బతినివుంది; పార్టీని కాపాడుకోవడమే పెద్ద సమస్య అయింది. అలాంటప్పుడు వారినందరిని పార్టీలోకి యిముడ్చుకొని, వారికి తగిన రాజకీయశిక్షణ యిచ్చి కార్యాచరణకు దింపగల్గేంత పార్టీనిర్మాణం లేకపోయింది. ఆదినుండి వచ్చే బలహీనతే అప్పుడుగూడ పార్టీని అభివృద్ధి గానీయకుండా చేసింది.

## పార్టీ నిర్మాణ ప్రయత్నాలు:

వెనుకటిదశలో పార్టీతిన్న దెబ్బవలన పార్టీ ముఖ్యులందరూ అరెస్టు గావించబడ్డారనియు, యింక మిగిలివున్న పార్టీసభ్యులలో ముఖ్యులకు సెల్లుకార్యదర్శుల స్థాయికన్నా హెచ్చుతేదనియు, వీరితో రాష్ట్రాల్లో పార్టీ రహస్యయంత్రాలను నిర్మించాల్సిన సమస్య కేంద్రపార్టీని యెదుర్కొందని యిదివరలో చూశాం. రాష్ట్రాల్లో రహస్యకేంద్రాలను ఏర్పరచి, పార్టీని పునర్నిర్మించుటకుగాను ప్రథమముగా అవి అనుసరించే తప్పుపద్ధతులను వెంటనే తొలగించడం అవసరమైంది. అందుకుగాను రాష్ట్రకమిటీలేవీ కేంద్రపార్టీ అనుమతిలేకుండా రహస్య సాహిత్యోత్పత్తి గావించరాదనియు, రహస్యకేంద్రాలతో నేరుగా పార్టీసభ్యులకు సంబంధాలుంచరాదనియు కేంద్రపార్టీ ఇన్‌స్ట్రక్షన్సు పంపింది. అంతేగాకుండా పార్టీ నిర్మాణములో ముఖ్యమైన మార్పులు గొనివచ్చింది. ఇదివరలో పార్టీనాయకులే (రహస్యంగా వున్నవారైనసూ) క్రిందిపార్టీ యూనిట్లకు రాజకీయ రిపోర్టులు యివ్వడానికిగాని, వాటినుండి రిపోర్టులు తీసుకోడానికిగాని నేరుగా వెళ్ళేవారు. వారు వెళ్ళినప్పుడే స్థానిక యూనిట్లు సమావేశం అవడం జరిగేది: మరల వారు వెళ్ళేంతవరకు పార్టీసభ్యులు సమావేశం అయ్యేవారేగాదు. పార్టీసభ్యులు గావించిన పనిగూర్చి సమిష్టిగా ఆలోచించుకోవడంగాని, మరల కొత్త కార్యక్రమము వేసుకోవడం గాని జరిగేదిగాదు. ఎవరియిష్టమొచ్చినట్లు వారు వ్యక్తిగతశక్తి చొరవననుసరించి పని గావించుతూ వుండేవారు. కాని యీ విధంగా పనిజేయడం యీ దశలో సాధ్యంగాలేదు, ఎందుచేతనంటే పార్టీ ముఖ్యులుగాని, నాయకులుగాని తరుచు కదలడానికి వీలులేకపోయింది; క్రింది పార్టీయూనిట్లకు పార్టీ పత్రికను గూర్చిగాని, తదితర పార్టీ డాక్యుమెంట్సు గూర్చిగాని విశదపర్చేవారు యింక యెవరూ రావడానికివీలులేదు. వాళ్ళంతటవాళ్ళే చదువుకొంటూ వాటినిఅర్థంజేసుకొని పనిజేయాలి; అర్థంగాకపోతే పార్టీకేంద్రానికి రిపోర్టులు పంపి తెలుసుకొని సందేహాలను నివృత్తి గావించుకోవాలి. అందుచేత పార్టీ పాలసీని తెలుసుకోవడానికే పార్టీ సెల్లులు సమావేశమై, సాహిత్యాన్ని సమిష్టిగా చదివి సందేహాలను పైకమిటీలకు తెలియపర్చుకొంటేనేగాని అవకాశం లేకపోయింది. అందుకు యిదివరకు అలవాటులేని సెల్లు సమావేశాలను జరపటం, పైకమిటీలకు రిపోర్టులు పంపడం అవసరమైంది.

అంతేగాకుండా పార్టీ సాహిత్యాన్ని పైకమిటీలనుండి తెప్పించుకోడానికి ఒక నిర్మాణమును యేర్పాటు చేసుకోవలసి వచ్చింది. పార్టీ సాహిత్యం రాకపోతే పార్టీపాలసీయే తెలిసే అవకాశంలేదు. కాని దాన్ని క్రిందికి తెప్పించుకోవడం సులభమైన పనిగాదు. అందుచేత దాన్ని తెప్పించుకోడానికే పార్టీ నిర్మాణయుక్తంగా పనిజేయాల్సి వచ్చింది.

పార్టీ నిర్మాణములో యీ విధమైన మార్పును తీసుకురావాలంటే పార్టీ సభ్యులకు యీ పద్ధతులలో శిక్షణ, తర్ఫీదు యివ్వనిదే సాధ్యంగాదు. అందుచేత పార్టీకేంద్రం యీకాలములో దిగబడివున్న పార్టీకేడర్లకు పూర్తి రాజకీయశిక్షణ, తర్ఫీదు యివ్వడానికి పూనుకొంది. ముందు రాష్ట్రకమిటీ ముఖ్య సభ్యులకు, తరువాత జిల్లాలలోని ముఖ్యులకు తర్ఫీదు యిచ్చింది. కేవలం నిర్మాణ పద్ధతుల్లోనేగాక

రాజకీయ సిద్ధాంతాలపై పార్టీ పాలసీనిగూర్చి వెనుకటినుండి అప్పటివరకు తిర్గి తర్ఫీదు యివ్వాల్సి వచ్చింది. ఎందుచేతనంటే అరెస్టు గాకుండా దిగబడివున్న పార్టీ సభ్యులకు, నాయకులకు హెచ్చు రాజకీయ స్థాయిలేదు; అదేగాకుండా పార్టీలోనికి యీ కాలంలో నూతనంగా వచ్చిన సభ్యులకు బాగా రాజకీయ పాలసీగూర్చి చెప్పనిదే వాళ్ళ ప్రాంతాలలో పార్టీ పాలసీ ననుసరించి పనిజేసేశక్తి వారికి వుండదు. అందుచేత రాజకీయ, నిర్మాణపు, టెక్నికల్ శిక్షణ, తర్ఫీదు పార్టీసభ్యులకు యివ్వడానికి పార్టీకేంద్రం పూనుకొంది. ముందు రాష్ట్రాల్లో పార్టీ ముఖ్యులకు యీ తర్ఫీతు యిచ్చింది. వారు జిల్లాలోను, తాలూకాలలోను పార్టీసభ్యులకు స్కూళ్ళుపెట్టి యిచ్చారు. ఈ విధంగా యీ కాలంలో పార్టీ సభ్యులకు నూతన పరిస్థితులలో పార్టీ పాలసీని యెలా ప్రజలవద్దకు తీసుకుపోవలసిందీ, అందుకు తగిన పార్టీ నిర్మాణమును యెలా నిర్మించాల్సిందీ యీ విషయాలనుగూర్చి తర్ఫీదు యివ్వబడింది. దీనివలన పార్టీసభ్యులు పార్టీ చైతన్యం అలవర్చుకోవడంలోను, క్రమశిక్షణ యేర్పరచుకోవడంలోను, పార్టీని నిర్మాణయుక్తంగా పనిజేయించడంలోను యెంతో ముందుకుపోయినా, హెచ్చు అనుభవం, రాజకీయ పరిపక్వంలేని వారగుటచేత పూర్తి ఫలితాలు రాలేదు. పార్టీని నిర్మించాలంటే రాజకీయఅనుభవం, పరిపక్వతవుండి, బాధ్యతలను నెత్తిమీదవేసుకొని నిర్వహించగల సామర్థ్యము కొంతవరకు వున్నప్పుడే సాధ్యమౌతుంది. పార్టీ నిర్మాణసూత్రాలు వల్లించడానికి, ఆచరణలో పార్టీని నిర్మించడానికి చాల భేదముంది; పార్టీని నిర్మించేశక్తి అనుభవంద్వారా గల్గుతుంది. అనుభవమునకుతోడు సిద్ధాంత పరిజ్ఞానం వున్నప్పుడు పార్టీని చక్కగా నిర్మించగలశక్తి గల్గుతుంది. సామ్రాజ్యవాద యుద్ధకాలంలో వచ్చిన నూతన పార్టీసభ్యులు చాలమంది కేంద్రపార్టీ స్కూళ్ళకు హాజరయినా పార్టీని నిర్మించలేకపోయారంటే పైదే కారణం.

ఈ కాలంలో పార్టీని నిర్మాణయుక్తంగా పనిజేయించడానికి పూనుకోవడంవలన, రహస్యంగా పనిజేయవలసి వచ్చుటచేత కేంద్రపార్టీ నాయకులు, రాష్ట్రాల్లోని పార్టీముఖ్యులు యెంతో రాజకీయంగాను, నిర్మాణయుక్తంగా అభివృద్ధి అయ్యారు. వీరు అభివృద్ధి అవడమేగాక, పార్టీకి ఒక నిర్మాణపు ఆకారం రావడం వలన, పార్టీసభ్యులలో యిదివరకంటే పార్టీ చైతన్యము, క్రమశిక్షణ యెన్నోరెట్లు అభివృద్ధి అయ్యాయి; పార్టీ మొత్తంమీద పెటీబూర్జువా చెడులక్షణాలు చాలవరకు తగ్గాయి. పార్టీ పద్ధతిలో పనిజేయడం నేర్చుకుంటున్నారు.

### ఈ కాలంలో పార్టీ సాధించిన విజయాలు :

ఈకాలంలో మనం గడించిందేమిటి? సామ్రాజ్యవాద యుద్ధకాలమంతా వట్టి నిరాశాజనకమైనదేనని భావించరాదు. పార్టీగావించిన లోపాలు చాలావున్నా, కొంతవరకు విజయాలను గూడ సాధించగలిగింది. కాంగ్రెసుసంస్థ తప్ప మరి యితరపార్టీలేవీ గురిగానంత నిర్బంధానికి పార్టీ గురిఅయింది. అయినా ప్రభుత్వం పార్టీని రూపు మాపలేకపోయింది. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రజలను సమీకరించడంగాని, పోట్లాడించడంగాని, వారిలో ప్రచారం ఆందోళనలు గావించడంగాని మనపార్టీ యొక్కటే యీకాలంలో చేసింది; ప్రభుత్వ నిర్బంధానికి గురిఅవుతూ భారతస్వాతంత్ర్య పతాకాన్ని నిలబెట్టుటకు పార్టీ తీవ్రకృషిజేసి నిలబెట్టింది; యీ కారణాలవలన తోటి దేశభక్తుల గౌరవమన్ననలను పార్టీ పొందింది, పార్టీ నాయకత్వంక్రింద యీ కాలములోనే విద్యార్థులు సాగించిన



ప్రచండమైన విద్యార్థిసమ్మెలు, కార్మికసమ్మెలు ప్రజలందరిలో ఉత్సాహాన్ని, ఉద్రేకాన్ని కలుగజేశాయి. ఈవిధంగా ఒక ముఖ్య రాజకీయశక్తిగా పార్టీ పరిగణింపబడింది.

పార్టీ ఆర్థికస్థితి, నిర్మాణపుస్థితిగూడ యీరోజుల్లో యుద్ధానికి పూర్వముకన్నా బాగుపడింది. 'నేషనల్‌ఫ్రంటు' రోజులలో నెలకు కేంద్రపార్టీకి రు. 600/- లు ఖర్చు అవుతుంటే, యీకాలంలో నెలకు రు. 2000/- లు ఖర్చు అవుతుండేది. ఈ డబ్బంతా పార్టీసభ్యులు ప్రజలనుండి, పార్టీ సానుభూతి పరులనుండి వసూలు జేస్తుండేవారు. అందుచేత కేంద్రపార్టీకి ఖర్చు హెచ్చినా డబ్బుఇబ్బంది వుండేదిగాదు. రాష్ట్రాలలోగూడ యీమార్పు వచ్చింది. కేంద్రకమిటీ సహాయంవలననే, రాష్ట్రాలలో ఒకరిద్దరు పార్టీ నాయకుల ధనసహాయంవలననే యుద్ధానికిపూర్వం పార్టీ నడుపబడుచుండేది. ఈ కాలంలో చాల రాష్ట్రాలలో రాష్ట్రకమిటీల ఖర్చులకు హెచ్చుభాగం ప్రజలనుండిగాని, పార్టీ సభ్యులనుండిగాని వసూలుచేయబడుచుండేది. బాగా పనిజేస్తున్న రాష్ట్రాలలో పార్టీ ఖర్చులకొరకు ప్రతినెలా పార్టీయూనిట్లు ప్రజలనుండి, పార్టీ సభ్యులనుండి రెగ్యులర్‌గా వసూలుచేసే అలవాటు యేర్పడింది. పార్టీసభ్యులు కోటాలువేసుకుని వసూలుచేసేపద్ధతి ప్రవేశపెట్టబడింది. ఈ విధంగా పార్టీఖర్చులకు రెగ్యులర్‌గా ప్రతినెలా వసూలుగావించే అలవాటు పార్టీలో ప్రవేశపెట్టబడినది.

పార్టీ యీకాలములో రాజకీయంగా, నిర్మాణరీత్యా గావించిన కృషిఫలితంగా పార్టీసభ్యులలో మంచి ఫలితాలువచ్చాయి. పార్టీ కేంద్రమంటే యిదివరలో యేకొద్దిమంది వుత్తమపార్టీ సభ్యులకో వుండే భక్తిశ్రద్ధలు యిప్పుడు పార్టీ సభ్యులందరిలో గలిగాయి. అందుచే పార్టీలో సరియైన కేంద్రీకరణం వచ్చింది. స్థానికతత్వం అంతరించింది. అచ్చటచ్చట పరిస్థితులు పూర్తిగా బోధపడకపోవుటచేత రాజకీయ తప్పుధోరణిగామాత్రం యీ స్థానికతత్వం ద్యోతకమౌతూ వుండేదిగాని స్థానికతత్వం అంతరించిందనే చెప్పాలి.

ఆ విధంగా పార్టీ నిర్మాణముయొక్క ఆకారం యీకాలములో సృష్టింపబడింది. పార్టీ నిర్మాణప్రాముఖ్యతను పార్టీ నాయకత్వమే గ్రహించుటగాక, పార్టీసభ్యులందరుగూడ పార్టీ నిర్మాణపు అవశ్యకతను గ్రహించారు. పార్టీ నిర్మాణయుక్తంగా బలంగా లేకపోతే రాజకీయంగాకూడ పార్టీ యెంత శక్తిహీనంగా వుంటుందో స్పష్టంగా తెలుసుకున్నారు.

పార్టీ నిర్మాణావశ్యకతను గ్రహించడమేగాక, పార్టీని నిర్మించడమనేది ఒక ప్రత్యేక కర్తవ్యమని, ఆ పనిని పార్టీ తదితరపనులన్నీ నేర్చుకోవలసినట్లే నేర్చుకోవాలని పార్టీసభ్యులు గ్రహించారు. పార్టీని నిర్మించడానికి కేడరును ప్రత్యేకించి వారికి ప్రత్యేక తర్ఫీదు యివ్వాలనిగూడ నేర్చుకున్నారు. అయినప్పటికీ పార్టీనిర్మాణపు అనుభవం పాతసభ్యులకు చాల కొద్ది అగుటవలన, అరెస్టుకాగా మిగిలివున్న పార్టీ సభ్యులలో హెచ్చుభాగం నూతనంగా పార్టీలోనికి వచ్చిన వారగుటచేతను పార్టీని బలిష్ఠంగా నిర్మించజాలకపోయాం.

పార్టీని నిర్మించడానికి యెన్ని కష్టాలు యెదుర్కోవలసివచ్చినా, పార్టీ నిర్మాణములో అభివృద్ధికరమైన ఒక నూతన దశ ప్రారంభమైంది. పార్టీసభ్యులందరూ పార్టీని నిర్మించే విధం తెలుసుకోవాలని ఆతురత కనపర్చారు.

# ఏ డ వ భా గ ము

## ప్రజాయుద్ధకాలములో పార్టీ నిర్మాణము

### సోవియట్ యూనియన్‌పై జర్మనీదాడికి ముందున్న పరిస్థితులు :

"1939 సెప్టెంబరులో ప్రారంభమైన సామ్రాజ్యవాదయుద్ధం ప్రారంభము కాకముందే ఫాసిజము, ఫాసిస్టు దురాక్రమణ అభివృద్ధి అవుతున్న రోజులలోనే ప్రపంచం రెండుముఠాలుగా విడిపోయింది. ప్రపంచ సామ్రాజ్యవాదముఠా విద్రోహశక్తులముఠా, దానికి ఫాసిస్టులూ, వారిని బలపర్చేవారు నాయకత్వం వహించారు. ప్రపంచాన్ని ఫాసిజంతో యుద్ధంతో ముంచివేయడానికి వలసదేశాల బానిసత్వాన్ని స్థిరపరచడానికి సోవియట్ యూనియన్‌పై దాడివెడలటంకోసం వారు కృషిచేశారు.

"ప్రపంచ ప్రజలపక్షం అభివృద్ధిని కోరేపక్షం, దానికి సోవియట్ యూనియన్, ప్రపంచప్రజలలో అగ్రభాగాలు నాయకత్వం వహించాయి. ఫాసిజానికి వ్యతిరేకంగా పోరాడడానికి, ఫాసిస్టు దురాక్రమణను నిరోధించడానికి, సోవియట్‌యూనియన్‌తో కలసి యుద్ధాన్ని ఆపడానికి సంసిద్ధమైన ఫాసిస్టు వ్యతిరేక ప్రపంచ ప్రజాసంఘటన నిర్మించడానికి వీరు కృషిచేసారు. సమిష్టి భద్రతద్వారా శాంతిని కాపాడడానికి ప్రతిదేశంయొక్క స్వాతంత్ర్యాన్ని, ప్రజాస్వామ్యాన్ని (బానిసదేశాలతోసహా) కాపాడడానికి వీరు నిలబడ్డారు. కాని యీ ప్రజాశాంతి సంఘటన జయప్రదంగా నిర్మింపబడలేదు. సోషల్ డెమాక్రటులచే ఛిన్నాభిన్నం చేయబడింది.— — — దానిఫలితంగా బ్రిటిష్, ఫ్రెంచి, అమెరికన్ సామ్రాజ్యవాదులు సోవియట్‌పై దాడి వెడలుతారనేఆశతో తమ సామ్రాజ్యవాద ప్రత్యర్థులైన ఫాసిస్టులను బలపర్చారు. కాని యీ ప్లానులు తమకే విరుద్ధంగా పరిణమించాయి. హిట్లరు సోవియట్‌పై దాడికి తనబలం యింకా చాలదనుకున్నాడు. సోవియట్ యూనియన్‌తో నిరాక్రమణసంధి చేసుకున్నాడు. దీనితో బ్రిటిష్ విద్రోహులకు పిచ్చి యెత్తింది. జర్మనీపై యుద్ధాన్ని ప్రకటించారు.

### రెండవ సామ్రాజ్యవాద యుద్ధం :

"1939 సెప్టెంబరులో రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభం గావడంతో ప్రజాపక్షం, శాంతిపక్షం చీలిపోయింది. ఒకదేశప్రజలు మరోదేశప్రజలకు యెదురుగా రణరంగంలో నిలిచారు."



బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్యవాదులు తాము హిట్లరిజానికి వ్యతిరేకంగా పోరాడుతున్నామనీ, స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యాలకోసం, పోలండు రక్షణకోసం యుద్ధం చేస్తున్నామని ప్రజలతో చెప్పారు. కాని వాస్తవంలో అదేమీ చేయుటలేదు. ప్రపంచాధిపత్యంలో తమకు క్రిందిచేయిగా వుండటానికి, సోవియట్‌పై దండయాత్ర చేయడానికి నిరాకరించి తమ్ము ద్రోహంచేసిన సామ్రాజ్యవాద ప్రత్యర్థి హిట్లరుతోనే వారు పోరాడుతున్నారు."

"బ్రిటిష్ ఫ్రాంసుల ప్రపంచాధిపత్యాన్ని త్రోసి రాజనటానికే హిట్లరు పూనుకొన్నాడు. తాను జర్మనీకి "జీవించేస్థలం" కోసం దాదాపు ప్రపంచాన్నంతనీ గుత్తగా గొన్న బ్రిటను, ఫ్రాంసులతో పోరాడుతున్నానని హిట్లరు జర్మనుప్రజలను మోసగించాడు."

"ప్రపంచాధిపత్యంకోసం, ముడిపదార్థాలు మార్కెటులకోసం రెండువైపులా పోరాడుతున్నారు. ఆ యుద్ధంలో ప్రజలు రక్షించుకొనేది యేమీలేదు. సామ్రాజ్యవాదులు ప్రజలను ఆటగాండ్రుగామాత్రం వుపయోగించుకుంటున్నారు. అందుచే ప్రతిదేశంలోను, ప్రజలలో చైతన్యం పొందినవారంతా ఆ యుద్ధాన్ని వ్యతిరేకించారు."

"సోవియట్ యూనియన్ ఆయుద్ధానికి దూరంగా నిలబడింది. జర్మనీకి అప్పుడు సోవియట్‌పై దాడివెడలటానికి ధైర్యంచాలక నిరాక్రమణసంధి చేసుకుంది. బ్రిటిష్ సామ్రాజ్యవాదులు సోవియట్-జర్మన్ యుద్ధాన్ని రెచ్చగొట్టాలనుకున్న ప్రయత్నంలో విఫలులయ్యారు. సోవియటు యుద్ధంలోకి యీడ్వబడకుండా తటస్థంగా వుంటూ బలపడడం బ్రిటిష్ ఫ్రెంచి సామ్రాజ్యవాదులకు ఆశాభంగం అయింది వారు అనుకోని విధంగా యుద్ధంలో చిక్కుబడ్డారు. వారు, తూర్పు యూరప్‌లో రష్యాపై యుద్ధాన్ని రెచ్చగొట్టడానికి యెంతో శ్రమపడ్డారు. యుద్ధం తూర్పుకు సాగిపోవడానికి కృషిచేశారు. సోవియట్‌పై ఫిన్లాండును రెచ్చగొట్టి యుద్ధంలో పూర్తిగా దానికి సాయపడ్డారు. కాని యివన్నీ వృధా అయ్యాయి."

"పై సామ్రాజ్యవాదుల కుట్రలను విఫలం చేయడానికి, స్వతంత్రశాంతి పాలసీని అవలంబిస్తున్న సోవియట్‌కు తగినబలంవుంది. తనప్రజల క్షేమంకోసం, ప్రపంచప్రజల క్షేమంకోసం తూర్పున శాంతిని కాపాడడానికి, తన సరిహద్దు దేశాలు యుద్ధజ్వాలలలో యిరుక్కోకుండా చేయడానికి, యుద్ధం వ్యాపించకుండా చేయడానికి సోవియట్ ప్రయత్నించింది."

"సామ్రాజ్యవాద యుద్ధం ప్రారంభం కావడంతో ప్రజల శాంతిసంఘటన విచ్ఛిన్నమైపోయినా, సోవియట్ యూనియన్ శాంతి సంఘటనకు పునాదిగావుండి బలపడుతూ యితర దేశాల ప్రజలతో ఐక్యమై ఫాసిజాన్ని నాశనం గావించడానికి తగిన పరిస్థితులకొరకు వేచివుంది. ప్రతి ప్రదేశంలోను కమ్యూనిస్టులు ప్రజా సంఘటనను తిరిగి పునరుద్ధరించడానికి సామ్రాజ్యవాదాన్ని నాశనం గావించి యుద్ధాన్ని అంతమొందించి ప్రజా శాంతిని కాపాడడానికి కృషిచేశారు."

"రెండవ ప్రపంచయుద్ధం మొదటి 22 నెలలలో జరిగిన బ్రహ్మాండమైన సంఘటనలు, పెట్టుబడిదారీ విధానంలోని సంక్షోభాన్ని తీవ్రపరచి పాలకవర్గాలలోనే తీవ్రసంక్షోభాన్ని కలుగజేశాయి. ప్రపంచమంతటా వైరుధ్యం వ్యాపించి పెద్ద సామ్రాజ్యవాద ప్రభుత్వాలన్నీ ఏదో ఒక పక్షంలోచేరిపోయాయి. సోవియట్‌పై యుద్ధాన్ని ప్రోత్సహించడానికి యెంతో తంటాలుపడిన బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ఫాసిజాన్ని సంతృప్తిపర్చడానికి పశ్చిమయూరప్‌లోని ప్రభుత్వాలను బలహీనపర్చారు.

ఆ ప్రభుత్వాలను పాసిజానికి లొంగిపోయేటట్లు చేశారు. ఆ దేశాలలోని ప్రజా వుద్యమాలను అణచి వేయడానికి సాయపడ్డారు. ఈ పాలసీలోని కుళ్లు, హిట్లరు నార్వే, డెన్మార్కు, హాలెండు, బెల్జియం, ఫ్రాన్సులపై దాడిసల్పినప్పుడు వెల్లడి అయింది. అంతర్గతంగా పాపిజమనే యీ కుళ్లు వుండడం వలననే ఆ దేశాలు ఓడిపోయాయి. పశ్చిమయూరప్ అంతటిపైన, అక్కటి పరిశ్రమలపైనా హిట్లరుకు పెత్తనం వచ్చింది."

"పశ్చిమరంగాన్ని ఈవిధంగా పూర్తిచేసుకుని హిట్లరు తూర్పున బాల్కన్లపైపుకు తిరిగాడు. ఇక్కడగూడా పాలకవర్గాలు బ్రిటిష్ అనుకూల - జర్మనీ అనుకూలముఠాలుగా చీలివున్నాయి. ప్రజలు సోవియట్ యూనియన్‌తో స్నేహంగా వుండి శాంతి అనుభవించాలని కోరుతున్నారు. హిట్లరు బాల్కన్లను ఆక్రమించవదలచాడు. బ్రిటిష్‌సామ్రాజ్యవాదులు అచట హిట్లరుకువ్యతిరేకంగా మరోరంగాన్ని తెరువదలచారు. వారు బ్రిటిష్ అనుకూల పాసిస్టు గ్రూపులను బలపరచి ప్రజలను అణచివేశారు. ఈవిధంగా ప్రజావుద్యమాన్ని అణచివేయడంవల్ల పాసిస్టు శక్తులే బలపడ్డాయి, హిట్లరే లాభం పొందాడు. రుమేనియాను ఆక్రమించాడు. బల్గేరియాను లోబరచుకున్నాడు ఆయుధబలంతో యుగోస్లోవియా, గ్రీసులను జయించాడు. అచట నాజీరాక్షసపాలన యేర్పరచాడు. బాల్కను దేశాలలోని హిట్లరు ఆధిపత్యం మధ్యప్రాచ్యంలోను, సూయజ్‌లోను బ్రిటిష్ సామ్రాజ్య వాదులకు ప్రమాదకరమైంది. యూరప్‌లోని హిట్లరు ఆధిపత్యం చరిత్రలో యిదివరకెన్నడూ లేనంతగా బ్రిటిష్, అమెరికా సామ్రాజ్యవాదులకు పెద్ద సవాలు అయింది. అందుచే బ్రిటిష్, అమెరికన్ సామ్రాజ్యవాదులు చేతులు కలిపి జర్మన్ పాసిజంతో పోరాడడానికి తయారయ్యారు. బ్రిటిష్, అమెరికన్ సామ్రాజ్య వాదులముఠా మొదటిదశలో తిన్న దెబ్బలవలన శత్రువుపై చొరవజేసి ముందు దెబ్బకొట్టే అవకాశాన్ని హిట్లరుకు కోల్పోయారు. అందుచేత వారు దీర్ఘకాల యుద్ధానికి సన్నాహాలు చేయప్రారంభించారు." ("ప్రపంచ ప్రజాయుద్ధమే భారతస్వాతంత్ర్యయుద్ధం" అనేగ్రంథమునుండి 9-14 పేజీలు)

## సోవియట్‌యూనియన్‌పై జర్మనీదాడి

### హిట్లరు ఎందుకు దాడిచేశాడు ?

బ్రిటిష్, అమెరికన్ సామ్రాజ్యవాదులకు హిట్లరు గొప్పదెబ్బ కొట్టాడేగాని యింకా వారిని యుద్ధంలో ఓడించలేదు. అంతేగాకుండా బ్రిటిష్, అమెరికన్ సామ్రాజ్యవాదులు హిట్లరును దీర్ఘకాల యుద్ధంలో యిరికించి తద్వారా అతన్ని ఓడించాలని ప్రయత్నిస్తున్నారు. ఆర్థికంగా యింకా బలముగానే వున్న బ్రిటిష్, అమెరికన్ ముఠాతో దీర్ఘకాలయుద్ధం సాగించడంలోని కష్టాలను హిట్లరు ఎరుగును. యూరప్పును జయించాడు గాని అసంతృప్తితో కుములుతున్న పాదాక్రాంతమైన యూరప్‌దేశాల అగ్ని పర్వతంపై అతడు కూర్చున్నాడు. యూరప్‌దేశాల పరిశ్రమలను హస్తగతం చేసుకున్నాడుగాని వాటికితగిన ముడిసరుకులు లేవు. అంతేగాకుండా తనని యెదిరిస్తున్న బ్రిటిష్, అమెరికన్ సామ్రాజ్య వాదులతో చీలిక గానివచ్చి వారి దీర్ఘకాలపు యుద్ధసన్నాహాలను విచ్ఛిన్నం గావించడం హిట్లరుకు అన్నిటికంటె ముఖ్య అవసరం. ఈ అవసరాలన్నిటిని సోవియట్‌పై దాడివెడలుటతో తీర్చుకోవాలని అతడు ఆశించాడు. విప్లవ కేంద్రాన్ని నాశనంగావించి యూరప్‌లోని ప్రజలలో పూర్తి నిరుత్సాహాన్ని వ్యాపింపజేసి అప్పటి తన విజయాలను స్థిరపర్చుకోవచ్చునని తలచాడు. సోవియట్ యూనియన్



లోని బ్రహ్మాండమైన గోధుమ, బొగ్గు, నూనెకేంద్రాలను ఆక్రమించి యూరపులోని తన పరిశ్రమలను బలపర్చుకోవాలని ఆశించాడు. తాను సోవియట్‌పై దాడి వెడలుటవలన బ్రిటనులోని పాసిస్టు అనుకూల సామ్రాజ్యవాద ముఠాలను తనవైపుకు త్రిప్పుకుని తనతో యుద్ధంసాగించాలనే సమస్యపై బ్రిటిష్ పాలకవర్గంలో పెద్ద చీలికతేవాలని, తద్వారా బ్రిటను-అమెరికాల మధ్యకూడా చీలిక వస్తుందని ఆశించాడు.

### నూతన పరిస్థితులు :

సోవియట్‌పై జర్మనీ దాడిచేయడంతో నూతన పరిస్థితులేర్పడ్డాయి. సోవియట్ యూనియన్ను జయించి ప్రపంచముపై తన అధిపత్యమును స్థిరపర్చుకోడానికి, ప్రపంచ ప్రజలందరిని పాసిస్టు దాస్యములో ముంచడానికి హిట్లరు ఆశించాడు.

సోవియట్‌పై దాడితో చైనా, అమెరికా, భారతదేశ ప్రజలకుగూడ పాసిస్టు వుపద్రవము హెచ్చింది. చైనా యుద్ధరంగాన్నుండి దక్షిణ సముద్రాలపై దూకడానికి జపానుకు సోవియట్‌పై జర్మనీ దాడిచేయడంవలన అవకాశం యేర్పడింది. ఫిలిప్పైన్, మలయా, బర్మా, డచ్చి యీస్టిండీస్ దీవుల ప్రజలు జపాను పాసిజానికి గురిఅయ్యారు. భారతదేశ సరిహద్దులలోనికి వచ్చి కూర్చోవడం వలన భారతదేశ ప్రజలు జపాన్ పాసిజానికి గురిఅయ్యే ప్రమాదం హెచ్చింది. దక్షిణసముద్రాలలోని జపాను విజయాలు చైనా, అమెరికా ప్రజలకు, మరింత పాసిస్టు ప్రమాదాన్ని హెచ్చించాయి.

ఈవిధంగా నాజీ సామ్రాజ్యవాదం, దాని మిత్రులు (ఇటలీ, జపాను) మానవజాతి కంతకూ శత్రువులుగా విడిపోయారు. సోవియట్‌ను జర్మనీ ఓడించితే పాసిస్టు బానిసత్వం ప్రపంచమంతటా తాండవమాడే ప్రమాదం యేర్పడింది.

ఇంతవరకు యుద్ధం ప్రపంచాన్ని బానిసత్వములో వుంచాలనే రెండు సామ్రాజ్యవాద ముఠాల మధ్యనే జరిగింది, అప్పుడు ఏ ముఠా గెలిచినా ప్రజలకు సంభవించేది బానిసత్వమే. అందుచే యుద్ధాన్ని విప్లవ ప్రజాపోరాటంద్వారా అంతంజేసి ప్రజాశాంతిని నెలకొల్పే ప్రజా ప్రభుత్వాలను స్థాపించడమే ప్రజల ప్రధాన కర్తవ్యమయింది. సోవియట్‌పై హిట్లరు దాడితో ప్రపంచాన్నంతా బానిసత్వంలో ముంచజూస్తున్న పాసిస్టు పక్షానికి వ్యతిరేకంగా పోరాడి యుద్ధంలో ప్రజావిజయాన్ని సంపాదించడం ప్రపంచ ప్రజలందరి ముఖ్యకర్తవ్యముగా మారింది. ప్రపంచ ప్రజలందరూ పాసిస్టు కూటమికి వ్యతిరేకంగా ఐక్యమై పోరాడవలసిన అవసరంవచ్చింది. సోవియట్‌పై హిట్లరు గావించిన దాడితో అలాంటి ఐక్యత రాకుండా యిదివరకు బ్రిటిష్, అమెరికన్ సామ్రాజ్యవాదులు గావిస్తున్న అడ్డంకులు పూర్తిగా తొలగింపబడ్డాయి. బ్రిటన్‌లోను, అమెరికాలోను హిట్లరుకు అనుకూలురు, సోవియట్‌తో సహకారం చేయడానికి వ్యతిరేకులుగావున్న ముఠాల పలుకుబడి తగ్గిపోయింది. పాసిస్టుపక్షానికి వ్యతిరేకంగా సోవియట్‌తో బ్రిటన్, అమెరికాలకు సంధికుదిరింది. దీనితో సామ్రాజ్య వాద యుద్ధారంభములో తాత్కాలికంగా విచ్ఛిన్నమైన ప్రపంచ ప్రజల పాసిస్టు వ్యతిరేక సంఘటన మరల అనేకరెట్లు బలోపేతంగా పునరుద్ధరింపబడింది. పాసిస్టుపక్షానికి వ్యతిరేకంగా ప్రపంచప్రజలకు ప్రపంచం మొత్తంమీద ఐక్యత యేర్పడింది. సోవియట్ నాయకత్వంక్రింద నడుస్తూవున్న ప్రపంచ ప్రజలు, బానిసప్రజలు, జర్మనీ, ఇటలీ, జపాన్, ఆష్ట్రియా ప్రజలతోసైతం కూడిన సంయుక్త

సంఘటన యేర్పడింది. ఫాసిస్టు వ్యతిరేక యుద్ధాన్ని ప్రపంచ ప్రజా స్వాతంత్ర్య యుద్ధంగా జయించ దానికి అవకాశ మేర్పడింది.

సోవియట్‌పై హిట్లరు దాడితో యేర్పడ్డ పై నూతన పరిస్థితుల ఫలితంగా ప్రపంచమంతా ఇటలీ, జర్మనీ, జపాన్‌లతోకూడిన ఫాసిస్టుపక్షంగాను, సోవియట్ యూనియన్, చైనా, అమెరికా, బ్రిటన్ ప్రజల నాయకత్వంక్రింద యేర్పడ్డ ప్రపంచప్రజాపక్షముగాను చీలిపోయింది. యుద్ధం యీ రెండు పక్షాలమధ్య జరుగుతోంది. సామ్రాజ్యవాద యుద్ధమల్లా ప్రజాయుద్ధంగా మారిపోయింది.

ఈ రెండు పక్షాల యుద్ధాశయాలేమిటి? ఫాసిస్టు ముఠాఆశయం ప్రపంచపెత్తనం వహించడం; ప్రపంచాన్నంతనీ బానిసత్వంలో పడద్రోయడం. ప్రజాపక్షం ఆశయమేమిటి? ఫాసిజాన్ని నాశనం గావించడం, ప్రపంచాన్ని విముక్తిగావించి ప్రజారాజ్యాలను యేర్పరచడం. అందుచేత ప్రపంచప్రజలు ప్రజాపక్ష విజయంకొరకు కృషిజేయాలి. తద్వారానే తమ స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకోవడంగాని, బానిసత్వమునుండి విముక్తిపొంది స్వాతంత్ర్యం సంపాదించుకోవడంగాని సాధ్యమౌతుంది. యుద్ధంలో తటస్థంగా వుండటమంటే ప్రజాపక్షాన్ని బలహీనపర్చడం, పరోక్షంగా ఫాసిస్టుపక్షాన్ని గెలిపించడానికి తోడ్పడమౌతుంది. అందుచేత యీ యుద్ధంలో ప్రజలు తటస్థంగా వుండటమంటే తమస్వాతంత్ర్యం కొరకు జరుపబడే పోరాటమునకు ద్రోహముచేసినట్లే అవుతుంది.

ప్రజాపక్షంలో ప్రజలతోపాటు బ్రిటిష్, అమెరికన్ సామ్రాజ్యవాదులుగూడ వున్నారు. వారు తమ ప్రపంచ పెత్తనం నిలబెట్టుకోవాలనే ఆశలు యింకా విరమించుకోలేదు సోవియట్ యూనియన్ తోను, ప్రజలతోను కలసి ఫాసిజానికి వ్యతిరేకంగా యుద్ధము గావిస్తున్నా తమ ప్రపంచాధిక్యమును తిరిగి సంపాదించాలనే తంటాలు పడుతున్నారు. ఈ ఆశయాలుండుటచేతనే వారు ప్రజలకు వ్యతిరేకమైన పాలసీలు, (భారతదేశానికి స్వాతంత్ర్యం యివ్వకపోవడం వగైరా) యుద్ధకాలాన్ని పొడిగించే అభివృద్ధినిరోధక పాలసీలు (రెండవరంగాన్ని తెరవకపోవడం వగైరా) అవలంబిస్తున్నారు.

కాని ప్రజాయుద్ధం వృద్ధిపొందుతోన్నకొద్దీ ప్రజాస్వామ్య దేశాలలోని ప్రజలంతా సైనిక, రాజకీయ, ఆర్థిక విషయాలన్నిటిలోను సోవియట్ ఫాసిస్టు వ్యతిరేకశక్తులకు నాయకత్వం వహించడం చూస్తున్నారు. తమ సామ్రాజ్యవాద పాలకులు అవలంబించే పద్ధతులు యెలా అభివృద్ధినిరోధక పద్ధతులో త్వరత్వరగా గ్రహిస్తున్నారు. అలాంటి అభివృద్ధినిరోధక పద్ధతులు అవలంబించే ప్రజా విరోధులను, ఫాసిస్టు అనుకూల వ్యక్తులను తొలగించి వారిస్థానే ప్రజల యిష్టానుసారం ప్రజా యుద్ధ ఆశయాలను నెరవేర్చే వారిని ప్రవేశపెట్టమని ప్రభుత్వంమీద ప్రజావత్తిడి నానాటికి హెచ్చుతోంది. ప్రజాపక్షములోని సామ్రాజ్యవాదుల అభివృద్ధి నిరోధకపంథాకు వ్యతిరేకంగా ప్రజాపాలసీలు అవలంబించేటట్లు ప్రజలు చేయగల్గుచున్నారు. కొన్ని ప్రజావిజయాలుగూడ సంపాదించగల్గారు.

అయిననూ ప్రజాపక్షములోని సామ్రాజ్యవాదులు యింకా పూర్తిగా ఓడించబడలేదు. వాళ్ళ అభివృద్ధి నిరోధక పాలసీలకు వ్యతిరేకంగా ప్రజలను ఎంతవరకు సమీకరించి ఐక్యపర్చగల్గుతామో అంతత్వరగా ఫాసిస్టులను ఓడించి ప్రజలకు స్వాతంత్ర్యాన్ని తీసుకురాగల్గుతాము. అప్పుడే ప్రజాపక్షం అవిచ్ఛిన్నమైన ప్రజాఐక్యతతోకూడుకొని వుంటుంది; అప్పుడే ఫాసిజాన్ని నాశనంచేయడంతోపాటు సామ్రాజ్యవాదాన్నిగూడ పూర్తిగా నిర్మూలించడానికి, ప్రజారాజ్యాలను యేర్పరచడానికి అవకాశం వుంటుంది. అందుచేత ప్రజాపక్షంలోని సామ్రాజ్యవాదులు తమకోర్కెల నీడేర్చుకోవడానికి తంటాలు



పడుతున్నా అవి భగ్నము అవుతాయి. అయితే వాటంతటవే భగ్నముగావు. ప్రజాపక్షములోని ప్రజలు యెంత త్వరగా ఐక్యమై భగ్నముచేయడానికి పూనుకుంటారో అంతత్వరగా సామ్రాజ్యవాదుల కుట్రలను భగ్నంగావించి ప్రజావిజయాన్ని, శాంతిని గడించడానికి అవకాశముంది.

సోవియట్‌పై జర్మనీ దాడిచేయడంతో పైవిధమైన మార్పులు గల్గాయి. ప్రపంచప్రజలందరూ యుద్ధము తమదిగా భావించి ఫాసిజాన్ని రూపుమాపడానికి సోవియట్‌యూనియన్ నాయకత్వాన పోరాడుచున్నారు. నాజీ ఆక్రమితదేశాల్లో గూడ అభివృద్ధికోరే ప్రజలంతా ఐక్యమై ఫాసిస్టుప్రభుత్వాలకు వ్యతిరేకంగా పోరాడుచూ వాటిని అంతంజేయాలని కృషిజేస్తున్నారు. సోవియట్‌ప్రజల రెడ్‌ఆర్మీయొక్క వీరోచిత ప్రతిఘటన, రెడ్‌ఆర్మీ సాధించే విజయాలు, నాజీఆక్రమిత దేశప్రజలలో విప్లవజ్వాలలను రగుల్కొల్పుతూ వారిలో యిదివరకు వ్యాపించిన నిరుత్సాహం, నిస్పృహలను పారద్రోలుచున్నాయి. ఇదివరకెన్నడూ ఆదేశాలలో లేని ప్రజాఐక్యత ఫాసిస్టులను దునుమాడుటకు, తమ దేశాలల్లో ప్రజారాజ్యాలను స్థాపించుకోడానికి, నిర్మింపబడుతోంది. నాజీ ఆక్రమితదేశాలలోని ప్రజాఐక్యతా వుద్యమాలు నానాటికి అభివృద్ధి అవుతూ సోవియట్‌యూనియన్‌తో సంపూర్ణ సహకారాన్ని అపేక్షించుతూ వున్నాయి. ఈ వుద్యమాలకు కమ్యూనిస్టుపార్టీలు నాయకత్వం వహించి పనిజేస్తున్నాయి. అందుచేత నాజీఆక్రమితదేశాలలోని ప్రజలు తమ దేశాలను ఫాసిస్టు దాస్యానికి గురిగావించిన నాజీరాక్షసమూకను రూపుమాపడమే గాకుండా, ప్రజాభీష్టాలకు, కోర్కెలకు వ్యతిరేకంగా ప్రవర్తించుతూ అభివృద్ధినిరోధకపంథా అవలంబిస్తున్న తమ పక్షములోని సామ్రాజ్యవాదులనుగూడ పలుకుబడి లేకుండాచేసి సోవియట్‌యూనియన్ సహకారంతో ప్రజాశాంతిని నెలకొల్పి ప్రజాకోర్కెలను యీడేర్చగల ప్రభుత్వాలను స్థాపించడం ఆశయంగా గల్గియున్నారు.

ఈ విధంగా ప్రపంచములోని ప్రజలు ప్రజాపక్షాన జేరి యుద్ధములో ఫాసిజాన్ని రూపుమాపడానికి, సోవియట్ యూనియన్‌తో సహకారముతో మెలగే ప్రజారాజ్యాలను స్థాపించడానికి కృషిజేస్తున్నారు. ఈ ఆశయంతో యుద్ధం తమదిగా భావించి 100 కోట్లమంది ప్రజలు ఫాసిస్టుపక్షానికి వ్యతిరేకంగా పోరాడుచున్నారు. అందుచేత యీ యుద్ధం ప్రజాయుద్ధంగా మారింది.

ప్రపంచంలో యేర్పడ్డ నూతన పరిస్థితులను భారత కమ్యూనిస్టుపార్టీ అంతర్జాతీయంగానే గ్రహించిందిగాని వెంటనే వాటిని భారతదేశానికి అన్వయింపజేసి నూతన పరిస్థితులకు తగిన కార్యక్రమము యివ్వజాలకపోయింది. భారతదేశానికిగూడ ప్రజాయుద్ధమేనని తెలుసుకోడానికి భారత కమ్యూనిస్టుపార్టీకి సోవియట్‌పై జర్మనీ దాడిచేశాక 6 నెలలు పట్టింది. అప్పటివరకు యూరప్‌దేశ ప్రజలకు, చైనా ప్రజలకు మాత్రం ప్రజాయుద్ధమని, బానిసదేశ ప్రజలకు సామ్రాజ్యవాద యుద్ధమేననే జాతీయ బూర్జువా వైఖరినే అవలంబించింది. అందుచేత అప్పటివరకూ యుద్ధవ్యతిరేక కార్యక్రమమును (యుద్ధఫండులను వ్యతిరేకించుట, సైన్యాలకు రిక్రూట్‌మెంటును నిరోధించుట వగైరా) సాగిస్తూనేవుంది.

భారత కమ్యూనిస్టుపార్టీ 6 నెలలవరకు భారతదేశానికి ప్రజాయుద్ధమని యెందుకు గ్రహించజాలక పోయింది? యుద్ధంలో వచ్చిన మార్పును కమ్యూనిస్టులుగాగాక అతివాద జాతీయ దృక్పథంతోనే పరిశీలించడంవలన అలా జరిగింది. దీనికి కారణం ప్రజల్లోవున్న బ్రిటిష్ వ్యతిరేకతయొక్క ప్రభావం కమ్యూనిస్టులపైగూడ పడింది. భారతదేశ ప్రజలు, రాజకీయపార్టీలు 50 సంవత్సరాల

నుండి బ్రిటిష్ వ్యతిరేక పోరాటం సాగిస్తూవున్నారు. బ్రిటిష్ వ్యతిరేక పోరాటమే భారతదేశ స్వాతంత్ర్య పోరాటముగా భారత ప్రజలకు యింతవరకు తెలిసిన విషయం; అందుచేత బ్రిటిషు ప్రభుత్వం వున్నపక్షాన యుద్ధంలో పాల్గొనడంద్వారా తమ స్వాతంత్ర్యం వస్తుందని ప్రజలు నమ్మడం లేదు. యుద్ధానికి సహాయం చేయడంఅంటే బ్రిటిష్ ప్రభుత్వాన్నే బలపరచడమని, స్వాతంత్ర్య పోరాటానికి హానిచేయడమని ప్రజలు తలుస్తున్నారు. ప్రజలలోనున్న యీ బ్రిటిష్ వ్యతిరేక అభిప్రాయముల ప్రభావమే ప్రజల్లో ఒకభాగమైన కమ్యూనిస్టుపార్టీపై గూడ పడింది. ఈ తీవ్ర జాతీయ తత్వమునుండి బయటబడి కమ్యూనిస్టులలాగ ఆలోచించి నూతనపరిస్థితులలో స్వాతంత్ర్య పోరాటానికి నూతన కార్యక్రమము యివ్వడానికి ఆరునెలలు పట్టింది.

## భారత దేశానికిగూడ ప్రజాయుద్ధమే :

సామ్రాజ్యవాదయుద్ధాన్ని మనం, తదితర ప్రపంచ ప్రజలందరితోపాటు అన్నివిధాలా వ్యతిరేకించాము. సామ్రాజ్యవాదియుద్ధానికి సాయంచేయడంవలన మనకు లభించేదేమీలేదు. సామ్రాజ్యవాదయుద్ధంలో యెవరు గెలిచినా ప్రజలకువచ్చేది బానిసత్వమేగాబట్టి దానికి సాయంచేయడంవలన ప్రజలకు అంతానష్టమే. కాని సామ్రాజ్యవాదయుద్ధం ప్రజాయుద్ధంగా మారినప్పుడు, యుద్ధంలో ప్రజాపక్షం గెలిస్తే ప్రపంచప్రజలందరికీ స్వాతంత్ర్యం లభించేటప్పుడు, ఫాసిస్టుపక్షం గెలిస్తే ప్రపంచమంతటిలో ఫాసిస్టు క్రూరబానిసత్వం యేర్పడేటప్పుడు మనం యుద్ధానికి దూరంగావుండలేము: సామ్రాజ్యవాద యుద్ధకాలములోవలె యుద్ధాన్ని వ్యతిరేకించడమంటే ప్రజాపక్షాన్ని ఓడించడానికి, ఫాసిస్టుపక్షాన్ని గెలిపించడానికి తోడ్పడడమన్నమాట. 160 కోట్ల ప్రజలు యుద్ధంలో విజయాన్ని సంపాదించడం తమ స్వాతంత్ర ములను రక్షించుకోవడమని భావిస్తూ వున్న ప్పుడు, యుద్ధాన్ని మన వ్యతిరేకించుటద్వారా మన స్వాతంత్ర్యాన్ని గడించగల్గుతామని తలంచడం భ్రమ. ఎందుచేతనంటే యుద్ధం మాది అని భావించి యుద్ధాన్ని గెలవడానికి పూనుకొని పనిజేస్తున్న 160 కోట్ల ప్రజలు మనస్వాతంత్ర్య పోరాటానికి వ్యతిరేకమౌతారు. ఆ పరిస్థితుల్లో బ్రిటిష్ సామ్రాజ్యవాదం మన స్వాతంత్ర్యపోరాటాన్ని సులభంగా అణచివేయగల్గుతుంది.

అందుచేత భారతదేశ స్వాతంత్ర్యపోరాటాన్ని యుద్ధంలో ప్రజలపక్షాన పాల్గొనడముద్వారానే ప్రస్తుత పరిస్థితులలో కొనసాగించగల్గుతాం. ఈ యుద్ధాన్ని ప్రజలపక్షం జయించడానికి పూర్తిగా తోడ్పడుటద్వారానే, కృషిజేయుటద్వారానే మన స్వాతంత్ర్యాన్ని స్థాపించుకో గల్గుతాము. అంతేగాకుండా భారతజాతీయ స్వాతంత్ర్యంకోసం పోరాడడానికి, యిదివరకువలె ఒంటరిగా గాక, ప్రపంచ స్వాతంత్ర్యయుద్ధములో భాగముగా పోరాడడానికి ఈ యుద్ధం చక్కనిఅవకాశం. ప్రపంచ స్వాతంత్ర్య యుద్ధములోనే భారత స్వాతంత్ర్యం వుంది. బయట వున్నదల్లా ఫాసిజంక్రింద బానిసత్వం మాత్రమే.

భారతదేశ జాతీయోద్యమము యెప్పుడూ ఫాసిజాన్ని ఖండిస్తూనే వచ్చింది; ఫాసిస్టు వ్యతిరేక పోరాటంలో ప్రజలపక్షానవుండి పోరాడడమే ఆశయముగా వుంటూవుంది. మనకు దూరముగావుండి మన సానుభూతిని పొందదగ్గవారైన, స్వాతంత్ర్యాన్ని ప్రేమించే జాతులకు మాత్రమే నేడు ఫాసిజం ప్రమాదంగాలేదు. ఫాసిజం నేడు మనసరిహద్దులదాకా వచ్చింది. జపాను దురాక్రమణదారులు మన దేశ సరిహద్దులలో పొంచి కూర్చోవడంవలన యిదివరకు మాదిరిగా ఫాసిజము భారతదేశ మిత్రుల విరోధిమాత్రమేగాదు; నేడు అది భారతదేశాన్ని ఫాసిస్టుదురాక్రమణకు గురిజేసి అతి నికృష్టమైన



ఫాసిస్టు బానిసత్వంలో ముంచజూస్తున్న భారతదేశానికే ప్రబల శత్రువుఅయింది. మనం యిదివరకే సామ్రాజ్యవాదుల బానిసత్వంక్రింద మ్రగ్గుతున్నాం. యిప్పుడు సామ్రాజ్యవాదులలో నికృష్టరూపమైన ఫాసిజం క్రింద యింకా తీవ్రమైన బానిసత్వం మనపైకి వచ్చేప్రమాదం యేర్పడింది అందుచే ఫాసిజానికి వ్యతిరేకంగాజరుపబడే ప్రపంచయుద్ధం మన జాతీయరక్షణకొరకు జరుపబడే యుద్ధమేఅయింది.

మన ప్రజల ప్రయోజనాలు, మన దేశరక్షణ, మన జాతీయ స్వాతంత్ర్యము - యివన్నీ యీ యుద్ధాన్ని తదితర ప్రపంచ ప్రజలవలె మనదిగా స్వీకరించి, మనదిగా పోరాడటంలో యిమిడి వున్నాయి. ఇదిఒక్కటే మన భారత ప్రజలకు నిజమైన జాతీయమార్గం. సామ్రాజ్యవాద యుద్ధ కాలములోవలె యుద్ధాన్ని వ్యతిరేకించడము స్వాతంత్ర్యం సంపాదించుటకు మార్గంగాదు: స్వాతంత్ర్యం రాకపోగా జపాను ఫాసిస్టుల పని చేసిపెట్టినవారమౌతాం. మన గొంతుకలను మనమే కోసికోవడమౌతుంది. బ్రిటిష్ సామ్రాజ్యవాదుల క్రింద బానిసలుగావున్నాము గనుక యీ యుద్ధానికి దూరముగా కూర్చోవాలనడం సరియైన పంథాగాదు. ఈ యుద్ధంలో తటస్థవిధానం భారత స్వాతంత్ర్యాన్ని సాధించదు, పైగా జపాను ఫాసిజంక్రిందకు భారతదేశం పోవడానికి తోడ్పడము అవుతుంది. అందుచేత ప్రపంచ ప్రజలందరికివలెనే యీ యుద్ధం భారతదేశానికిగూడ ప్రజాయుద్ధమే; యీ యుద్ధంలో ప్రజాపక్షాన పాల్గొంటూనే మన స్వాతంత్ర్యాన్ని నిరోధిస్తున్న బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో పోరాడుతూ వుండాలి. ప్రస్తుత పరిస్థితుల్లో బ్రిటిషు ప్రభుత్వంతో మన స్వాతంత్ర్యంకొరకు జరిపే పోరాటం యుద్ధ ప్రయత్నాలను వ్యతిరేకించేదిగా వుండరాదు: యుద్ధ ప్రయత్నాలను పెంపొందించుతూ ,ప్రజాశక్తిని, ప్రజా ఐక్యతను పెంపొందించేదిగా వుండాలి. యుద్ధ ప్రయత్నాలను వ్యతిరేకించే యే వుద్యమమైనా ప్రజలశక్తిని, ప్రజల ఐక్యతను పెంపొందించజాలదు. బ్రిటిషు ప్రభుత్వ నిరంకుశత్వాన్నే బలపర్చేదిగా తయారౌతుంది. భారతదేశ స్వాతంత్ర్య పోరాటానికి ప్రపంచ ప్రజల సానుభూతిని గోల్పోయి వారిని వ్యతిరేకులుగా జేసుకొనేదిగా తయారౌతుంది.

భారతదేశ స్వాతంత్ర్య పోరాటాన్ని యీ నూతన ప్రపంచ పరిస్థితుల్లో అభివృద్ధి చేయడానికి భారత కమ్యూనిస్టుపార్టీ యీ క్రింది కార్యక్రమాన్ని యిచ్చింది:

## కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమము :

కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమము అంతా యీ యుద్ధాన్ని ప్రజల స్వాతంత్ర్య యుద్ధంగా భావించి పనిజేయడంపై ఆధారపడివుంది. దేశరక్షణను జయప్రదంగా సాగించేందుకు, ఫాసిస్టు ఉపద్రవాన్నుండి దేశాన్ని రక్షించేందుకు, జాతీయ ప్రభుత్వాన్ని సాధించడానికి ప్రజలనందరినీ సమీకరించి ఐక్యపర్చడము పార్టీ కార్యక్రమముయొక్క ముఖ్య సారాంశమైవుంది. దేశరక్షణకొరకు కృషిజేస్తూ జాతీయైక్యతకొరకు పనిజేయడమే నేడు స్వాతంత్ర్య పోరాటమును కొనసాగించేమార్గము.

బ్రిటిష్ సామ్రాజ్యవాదం భారతదేశ ప్రజలను బానిసలుగా వుంచాలనే వుద్దేశ్యంతోనే యుద్ధాన్ని కొనసాగించుతూ వున్నమాటనిజమే. ఆ వుద్దేశ్యంతోనే యుద్ధనిర్వహణాధికారం, దేశరక్షణ బాధ్యతలను ప్రజలకు అప్పగించడానికి నిరాకరిస్తోంది. బానిసలుగానే ప్రజలను యుద్ధకార్యాల్లో పాల్గొనమంటోంది. అందుచేత జాతీయప్రభుత్వాన్ని స్థాపించేంతవరకు, స్వాతంత్ర్యాన్ని యిచ్చేంతవరకు యుద్ధంలో పాల్గొనడానికి నిరాకరించడంగాని, జాతీయప్రభుత్వం తెచ్చుకొనేందుకు యుద్ధవ్యతిరేక కార్యాలలో నిమగ్నులమగుటగాని నేడు స్వాతంత్ర్య పోరాట మార్గంగాదు. మన స్వాతంత్ర్యం

సామ్రాజ్యవాదులచే ప్రసాదించబడదు. సామ్రాజ్యవాదులు తమంతటతామే లొంగరు. వారు దయదలచే దాకా, జాతీయప్రభుత్వం వారు ఏర్పరచేదాక ప్రజాయుద్ధాన్ని నడపమని తిరస్కరించడం మన స్వాతంత్ర్య పోరాటమును నడుప తిరస్కరించడమే; ప్రజాయుద్ధంద్వారా భారతదేశ స్వాతంత్ర్య సంపాదనకు గల్గిన సదవకాశాలను జారవిడవడమే. అందుచేత భారతదేశాన్ని రక్షించుకోవాలంటే, రాజకీయ పార్టీలన్నీ కలసి ఐక్యమై జాతీయప్రభుత్వాన్ని సంపాదించాలి. రాజకీయపార్టీలన్నీ ఐక్యమై దేశరక్షణకు పూనుకుంటే అట్టి ప్రజాశక్తిముందు సామ్రాజ్యవాదులు మోకరిల్లకతప్పదు. జాతీయప్రభుత్వాన్ని యేర్పరచక తప్పదు.

దేశరక్షణ కార్యాలల్లో పాల్గొనడంద్వారానే ప్రజలను రక్షించడంగాని, దేశాన్ని రక్షించడంగాని జరుగుతుంది: దేశరక్షణకు వ్యతిరేకమైన చర్యలన్నీ ప్రజలకు హానికల్గించేవి: జపాన్ ఫాసిస్టుల కనుకూలమార్గం ఏర్పరచేవి. అందుచేత ప్రజలను ఐక్యపర్చడానికి, ప్రజాసంఘటనను బలిష్టము గావించడానికి, జాతీయైక్యతను సాధించడానికి నేడు దేశరక్షణ కార్యాలను బలపర్చడమే మార్గం. దేశరక్షణను బలహీనపర్చేపనులు ప్రజల ఐక్యతను, సంఘటననుగూడ బలహీనపర్చుతాయి. తత్ఫలితంగా స్వాతంత్ర్య పోరాటం బలహీనపడిపోతుంది. కాన నేడు దేశరక్షణ కార్యాలను బలపర్చడానికి ప్రజలను ఐక్యపర్చడం, సంఘటనపర్చడమే స్వాతంత్ర్య పోరాటము. ప్రజాఐక్యత, సంఘటన అభివృద్ధి అయినకొలదీ బ్రిటిష్ సామ్రాజ్యవాదం బలహీనపడుతుంది. యుద్ధానంతరం సోవియట్ విజయాల ఫలితంగా, అంతర్జాతీయ ప్రజల స్వాతంత్ర్య పోరాటాల ఫలితంగా యేర్పడే అనుకూల వాతావరణములో ఐక్య భారతదేశం, ప్రజాశక్తి సంఘటనలను యిదివరకెన్నడూ లేనట్లుగా అభివృద్ధి చేసుకున్న భారతదేశానికి బ్రిటిష్ సామ్రాజ్యవాదమునుండి స్వాతంత్ర్యాన్ని గుంజుకునేశక్తి వుంటుంది: జపాను ఫాసిస్టు వుపద్రవాన్నుండి భారతదేశాన్ని రక్షించుకోవడమేగాక, బ్రిటిష్ సామ్రాజ్యవాదము నుండి విముక్తిపొంది స్వతంత్ర భారతదేశాన్ని నెలకొల్పగల్గుతాము.

అందుచేత దేశరక్షణను బలపర్చుతూ జాతీయైక్యతను, ప్రజా సంఘటనను అభివృద్ధి జేసుకోవడమే నేడు భారతదేశ స్వాతంత్ర్య పోరాటమార్గమని కమ్యూనిస్టుపార్టీ వెల్లడించింది. జాతీయైక్యతలేనిది దేశరక్షణను జయప్రదంగా సాగేటట్లు చేయడముగాని, ప్రజా సంఘటనను, ప్రజాశక్తిని అభివృద్ధి జేసుకోవడంగాని సాధ్యంగాదు. అందుకుగాను జాతీయైక్యతను సాధించడానికి, రాజకీయ పార్టీలన్నిటిని ఐక్యపర్చడానికి కమ్యూనిస్టుపార్టీ కృషిజేస్తోంది. ప్రధాన రాజకీయపార్టీలైన కాంగ్రెసు-ముస్లిమ్‌లీగులు ఐక్యమైనప్పుడు జాతీయైక్యతను సాధించడము చాల సులభం. కాంగ్రెసు - లీగు ఐక్యతయే జాతీయైక్యతకు పునాదిగాతీసుకొని ధానికొరకై కమ్యూనిస్టుపార్టీ కృషిజేస్తోంది. కాంగ్రెసు-లీగు ఐక్యతను సాధించడానికి ఒకటే మార్గముంది ముస్లిమ్ జాతుల స్వయంనిర్ణయ హక్కును కాంగ్రెసు అంగీకరిస్తే యిదివరకెన్నడూలేని జాతీయైక్యత నేడు సాధ్యమౌతుంది కాంగ్రెసు ముస్లిం జాతుల స్వయంనిర్ణయ హక్కును అంగీకరించడం అంటే దేశాన్ని రెండు ఖండాలుగా చీల్చడమని, యింతవరకు సాధించిన జాతీయైక్యతను బలహీనపర్చడమని కొందరిలో దురభిప్రాయములున్నాయి. కాని యివి ఆధారరహితమైనవి. నేడు ముస్లిమ్ ప్రజాసామాన్యంలో జాతీయ చైతన్యం అభివృద్ధి పొంది తమ జాతుల స్వతంత్ర జాతీయ పరిపూర్ణతను కాంక్షిస్తున్నారు. బ్రిటిషు ప్రభుత్వం తమ జాతుల సంపూర్ణ వికాసానికి అడ్డంకుగావుందని గూడ గుర్తించారు. కాని కాంగ్రెసుతో కలసి బ్రిటిషు ప్రభుత్వంతో పోరాడడానికి యింకా కొన్ని సందేహాలు వారిలోవున్నాయి. కాంగ్రెసువారి



జాతుల స్వయంనిర్ణయ హక్కును సంపూర్ణంగా అంగీకరించనందున యీ సందేహాలు కలుగుచున్నాయి. ఈ పరిస్థితుల్లో దేశములో పెద్ద రాజకీయసంస్థఅయిన కాంగ్రెసు ముస్లిమ్‌జాతుల, స్వయం నిర్ణయ హక్కును సంపూర్ణంగా గుర్తించి, వారినందరినీ స్వాతంత్ర్య పోరాటములోనికి తీసుకురావడానికి పూనుకొంటే దేశములో యిదివరకెన్నడూలేని జాతీయైక్యత సాధింపబడుతుంది. బ్రిటిషు ప్రభుత్వాన్నుండి జాతీయ ప్రభుత్వాన్ని సాధించడానికి, దేశరక్షణను బలపర్చడానికి సమిష్టిగా కాంగ్రెసు, ముస్లిమ్-లీగు తదితర రాజకీయపార్టీలు, కలసి సాగించే ప్రజాసమీకరణ, ప్రజాసంఘటనల ద్వారా ఒకరిపై ఒకరికి వుండే అనుమానాలు తొలగిపోతాయి. స్వాత్యంత్ర పోరాటములో సాగించిన ఐక్యతను స్వాతంత్ర సంపాదనానంతరంగూడ ప్రజలు నిలబెట్టుకోగల్గుతారు. అందుచేత ముస్లిమ్ జాతుల స్వయం నిర్ణయహక్కును గుర్తించడంద్వారా దేశంలో యెన్నడూలేని ప్రజాఐక్యత, సంఘటన యిప్పుడు వస్తుంది; స్వాతంత్ర పోరాటం ఉన్నతస్థాయికి వెళ్ళుతుంది. స్వాతంత్రం సాధించిన తరువాత, దాన్ని సాధించిన ఐక్యత దాన్ని నిలబెట్టుకోడానికి, సంపూర్ణంగా అనుభవించడానికి యింకా పెంపొందింప బడుతుందిగాని విచ్ఛిన్నంగాదు. దేశం ముక్కలు ముక్కలుగా భాగింపబడడం జరుగదు. ముందెన్నడూలేని ఐక్యత నెలకొల్పబడుతుంది. సోవియట్‌రష్యాయే యిందుకు తార్కాణము.

దేశరక్షణను బలపర్చుతూ జాతీయైక్యతను సాధించడానికి, ప్రజాశక్తిని, ప్రజాసంఘటననూ అభివృద్ధి గావించడానికి, తద్వారా దేశ స్వాతంత్ర్య సంపాదనకొరకు కమ్యూనిస్టుపార్టీ ప్రస్తుత పరిస్థితుల్లో యీ క్రింది కార్యక్రమాన్ని యిచ్చింది:

యుద్ధం మనదేశ సరిహద్దులలోనికి రావడంతో దేశములోని స్థితిగతులు తారుమారయ్యాయి. క్షామపరిస్థితులు యేర్పడ్డాయి. ప్రజలకు తిండి, గుడ్డ వగైరా జీవితావసర వస్తువులు కరువైపోయాయి. అధికలాభాలకు అపేక్షించే తిండి దొంగలు పండిన పంటలు, వుత్పత్తిఅయిన సరుకులనుగూడ ప్రజలకు అందనీయకుండా దాచేస్తున్నారు. దీనితో ప్రజల కందుబాటులో లేకుండా ఆహారపదార్థాల, తదితర వస్తువుల ధరలు విపరీతంగా పెరిగిపోయాయి. కరువు మరింత తీవ్రమై లక్షలాది ప్రజలు మృత్యువాతబడుచున్నారు దేశభక్తులందరి మొదటి కర్తవ్యం ప్రజలను రక్షించడం; యుద్ధరంగానికి వెనుకభాగము, దేశరక్షణకు ప్రధానఅంగము అయిన ప్రజలశక్తి క్షీణించకుండాచూచి దేశరక్షణ జయప్రదముగా జరిగేటట్లు చూడడం. ఈ అత్యవసర కార్యాలను నిర్వహించినప్పుడే దేశరక్షణ సాగుతుంది; ప్రజాఐక్యత యేర్పడుతుంది. స్వాతంత్ర్య పోరాటము బలహీనముగాకుండా వుంటుంది. వీటిపై అన్ని రాజకీయపార్టీలు కేంద్రీకరించి పనిజేయాలి. ఇందుకు యీ కార్యక్రమ మిచ్చింది:

1. రైతు - కూలీ సామరస్యంతో అధికపంటలను పండించాలి. ప్రజలను క్షామమునుండి రక్షించాలంటే అధికపంటలను పండించందే సాధ్యంగాదు. అధికపంటలుపండించడానికి గ్రామమంతా రైతులు, కూలీలు ఐక్యమవ్వాలి; అప్పుడే సాధ్యమౌతుంది. రైతులు, కూలీలు ఐక్యమవ్వాలంటే ఒండొరులమధ్య సామరస్యం, అందరిలోని దేశభక్తి యేర్పడాలి. ఇందుకు రైతులు, కూలీల కనీస కోర్కెలు తీర్చాలి. కూలీలు దేశభక్తితో, క్రమశిక్షణతో పంటలను శ్రద్ధగాను, హెచ్చుగాను పండించడానికి తోడ్పడాలి. కూలీల కోర్కెలను రైతులు, రైతుల కోర్కెలను కూలీలు బలపర్చుకుంటూ అవిచ్ఛిన్నమైన ఐక్యతను నెలకొల్పుకోవాలి. అంతేగాకుండా రైతుల, కూలీలశక్తిని యిదివరకుకంటె యెన్నోరెట్లు సంఘటితపర్చితేనే, అభివృద్ధిజేస్తేనే కూలీల, రైతుల సమిష్టిబలము పెంపొందుతుంది; అప్పుడే అధికపంటలు పండించడానికి ప్రభుత్వమునుండి, జమీందారులనుండి, ధనికులనుండి వచ్చే

అడ్డంకులను దాటి జయప్రదంగా అధికోత్పత్తిని సాగించగల్గుతాము. ఇందుకు నూటికి నూరుమందిని రైతులను రైతుసంఘాలలోను, కూలీలను కూలిసంఘాలలోను సంఘటితపర్చాలి. రైతు, కూలి వుద్యమాలను అనేకరెట్లు అభివృద్ధి చేయాలి. ప్రధాననినాదం అధికపంటలు పండించడానికి రైతులను, కూలీలను రైతు, కూలీసంఘాల్లో సంఘటితపర్చుతూ ఐక్యపర్చాలి.

2. అధికపంటలు పండించనిది, ఆహారకరువు యెలాపోదో, అధికోత్పత్తి చేయంది, ఎక్కువ వస్తువులను, పనికరాలను వుత్పత్తిచేయకపోతే దేశములో యేర్పడ్డ వస్తువులకరువు తొలగదు. ప్రజల కందుబాటులోవుండే ధరలకు గుడ్డ వగైరా జీవితావసరవస్తువులు లభించవు. జపానురాక్షసులనుండి మన దేశాన్ని కాపాడుచున్న మన సైన్యానికి ఆయుధాలు, బట్ట, తిండి సరఫరాకావు కాన అధికపంటలను పండించుటతోపాటు అధికోత్పత్తికి పూనుకోవాలి

పారిశ్రామిక కార్మికులను సమీకరించి ఐక్యపర్చనిది. వారిలో దేశరక్షణకొరకు దేశభక్తిని పురికొల్పంది అధికోత్పత్తి సాధ్యంగాదు. కాన పట్టణకార్మికులు విరివిగా వస్తువులు తయారుచేయ డానికి పూనుకొనేటట్లు చేయాలి. కార్మికులందరినీ అధికోత్పత్తికి సమీకరించడానికి, ఐక్యపర్చడానికి, అధికలాభాల కపేక్షించే యజమానులనుండి, ప్రభుత్వాన్నుండి అధికోత్పత్తికి కల్పింపబడే అడ్డంకులను తొలగించడానికి, కార్మికుల కనీసకోర్కెలను యీడేర్చడానికి కార్మికులందరినీ ట్రేడ్‌యూనియన్ లలో జేర్పించాలి. కార్మికులు దేశభక్తితో అధికోత్పత్తికి పూనుకోవడంవలన ట్రేడ్‌యూనియన్‌లలో నూటికి నూరుమంది కార్మికులు చేరడంవలన తమ కోర్కెలను సఫలీకృతం జేసుకోగల్గుతారు; దేశ ప్రజలను రక్షించి దేశాన్ని జపాను ఫాసిస్టు ప్రమాదంనుండి కాపాడగల్గుతారు. ఇదొక్కటే నేడు కార్మికులు అవలంబించవలసిన దేశభక్తియుతమైన మార్గం. ప్రజల అవసరాలను, దేశరక్షణ అవస రాలను తీర్చడానికి కృషిజేయడంద్వారానే కార్మికులు తమ హక్కులను సంపాదించుకోగల్గుతారు. ఈ మార్గంద్వారానే తమ సంఘటితశక్తిని పెంపొందించుకోగల్గుతారు.

3. పండినపంటలను, ప్రజలకు అవసరమైన వస్తువులను ప్రజలకు అందుబాటులో వుండే ధరలకు కంట్రోలు చేయించాలి. వాటిని ప్రజలకు అందజేయడానికి, మధ్య తిండిదొంగల లాభాల కోసం దాచివేయకుండా చూడడానికి ఆహారకమిటీలను యేర్పరచి పనిజేయాలి. దీనికోసం ప్రతి గ్రామంలోను, పట్టణములోను ప్రజారక్షణదళాలను యేర్పరచి వేలకొలది వాలంటీర్లను పై కార్యాలు నెరవేర్చడానికి తర్ఫీదు చేయాలి;

4. మనదేశ సరిహద్దులను జపాను ప్రమాదమునుండి కాపాడుతూవున్న మన సైన్యానికి తిండి, గుడ్డ, ఆయుధాలు సరఫరా చేయడమేగాక, సైన్యానికి, ప్రజలకు అన్యోన్యసహకార సంబం ధాలు కలిగేటట్లు చేయాలి; సైన్యాన్ని అన్నివిధాల బలపర్చాలి,

నేడు మనసైన్యం దేశరక్షణ గావిస్తున్న సైన్యంగాని ప్రజలను హింసించే సైన్యంగాదు. నేడు సైన్యం ప్రధానకర్తవ్యం దేశాన్ని జపాను ఫాసిస్టుమూకలనుండి రక్షించడం: సైన్యంయొక్క కర్తవ్య ములో మార్పురావడమేగాక సైన్యం స్వభావంలోగూడ పూర్తిమార్పు వచ్చింది. 20 లక్షలమంది మన కూలీ రైతు సోదరులు నేడు సైన్యంలో వున్నారు. వీరంతా దేశరక్షణగావించడానికి సైన్యంలోజేరారు గాని, దేశప్రజల బ్రిటిష్ పరిపాలనక్రింద అణచిపెట్టి వుంచడానికి పోలేదు. వారు గావిస్తున్న మహ త్కార్యాన్నిగూర్చి వారిని వుత్సాహపర్చడం, వారికి తగిన సహాయం వెనుకనుండి చేయడం ప్రజల



కర్తవ్యం. వారితో అన్యోన్యసహకార సంబంధాలు ప్రజలం ఇప్పటినుండే పెంపొందించుకొంటూవారికి తగిన సహకారం జేస్తుంటే ప్రజలకు సైన్యానికి సన్నిహితసంబంధం యేర్పడుతుంది యుద్ధానంతరం ప్రజాభీష్టాలకు వ్యతిరేకంగా సైన్యాన్ని బ్రిటిష్‌సామ్రాజ్యం త్రిప్పజాలదు. ప్రజల స్వాతంత్ర్యకోర్కెను సైన్యంగూడ బలపర్చుతుంది ప్రజల, సైన్యంయొక్క సన్నిహిత సంబంధ, సహకారాలను బ్రిటిష్ ప్రభుత్వం విడదీయజాలదు. ఇప్పుడు దేశరక్షణను దేశభక్తితో కొనసాగిస్తున్న సైన్యాన్ని ప్రజా సైన్యంగా మార్చడానికి ప్రజలు తమవంతు బాధ్యతలను నిర్వహించాలి.

5. విద్యార్థి, యువజన, స్త్రీ, బాలసంఘాల నేర్పరచి, వాటిద్వారా లక్షలాదిమందిని ప్రజా జీవితంలో పాల్గొనేటట్లు, మనలను యెదుర్కొనే సమస్యలన్నిటి పరిష్కారంకు తోడ్పడి కృషిజేసే టట్లు చేయాలి అప్పుడే అన్నివర్గాల ప్రజలసంఘటితశక్తి, ఐక్యత అభివృద్ధిఅయి స్వాతంత్ర్య పోరాటం వేయిరెట్లు బలపడడానికి అవకాశం యేర్పడుతుంది.

6. పై కార్యాలన్నిటిని సాధించాలంటే దేశములోని వివిధ రాజకీయపార్టీలమధ్య ఐక్యత అవసరం; దేశరక్షణకోసం, దేశ స్వాతంత్ర్యంకోసం అన్నిపార్టీలు కలసి పనిజేయాలి ముఖ్యంగా కాంగ్రెసు - ముస్లిమ్‌లీగ్ కలసి పనిజేయాలి. కాంగ్రెసు, ముస్లిములీగు కోరే ముస్లింజాతుల స్వయం నిర్ణయహక్కును అంగీకరించాలి. ముస్లిములీగు కాంగ్రెసునాయకుల విడుదలకోసం పనిజేయాలి. అలా కాంగ్రెసు - ముస్లిములీగులు పనిజేసినప్పుడే ఒకరిమీద ఒకరికి వున్న అనుమానాలు పోయి భారతదేశంలో నిజమైన ఐక్యత యేర్పడుతుంది. అప్పుడే వివిధజాతులు సమాన స్వాతంత్ర్యాలనుభ విస్తూ ఐచ్ఛికంగా, భారత రాజకీయ సమాఖ్యను ఏర్పాటు చేసుకోగల్గుతాయి.

కాంగ్రెసునాయకుల విడుదలకోసం, కాంగ్రెసు - లీగ్ ఐక్యతకోసం, ప్రజల తిండికోసం, జపాన్ ఫాసిస్టు ప్రమాదాన్నుండి దేశాన్ని రక్షించుకోడానికి జాతీయప్రభుత్వాన్ని, దేశస్వాతంత్ర్యాన్ని సంపాదించుకోవడానికి ప్రజలందరూ కలసి పనిజేయాలి. ఇదే కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమము.

## వివిధపార్టీల కార్యక్రమము :

కాంగ్రెసు కార్యక్రమము : అంతవరకు సాగించుచున్న వ్యక్తి సత్యాగ్రహోద్యమము మానివేయబడింది. వ్యతిరేకపాలసీని మానివేసింది. (బార్డోలీ వర్కింగ్‌కమిటీ, వార్ధా అ. భా. కాం. కమిటీ సమావేశాల తీర్మానాలు.) కాని ప్రజాయుద్ధంగా యీ యుద్ధాన్ని అంగీకరించి ప్రజాసమీ కరణకు పూనుకోలేదు. బ్రిటిష్‌ప్రభుత్వం జాతీయప్రభుత్వం యివ్వనిదే భారతదేశానికి ప్రజాయుద్ధం గాదని, అంతవరకు బ్రిటన్ యుద్ధమేనని భావించి యుద్ధనిర్వహణబాధ్యత తీసుకోడానికి నిరాకరించింది. యుద్ధంలోపాల్గొంటూ ప్రజాశక్తిని, ప్రజాఐక్యతను పెంపొందించడానికి పూనుకోక జాతీయప్రభుత్వంను బ్రిటిష్‌ప్రభుత్వం యివ్వాలని బ్రిటిష్ సామ్రాజ్యవాదంవైపు యెదురుచూస్తూ కూర్చుంది. జాతీయప్రభు త్వాన్ని సంపాదించడానికి, జాతీయరక్షణను బలపరుస్తూ భారతీయులందరినీ ముఖ్యంగా ముస్లిమ్‌లీగ్ - కాంగ్రెసులను ఐక్యపర్చడానికి పూనుకోవడానికి నిరాకరించింది. యుద్ధంలో పాల్గొంటూ ప్రజలశక్తిని, ఐక్యతను పెంపొందించడానికి భారత ప్రజలందరినీ సమీకరించి యున్నయెడల, భారత ప్రజల సంయుక్త జాతీయవాంఛను బ్రిటిష్ ప్రభుత్వము త్రోసివేసియుండేదిగాదు. బ్రిటిష్ ప్రజల ఒత్తిడి వలన ప్రారంభమైన క్రిప్సు రాయబారాలను బ్రిటిష్ సామ్రాజ్యవాదులు భగ్నం చేసియుండేవారుగాదు. క్రిప్సురాయబారాలు విఫలమయ్యాక పరిస్థితులు తారుమారయ్యాయి. దేశరక్షణను కొనసాగించడానికి

జాతీయైక్యతను సాధించకుండా, ప్రజలను సమీకరించి ప్రజాశక్తిని పెంపొందించకుండా జాతీయనాయకులు బ్రిటిష్ సామ్రాజ్యవాదంపైపు 'నిరీక్షిస్తూ కూర్చోవడం' వలన బ్రిటిష్ ప్రభుత్వం చొరవ తీసుకుంది. కఠినమైన నిర్బంధవిధానం దేశంలో ప్రవేశపెట్టబడింది. ప్రజల్లోను, జాతీయనాయకుల్లోను గందరగోళం, సందిగ్ధావస్థ బయలుదేరింది. బ్రిటిష్ వ్యతిరేకతత్వం, యుద్ధవ్యతిరేకతత్వం మరొక పర్యాయం తలయెత్తాయి. పోరాటాన్ని నిలిపివేసి నిస్తబ్ధతను కొనసాగిస్తూ, బ్రిటిష్‌సామ్రాజ్యవాదం జాతీయప్రభుత్వం ఇవ్వాలని నిరీక్షిస్తూ కూర్చున్న జాతీయనాయకులు పోరాటం తీసుకొస్తామని ప్రభుత్వాన్ని బెదిరిస్తే తప్పక యేదో ఒకటి జరుగుతుందనే ధోరణికి వచ్చారు. దీని ఫలితమే వార్ధా వర్కింగుకమిటీ, బొంబాయి ఏ. ఐ. సి. సి. తీర్మానాలు. ఆతీర్మానాలల్లో ఫాసిజాన్ని యెదిరించడానికి తమసంసిద్ధతను వెల్లడిగావించుతూనే మరొకవైపున బ్రిటిష్ సామ్రాజ్యవాదంపై పోరాటం ప్రారంభిస్తామనే బెదిరింపుకూడా వుంది. మొదటినుంచీ జాతీయనాయకులు అవలంబిస్తూవచ్చిన పాలసీలో యిది అంత్యదశ. పూర్వపుపాలసీయే యిపుడు కొత్తరూపంలో వెల్లడిఅయింది. ప్రజల్ని సమీకరించి, దేశరక్షణనుబలపరచేపంథా యిప్పుడుకూడా అవలంబించబడలేదు. జాతీయనాయకత్వం పూర్వం మాదిరిగనే యుద్ధం సామ్రాజ్యవాదుల యుద్ధమేనని, కాబట్టి యుద్ధాన్ని ఆటంకపరచాలని బెదిరిస్తే సామ్రాజ్యవాదులు లొంగివస్తారనీ తలచారు. జాతీయైక్యత సాధించడం అసాధ్యం గాబట్టి బ్రిటిష్ సామ్రాజ్యవాదులను బెదిరించే పోరాటమొక్కటే గత్యంతరమని భావించారు.

నూతన పరిస్థితుల్లో జాతీయ స్వాతంత్ర్యానికిది మార్గంకాదని కమ్యూనిస్టుపార్టీ జాతీయనాయకులను హెచ్చరించింది. యుద్ధంలో విజయాన్ని సంపాదించడానికవసరమైన కార్యక్రమముపై ప్రజల్ని ఐక్యపర్చడం ద్వారానే స్వాతంత్ర్యం లభిస్తుందని స్పష్టపర్చింది. కాని యీ యథార్ధాన్ని జాతీయనాయకులు గ్రహించలేదు,

## ముస్లిమ్‌లీగు కార్యక్రమము :

ముస్లిమ్‌లీగు నాయకత్వంకూడ బూర్జువావర్గ నాయకత్వమే అగుటవలన ప్రజాసమీకరణ, ప్రజాఐక్యత సాధనాలతో స్వాతంత్ర్యాన్ని సంపాదించాలనే భావంలేదు. కాంగ్రెసు నాయకత్వంవలెనే బ్రిటిషు సామ్రాజ్యవాదులవైపే నిరీక్షిస్తూ కూర్చుంది,

హిందూ ప్రజాసామాన్యంలోను, ముస్లిమ్ ప్రజాసామాన్యంలోను సామ్రాజ్యవాద యుద్ధదశలో యుద్ధవ్యతిరేకభావాలు విరివిగా యున్నాయి. అయినా అప్పుడు కాంగ్రెసు, ముస్లిమ్‌లీగులు యుద్ధవ్యతిరేకతను చూపెట్టాయేగాని ప్రజాశక్తిని అభివృద్ధిచేయడానికి ప్రజాపోరాటాన్ని గొనిరాలేదు. కాంగ్రెసు నాయకత్వం సత్యాగ్రహమంటూ బ్రిటిషు ప్రభుత్వంపై ఒత్తిడితేవాలని భావించింది; జిన్నా పాకిస్థాన్ అంటూ ఒత్తిడితేవాలని ప్రయత్నించాడు, ఉభయసంస్థలు ప్రజాశక్తిపై ఆధారపడక బ్రిటిషు సామ్రాజ్యవాదంతో బేరాలకు దిగాయి.

ఆ బూర్జువావర్గ ధోరణే ప్రజాయుద్ధదశలోగూడ ద్యోతకమయింది. ప్రజాశక్తిపై ఆధారపడకుండా వుండే ధోరణితోపాటు యుద్ధం మనదిగాదు. బ్రిటన్ యుద్ధముఅనే ధోరణిగూడ బయలుదేరింది. అందుచేత ప్రజాయుద్ధ కాలములో యుద్ధంలో పాల్గొనుటద్వారా ప్రజాశక్తిని, ఐక్యతను విరివిగా పెంపొందించుకునే మహదవకాశాన్ని జారవిడిచాయి.



ముస్లిమ్‌లీగ్‌లోని అభివృద్ధి నిరోధకముతా సామ్రాజ్యవాద యుద్ధదశలోగూడ యుద్ధంలో సహకారం చేయాలనే అపేక్షించింది. వ్యక్తిగతంగా అలాచేయడానికి అనుమతి యీయబడింది. కాని మొత్తంమీద ముస్లింలీగ్ యుద్ధవ్యతిరేక ధోరణే అవలంబించింది. బ్రిటిషు ప్రభుత్వం, కాంగ్రెసు, పాకిస్థాన్‌ను అంగీకరించితేనే యుద్ధనిర్వహణలో పాల్గొంటానని కూర్చుంది.

## 'అతివాద' పార్టీలు :

1. రాయిస్టులు :— సామ్రాజ్యవాద యుద్ధారంభంలోనే రాయిస్టులు సామ్రాజ్యవాదులతో స్వాతంత్ర్యపోరాటానికి వ్యతిరేకంగా చేతులుగల్పారు. ఫాసిస్టువ్యతిరేక యుద్ధమంటూ సామ్రాజ్యవాద యుద్ధాన్ని బలపర్చారు. సామ్రాజ్యవాద యుద్ధాన్ని వ్యతిరేకించిన కాంగ్రెసుసంస్థను ఫాసిస్టుసంస్థ అని దాన్ని శిక్షించాలని ప్రచారం చేశారు. బ్రిటిష్‌ప్రభుత్వ నిర్బంధ విధానాన్ని పూర్తిగా సమర్థించారు.

ప్రజాయుద్ధంగా మారిన తరువాత వారి సామ్రాజ్యవాదుల చెలిమిని 'ప్రజాయుద్ధం, ఫాసిస్టు ప్రతికూలత, సోవియట్ యూనియన్‌కు సహాయం' అనే విప్లవపదాలతో కప్పిపుచ్చుకోడానికి చూచారు. బ్రిటిష్ ప్రభుత్వం ఫాసిస్టు వ్యతిరేక యుద్ధం చేస్తోందిగాబట్టి దానితో మనకున్న తగాదాను యుద్ధమయ్యేంతవరకు కట్టిపెట్టాలని, యుద్ధం అయిన తరువాత మన స్వాతంత్ర్య పోరాటం చూసుకుందామని రాయి చెపుతాడు. దీని అర్థం యిప్పుడు సామ్రాజ్యవాద నిరంకుశత్వాన్ని, బానిసత్వాన్ని స్వీకరించడమే అవుతుంది. యుద్ధంలో పాల్గొంటూనే బ్రిటిష్ ప్రభుత్వ నిరంకుశత్వంతో పోరాడాలనియు, తద్వారా మన ప్రజాశక్తిని, ఐక్యతను పెంపొందించుకోవాలనియు అతను చెప్పడు. బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పంథాను అన్నివిధాలా బలపర్చుతూ సామ్రాజ్యవాదంతో మిళితమై పోవడమే రాయిస్టుల పంథా. మనపవిత్ర భారతావనిని సామ్రాజ్యవాదులు తమంతటతామే రక్షించలేరని రాయి గ్రహించడు. మనకు జాతీయైక్యత, జాతీయప్రభుత్వం, ప్రజాసమీకరణకావాలనికోరడు. ఒక్కమాటలో చెప్పాలంటే రాయిస్టుల వాదన యిది : కాంగ్రెసు సంస్థ ఫాసిస్టుసంస్థ; జపానుకు అనుకూలము : కాంగ్రెసును అణచివేస్తే భారతదేశానికి స్వాతంత్ర్యం వస్తుంది. ఇది ఫాసిస్టు వ్యతిరేకతగాదు; సామ్రాజ్యవాదుల ఏజెన్సీకి బురఖా మాత్రమే.

2. ఫార్వర్డుబ్లాకు :- ఫార్వర్డుబ్లాకు నియమరహితమైన బూర్జువావర్గంలోని భాగం. దీనికొక ఖచ్చితమైన పాలసీ అంటూలేదు. ఫాసిస్టు అనుకూలంగా మారిందంటే ఆశ్చర్యమేమీలేదు. 'బ్రిటను శత్రువు భారతదేశ మిత్రుడు' అనే సూత్రంపై పనిజేస్తారు, జపాను బ్రిటిష్ ప్రభుత్వంకు శత్రువు గాబట్టి జపాను అండతీసుకుని స్వాతంత్ర్యం సంపాదించాలంటారు. జపాను సైన్యాలను మనదేశంపైకితెచ్చి స్వాతంత్ర్యం సంపాదిస్తామంటారు. జపాను ఫాసిస్టుమూకలు భారతదేశాన్ని ఆక్రమించడానికి తీవ్రకృషిజేస్తూ జపాన్ ఏజెంటులుగా పనిజేస్తున్నారు. భారతదేశాన్ని జపాను ఫాసిస్టు బానిసత్వంలో ముంచడానికి కృషిజేస్తున్న జపాను ఏజెంటుగా ఫార్వర్డుబ్లాకు తయారయింది.

3. కాంగ్రెసు సోషలిస్టులు;— సామ్రాజ్యవాద యుద్ధంలో స్వతంత్రపంథా లేకుండా జాతీయ బూర్జువా నాయకత్వం తోక పట్టుకొని వ్రేలాడారు. సోషలిజానికి తిలోదకాలువదలి మెన్షివిక్ పంథా పట్టారు. సామ్రాజ్యవాద యుద్ధం ప్రజాయుద్ధంగా మారినను, అంతర్జాతీయత, సోషలిజము విడనాడిన కాంగ్రెసు సోషలిస్టులకు యుద్ధంలో నూతనంగావచ్చిన మార్పు కనుపించలేదు. అందుచేత యుద్ధాన్ని వ్యతిరేకించడమే వీరి స్వాతంత్ర పోరాటమార్గం. ప్రారంభంలో కాంగ్రెసు పోరాటం తీసుకురావాలని

వీరు వాంఛించారు. కాంగ్రెసు నాయకుల అరెస్టులనంతరం అరాచకోద్యమానికి నాయకత్వం వహించి జపాను ఏజెంటులుగా పనిజేస్తున్న ఫార్వర్డుబ్లాకుతో కలసి 'స్వాతంత్ర్య పోరాటం' సాగించ తలచారు. అరాచకోద్యమము విఫలమవడముతో ఫార్వర్డుబ్లాకుతోపాటు కాంగ్రెసు సోషలిస్టులుగూడ భారతదేశంపైకి జపాను సైన్యాలరాకకు, సోవియట్ - జర్మన్ దేశాలమధ్య, చైనా - జపాను దేశాలమధ్య సంధి కుదిరి, బ్రిటిషుసైన్యం యుద్ధంలో ఓడిపోయి, ఫాసిస్టు సైన్యాలు గెలుపొందడానికి యెదురుచూడడం మొదలుపెట్టారు. స్వతంత్ర పంథాలేని కాంగ్రెసు సోషలిస్టులు అంతకన్నా మరొక విధంగా యెలాచేస్తారు? జాతీయ బూర్జువా వర్గంలో ఒకభాగమైన కాంగ్రెసు నాయకత్వానికి తోకగా కొంతకాలము, జాతీయ బూర్జువా వర్గంలో మరొకభాగమైన ఫార్వర్డుబ్లాకుకు తోకగాయిప్పుడూ ప్రవర్తిస్తున్నారు. స్వతంత్ర కార్మిక పంథా, సోషలిజము, అంతర్జాతీయత విసర్జించిన కాంగ్రెసుసోషలిస్టులు అంతకన్నా మరోవిధంగా ప్రవర్తించజాలరు.

కాంగ్రెసు సోషలిస్టుల ప్రస్తుత పంథాయిది: భారతదేశంపైకి జపాను సేనలు వస్తేనే స్వాతంత్ర్యం వస్తుంది; కాంగ్రెసు నాయకులు జైళ్ళనుండి బయటకువస్తే జపాను సైన్యాలు భారతదేశంపైకి రావడాన్ని వ్యతిరేకించుతారు గాన వారు జైళ్ళలోనే వుండాలి; ప్రతిష్టంభన కొనసాగుతూ వుండాలి. అంతర్జాతీయంగా వీరిపాలసీ యిది. జర్మనీకి సోవియట్ యూనియన్‌కు, చైనాకు - జపానుకు సంధి కుదరాలి. ఫాసిస్టులు బ్రిటిషు, అమెరికన్ సైన్యాలను ఓడించాలి. అప్పుడు మనకు స్వాతంత్ర్యం వస్తుంది.

ఫార్వర్డుబ్లాకు, కాంగ్రెసు సోషలిస్టుపార్టీ కార్యక్రమాలకు భేదంలేదు. రెండూ భారతదేశ స్వాతంత్ర్యమును జపాను సైన్యాల సహాయంతో, ఫాసిస్టుల జయంతో సంపాదించాలని ప్రయత్నిస్తున్నాయి. ఇది పంచమాంగదళ కార్యక్రమము. ఫాసిస్టు ఏజెంట్ల కార్యక్రమం.

కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమము ఒక్కటే ప్రజాయుద్ధకాలములో దేశాన్ని ఫాసిస్టు ప్రమాదాన్నుండి రక్షించేది; దేశస్వాతంత్ర్యాన్ని సాధించేది. తదితర పార్టీల కార్యక్రమములు దేశ స్వాతంత్ర్యాన్ని గడించజాలవు. ఫాసిస్టు బానిసత్వానికి దేశాన్ని గురిజేయడమో లేక బ్రిటిషు బానిసత్వాన్ని, నిరంకుశత్వాన్ని ఖాయపర్చడమో చేస్తాయి. కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమాన్ని తదితర రాజకీయ పార్టీలు యెంతత్వరగా ఆమోదించి ఆచరించడానికి సిద్ధపడుతాయో అంతత్వరగా దేశస్వాతంత్ర్యం సాధించబడుతుంది.

## జాతీయ సంక్షోభం — కమ్యూనిస్టుపార్టీ కార్యకలాపాలు

ఆగస్టు సంఘటనలు :- జాతీయనాయకులు జాతీయ రక్షణకొరకు జాతీయైక్యతను సాధించడానికి, ప్రజలను సమీకరించడానికి బదులు యుద్ధకార్యాలకు వ్యతిరేకంగా పోరాటాన్ని తెస్తామనిబెదిరిస్తూ కూర్చోవడంవలన బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి భారతీయులందరిపై తీవ్ర నిర్బంధం ప్రయోగించడానికి అవకాశం దొరకింది. జాతీయరక్షణకు యెంతో అత్యవసరమైన జాతీయోద్యమాన్నే నాశనం గావించ తలపెట్టింది. కాంగ్రెసునాయకులందరినీ నిర్బంధించింది. ఆగస్టు 9 వ తేదీతో ప్రభుత్వ నిర్బంధవిధానము ఉన్నతశిఖరాన్నంటింది. తత్ఫలితంగా దేశభక్తులైన ప్రజాసామాన్యమంతా ఒక్కసారి లేచింది. దేశమంతా ఒక్కసారి భగ్గుమంది. దేశరక్షణను నాశనముగావించే, దేశసరిహద్దులలో



మాటువేసుకుకూర్చున్న జపాన్ ఫాసిస్టులకు దారిని సుగమపర్చే అరాచక విధ్వంసకచర్యలు దేశమంతటా చెలరేగాయి. బ్రిటిష్ వ్యతిరేకతత్వం జపాను అనుకూల పోకడగా మారింది.

ఈ అవకాశాన్ని పంచమాంగదళం (ఫార్వర్డుబ్లాకు, కాంగ్రెసు సోషలిస్టుపార్టీ) బాగా వుపయోగించుకుంది. బ్రిటిష్ సామ్రాజ్యవాద నిర్బంధవిధానం, కాంగ్రెసునాయకుల పోరాట బెదిరింపు పంచమాంగదళానికి దేశభక్తి బురఖా తగిలించుకుని కాంగ్రెసుపేర జపాను కనుకూలమైన అరాచకోద్యమాన్ని, విధ్వంసకచర్యలను సాగించడానికి అవకాశం చిక్కింది. జాతీయోద్యమములో ప్రవేశించి దానిపై నాయకత్వం వహించడానికి మంచి అదును దొరికింది.

ఆగస్టు 9 వ తేదీతో ప్రారంభమైన కాలాన్ని కమ్యూనిస్టులు జాతీయ సంక్షోభదశ అని పిలిచారు. ఎందుకంటే ఒకప్రక్క ప్రభుత్వం తన నిర్బంధవిధానంతో పంచమాంగదళాన్ని మరింతబలపర్చుతోంది; దేశభక్తులందరూ పంచమాంగదళం ఒడిలోకి పోతున్నారు. వారిలోని బ్రిటిష్ వ్యతిరేకత జపాను అనుకూల పోకడగా మారుతోంది. ప్రజల్లోని ఫాసిస్టువ్యతిరేక చైతన్యశక్తి క్షీణించుతోంది. మరొకప్రక్క దేశభక్తులంతా స్వాతంత్ర్యసంపాదనకొరకు దేశరక్షణను ఆర్గనైజ్ చేయడానికి బదులు విధ్వంస మొనర్చుతున్నారు పరిస్థితులన్నీ మనదేశ సరిహద్దులలో కూర్చున్నజపాను ఫాసిస్టుల కనుకూలంగా వున్నాయి.

పార్టీ కార్యక్రమము : ఆగస్టు సంఘటనల ముందునుంచిగూడ పార్టీ, కాంగ్రెసు తలపెట్టే పోరాటఫలితాలగూర్చి హెచ్చరించుతూవచ్చింది. పోరాటము పంచమాంగదళముయొక్క చేతుల్లో పదునైన ఆయుధంగా వినియోగపడుతుందనియు, ఫాసిస్టులకు సహాయపడుతుందనీ హెచ్చరించింది. దేశరక్షణను భగ్నముచేసే యేపోరాటమైనా ప్రజలశక్తిని, ఐక్యతను బలహీనపర్చుతుందనియు, దేశరక్షణను బలపర్చటానికి ప్రజలనందరినీ సమీకరించి వారి సంఘటనాశక్తిని, ఐక్యతను పెంపొందించుటే దేశ స్వాతంత్ర్యమునకు మార్గమని మొదటినుండి కమ్యూనిస్టులు హెచ్చరించుతూవచ్చారు. ఆగస్టు సంఘటనలను, అరాచకోద్యమాన్ని, విధ్వంసకచర్యలను కమ్యూనిస్టుపార్టీ వ్యతిరేకించింది. ప్రజలు ఉద్రిక్తులై విధ్వంసకచర్యలకు, అరాచక చర్యలకు దిగకుండా జోక్యం కలుగజేసుకుని నివారించుటకు ప్రయత్నించింది. ప్రభుత్వ నిర్బంధవిధానమును వ్యతిరేకించి, ప్రభుత్వానికి-ప్రజలకు మధ్య పార్టీసభ్యులు నిలబడి పనిజేశారు. కార్మికులు వుత్పత్తి కేంద్రాలను వీడకుండా, రైతులు పంటపొలాలను వదిలిపెట్టకుండా, విద్యార్థులు విద్యాలయాలను విడనాడకుండా కమ్యూనిస్టులు దేశరక్షణ జయప్రదంగా సాగడానికి వుత్పత్తిని కుంటుబడనీయకుండా, ప్రజా జీవితం తారుమారుగానీయకుండా కృషిజేశారు. కమ్యూనిస్టుపార్టీ కార్మికులమధ్య గావించిన కృషే లేకపోతే ఉత్పత్తి అంతా విచ్ఛిన్నమై యుద్ధరంగం వెనుకభాగము పూర్తిగా విధ్వంసమైపోయేది.

జాతీయ నాయకుల విడుదలకొరకు బ్రహ్మాండమైన ఆందోళన లేవదీయబడింది. జాతీయైక్యతను నిర్మించడానికి జాతీయైక్యతా వుద్యమము సాగించబడింది. కమ్యూనిస్టుపార్టీ అప్పటి నినాదాలివి.

—జాతీయ నాయకులను విడుదల గావించాలి.

—విధ్వంసకచర్యలు జరుగకుండా చూడాలి.

—జాతీయైక్యతను నిర్మించడానికి ప్రజలందరూ పూనుకోవాలి.

—కాంగ్రెసువాదులు ముస్లింజాతుల స్వయంనిర్ణయహక్కును అంగీకరించాలి.

—ముస్లిములీగు కాంగ్రెసు నాయకుల విడుదలకొరకు కృషిజేయాలి.

కమ్యూనిస్టుపార్టీ ఒక్కటే ఒంటరిగా యీ కార్యక్రమాన్ని సాగించింది. తదితర అన్ని పార్టీలు కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమానికి వ్యతిరేకంగా తాత్కాలికంగా ఐక్యమయ్యాయి. పార్టీపై యెన్నడూలేని దుష్ప్రచారం సాగింపబడింది. బ్రిటిష్ ప్రభుత్వం దగ్గర లంచంపుచ్చుకుని బ్రిటిష్ ఏజెంట్లుగా కమ్యూనిస్టులు జాతీయోద్యమానికి వ్యతిరేకంగా పనిజేస్తున్నారని దుష్ప్రచారం బాగా సాగింది. అగస్టు సంఘటన ప్రారంభ దినాల్లో, తాత్కాలికోద్రేకపు దశలో పంచమాంగదళం తన స్థానాన్ని నిలబెట్టుకుని విధ్వంసకచర్యలు సాగించింది. దేశభక్తులను తనవైపుకు ఆకర్షింపగల్గింది. విధ్వంసకచర్యలను దేశ మొత్తంమీద ఆర్గనైజ్ చేయడానికి ప్రయత్నిస్తూవున్న పంచమాంగదళపు కృషికి తీవ్రమైన వ్యతిరేక ప్రచారం దేశభక్తులలో గావిస్తూ దేశభక్తులను కమ్యూనిస్టుపార్టీ కార్యక్రిమంవైపుకు ఆకర్షింప యత్నంచేస్తున్న కమ్యూనిస్టుపార్టీకి వ్యతిరేకంగా పంచమాంగదళం అన్ని పార్టీలను తాత్కాలికంగా ఐక్యపర్చింది. కమ్యూనిస్టుపార్టీకివున్న స్వతంత్ర పలుకుబడిని నాశనము గావించడానికి దాని పలుకుబడిక్రిందవున్న ప్రజా వుద్యమాలను విచ్ఛిన్నం గావించ ప్రయత్నించింది. రైతురంగాన్ని రంగాముఠా విచ్ఛిన్నం చేయడానికి తోడ్పడింది. విద్యార్థిరంగాన్ని జాతీయ విద్యార్థి సంఘాల స్థాపనతో చీల్చింది. కమ్యూనిస్టుపార్టీపై తన శక్తినంతా వుపయోగించి అనేక విధాల దుష్ప్రచారం కొనసాగించింది.

అయినప్పటికీ కమ్యూనిస్టుపార్టీ కార్యక్రిమము ఒక్కటే నిజమైన జాతీయపంథా అగుటచేతను, ప్రజలను, దేశాన్ని రక్షించేది అగుటచేతను కమ్యూనిస్టుపార్టీ యీ కాలములో బాగా బలపడింది. రైతు, కూలీ, కార్మిక, విద్యార్థి, యువజన, బాల, మహిళాసంఘాలు అనేకరెట్లు బలపడ్డాయి. కమ్యూనిస్టుపార్టీ స్వతంత్రప్రజాపలుకుబడి హెచ్చయింది. పార్టీ యిదివరకుకన్నా క్రమశిక్షణతోను, హెచ్చు చైతన్యముతోను పనిజేయడం ప్రారంభించింది. పార్టీసభ్యులు అద్భుతమైన త్యాగాలు పార్టీకొరకు చేయడం ప్రారంభించారు. దేశములోని యిదివరకు త్యాగప్రమాణాలన్నిటిని పార్టీ సభ్యుల త్యాగాలు మించిపోయాయి.

అంతేగాకుండా పార్టీ సాగించిన జాతీయైక్యతా వుద్యమంద్వారా మంచి రాజకీయ ఫలితాలు గూడ వచ్చాయి. పోరాటముయొక్క తాత్కాలికోద్రేకం తగ్గినకొద్దీ నిజమైన దేశభక్తులు విధ్వంసక చర్యల విధానంలోని దేశారిష్టమును గ్రహించడం ప్రారంభించారు. విధ్వంసక చర్యలు మన ప్రజలపైననే ప్రయోగింపబడుతూ అరాచకత్వానికి (స్కూళ్ళమీద, రైళ్ళమీద, ఫ్యాక్టరీలపైన బాంబులు వేయడం) దిగజారడం ప్రారంభించగానే గాంధివాదులు యీ విధ్వంసక చర్యలనుండి విరమించుకోసాగారు. తమ మిత్రులనుకొనే పంచమాంగదళం జపాను అనుకూల ప్రచారాన్ని, జపాను అనుకూల భావాలను విస్తరింపజేయడాన్ని చూచి నెహ్రూవాదులు వారితో సంబంధం వదులుకో మొదలుపెట్టారు. నాయకులు విడుదలగావాలని కమ్యూనిస్టులు గావించిన ప్రచారం, జాతీయైక్యతను నిర్మించడానికి సాగించిన జాతీయైక్యతా వుద్యమము కాంగ్రెసు దేశభక్తులను, ముస్లిము దేశభక్తులను ఆలోచించేటట్లు చేసింది. విధ్వంసక చర్యలకు వ్యతిరేకంగా గావించిన ప్రచారం నెహ్రూవాదులను, గాంధివాదులను వాటినుండి విముఖులను గావించింది. కాంగ్రెసువాదు లందరూ వాటి నిష్ఫలతను తెలుసుకోగల్గారు. అయితే యింకా దేశరక్షణద్వారా దేశ స్వాతంత్ర్యము వస్తుందనిమాత్రం గ్రహించలేదు. జాతీయైక్యతా వుద్యమమువలన కాంగ్రెసువాదులు కాంగ్రెసు-లీగ్ ఐక్యత సాధ్యమౌతుందని, అది యేర్పడాలని కోరడం ప్రారంభించారు; ముస్లిము ప్రజాసామాన్యం కాంగ్రెసు నాయకుల విడుదలకోరడం



ప్రారంభించారు. కాంగ్రెసు అంగీకరించడంద్వారానే తమ స్వయంనిర్ణయ హక్కు స్థిరపడుతుందని గ్రహించారు. కాని కాంగ్రెసు దేశభక్తులు కాంగ్రెసు - లీగు ఐక్యతకొరకు పనిజేయడంగాని, ముస్లిం ప్రజాసామాన్యం, లీగునాయకత్వం కాంగ్రెసు నాయకుల విడుదలకొరకు పనిచేయాలనిగాని ముందుకు రాలేదు; కార్యాచరణకు దిగకుండా నిస్పృహతో కూర్చున్నారు.

కాంగ్రెసువాదులపై పంచమాంగదళపు ప్రభావము తగ్గింది. ముఖ్యంగా విధ్వంసక చర్యలను దేశమంతటా మరల ఆర్గనైజ్‌చేయాలనే పంచమాంగదళ ప్రచారం కాంగ్రెసువాదులలో పారడంలేదు. కాని యింకా పంచమాంగదళం దేశభక్తి ముసుగునే వేసుకుని పనిజేయగల్గుతోంది. కాంగ్రెసువాదులకు పంచమాంగదళముకు వున్న లంకె పూర్తిగాతెగలేదు. దేశరక్షణద్వారా స్వాతంత్ర్యము వస్తుందనే భావం కాంగ్రెసువాదులలో యింకా కలుగకపోవడంవలన, దేశరక్షణకు కాంగ్రెసువాదులు పూనుకోవడంలేదు. అందుచేత పంచమాంగదళము కాంగ్రెసుపేరుతో యింకా దేశభక్తులను మోసగించ గల్గుతూనే వుంది.

పార్టీ ఒక్కటే ఒంటరిగా పనిజేయవలసిరావడంవలన జాతీయసంక్షోభాన్నుండి దేశాన్ని రక్షించడానికి పార్టీజేసిన కృషి చాలలేదు. పార్టీకున్నశక్తి, బలానికన్నా నిర్వహించవలసిన బాధ్యతలు హెచ్చగుటచేత జాతీయ సంక్షోభం తొలగింపబడలేదు. జాతీయైక్యత సాధించబడలేదు. దేశభక్తులను దేశరక్షణకు పూనుకొనేటట్లు చేయజాలకపోయింది. అయినప్పటికీ జాతీయసంక్షోభంతో పంచమాంగదళ విద్రోహచర్యలతో దేశం సర్వనాశనం గాకుండా, దేశం జపానుఫాసిస్టుల దాసత్వం క్రిందికి పోనీయకుండా కృషిజేయగలిగింది.

రాజకీయ ప్రతిష్టంభనమునకు ఆహారసమస్య తోడైంది. దీనితో జాతీయసంక్షోభం మరింత తీవ్రమయింది జపాను ఫాసిస్టులు మనదేశ సరిహద్దులలోకి రావడంతో ప్రజలకు తిండి, గుడ్డ వగైరా కరువైపోయాయి. అగస్టు సంఘటనలతరువాత యిదివరలో అధికలాభాలను గుంజేవర్తకులు తిండి దొంగలయ్యారు. దేశభక్తి ముసుగుతో వారి దోపిడిని యథేచ్ఛగా సాగించడం ప్రారంభించారు. బ్రిటిష్ సామ్రాజ్యవాదం ఆర్థికరంగంలో అవలంబించిన దివాళాకోరు పాలసీ ఫలితంగానే ఆహార సమస్య తీవ్రమయింది; తిండిదొంగలు, దొంగమార్కెట్లు హెచ్చయి ప్రజలతిండి, తదితర అవసర వస్తువులు కరువైపోయి దేశం క్షామానికి గురిఅయింది. ఇంతవరకు రాజకీయసంక్షోభంవలన రాజకీయాల్లో చొరవతీసుకుని పనిజేసే యేకొద్దిమందో బాధపడ్డారు. ఆహారసమస్యవల్ల భారతదేశ ప్రజలందరూ క్షామ జ్వాలలకు ఆహుతి అవ్వాల్సివచ్చింది. దీనితో భారతదేశం అరాచకచర్యలకు, కరువు దోపిళ్ళకు, సమాజంలో అంతఃకలహానికి గురిగావలసి వచ్చింది. కార్మికులు తమ ఆకలిమంటలను చల్లార్చుకోడానికి, ఆహారపదార్థాలను సంపాదించడానికి తమ కాలాన్నంతా వినియోగించుకోవాల్సి వచ్చింది: యజమానులు, ప్రభుత్వం కార్మికులయెడ ఆహారరంగంలో అవలంబించిన పాలసీవల్ల అన్ని పరిశ్రమల్లో ఆకస్మికసమ్మెలు వచ్చి వుత్పత్తే నాశనమయ్యేపరిస్థితు లేర్పడ్డాయి. గ్రామసీమల్లో క్షామ పరిస్థితు లేర్పడి పొట్ట చేతబట్టుకుని గ్రామ గ్రామము తిండికొరకు తిరగాల్సిన అవస్థ రైతులకు పట్టింది. తత్ఫలితంగా గ్రామ ఆర్థిక, సాంఘిక జీవితమే విచ్ఛిన్నమైపోతోంది. గ్రామకూలీలు ఆకలి మంటలు చల్లార్చుకోడానికి అరాచక చర్యలకు దిగే అపాయం యేర్పడింది. గ్రామాల్లో భీషణ అంతఃకలహం చెలరేగి గ్రామాలు దగ్ధమయ్యేస్థితి యేర్పడింది. తత్ఫలితంగా క్షామనివారణకొరకు, దేశరక్షణకొరకు అధికపంటలు పండించాల్సిన పరిస్థితుల్లో పంటలే దగ్ధమైపోవలసి వచ్చింది. ఈవిధంగా

రాజకీయసమస్యతో ప్రారంభమైన జాతీయసంక్షోభం ఆహారసమస్యతో దేశంలోని అన్నివర్గాలకీ, అన్నిరంగాలకు వ్యాపించింది ; బాగా తీవ్రమయింది.

ఆహారసమస్యను పరిష్కరించడంద్వారానే ప్రజలు, దేశం దగ్ధంగాకుండా కాపాడగల్గే పరిస్థితులు యేర్పడ్డప్పుడు కమ్యూనిస్టులు ఆహారసమస్యా పరిష్కారానికి తమ శక్తినంతా కేంద్రీకరించారు. ఆహారసమస్యపై బ్రహ్మాండమైన వుద్యమాన్ని సాగించారు. కాని పంచమాంగదళం ఆహారసమస్య ఆధారంగా తీసుకుని మరొక పర్యాయం దేశాన్ని అరాచకోద్యమానికి గురిచేసి తమ జపాను యజమానులకు దారి శుభ్రముచేయడానికి ఆశించింది; దేశంలో యెల్లడల కరువుదోపిళ్ళు, అంతర్యుద్ధం తీసుకురావడానికి కృషిచేసింది. ఈ పంచమాంగదళ కుట్రలను కమ్యూనిస్టులు యెదుర్కొని వాళ్ళ మాటలువింటే ప్రజలకు వచ్చేది తుపాకిగుండ్లుగాని, ఆహారంగాదని ఆచరణద్వారా ప్రజలకు ఋజువు చేయగల్గాం. ఆహారంకోసం ప్రజా ఐక్యతను పెంపొందించడంద్వారానే ప్రజలకు తిండి లభించునని ప్రజలందరిలో ప్రచారంచేసి ఆచరణలో నిరూపించగల్గారు.

ప్రజలందరికి తిండి, గుడ్డ వగయిరా వస్తువులను అందజేయడానికి కమ్యూనిస్టులు ఒక కార్యక్రమము ప్రకారము దేశమంతటా పనిజేశారు. కార్మికులకు చౌకడిపోలద్వారా ఆహారాన్ని సంపాదించి పరిశ్రమల్లో సమ్మెలురానీయకుండా ఉత్పత్తిని నిరాటంకంగా జరిగేటట్లుజేశారు. గ్రామ - కూలీ రైతు సామరస్యం యేర్పరచి, తద్వారా గ్రామైక్యతను యేర్పరచి పల్లెప్రాంతాల కూలీలు కరువు దోపిళ్ళకు, అంతఃకలహాలకు దిగకుండా, అధికపంటలను పండించడానికి పూనుకొనేటట్లు చేశారు. కార్మికులు, రైతులు తయారుచేసిన సరుకులను, పండించిన పంటలను ప్రజలకందరికీ అందేటట్లు, తిండిదొంగలచేతుల్లో పడకుండా వుండేటట్లు ప్రయత్నం చేస్తున్నారు. ప్రజల కందుబాటులో వుండే ధరలకు సరుకులను, ఆహారపదార్థాలను ప్రజలకు అందజేయడానికి కంట్రోలు ధరలను యేర్పరచాలని ప్రజలను సమీకరిస్తూ ప్రభుత్వంపై వత్తిడితెస్తున్నారు. క్షామానికి గురిఅయిన బెంగాలు, రాయలసీమ, మలబారు, ఒరిస్సా రాష్ట్రాలకు ప్రజలందరూ యధోచితంగా సహాయపడుటకు కరువునివారణ వుద్యమాలను సాగిస్తున్నారు. రైతులు పండించే పంటలకు అధికధరలు రావాలనే అధికలాభాపేక్షకు గురియై క్షామ పరిస్థితులను మరింత తీవ్రపర్చకుండా, రైతులు దేశభక్తితో ముందుకువచ్చి ప్రజలకందుబాటులో వుండే ధరలకు తాము పండించే పంటలు సరఫరా చేయాలని రైతుల్లో దేశభక్తిపూరిత ప్రచారం సాగిస్తున్నారు.

ఈ విధంగా దేశమంతటా కమ్యూనిస్టులు ఆహారసమస్యపై తీవ్రకృషి జేస్తున్నారు. ఆహారసమస్యపై ప్రజలను వివిధరంగాల్లో ఐక్యపర్చుతూ జాతీయైక్యతకు పునాది వేస్తున్నారు. ప్రజాసంఘాలను బలపర్చుతూ ప్రజాశక్తిని, సంఘటనను అభివృద్ధి జేస్తున్నారు. ఆహారసమస్య రోజురోజుకు తీవ్రమౌతూ దేశం నలుమూలలకు వ్యాపించుతూ వున్నప్పటికిని అది దేశానికి ముప్పుతెచ్చే పెద్ద తుపానుగా మారకుండా అరికడుతున్నారు.

ఆహారసమస్యపై కమ్యూనిస్టులు గావిస్తున్నకృషి దేశభక్తులలో వ్యాపించిన నిరాశ, నిస్పృహలను కొంతవరకు తొలగించింది. కాని, యింకా యీ సమస్యపై దేశభక్తులందరూ ఐక్యమై కార్యాచరణకు ముందుకు రాగల్గేటట్లు పార్టీ చేయజాలకపోయింది. పంచమాంగదళము ఆహారసమస్యా పరిష్కారానికియిచ్చే కరువుదోపిళ్ళ కార్యక్రమమును దేశభక్తులెవ్వరూ అంగీకరించకపోయినప్పటికిని కమ్యూనిస్టులు సాగిస్తున్న కార్యక్రమమువైపుకు యింకా మొగ్గడంలేదు. కమ్యూనిస్టుల కార్య



క్రమాన్ని భగ్నముచేయడానికి పంచమాంగదళముకు తోడ్పడుతూ వుండడమో లేక చూస్తూ వూరుకోవడమో యింకా జరుగుతూనే వుంది. ఆహారసమస్యపై కమ్యూనిస్టులుయిచ్చే ప్రధాన నినాదాలను యింకా అంగీకరించక పోవడమే దీనికి కారణం. ఆహార సమస్యపై కమ్యూనిస్టులుయిచ్చే నినాదాలు ప్రభుత్వాన్ని బలపర్చడానికే, ప్రభుత్వంతో సహకారం చేయడానికే తోడ్పడతాయి అని వారి వుద్దేశ్యం. ప్రజలను సమీకరించి ఐక్యపర్చడానికి, జాతీయ నాయకులను తత్ఫలితంగాకలిగే ప్రజాశక్తిద్వారా విడుదల చేయించుకోడానికి యిదొక్కటే మార్గమని వారు గ్రహించడంలేదు. అందుచేత ప్రభుత్వమే ఆహారసమస్య కంతకూ బాధ్యత గాబట్టి జాతీయ ప్రభుత్వ మేర్పడేంతవరకు ఆహారసమస్యా పరిష్కారంకొరకు చేసేదేమీ లేదని, అంతవరకూ ప్రభుత్వం లొంగిరావడానికి ప్రతిష్టంభనను కొనసాగించుటేనని వాదించుతారు. ఈ విధంగా కాంగ్రెసువాదులు ఆహారసమస్యపై పార్టీతో సహకారం చేయడానికి నిరాకరిస్తూ కూర్చున్నారు.

జాతీయ సంక్షోభాన్ని తొలగించడానికి కమ్యూనిస్టుపార్టీ కృషిజేస్తున్ననూ, ప్రధాన రాజకీయ పార్టీలు యీ కార్యక్రమాన్నింకా అంగీకరించక పోవడంవలన జాతీయ సంక్షోభం యింకా తొలగలేదు. తీవ్రమౌతూనేవుంది. పార్టీ కార్యక్రమముద్వారా ప్రజలను వివిధరంగాల్లో ఐక్యపర్చుతూ వున్నప్పటికిని విశాలమైన ప్రజాఐక్యత, దేశభక్తులందరూ కలసి రాకపోవడంవలన, యేర్పడలేదు. పార్టీ కార్యక్రమాన్ని దేశభక్తులింకా అంగీకరించక పోవడంవలన పార్టీకి ప్రారంభంలో యేర్పడ్డ వ్యతిరేకకూటమి యింకా రద్దుగాలేదు. వెనుకటి పంచమాంగదళ కార్యక్రమము (విధ్వంసక చర్యలు వగైరా) అంటే దేశభక్తులు విముఖత్వముచెందినా, దేశరక్షణద్వారా దేశ స్వాతంత్ర్యము సంపాదించాలనే కమ్యూనిస్టుల కార్యక్రమము అంగీకరించక పోవడంవలన పంచమాంగదళము యింకా కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా దేశభక్తులను సమీకరించి మోసపుచ్చగల్గుతూనే వుంది. విధ్వంసక చర్యల కార్యక్రమాన్ని యెవరూ బలపర్చకపోవడం వలన పంచమాంగదళము నూతన కార్యక్రమముపై దేశభక్తులను సమీకరించుతోంది. కమ్యూనిస్టుల బలాన్ని క్షీణింపజేయడానికి ప్రతిరంగంలోను కమ్యూనిస్టు వ్యతిరేక విచ్ఛిన్నచర్యలను కొనసాగించుతోంది. వీటిద్వారా దేశభక్తులపై మరల పూర్తి నాయకత్వం సంపాదించాలని ఆశించుతోంది. కమ్యూనిస్టు ప్రధాన రాజకీయ కార్యక్రమాన్ని దేశభక్తులు అంగీకరించకపోవడంవలన, కమ్యూనిస్టు కార్యక్రమము దేశస్వాతంత్ర్యపోరాటాన్ని బలహీనపర్చుతోందనే వుద్దేశ్యంతో దాన్ని విచ్ఛిన్నము చేయడానికి పూనుకున్న పంచమాంగదళ విచ్ఛిన్న చర్యలకు చేయూత యిస్తున్నారు.

కమ్యూనిస్టుపార్టీది నిజమైన జాతీయపంథా ; అదొక్కటే దేశస్వాతంత్ర్యాన్ని సాధించే కార్యక్రమము. అందుచేత కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమము ప్రజల కార్యక్రమము. తాత్కాలికంగా దేశభక్తులు దురభిప్రాయాలకు లోనైనప్పటికి తప్పక చివరకు కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమము అంగీకరించక తప్పదు. ప్రజలకొరకు పనిజేస్తూవున్న పార్టీని యెవరూ అణచలేరు. 20 సంవత్సరాలుగ బ్రిటిష్‌ప్రభుత్వం పార్టీని తనబలాన్నంతా వినియోగించి తుడిచివేయాలని చూచింది. విఫలమైంది. అలాగే కమ్యూనిస్టుపార్టీ బలాన్ని క్షీణింపజేయడానికి పనిజేసే పంచమాంగదళము జయముపొందదు; దాని ప్రయత్నాలు విఫలమౌతాయి. పార్టీ యింకా యెక్కువ పట్టుదలతోను, దీక్షతోను పనిజేయాలి. స్వతంత్రబలాన్ని, ప్రజాధారాన్ని హెచ్చుజేసుకోవాలి. ప్రజారంగాలలో కృషిద్వారా నిజమైన దేశభక్తులను ఆకర్షించాలి.

# ప్రజా యుద్ధకాలంలో పార్టీ నిర్మాణం

## ప్రజా యుద్ధకాలానికి ముందు పార్టీ నిర్మాణం :

సామ్రాజ్యవాద యుద్ధకాలంలోనే పార్టీ నిర్మాణము ప్రారంభమైనదని వెనుకటి అధ్యాయంలో చూచాము. పార్టీ నిర్మాణముయొక్క ఆకారం సృష్టించబడింది. పార్టీ నిర్మాణ ప్రాముఖ్యతను పార్టీ నాయకత్వమే గాకుండా స్థానికపార్టీ నాయకులందరూ గ్రహించారు. పార్టీ కేంద్రంఅంటేను, పార్టీ కేంద్రనాయకత్వమంటేను పార్టీ సభ్యులందరిలోను భక్తిశ్రద్ధలు యేర్పడ్డాయి. ఇంతకుముందు పార్టీ సభ్యుల్లో స్థానికతత్వం వుండేది; పార్టీ కేంద్రముఅంటే పట్టీపట్టక వుండేవారు. ఈ మార్పులవలన పార్టీలో నిజమైన కేంద్రీకరణ వచ్చింది. పార్టీ కేంద్రం రాజకీయంగా నాయకత్వం వహించడమే గాకుండా యిప్పుడు నిర్మాణరీత్యా పార్టీ కేంద్రం నడుపుతోంది. కేంద్రపార్టీ నిర్మాణరీత్యా యిచ్చే సూచనలన్నిటిని క్రింది కమిటీలు ఆచరణలో పెట్టడానికి ప్రయత్నించుతున్నాయి.

స్థానికపార్టీ నాయకులు పార్టీ నిర్మాణావశ్యకతను గుర్తించడమేగాకుండా తమతమ ప్రాంతాలలో పార్టీని నిర్మించడానికి ప్రయత్నాలుచేశారు. రహస్య పార్టీ కేంద్రాలను యేర్పరచి పార్టీ యంత్రాన్ని నిర్మించారు స్థానికపార్టీ సభ్యులుగూడ తమంతటతామే పార్టీని నడుపుకోడానికి తగిన శిక్షణ వారికి యివ్వడానికిగూడ కొన్నిచోట్ల ప్రయత్నాలు జరిగాయి. ప్రథమసారిగా స్థానికపార్టీ సెల్లులు పార్టీ నాయకుల సహాయం లేకుండానే పార్టీ పద్ధతులో పనిజేయడం ప్రారంభించాయి. కేంద్రకమిటీ నుండీ, క్రింది స్థానిక సెల్లులవరకు, పార్టీ పద్ధతులలో పనిజేయడానికి ప్రయత్నం జరిగింది. పార్టీ నిర్మాణము అస్థిపంజరం యేర్పడింది.

ఈవిధంగా పార్టీని నిర్మించడానికి సామ్రాజ్యవాద యుద్ధంలో జరిగిన కృషిఫలితంగా పార్టీని రూపుమాపుటకు బ్రిటిష్ సామ్రాజ్యవాదం యెంత తన్నుకులాడినా ప్రయోజనం లేకపోయింది. పార్టీని రూపుమాపాలన్న ప్రభుత్వ ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. ప్రభుత్వ నిర్బంధం యెంతవున్నా, పార్టీ ప్రజాయుద్ధకాలం వచ్చేసరికి నిర్మాణరీత్యా బలపడింది. పార్టీని పార్టీ పద్ధతుల్లో పనిజేయించ డానికి, నిర్మాణరీత్యా యింకా బలప్రదం చేయడానికి ఒక ఆధారమేర్పడింది పార్టీని నిర్మించడానికి సామ్రాజ్యవాద యుద్ధకాలంలో జరిగిన ప్రయత్నాలే లేకపోయినట్లయిన, ప్రజాయుద్ధ కాలంలో పార్టీ గడించిన ఫలితాలు సంభవించి యుండేవిగావు. ప్రజాయుద్ధకాలంలో పార్టీ త్వరత్వరగా అభివృద్ధి అవడానికి కారణం సామ్రాజ్యవాద యుద్ధకాలంలో ప్రచండమైన ప్రభుత్వనిర్బంధము మధ్య పార్టీని నిర్మించడానికి చేసిన కృషియే.

## ప్రజాయుద్ధకాలం — పార్టీ నిర్మాణ కర్తవ్యాలు :

సామ్రాజ్యవాద యుద్ధం ప్రజాయుద్ధంగా మారడంతోనే పార్టీపై నిర్మాణరీత్యా యెన్నడూలేని భారం పడింది; పార్టీయొక్క రాజకీయ, నిర్మాణపు శక్తిసామర్థ్యాలు గొప్ప పరీక్షకు గురిఅయ్యాయి. మనపార్టీ రాజకీయపంథా ఒక్కటే దేశాన్ని ఆవరించిన క్లిష్టపరిస్థితులనుండి రక్షించగల్గేది. తదితర రాజకీయ పార్టీలపంథా యేదీకూడా దేశాన్ని రక్షించజాలదు; స్వాతంత్ర్యం సాధించజాలదు; ఈ పరిస్థితుల్లో పార్టీపైనున్న రాజకీయ బాధ్యతల కనుగుణ్యంగా పార్టీ అభివృద్ధిగావాలి. పార్టీ ముఖ్య రాజకీయ నినాదాల ననుసరించే నిర్మాణపు కర్తవ్యాలు నిర్ణయించబడుతాయి. పార్టీ దానిపైవున్న రాజకీయ



బాధ్యతను నిర్వహించగల్గితే దేశం స్వాతంత్ర్యాన్ని సాధించగల్గుతుంది; దేశానికి, పార్టీకి భవిష్యత్‌లో గొప్ప అవకాశాలు యేర్పడుతాయి. కమ్యూనిస్టులంగా మనకున్న విలువ, శక్తినంతా చూపెట్టి పార్టీపైనున్న రాజకీయ కర్తవ్యాన్ని నిర్వహించడానికి నిర్మాణరీత్యా అభివృద్ధి అయితే దేశం రక్షింపబడుతుంది; లేకపోతే దేశం నాశనం గావాల్సివస్తుంది. దానితోపాటు పార్టీగూడ నాశనమైపోవలసివస్తుంది. అందుచేత దేశాన్ని నాశనంగాకుండా రక్షించడమా లేక దేశనాశనంతోపాటు మనపార్టీగూడ క్షీణించిపోవడమా అనే సమస్యలు పార్టీని యెదుర్కొంటున్నాయి.

పార్టీ పాలసీని ప్రజలందరిచేత, అన్ని రాజకీయ పక్షాలచేత సాధ్యమైనంత త్వరలో అంగీకరింపజేసి దేశరక్షణను కొనసాగించడానికి, దేశ స్వాతంత్ర్యాన్ని సాధించడానికి జాతీయైక్యతను నిర్మించడానికి పార్టీ యెడతెగని వుద్యమాన్ని ప్రారంభించాలి. అందుకు తగిన పార్టీయంత్రాన్ని సృష్టించుకోవాలి. ఇదే పార్టీ నిర్మాణపు కర్తవ్యం.

పార్టీ ముఖ్య నిర్మాణపు కర్తవ్యాలివి :

1. ప్రస్తుతం మన పార్టీకున్న పలుకుబడి, స్థానాన్నిబట్టి మన పార్టీని ప్రజాపార్టీగా చేయాలి.

2. ప్రజలందరికీ రాజకీయనాయకత్వం వహించగల్గే శక్తి సామర్థ్యములు గలిగి, క్రమశిక్షణతోను, బోల్షివిక్ పట్టుదలతోను పని జేయగలిగిన పార్టీనాయకులను స్థానిక సెల్లునుండి సెంట్రలు కమిటీవరకూ తయారుచెయ్యాలి ఇందుకు పార్టీనాయకత్వాని కంతకూ నూతన రాజకీయ, నిర్మాణపు కర్తవ్యాల గూర్చి తర్ఫీదు యివ్వాలి. ప్రతిపార్టీ యూనిట్ నాయకుడు ఆ యూనిట్‌ను జయప్రదంగా నడిపించగల శక్తి సామర్థ్యములు గల్గియుండాలి ; ప్రతి పైకమిటీ తన క్రిందికమిటీలను సక్రమముగా పనిజేయించగల్గేటట్లు తర్ఫీదు యివ్వాలి. ప్రతిపార్టీ కేంద్రం ఆ ఏరియాలోని పార్టీనంతనూ నడిపించ గలిగి వుండాలి.

ప్రతి క్లిష్టసమయములోను చురుకుగా, త్వరగా కార్యాచరణకు దిగి ఒకటీమ్‌లాగ క్రమశిక్షణతో పనిజేసేటట్లు మొత్తం పార్టీనంతనూ తర్ఫీతు చెయ్యాలి ; ప్రజలకు దూరమవకుండా ప్రజలతో లీనమైపోయి వారిని నడపగల్గే ప్రజాపార్టీగాతయారుగావాలి. ఇవే పార్టీ ముఖ్య నిర్మాణపుకర్తవ్యాలు.

## ప్రజాపార్టీ :

ప్రజాపార్టీని తయారుచేయడంఅంటే యేమిటి ?

మనపార్టీ భారతదేశంలో మూడవరాజకీయపార్టీగా వున్ననూ యింకా ప్రజాపార్టీగా లేదు. మలబారు, బెంగాలులో కొన్ని జిల్లాలు, ఆంధ్రలో కొన్ని ఫిర్కాలు - వీటిల్లోమాత్రమే ప్రజలందరికీ పార్టీ నాయకత్వం వహిస్తోంది. సంయుక్తరాష్ట్రాలు, బొంబాయి రాజధాని, గుజరాతు, పంజాబు, బీహారు మొదలయిన రాజకీయంగా అభివృద్ధిపొందిన రాష్ట్రాల్లో పార్టీ పలుకుబడి చాల తక్కువగా వుంది. దేశం మొత్తంమీదచూస్తే మహమ్మదీయులలో పార్టీకి పలుకుబడి తక్కువగానేవుంది. అందువలననే ముస్లిమ్‌లీగు గాంధీజీ విడుదలకోసం యింతవరకు ముందుకువచ్చేట్లు చేయజాలకపోయాము.

పార్టీ దేశాన్ని యెదుర్కొన్న సమస్యలను పరిష్కరించాలంటే, అన్ని రాష్ట్రాల్లోను, అన్ని జిల్లాలల్లోను అన్ని గ్రామాల్లోను ప్రజలపై పలుకుబడిని సంపాదించాలి. ప్రతిప్రాంతంలోను అన్ని వర్గాల ప్రజల్లోనూ జొరబడాలి. ప్రతివర్గంలోను అన్నికులాలకు, మతాలకుచెందినవారిలో పలుకుబడిన్ని

సంపాదించాలి: ప్రజలందరినీ రైతు, కూలీ, కార్మిక, విద్యార్థి వగయిరా ప్రజాసంఘాలల్లో సంఘటిత పర్చాలి. అన్నిసంఘాలల్లో చురుకుగా పనిజేసే దేశభక్తులంతా పార్టీలో చేర్చుకోబడాలి. అన్నికులాలు, మతాలకు చెందినవారుగూడ పార్టీలో వుండాలి. ఒక గ్రామంలో పార్టీ ప్రజాపార్టీగా అయిందంటే అర్థం అచ్చటి ప్రజలందరూ రైతు, కూలీ, యువజన, మహిళా సంఘాల్లో చేరారన్నమాట; ఈప్రజా సంఘాలల్లో చురుకుగా పనిజేసే ప్రజాసేవకులంతా పార్టీలో జేరారన్నమాట. గ్రామములోవున్న ప్రతికులానికిచెందినవారు పార్టీలో వున్నారన్నమాట. ఇలాంటప్పుడు పార్టీ గ్రామములోవున్న సమస్య లన్నింటిని పరిష్కరించగల్గుతుంది. ఈ విధంగా భారతదేశమంతటా పార్టీ అభివృద్ధి అయినప్పుడు ప్రజాపార్టీగా తయారవుతుంది.

పార్టీ అన్ని ప్రాంతాల, వర్గాలు, కులాలు, మతాల ప్రజల్లోకి వ్యాపించి, సంఖ్యలో అనేకరెట్లు అవడమేగాక, ప్రతి పార్టీసభ్యుడూ తనను స్థానికంగా యెదుర్కొన్న సమస్యలను మార్క్సిస్టు దృక్పథంతో పరిశీలించి పరిష్కరించగల రాజకీయ సిద్ధాంత పరిజ్ఞానం కలిగివుండాలి. ఇందుకు మార్క్సిజంయొక్క ప్రధాన సూత్రాలను, ప్రపంచ రాజకీయాలనుగూర్చిన పరిజ్ఞానం కల్గివుండాలి.

పార్టీసభ్యులంతా కష్టపడి పనిజేయడంచాలదు. వారంతా పార్టీ పద్ధతుల్లో పనిజెయ్యాలి. అంటే ప్రతి పార్టీసభ్యుడు యేదో యొక పార్టీ యూనిట్‌లో (స్థానికసెల్లు, స్థానికకమిటి, ఫ్రాక్షన్) వుండాలి. ప్రతివిషయాన్ని యూనిట్‌లో సమిష్టిగా చర్చించాలి పార్టీ యూనిట్ శక్తినిబట్టి పని యివ్వాలి. పార్టీ చేసిన నిర్ణయాలను సమిష్టిగా అమలుజరపాలి. మరల పార్టీ, యూనిట్ సమావేశంలో చేసిన పనిని గూర్చి విమర్శన చేసుకోవాలి. లోటుపాట్లను సరిదిద్దుకోవాలి. ముందు కార్యక్రమం వేసుకోవాలి. యూనిట్ మొత్తం పార్టీ కార్యక్రమాన్ని అమలు పర్చడానికి ఒకప్లాను ప్రకారం పనిజేయాలి.

పార్టీనాయకత్వం (సెల్లు కార్యదర్శులు, జిల్లా, రాష్ట్ర, కేంద్రకమిటీలు, ప్రజాసంఘాల ఫ్రాక్షనులు) ముందు రాబోయే విషయాలను, సూచనలను బట్టి గ్రహించి పార్టీసభ్యులకు చక్కని కార్యక్రమము యిచ్చి వారిని నడపగలిగినశక్తి గలిగియుండాలి. పార్టీసభ్యులను టీముగా ముందుకు తీసుకుపోగలిగిన ఆచరణయోగ్యమైన అనుభవము, పరిజ్ఞానం గల్గియుండాలి. పార్టీసభ్యులు, తమను స్థానికంగా యెదుర్కొన్న సమస్యలను పరిష్కరించగల రాజకీయ పరిజ్ఞానం కలిగి పార్టీపద్ధతుల్లో పనిజేస్తున్నప్పుడు, పార్టీనాయకత్వం పరిస్థితుల కనుగుణ్యంగా యెప్పటికప్పుడు తగిన కార్యక్రమము యిచ్చి నడుపుతున్నప్పుడు పార్టీ తన శక్తినంతను అవుసరమైన సమస్యమీద కేంద్రీకరించగల్గుతుంది. ఆవిధంగా ప్రజల సమస్యలను పరిష్కరించి ప్రజానాయకత్వం వహించి ప్రజాపార్టీగా తయారు అవుతుంది.

పైవిధంగా మనపార్టీని ప్రజాపార్టీగా తయారుచేయడం యీకాలంలో పార్టీనిర్మాణపు ప్రధాన కర్తవ్యం. పార్టీ యీవిధంగా తయారు గావడానికి తగిన జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులున్నాయి. దేశాన్ని నేడు యెదుర్కొనుచున్న సమస్య లన్నిటిని పరిష్కరించగల రాజకీయపంథా పార్టీ ఒక్కదానికేవుంది. ఈరాజకీయపంథాను అమలుపర్చడానికి పార్టీకి సుశిక్షితులైన 20 వేల సైనికులున్నారు. పార్టీ పనిజేస్తున్న కొలది దేశభక్తులందరూ పార్టీ కార్యక్రమమువైపుకు ఆకర్షింపబడుతారు. క్రమేణా పార్టీలోగూడ జేరుతారు. ఇలాంటివారిసంఖ్య నానాటికి హెచ్చుతుంది. వీరందరికి కార్యక్రమము యిచ్చి పనిజేయించుతూ వారిని అభివృద్ధిజేసే పార్టీ నేడు కమ్యూనిస్టుపార్టీ తప్ప మరొకటిలేదు.



అందుచేత కమ్యూనిస్టుపార్టీ నిర్మాణము వీరందరినీ యిముడ్చుకోగల్గివుండాలి. అప్పుడే ప్రజాపార్టీ అవుతుంది; పార్టీపైనవున్న భారమైన రాజకీయ బాధ్యతలు నిర్వహించబడుతాయి.

పార్టీని ప్రజాపార్టీగా జేయడానికిగాను పార్టీ నిబంధనావళిలో కొంతమార్పు తీసుకురాబడింది. పార్టీ సభ్యత్వానికి వుండవలసిన అర్హతలు కొంతవరకు తగ్గించబడ్డాయి. ఇదివరలో పార్టీ సభ్యులుగా జేర్పించుకోవడంలో కొంత నియమము యేర్పరచబడింది. సామ్రాజవాదయుద్ధకాలంలో ప్రభుత్వ నిర్బంధపుదాడిని యెదుర్కొని పార్టీని రక్షించుకోవాలంటే పార్టీ సభ్యులను విరివిగాజేర్చడం సాధ్యం కాలేదు. అన్ని పరీక్షలకు బాగా యిదివరలో గురిఅయినవారినే జేర్చుకోవడం అవసరమైంది. లేక పోతే పార్టీ అస్థిత్వానికి హానిగల్గేది. ఇప్పుడు పార్టీపై నిషేధం తొలగించబడినతరువాత, పార్టీ యొక్కటే దేశభక్తులందరూ నిర్వహించాల్సిన బాధ్యతలు నిర్వహించవలసి వచ్చినతరువాత సామ్రాజ్యవాదకాలంలో పార్టీ సభ్యత్వానికి పెట్టిన నియమాలు అనవసరం, అంతేగాకుండా పార్టీ త్వరితగతిని అభివృద్ధిని అరికట్టేటట్లు వున్నాయి. అందుచేత పార్టీ సభ్యత్వ నియమాలు కొంతవరకు పడలింపబడ్డాయి. పార్టీ కార్యక్రమాన్ని అంగీకరించి, పార్టీ యూనిట్‌లోవుండి దాని క్రమశిక్షణకు లోబడి యేదో ప్రజారంగాలల్లో చురుకుగా పనిజేస్తున్న వారినందరినీ పార్టీలో జేర్చుకోగల్గేటట్లు నియమాలు సడలించబడ్డాయి. సోవియట్‌యూనియన్ కష్టజీవుల రాజ్యమనియు, అలాంటిరాజ్యాన్ని మనదేశంలో గూడ యేర్పరచాలనియు, సోషలిస్టు సిద్ధాంతాలగూర్చి తెలుసుకుందామని అభిలషించుతుంటే చాలు; యిదివరకు మాదిరిగా మార్క్సిస్టు, లెనినిస్టు ప్రధానసూత్రాలు పార్టీలోకి రాకముందే తెలుసుకొని వుండనవసరంలేదు. పార్టీలోకి జేర్చుకుని వారి రాజకీయపరిజ్ఞానాన్ని, మార్క్సిస్టుపరిజ్ఞాన్ని అభివృద్ధి చేయాలి. ఇది పార్టీబాధ్యత.

ఈ పై నియమము ననుసరించే యిదివరకు పార్టీ సహాయకసభ్యులు (అగ్జిలరీసభ్యులు) గా వున్నవారినంతా తక్షణమే పార్టీలో జేర్చుకోవాలని నిర్ణయింపబడింది. ఇకముందు పార్టీ నిర్మాణములో ఆగ్జిలరీ సెల్లులు వుంచరాదనియు, పార్టీసెల్లులు, పార్టీ మిలిటెంట్సుగామాత్రమే వుండాలనిగూడ నిర్ణయింపబడింది. రాజకీయ పరిస్థితుల ననుసరించి పార్టీ నిర్మాణపు కర్తవ్యాలు నిర్ణయింపబడ్డాయి.

ప్రజాయుద్ధకాలములో పార్టీ నిర్మాణపు కర్తవ్యాలు యేమిటో పైన చూశాము. ప్రజాపార్టీగా నిర్మించాలి అనేది ముఖ్య కర్తవ్యం. ప్రజాపార్టీఅంటే యేమిటో తెలుసుకున్నాము. దాన్ని నిర్మించడానికి యేయేపద్ధతులు అవలంబించాలో తెలుసుకోవాలి. ప్రజాపార్టీ నిర్మించడానికి కేవలం పార్టీ సభ్యత్వం పెంపొందించడమే చాలదు. 1. పార్టీ పద్ధతులలో ప్రతి పార్టీసభ్యుడు, ప్రతి పార్టీకమిటీ పనిజేసేటట్లు తయారుచెయ్యాలి. అంతేగాదు. 2. స్థానికంగా ప్రతి పార్టీయూనిట్ తనను ఎదుర్కొనే ప్రజాసమస్యలను సరిగా అవగాహనం చేసుకొని జయప్రదంగా పరిశీలించడానికి తగిన రాజకీయ సిద్ధాంత, అనుభవ పరిజ్ఞానం గడించాలి. ఇలా ప్రతి యూనిట్‌ను తర్ఫీతు చేయడానికి పార్టీ యేర్పాట్లు చేయాలి. పైరెండు కర్తవ్యాలు నెరవేర్చందే పార్టీ ప్రజాపార్టీగా తయారుగాదు.

## పార్టీ పద్ధతుల్లో పనిచేయాలి:

పార్టీ సభ్యులంతా కష్టపడి పనిజేస్తూ వున్నంతమాత్రానే పార్టీ నిర్మింపబడదు. పార్టీ సభ్యులందరూ పార్టీ పద్ధతుల్లో పనిజేయాలి. వ్యక్తిగతంగా యెవరి శక్త్యానుసారం వారు పనిజేస్తూవుండడం పార్టీ పద్ధతిగాదు. పార్టీ సభ్యులందరూ టీమ్‌గా ఒక ప్లానుప్రకారం, క్రమశిక్షణతో పనిజేయడం

పార్టీపద్ధతి. ప్రతి పార్టీసభ్యుడూ యేదోయొక పార్టీ యూనిట్‌లో వుండాలి. సభ్యులు తాము చేయబోయే ప్రతివిషయాన్ని సమిష్టిగా సెల్లులో చర్చించాలి. సమిష్టిగా తమ పనులను నిర్వహించడానికి ఒక ప్లాను వేసుకోవాలి. ఎవరు ఏపని నిర్వహించాలో పని విభజన గావించుకోవాలి. తమ ప్రత్యేక బాధ్యతలను, తమ యూనిట్ మొత్తం బాధ్యతలను నిర్వహించడానికి గట్టిగా కృషి జేయాలి. పని తీసుకొనేటప్పుడు సభ్యుల శక్తినిబట్టి, యూనిట్ శక్తినిబట్టి అంచనావేసుకొని తీసుకోవాలి. తక్కువ అంచనా వేయడంగాని, యెక్కువ అంచనా వేయడంగాని జరుగరాదు. తక్కువ అంచనావేస్తే పని కుంటుపర్చబడుతుంది; పార్టీ ముందుకుబోదు. ఎక్కువ అంచనావేస్తే పని పూర్తిగాక నిరుత్సాహం గల్గి అసలు పనిచేయడమే మానివేస్తారు. అందుచేత శక్తినిబట్టి పనులు విభజించుకోవాలి. సభ్యులు యెవరెవరు యెంతవరకు బాధ్యతలను నిర్వహించారో తనిఖీ చేయడానికి మరల సెల్లు సమావేశంలో చేసిన పనినిగూర్చి పరిశీలించాలి. లోటుపాట్లు వుంటే సరిదిద్దుకోవాలి. ముందు కార్యక్రమము మరల నిర్ణయించుకోవాలి.

పార్టీ సభ్యులలో ఒకరిపై ఒకరి చాడీలు చెప్పుకోరాదు; ఏ పార్టీ సభ్యుడైనా తప్పుజేస్తున్నట్లు తెలిస్తే సెల్లులోపెట్టి నిర్మొగమోటంగా అడగాలి. అతని తప్పును ఆ విధంగా సకాలంలో సరిదిద్దగల్గుతారు. లేకపోతే పార్టీ సభ్యులమధ్య అనుమానాలు, దురభిప్రాయాలు ప్రబలుతాయి. చివరకు పార్టీలో విచ్ఛిన్నానికి దారితీస్తాయి. నిర్మొగమోటంగా ఆత్మవిమర్శ చేసుకోవాలంటే అవతలి పార్టీ సభ్యుడు నిరుత్సాహపడిపోయి పార్టీలోనుంచి వెళ్ళిపోయేటట్లు విమర్శ వుండరాదు. ఆత్మవిమర్శ పార్టీ సభ్యులను పుత్తేజపర్చేదిగాను, వాళ్ళ తప్పులను వారిచేత గుర్తింపజేసి సరిదిద్దుకొనేదిగా వుండాలి.

పార్టీ పద్ధతులను సెంట్రల్‌కమిటీ నుండి స్థానికపార్టీ సెల్లువరకు పార్టీ కమిటీలన్నీ యెలా ఆచరించాలో చూద్దాం.

## సెంట్రల్ కమిటీ :

ప్రజాయుద్ధకాలం వచ్చేంతవరకూ సెంట్రల్‌కమిటీ యెలా పనిజేస్తోందో పరిశీలించుదాం. సెంట్రల్‌కమిటీ సభ్యులు తమలోతాము సెంట్రల్‌కమిటీ పనులను విభజించుకొని వాటిని నిర్వహిస్తూ మొత్తం పార్టీకంతకూ నాయకత్వము వహించి పనిజేయడమనేది యిదివరకు జరుగలేదు. కేంద్ర కమిటీ సభ్యుడే "గిర్నికంగారు యూనియన్" ముఖ్య పనినిగూడా జేస్తూ వుండేవాడు. సెంట్రల్‌కమిటీ సభ్యుడుగా తనకున్న బాధ్యతలను నిర్వహించలేకపోయేవాడు. ఈ కారణంచేత సెంట్రల్‌కమిటీ సభ్యుల పనిఅంతా ఒక్క పొలిట్‌బ్యూరోమాత్రమే చేస్తుండేది; పొలిట్‌బ్యూరో పనినంతా పార్టీ కార్యదర్శి జేస్తుండేవాడు. ఈ విధంగా పార్టీకేంద్రం పనిజేసింది. స్థానికగ్రూపుల సమ్మేళనముగా మాత్రమే పార్టీవున్న రోజుల్లో యీ విధంగా పనిజేయడం సహజమే. కాని నూతన పరిస్థితులేర్పడి, పార్టీపై తీరని బాధ్యతలు పడ్డప్పుడు పై విధంగా పనిజేయడమంటే పార్టీని నిర్మించడంగాదు; పార్టీని ధ్వంసంచేయడమౌతుంది. స్థానిక పార్టీపనులలోను, ప్రజాసంఘాల పనులలోను మునిగిపోయిన పార్టీ కేంద్రం తమకిచ్చిన పనిని మర్చిపోతూవున్నంతకాలం సెంట్రలుకమిటీ సభ్యులుగాను, కేంద్రపార్టీ నాయకులుగాను పనిచేయజాలరు. సెంట్రల్‌కమిటీ సెంట్రల్‌కమిటీగా పనిజేయజాలదు. అంతేగాదు,



కేంద్రకమిటీసభ్యుల రాజకీయస్థాయిలోవున్న అసమానత్వంపోదు: అది పోనంతకాలం భారతదేశాని కంతకు నాయకత్వం వహించగల పార్టీ నాయకత్వం తయారుగాదు.

కాన సెంట్రల్‌కమిటీ పనిజేసే విధములోనే పూర్తిమార్పు రావాలి. సెంట్రల్‌కమిటీ సభ్యులందరూ హెచ్చుకాలం కేంద్రంలోవుంటూ సెంట్రల్‌కమిటీ పనిని చేస్తూవుండాలి. తమకు యిచ్చిన ప్రత్యేక బాధ్యతలను నిర్వహిస్తూ కేంద్రపార్టీ మొత్తపు బాధ్యతలన్నిటిని సమిష్టిగా నిర్వహించడానికి ఒక టీములాగ పనిజేయాలి. ఇందుకుగాను సెంట్రల్‌కమిటీ సభ్యులందరి స్థాయి దరిదాపు అంతా ఒకటిగా వుండాలి. తక్కువస్థాయి వున్నవాళ్లు త్వరత్వరగా అభివృద్ధి గావడానికి బోల్షివిక్ కృషి గావించాలి.

ఏ రాష్ట్రానికైనా సెంట్రలుకమిటీ సభ్యులు పంపబడినప్పుడు ఆ రాష్ట్రపు పనిలోనే మునిగిపోరాదు. సెంట్రలుకమిటీ సభ్యుడుగా తాను నిర్వహించాల్సిన బాధ్యతలు నిర్వహించాలిగాని రాష్ట్ర కమిటీసభ్యులు చేయాల్సిన పనులన్నీ వీరే చేస్తూ కూర్చుంటే సెంట్రలుకమిటీ పనులు వెనుకబడతాయి. సెంట్రలుకమిటీకి పంపాల్సిన రిపోర్టులు పంపడం, సకాలంలో తిరిగి కేంద్రపార్టీ ఆఫీసుకువెళ్ళి సెంట్రలుకమిటీ తదితర పనులు పూర్తిచేయడానికి తోడ్పడడం - యివన్నీ రాష్ట్ర పనులలో మునిగిపోతే చేయడం సాధ్యంగాదు. అప్పుడు సెంట్రలుకమిటీ తన మొత్తపు బాధ్యతలన్నిటినీ నిర్వహింపజాలదు. ఈ సందర్భంలో యింకొక జాగ్రత్త తీసుకోవాలి. కేంద్రకమిటీ సభ్యులు రాష్ట్రాలకు వచ్చినప్పుడు రాష్ట్రాల పనుల్లో మునిగిపోగూడదనే నెపంతో అసలు రాష్ట్రాల సమస్యలలో వేటితోను జోక్యం కలుగజేసుకోకుండా, వాటిని పరిష్కరించడానికి ప్రతి విషయంలోను సమగ్రమైన, ఆచరణయోగ్యమైన సూచనలను యివ్వకుండా కేంద్రకమిటీ నిర్ణయాలను, రాజకీయ రిపోర్టునుమాత్రంచెప్పి తిరిగివస్తే అపాయంగూడవుంది. ఇలా చేయడం కేంద్రకమిటీ బాధ్యతను నిర్వహించడంగాదు; కేంద్రకమిటీ పేరుతో పెత్తనంచేయడంమాత్రమే అవుతుంది. రాష్ట్ర కమిటీవి యెదుర్కొనే ప్రతి సమస్యపైన తగిన సలహాలను కేంద్రకమిటీ సభ్యుడు యివ్వాల్సివుంటుంది. అవసరమైతే ఆ సూచనలను ఆచరణలో పెట్టడానికిగూడ తానే మార్గంగూడ చూపెట్టాలి. అప్పుడే కేంద్రపార్టీపైన రాష్ట్రకమిటీకి నిజమైన విశ్వాసం, గౌరవం వుంటుంది. కేంద్రకమిటీ ప్రతిసూచనను గౌరవంతో మన్నించుతుంది. గ్రహించాల్సిన విషయమేమంటే స్థానికతత్వంతో ఒకరాష్ట్రపు పనిలోనే కేంద్రకమిటీ సభ్యులు మునిగిపోరాదు. కేంద్రకమిటీబాధ్యతలను వ్యక్తిగతంగాను, తదితర సభ్యులందరితోగూడి సమిష్టిగాను నిర్వహించడమే తమ ప్రధాన కర్తవ్యంగా యెంచాలి.

కేంద్రకమిటీ జయప్రదంగా దాని బాధ్యతలను నిర్వహించాలంటే రాష్ట్రకమిటీలు పూర్తిసహకారం చెయ్యాలి. ముఖ్యంగా తమ రాష్ట్రాలల్లో కేంద్రకమిటీసభ్యుల స్థాయిలో వున్నవారిని కేంద్రకమిటీకి యివ్వడానికి ముందుకు రావాలి. రాష్ట్రంలో కేంద్రకమిటీసభ్యులుగా, నాయకులుగా పనికివచ్చే వారందరినీ కేంద్రకమిటీ పనికి యివ్వకుండా వారు యెప్పుడూ రాష్ట్రములోనే వుండి రాష్ట్రకమిటీపని చూడాలనేభావం రాష్ట్రకమిటీల కున్నంతకాలం కేంద్రకమిటీ నామకఃమాత్రమే వుంటుంది. అందుచేత రాష్ట్రకమిటీలు స్థానికతత్వాన్ని పూర్తిగా విసర్జించివేయాలి. తమ ప్రాంతాలనుండి కేంద్రకమిటీపనికి పంపే రాష్ట్రనాయకుల స్థానాలను బాగా పనజేస్తూ త్వరగా అభివృద్ధి గాంచుచున్న జిల్లా నాయకులతో నింపాలి. వారికి తగు శిక్షణ తర్ఫీతు యివ్వాలి. ఇలా చేసినప్పుడే కేంద్రపార్టీ నాయకత్వం నిర్మింపబడుతుంది.

## రాష్ట్రకమిటీలు :

రాష్ట్రకమిటీల ముఖ్యవిధు లివి : జిల్లాకమిటీలను, పార్టీ మొత్తాన్నంతనూ కేవలం రాజకీయంగా నడిపేకేంద్రాలుగా వుండడమేగాకుండా, వాటిని దైనందినం పనిజేయించే పార్టీకేంద్రాలుగా వుండాలి. కేంద్రకమిటీ యిచ్చే రాజకీయనినాదాలను, కార్యక్రమాన్ని జిల్లాకమిటీలకు అందజేసే కేంద్రాలుగా మాత్రమేగాక, వాటిని జిల్లాకమిటీలచేత, పార్టీసభ్యులందరిచేత రాష్ట్రపరిస్థితులకు అన్వయింపజేసి ఆచరణలో పెట్టించడానికి యెప్పటికప్పుడు తగిన సూచనలు, సలహాలు రాష్ట్రకమిటీ యిస్తుండాలి. అప్పుడే పార్టీనంతనూ ముఖ్యంగా జిల్లాకమిటీలను దైనందిన సమస్యలమీద నడపగల్గుతుంది.

ఇలా రాష్ట్రకమిటీ పనిజేయాలంటే రాష్ట్రకమిటీ సభ్యులంతా ఒకటీమ్‌లాగ కలసి పనిజేయాలి. వారిమధ్య సంపూర్ణమైన రాజకీయైక్యత యేర్పడాలి. వారికందరకూ ఒకే విధమైన పార్టీ చైతన్యం, అనుభవజ్ఞానం, ఆచరణాశక్తులు వుండాలి. రాష్ట్రకమిటీలు యిలా తయారవ్వాలంటే, సెంట్రలుకమిటీ దైనందినం రాష్ట్రకమిటీచేసే పనులను, దాని ప్రతిసమస్యను పరిశీలన గావించుతూ యెప్పటికప్పుడు సూచనలు చేస్తూవుండాలి. కొన్ని నెలలకొకపర్యాయం రాష్ట్రకమిటీసభ్యులను పిలిపించి వారిలోపాలను చూపెట్టి, వాటిని సవరించుకోడానికి అతిసామాన్యమైన సూచనలు యివ్వడంమాత్రమే చాలదు. సెంట్రల్ కమిటీకి రాష్ట్రకమిటీ తమ దైనందినసమస్యలగూర్చి రిపోర్టుపంపుతూ వుండాలి; సెంట్రలు కమిటీ యెప్పటికప్పుడు వాటి పరిష్కారానికి తగిన సూచనలు పంపుతూ రాష్ట్రకమిటీలను దైనందినం నడుపుతూవుండాలి.

సెంటరునుండి ప్రతిచిన్న విషయానిపై నిర్ణయమురానిదే పనిచేయకుండా ' సెంటరే సూచనలు పంపిస్తుందిలే ' అనే మనస్తత్వముతో రాష్ట్రకమిటీలు కూర్చోవచ్చు. ఇలా కూర్చోవడం పరిస్థితుల కెప్పటికప్పుడు అన్వయింపజేసే నినాదాలను పార్టీకిచ్చి బోల్షివిక్ చొరవతో పార్టీని ముందుకు తీసుకుపోకుండా యెప్పటికప్పుడు పరిస్థితులకు వెనుకబడి వుండడమౌతుంది. పరిస్థితులకు యెప్పటికప్పుడు ముందుండి పార్టీనంతా సామర్థ్యంతో నడపగల శక్తిపోతుంది. అందుచేత అన్ని విషయాలల్లో దిగజారుడుపంథా అవలంబించుతారు. తరువాత ఆత్మవిమర్శ చేసుకోబోయి ఒకళ్ళనొకళ్ళు తప్పులు యెన్నుకోవడం జరుగుతుంది. పైకమిటీలు క్రింది కమిటీలమీద, క్రింది కమిటీలు పైకమిటీలమీద విమర్శించుకోవడం, యివి అవీ గాకపోతే పరిస్థితులను నిందించడం జరుగుతుంది దీనిమూలాన పార్టీ జీవితం, పార్టీపని అంతా నాశనమౌతుంది. అందుచేత రాష్ట్రకమిటీలు బోల్షివిక్ చొరవను యెప్పుడూ వీడగూడదు; పరిస్థితులకు యెన్నడూ వెనుకబడకుండా ముందుండాలి. ఇలా చేస్తూనే తమల నెదుర్కొనే సమస్యలను యెప్పటికప్పుడు సెంటరుకు తెలియపర్చుతూ సెంటరు సూచనలను యెప్పటికప్పుడు పొందుతూ వుండాలి. సెంటరు సూచనలు రావడం ఆలస్యమైతే వాటికొరకై యెదురుచూస్తూ కూర్చోకుండా రాష్ట్రములోని పరిస్థితులబట్టి తమకున్న రాజకీయ, నిర్మాణపు అనుభవంతో నిర్ణయం వెంటనే తీసుకుని పార్టీ సభ్యులకందరకు తెలియజేయాలి. సెంటరు సూచనలను బట్టి పొరపాట్లుంటే దిద్దుకోవచ్చు. ఇలాచేయడం బోల్షివిక్ చొరవతో పనిచేయడం అవుతుంది.

రాష్ట్రకమిటీ సభ్యులు అందరూ తలొక ప్రత్యేక బాధ్యత తీసుకుని పనిజేయాలి. ఒకరు కార్యదర్శిగాను, ఒకరు సంపాదకులుగాను, ఒకరు సహాయ కార్యదర్శిగాను తతిమ్మావారు పార్టీ ఆర్గనైజర్లుగా ప్రజారంగాలను విభజించుకోవాలి. రాష్ట్రకమిటీ సభ్యుడు ఒక జిల్లాపార్టీ నాయకుడుగా మాత్రమే వుండిపోరాదు. రాష్ట్రపార్టీ తరపున రాష్ట్రమంతటా పనిజేసే హోల్‌టైమరుగా వుండాలి.



పరిస్థితులతోపాటు మారి వాటికన్నా యెప్పుడూ ముందు వుండేటట్లు మొత్తం పార్టీయూనిట్లను తయారుచేయడం, రాష్ట్రకమిటీల ప్రథమ కర్తవ్యం. ఇందుకు పార్టీసభ్యులకు, పార్టీ కమిటీలకు రాజకీయ రిపోర్టింగు ప్రతినెలా యివ్వడం చాల అవసరం. రాజకీయ తర్ఫీదు యెప్పటికప్పుడు పరిస్థితులు మారినప్పుడల్లా యివ్వడంవలన క్రిందికమిటీలు, పార్టీసభ్యులు ప్రతివిషయాన్ని రాజకీయంగా పరిశీలించడం నేర్చుకుంటారు. అందుచేత క్రిందికమిటీలకు రాజకీయరిపోర్టింగు యివ్వడమనేది రాష్ట్రకమిటీ ప్రత్యేక బాధ్యతగా తీసుకోవాలి. దానితోపాటు పార్టీ హోల్‌టైమర్సుకు, పార్టీ ఆర్గనైజర్లకు గూడ ప్రస్తుత రాజకీయ నినాదాలగూర్చి, ముఖ్య నిర్మాణసూత్రాలగూర్చి తర్ఫీదు యివ్వడానికి ప్రత్యేక స్కూళ్ళుపెట్టాలి.

## జిల్లాకమిటీలు :

జిల్లా కమిటీసభ్యులుగూడ రాష్ట్రకమిటీసభ్యులవలె ఒక టీమ్‌లాగ కలిసి పనిజేయాలి. సభ్యులందరిస్థాయి దాదాపు ఒకే మాదిరిగా లేకపోతే టీమ్‌లాగ పనిజేయడం సాధ్యంగాదు. జిల్లాకమిటీ సభ్యులు నేరుగా ప్రజానాయకత్వం వహించి పనిజేయాలి. పార్టీసభ్యులకు, పార్టీయూనిట్లకు నాయకత్వం వహించి పనిజేయడమేగాకుండా వారు ప్రజలతో ప్రత్యక్ష సంబంధాలుగల్గి ప్రజా నాయకత్వం వహించాలి. తమ రంగాల్లో వారు పార్టీ నాయకులుగామాత్రమేగాకుండా ప్రజానాయకులుగా వుండాలి. అప్పుడే పార్టీసభ్యులందరినీ ప్రతిసమస్యపైనీ నడపగల్గుతారు; పార్టీ అంతాకదిలి పనిజేయగల్గుతుంది. జిల్లాకమిటీ సభ్యులకు—ప్రజలకు నేరుగా సంబంధం వుండకపోతే ప్రజలలోను, పరిస్థితులలోను యెప్పటికప్పుడు వచ్చే మార్పులతోపాటు వారుగూడ మారి తగిన కార్యక్రమము వేసుకోలేకపోతారు. జిల్లాకమిటీలయొక్క ప్రధాన కర్తవ్యము పార్టీ యంత్రంద్వారా ప్రజలచేత పార్టీ కార్యక్రమాన్నంతా ఆచరణలో పెట్టించడానికి కృషిజేయడం; ప్రజలకు వివిధరంగాలలో నాయకత్వం వహించి వారిని నడుపుతూ ప్రజావుద్యమాన్ని నిర్మించడం. ఇలా జిల్లాకమిటీలు తమ బాధ్యతలను నిర్వహించేటట్లు వాటిని, పార్టీ కేడర్లనంతానుతర్ఫీదుచేయడం రాష్ట్రకమిటీ బాధ్యత.

ప్రతి జిల్లాకమిటీ సభ్యుడు తనకిచ్చిన రంగంలో ప్రజానాయకుడుగా తయారవడమేగాకుండా ఆ రంగంలో పార్టీ యంత్రాన్ని నిర్మించి అభివృద్ధిచేసే బాధ్యత తీసుకోవాలి. పార్టీ నిర్మింపబడకపోతే యెంత శక్తిసామర్థ్యము లున్నప్పటికినీ ఒక్కడే రోజురోజుకూ హెచ్చుగుచున్న బాధ్యతలను నిర్వహించలేకపోతాడు. అందుచేత తన పనిని సక్రమముగా నిర్వహించడమేగాక, పార్టీ సభ్యులందరకు, పార్టీయూనిట్లకు, ప్రజాసంఘాలకు ప్రాథమిక పార్టీ పనులు యిచ్చి వాటిచేత సక్రమముగా చేయించుతూ ఆయా పనులకు వాటిని తర్ఫీదుజేస్తూవుండాలి. తానే అన్నిపనులుజేస్తూ క్రింది పార్టీయూనిట్లను పార్టీసభ్యులను వాటి వాటి ప్రాథమిక పనులు నిర్వహించడానికి తర్ఫీదు చేయకపోతే వుద్యమము వ్యాప్తిచెందదు; కొంతకాలానికి ధ్వంసంగూడా అవుతుంది. అందుచేత పార్టీ పద్ధతి యేమంటే ప్రతి జిల్లాకమిటీసభ్యుడు తనపనిని సక్రమముగా నిర్వహిస్తూనే తనక్రింది పార్టీయూనిట్లను, పార్టీసభ్యులను ప్రజాసంఘాలను వాటి వాటి బాధ్యతలు నిర్వహించేశక్తి కలుగజేయడానికి నిరంతరం కృషిజేయాలి. అదే పార్టీని నిర్మించడం; ప్రజావుద్యమాన్ని నిర్మించడం. ఈ సందర్భంలో ఒక విషయం బాగా

గుర్తుంచుకోవాలి. క్రిందీ పార్టీయూనిట్లు, పార్టీసభ్యులు, ప్రజాసంఘాలు - యివి వాటి బాధ్యతలను జయప్రదంగా నిర్వహించాలంటే వాటిని యెలా చెయ్యాలో జిల్లాకమిటీసభ్యుడు సూత్రప్రాయంగాచెప్పి ఇన్‌స్ట్రక్షన్సు యిచ్చి వెళ్ళిపోతే సాధ్యపడదు. అలాచేస్తే వాటిపై పెత్తనం చెలాయించే సూపర్‌వైజర్ల లాగ అవి జిల్లాకమిటీ సభ్యులను తలుస్తాయిగాని వాటిని ఉత్సాహపరుస్తూ నడిపించే వాటి నాయకులుగా వారిని పరిగణించవు. అందుచేత వాటన్నిటికి నాయకత్వం వహించి ప్రజలమధ్య వాటి నెదుర్కొన్న సమస్యలపై జిల్లాకమిటీసభ్యులు స్వయంగా నడపాలి. స్వయంగా ఆందోళన, వుద్యమాలకు నాయకత్వం వహించి తమక్రింది యూనిట్లను ఉత్తేజపర్చాలి. అప్పుడే వాటిచేత పనులు చేయించగల్గుతారు; చేసినవాటిని తనిఖీచేసి ఆచరణయోగ్యమైన సూచనలు యివ్వగల్గుతారు.

## పార్టీ సెల్లులు - పార్టీ ఆర్గనైజర్లు :

పార్టీపై నేడున్న రాజకీయ, నిర్మాణపు బాధ్యతలను సక్రమముగా నిర్వహించాలంటే పార్టీ ఆర్గనైజర్ల, హోల్‌టైమర్ల సంఖ్య పెరగాలి. పార్టీపనికై తమ యావత్కాలాన్ని వినియోగించే వారిని వారి రాజకీయ నిర్మాణపు స్థాయినిబట్టి రాష్ట్ర, జిల్లా, తాలూకా పార్టీ ఆర్గనైజర్లుగా తీసుకోవాలి. వారికి తగిన తర్ఫీతు యిచ్చి వారిని అభివృద్ధిజేయాలి. ఇలాంటి ఆర్గనైజర్లసంఖ్య పెరగనిది స్థానిక పార్టీయూనిట్లను సక్రమముగా పనిజేయించలేము.

ఆర్గనైజర్లు ఏయేపనులు చెయ్యాలి? ఆర్గనైజర్లు జిల్లాలకు, తాలూకాలకు వెళ్ళేముందు పార్టీ కార్యదర్శులు వారు యే పనులు యెలా చేసుకురావాలో స్పష్టమైన ఇన్‌స్ట్రక్షన్సు యివ్వాలి. ఇలాంటి ఇన్‌స్ట్రక్షన్సు యివ్వకుండా ముందుగా చర్చించకుండా వాళ్లను పంపితే వారి బుద్ధికి తోచినట్లు పనులు చేసుకువస్తారు. 'తరువాత అలాచేశావు, యిలాచేశావు' అని విమర్శించడంవలన ప్రయోజనం లేదు. అది పార్టీ పద్ధతిగాదు. ప్రతివిషయము, ప్రతి సమస్యగూర్చి ముందుగా సమిష్టిగా చర్చించి వివరాలతోకూడిన ఇన్‌స్ట్రక్షన్సు యివ్వాలి. మరల తిరిగి వచ్చినతరువాత ఆ సూచనలను యెంత వరకు అమలుజరిపిందీ, యిచ్చిన ఇన్‌స్ట్రక్షన్సు సరియైనదీ లేనిదీ తనిఖీచేయాలి. అనుభవాన్నిబట్టి మరల కొత్తఇన్‌స్ట్రక్షన్సు ఇచ్చిపంపాలి. ఇలాచేస్తే పనులూ జరుగుతాయి. ఆర్గనైజర్లు పార్టీపద్ధతిలో పనిజేయడం నేర్చుకుని అభివృద్ధీ అవుతారు.

ఆర్గనైజర్సు చేయాల్సిన పనులివి: క్రింది యూనిట్లకు రాజకీయ రిపోర్టింగు యివ్వాలి. వాటిని యెదుర్కొనే సమస్యలను పరిష్కరించడానికి సూచనలు యివ్వాలి. సూత్రప్రాయంగా సూచనలు యివ్వడమేగాకుండా వాటిని యెలా ఆచరణలో పెట్టాలో వివరాలుతో కూడిన కార్యక్రమము తయారు చెయ్యాలి. అవసరమైనచోట్ల ఆర్గనైజర్లే స్వయంగా దాన్ని యెలా అమలు పర్చాలో చూపెట్టాలి. దీనివలన ఆర్గనైజర్లకు అనుభవజ్ఞానం హెచ్చుతుంది; క్రింది యూనిట్లకు పార్టీయిచ్చిన కార్యక్రమము సరియైనదనే విశ్వాసం యేర్పడి యిదివరకుకంటె ఆత్మవిశ్వాసంతో పనిజేస్తారు. పార్టీనిర్ణయాలుగాను, పైకమిటీ నిర్ణయాలుగాను ఆర్గనైజర్లు తాముయిచ్చే సూచనలను క్రింది కమిటీలపై రుద్దరాదు. అవి యెలా ఆచరణయోగ్యమో తామే స్వయంగా చూపెట్టి క్రింది కమిటీలకు నచ్చజెప్పాలి. అప్పుడే పై కమిటీలకు, క్రింది కమిటీలకు మధ్య సంపూర్ణమైన విశ్వాసము ఉంటుంది; క్రిందికమిటీలను పై కమిటీలు ఉత్తేజపర్చి ఒక టీమ్‌లాగ పనిజేయించ గల్గుతాయి. ఆర్గనైజర్లు యీ పనులన్నీ చేసిన మీదటనే పార్టీకేంద్రానికి తిరిగి రావాలి: సూత్రప్రాయంగా పై కమిటీ సూచనలను నిర్ణయాలను



క్రింది కమిటీలకు వల్లించి తమ బాధ్యత తీరిపోయిందని ఆర్గనైజర్లు పార్టీ కేంద్రానికి తిరిగి వచ్చేయరాదు.

ఆర్గనైజర్లు పార్టీ కేంద్రానికి తిరిగి వచ్చినప్పుడు తాముచేసిన పనినిగూర్చి, దాని ఫలితాలగూర్చి వ్రాతమూలకమైన రిపోర్టును తయారుచేసి పార్టీ కార్యదర్శికి యివ్వాలి. ఊరకే గాసిప్‌చేసి వెళ్ళరాదు. ఆర్గనైజర రిపోర్టులపై యితర సభ్యుల కుపయోగించే యేవైనా సర్క్యులర్లుగాని, పార్టీ లెటర్లుగాని తయారుచేయాల్సి వున్న వాటిని ఆర్గనైజర్లచేత పార్టీకార్యదర్శి వ్రాయించాలి. ఈవిధంగా పనిజేస్తే ఆర్గనైజర్సు జిల్లాలకు వెళ్ళి పనిజేయడమేగాక ఆఫీసులోవుండి పనిజేయడానికిగూడ తర్ఫీతు చేయబడతారు. సర్వతోముఖంగా అభివృద్ధి అవుతారు.

ఆర్గనైజర్లు జిల్లాలకు, తాలూకాలకు వెళ్ళినప్పుడు పార్టీ పత్రికలకు యెప్పటికప్పుడు అచ్చట సమస్యలగూర్చి, వుద్యమాన్నిగూర్చి వార్తలు పంపుతూవుండాలి. తాము పంపే అనుభవాలగూర్చి, తమను యెదుర్కొనే సమస్యలగూర్చి యెప్పటికప్పుడు పార్టీపత్రిక ముఖాన ప్రకటించుతూవుంటే అవి యితరప్రదేశాల ఆర్గనైజర్లకు ఎంతోవుపయోగకరంగా వుంటాయి. అప్పుడే పార్టీపత్రిక నిజమైన పార్టీ ఆర్గనైజరుగా తయారు అవడానికి ఏలుంటుంది.

ఆర్గనైజర్లు సాధారణ పార్టీసభ్యులకంటె ఉత్తమ లక్షణాలు కల్గియుండాలి. వ్యక్తిగత జీవితం అన్నివిధాల ఆదర్శప్రాయంగా వుంచుకోవాలి. అందరికంటె నిర్మాణాత్మకంగా పనిజేయాలి. పార్టీ పనులు చేయడంలోనే పార్టీపద్ధతులు అవలంబించడమే గాకుండా, వ్యక్తిగత ప్రవర్తనములో గూడ జీవితాన్ని నిర్మాణయుక్తమైన కట్టుబాట్లలో నడుపుకోవాలి. మంచి ఓర్పుగల్గి యుండాలి: పెత్తందారుల వలె ప్రవర్తించరాదు. పార్టీసభ్యులనుండి నేర్చుకోవలసిన విషయాలుంటే నేర్చుకోవాలి. పార్టీసభ్యులు తమపై గావించే విమర్శను సరిగా తీసుకోవాలి. తప్పును వెంటనే అంగీకరించాలి. తప్పిపుచ్చుకో డానికి పెనుగులాడగూడదు.

వ్యక్తిగతంగా దైనందినం అభివృద్ధి అవడానికి పూర్తి కృషిచేయాలి. ముఖ్యంగా సిద్ధాంత పరిజ్ఞానాన్ని నానాటికి పెంపొందించుకుంటూవుండాలి. పార్టీసాహిత్యాన్ని (పార్టీ సర్క్యులర్లు, పార్టీ లెటర్లు, పార్టీ పత్రికలు, పార్టీ ప్రచురణలు) బాగా అధ్యయనం చేస్తూవుండాలి. దైనిక పత్రికను తప్పక రోజూ చదువుతూవుండాలి. తన పూర్తికాలాన్ని పార్టీ పనికై వినియోగించుతూవుండాలి.

పై కమిటీల సూచనలకు యెదురుచూస్తూ కూర్చోకుండా బోల్షివిక్ చొరవతో పనిజేయాలి.

పార్టీ ఆర్గనైజర్లు యెంత అభివృద్ధి అవుతూవుంటే అంతవేగంగా పార్టీయంత్రం అభివృద్ధి అవుతుంది. అందుచేత పార్టీ పై కమిటీలు, పార్టీ ఆర్గనైజర్లు పైవిధంగా అభివృద్ధి అయ్యేటట్లు, పార్టీ పద్ధతుల్లో పనిజేసేటట్లు పూర్తి శ్రద్ధతీసుకుని కృషిజేయాలి.

## పార్టీ సెల్లులు :

పార్టీ యంత్రానికంతకూ స్థానికపార్టీ యూనిట్ పునాదివంటిది. స్థానికపార్టీ యూనిట్లు సక్రమముగా పనిజేయనిదే పార్టీయంత్రం అంతా జయప్రదంగా పనిజేయజాలదు. స్థానికపార్టీ యూనిట్లను నడపగలిగిన సెల్లు నాయకులు తయారుగానిదే స్థానికపార్టీయూనిట్లు సక్రమముగా పనిజేయజాలవు. అందుచేత సెల్లునాయకులను తర్ఫీతుచేయడం ప్రథమ కర్తవ్యం. ఈ బాధ్యతను జిల్లాకమిటీలు తీసుకోవాలి.

సెల్లు నాయకులుగా యెవరువుండాలి? సెల్లు సెక్రటరీ తన ప్రాంతములో ప్రజలకు నాయకత్వం వహించి పనిజేయగల శక్తిసామర్ధ్యములు గలిగివుండాలి. తమ ప్రాంతాల్లోని ప్రజలసమస్యలను పూర్తిగా అవగాహనం చేసుకొని యుండాలి. ప్రజలకు అర్ధమయ్యేటట్లు మాట్లాడగలశక్తి వుండాలి. (పెద్ద వుపన్యాసకుడుగాకపోయినా). తమ ప్రాంతానికి సంబంధించిన అన్నిపనులు వారు చేయగల సమర్థులై వుండాలి.

తమ సెల్లులలోవున్న పార్టీ సభ్యులందరి విశ్వాసాన్ని చూరగొన్నవారుగా వుండాలి. పై కమిటీలు తమపై పెత్తందార్లుగా పెట్టారనేభావం సెల్లు సెక్రటరీలపై సెల్లు సభ్యులకుండరాదు. స్థానిక సమస్య లన్నింటిలో చొరవతో పాల్గొని ఆత్మవిశ్వాసంతో పనిజేయగలవారుగా వుండాలి. సిద్ధాంత పరిజ్ఞానం సంపాదించడానికి, యింకా బాగా అభివృద్ధి పొందాలనే కోర్కెవుండాలి.

సాధారణంగా యీ లక్షణాలన్నీ మన పార్టీ సభ్యుల్లో అంతర్భూతమై వుంటాయి. వాటిని అభివృద్ధిజేసి వారిని తర్ఫీతుజేస్తే తప్పక సామాన్యపార్టీ సభ్యులలో కాస్త చొరవవున్నవారు సెల్లు నాయకులుగా తయారు అవుతారు. ఈ బాధ్యతను పై కమిటీలు నిర్వహించకుండా పార్టీసభ్యుల, పార్టీ కేడర్లస్థాయి చాల తక్కువగా వుందని, సెల్లులు సరిగా పనిజేయడంలేదని సాకుజెప్పే ఆర్గనైజర్లు, పార్టీ కమిటీలు పార్టీ వ్యతిరేకులు. మన పార్టీసభ్యులు, మన కేడరు ప్రజలందరిలో అత్యున్నతమైన వారు; వారే చరిత్రను నిర్మించవలసినవారు. అట్టివారు వెనుకబడియున్నారని, సరిగా పనిజేయజాలరని వాపోయే పార్టీ ఆర్గనైజర్లకు, కమిటీలకు బోల్షివిక్ దృక్పథంలేదు; కఱ్ఱపెత్తనంచేసే నిరంకుశాధికారముమాత్రమే తెలుసు. అలాంటి పార్టీ ఆర్గనైజర్ల, కమిటీల లోటువలననే పార్టీసభ్యులు, మన కేడరు యింకా అభివృద్ధిగాకుండా వెనుకబడివుంది. పార్టీ సెల్లులు, పార్టీ సభ్యులు చేయాల్సిన పనులేమి?

ప్రతి పార్టీసెల్లు ఒక టీములాగ ప్రతి విషయంలోను పనిజేయాలి. పార్టీ సభ్యులు చేయాల్సిన ప్రతి పనిని ముందు సెల్లులోపెట్టి చర్చించి, నిర్ణయాలు తీసుకోవాలి. ఆ నిర్ణయాలను అనుసరించి సెల్లు సభ్యులంతా సమిష్టిగా కలసి, పనిజేయాలి. పార్టీసభ్యులుచేసే ప్రతిపనికి నిర్ణీతకోటాలు నిర్ణయించుకోవాలి. సెల్లుమొత్తంకోటానంతా పూర్తిజేయడానికి పనిజేయాలి. కోటా తీసుకునేటప్పుడే సెల్లుసభ్యుల శక్తి సామర్థ్యాల ననుసరించి తీసుకోవాలి. యెక్కువ కోటాలు తీసుకుని పూర్తి గాకపోతే నిస్పృహచెంది చతికిలబడగూడదు. తక్కువ కోటాలు తీసుకుని పార్టీ మొత్తం ప్లానును తలక్రిందులు చేయగూడదు. అంచనా తక్కువ, యెక్కువ లేకుండా సరిగా వేసుకోవాలి.

సెల్లు సమావేశాన్ని ప్రతివారం జరిపి చేసిన పనినిగూర్చి పునర్విమర్శ చేసుకోవాలి. వున్న లోపాలను సరిజేసుకొని ముందు కార్యక్రమము వేసుకోవాలి. చేసిన పనినిగూర్చి, తమను యెదుర్కొనే సమస్యలగూర్చి పై కమిటీకి రిపోర్టు రెగ్యులర్‌గా పంపుతూవుండాలి. ప్రతిసెల్లుకు పార్టీ ప్రచురణలు అన్నిటితోకూడిన లైబ్రరీ ఒకటి వుండాలి.

ప్రతి పార్టీసభ్యుడూ యేంచెయ్యాలి? ప్రతి పార్టీసభ్యుడు తాను తప్పనిసరిగా చేయాల్సిన పనులేవో నిర్ణయించుకోవాలి. ముందు చేయాల్సిన పనులు, ముఖ్యంగా చేయాల్సినపనులు ముందు చెయ్యాలి. వాటిమీదనే కేంద్రీకరించాలి. చెయ్యలేనందుకు ఆసాకు, యీసాకు చెప్పరాదు.



కమ్యూనిస్టుపార్టీ విప్లవకరమైన పనులుగావించే పార్టీగాని, కబుర్లతో, కులాసాగా కాలము వెళ్ళబుచ్చే క్లబ్‌గాదు. ప్రతి పార్టీసభ్యుడు పార్టీ కార్యక్రమాన్ని అంగీకరించడమేగాకుండా దానిని అనుసరించి తన పార్టీసెల్లుక్రమశిక్షణకు లోబడి తప్పనిసరిగా ప్రతిరోజూ రెండుగంటలకాలము పని జేయాలి. తనవంతు పనిని విభజించుకొని ఆ ప్రత్యేకపనిని తన సెల్లులోని తదితరసభ్యులతో కలసి మెలసి పార్టీ నిర్ణయించినరీతిని చేస్తూవుండడమే నిజమైన క్రమశిక్షణ.

ఒక పార్టీసభ్యునిపై మరొక పార్టీసభ్యునికి యేదైనా అసంతృప్తి వుంటే దాన్ని పార్టీసెల్లులోనే సభ్యులందరి సమక్షంలో తీర్చుకోవాలి. తనకున్న అసంతృప్తిని అలా తీర్చుకోకుండా తనకు దగ్గరగా వున్న పార్టీసభ్యులతో చెప్పడం వారిని కలుపుకుని ముఠా కట్టడం ఫాక్షనలిజానికి దారితీస్తుంది. ఎచ్చటా, ఎవరివద్దనూ (పార్టీసభ్యుల ముందుగూడ) దాన్నిగూర్చి గాసిప్‌చేయకుండా ముందు కార్యదర్శికి చెప్పాలి; తరువాత సెల్లులో చెప్పాలి. నిష్కర్షగా విమర్శించి యెదటిపార్టీ సభ్యుని తప్పును దిద్దుకొనేటట్లు చేయాలి.

ఈ విధంగా ప్రతి యూనిట్‌లో ప్రతిసభ్యుడు ప్రవర్తించేటట్లు పార్టీయూనిట్ జాగ్రత్త తీసుకోవాలి. అప్పుడు పార్టీ, పార్టీపంథాను అభివృద్ధి అవుతుంది.

పార్టీసభ్యుని కనీస కర్తవ్యాలు యివి:

1. సెల్లు మీటింగులకు తప్పనిసరిగా నిర్ణీతకాలానికి హాజరుగావాలి; 2. పార్టీపాలసీని ప్రజల్లో ప్రచారం గావించాలి; 3. పార్టీ సాహిత్యాన్ని ప్రజలకు అమ్ముతుండాలి; తాను తప్పనిసరిగా అధ్యయనం చేస్తూవుండాలి. 4. తనపార్టీ యూనిట్ నిర్ణయాలను తప్పనిసరిగా అనులుజరపాలి; పార్టీ నిర్ణయాలకు తటస్థంగా వుండుటగాని, వాటి ననుసరించి పనిజేయకుండా వుండడంగాని ఏపార్టీ సభ్యుడూ చేయరాదు; 5. పార్టీ సభ్యత్వరుసుమేగాక పార్టీ విధించిన అదనపు రుసుములు, విరాళాలు ప్రతి పార్టీసభ్యుడూ చెల్లిస్తూవుండాలి తన ఆదాయములో ఎంతో కొంత మొత్తాన్ని పార్టీకి విరాళముగా యెప్పుడూ యిస్తూవుండాలి. అంతేగాకుండా తన సానుభూతి పరులనుండి, ప్రజలనుండి పార్టీనిధికి డబ్బు వసూలు చేస్తూవుండాలి.

ఏమీ పనిజేయకుండా సోమరిపోతుల్లాగ వున్న పార్టీసభ్యులు పార్టీ క్రమశిక్షణను ధ్వంసం చేస్తారు; తదితర సభ్యులుగూడ అభివృద్ధి అవకుండా అడ్డుపడతారు. అందుచేత ఏపార్టీసభ్యుడు గూడ సోమరిపోతులాగ వుండకుండా ప్రతి పార్టీ యూనిట్ జాగ్రత్త తీసుకోవాలి. అందుకుగాను యీ క్రింది విధంగా చేయాలి; సోమరులుగావున్న పార్టీ సభ్యులు యేపని జెయ్యాలో నిర్ణయించి ఆపని జేయడానికి అతనికి తగినంత తర్ఫీతు పార్టీ యూనిట్ యివ్వాలి. పార్టీ పాలసీగూర్చి పూర్తిగా బోధించి దానిని యితరులలో ప్రచారం చేయగల్గేటట్లు తర్ఫీతు యివ్వాలి. ఇవన్నీ చేసిన తరువాత పార్టీ నిర్ణయించినరీతిని అతనికి యిచ్చినపనిని చేయడానికి అతను పూనుకొనేటట్లు చేయాలి. రెండు నెలలు దాటినతరువాత ఫలితంచూచి వెనుకటి వలెనే యిన్ని చేసినతరువాతగూడ సోమరిపోతువలె యేమీ చేయకుండా కూర్చుంటే, అతను అభివద్ధి అవడానికి ప్రయత్నంగూడ యేమీ చేయకపోతే అతన్ని పార్టీనుండి తొలగించివెయ్యాలి. పార్టీలో పనిజేయని ప్రతి పార్టీసభ్యుని, సోమరిపోతును యీ విధంగా పార్టీ క్రమశిక్షణకు గురిచేసి పార్టీలోని కుళ్ళును బైటకు గొట్టాలి. అయితే ఆర్గనైజర్లు ఒక విషయం గ్రహించాలి. పార్టీలోనుండి వెళ్ళగొట్టడానికి హెచ్చుప్రాధాన్యత ఇవ్వకుండా, అలాంటి

పని చేయని సభ్యులను శక్తిఅంతా వుపయోగించి అభివృద్ధి గావించడానికి ముందుకృషిజేయాలి; యేవిధంగాను అభివృద్ధి అవడానికి వీలులేని పరిస్థితుల్లో పార్టీనుండి తొలగించాలి.

**పార్టీ ఫంక్షనరీలకు, పార్టీ సభ్యులకు శిక్షణయివ్వాలి:**

పార్టీపై నేడున్న రాజకీయ, నిర్మాణపు బాధ్యతలను నిర్వహించడానికిగాను పార్టీ ఆర్గనైజర్లకు, పార్టీ సభ్యులకు పూర్తి శిక్షణయివ్వాలి. పార్టీ పాలసీని ప్రజల్లో యెలా ప్రచారం చెయ్యాలనే విషయం మీద పార్టీ ఆర్గనైజర్లకు, పార్టీ నాయకులకు ముందు తర్ఫీతుయివ్వాలి. నూతన పరిస్థితులు రావడం వలన నూతన కార్యక్రమము, నూతన కర్తవ్యాలు యేర్పడ్డాయి. వీటిని సక్రమముగా నిర్వహించడానికి పార్టీ కార్యకర్తలకు, నాయకులకు స్పష్టమైన దృక్పథంవుండాలి. వీరే పార్టీనంతనూ నూతన పంథాను నడపవలసివుంది. వీరి బుర్రలే స్పష్టంగా లేకపోయిన పార్టీఅంతా గాడి తప్పుతుంది. అందుచేత పార్టీ కార్యకర్తలకు (రాష్ట్ర, జిల్లా, తాలూకా కమిటీల సభ్యులకు, పార్టీ ఆర్గనైజర్లకు) పార్టీ ప్రస్తుతపాలసీపై స్కూళ్లుపెట్టి, పూర్తి తర్ఫీతుయివ్వడం అత్యవసర కర్తవ్యమైంది. ఈస్కూళ్లు నడిపే బాధ్యత సెంట్రలుకమిటీది; రాష్ట్రకమిటీది.

పార్టీ ఆర్గనైజర్లను, నాయకులను తర్ఫీతు చేసినంతమాత్రాన పార్టీ యంత్రమంతా సక్రమముగా పనిజేయజాలదు. స్థానిక పార్టీ యూనిట్లను సక్రమముగా నడుపగల్గే సెల్లు సెక్రటరీలను తర్ఫీతు చేయనిదే స్థానికపార్టీ యూనిట్లు పనిచేయజాలవు. మొత్తం పార్టీ సభ్యులనంతా కదిల్చి కార్యాచరణకు పూనుకొనేటట్లు చేయాలంటే పార్టీ ఆర్గనైజర్లు, నాయకులు తీరికలేకుండా పనిజేస్తేనేజాలదు. సెల్లులు పనిజేయాలి. అప్పుడే పార్టీపై నేడున్న భారమైన రాజకీయ, నిర్మాణపు కర్తవ్యాలు నిర్వహించబడతాయి. అందుచేత పార్టీ ఆర్గనైజర్లను, నాయకులను పార్టీ పాలసీపై తర్ఫీతు చేయడమే గాకుండా దానిని అమలు జరుపడానికి, పార్టీ యంత్రాన్నంతా పనిజేయించడానికి సెల్లు కార్యదర్శులను తర్ఫీతు చేయాలి. వీరికి ప్రస్తుత పార్టీపాలసీ గూర్చి చెప్పడమేగాకుండా ప్రాథమిక నిర్మాణపు సూత్రాలను గూడ నేర్పాలి. సెల్లులను యెలా సక్రమముగా పనిచేయించాలో వారికి ప్రధానంగా నేర్పాలి. అప్పుడే స్థానికపార్టీ యూనిట్లు కదిలి పనిజేస్తాయి. ఈ బాధ్యతను జిల్లా కమిటీలు తీసుకోవాలి. బలంగా అవి లేనిచోట్ల రాష్ట్రకమిటీయే యీ బాధ్యతనుగూడ వహించాలి.

పార్టీ ప్రస్తుత పాలసీనిగూర్చి తర్ఫీతు చేసినంతమాత్రానే పార్టీని యెప్పటికప్పుడు యెదుర్కొనే సమస్యలను మార్క్సిస్టు దృక్పథంతో పరిష్కరించేశక్తి పార్టీ సభ్యులకు, పార్టీ ఆర్గనైజర్లకు రాదు. పరిస్థితులలో సూక్ష్మమైన మార్పులు యీ రోజుల్లో ఎక్కువగా వస్తూవుంటాయి పరిస్థితులు మారినప్పుడు వాటి కనుగుణ్యంగా నూతన నినాదాలను, నూతన ప్రచార పద్ధతులను వెంటనే అలవర్చుకోవాలి. వెనుకటి పాలసీ, పద్ధతులనే పట్టుకుని వ్రేలాడుతుంటే పరిస్థితులు మనకన్నా ముందు పోతాయి; పరిస్థితులకు యెప్పటికప్పుడు ముందుండి ప్రజలను నడపాల్సిన మనం వెనుకబడిపోతాం.

మనపార్టీ మార్క్సిస్టు, లెనినిస్టు సిద్ధాంతాల ననుసరించి పనిజేయుచుండుటవలన పార్టీ ఆర్గనైజర్లకు, నాయకులకు మార్క్సిస్టు, లెనినిస్టు మూలసూత్రాలు తెలిసివుండటం చాల అవసరం. పార్టీలో సిద్ధాంత పరిజ్ఞానమునకున్న స్థానాన్ని మర్చిపోరాదు. మన పార్టీ విప్లవ రాజకీయ పార్టీ అగుటచేత, ప్రతిపార్టీపనినిచేసేపద్ధతి, అందుకు అవలంబించాల్సిన యెత్తులు తెలుసుకోవడానికి



పార్టీసభ్యులందరూ శిక్షణ పొందాలి. పార్టీ పనులను యెవరి ట్రిక్కులతో వారు చేయడానికి వీలులేదు; పార్టీ పనులన్నీ పార్టీపద్ధతులలోను, ఒక క్రమపద్ధతిని చేయుటకు నేర్చుకోవాలి. ఇందుకు మార్క్సిస్టు, లెనినిస్టు ప్రధానసూత్రాలు తెలుసుకోనిదే సాధ్యంగాదు.

పార్టీ కార్యకర్తలు రాజకీయ నినాదాలను, యెత్తుగడలను పరిస్థితులబట్టి పై కమిటీలవైపుకు ఎదురుచూడకుండా తమంతట తామే యేర్పరచుకోగల రాజకీయ పరిజ్ఞానం వుండాలి. అప్పుడే బోల్షివిక్ చొరవతో క్లిష్ట సమయాల్లో నిలబడి పనిజేయగల్గుతారు. మన పార్టీయొక్క ప్రత్యేకలక్షణం ఏమంటే పార్టీ మూలసిద్ధాంతమైన మార్క్సిజము, లెనినిజము అనే వెలుగుతో యెంతటి చీకటి పరిస్థితుల్లోనైనా ప్రతి పార్టీసభ్యుడు పనిజేయగల శక్తివంతుడై వుండడానికి అవకాశం వుంది; మార్క్సిజం-లెనినిజం ఆయుధాలను వుపయోగించడం నేర్చుకుంటే యెంతటి క్లిష్ట పరిస్థితులనైనా జయప్రదంగా ఎదుర్కొని జయాన్ని సాధించవచ్చు. అందుచేత పార్టీసభ్యుల సిద్ధాంత పరిజ్ఞానాన్ని హెచ్చించడం పార్టీ ప్రధాన కర్తవ్యంగా యెంచుతుంది.

పార్టీ నాయకుల, ఆర్గనైజర్ల సిద్ధాంత పరిజ్ఞానాన్ని హెచ్చుజేయడానికి కృషిజేయడమే చాలదు. ఈనాడు పార్టీలోకి అనేకమంది జేరుతున్నారు; వీరి రాజకీయస్థాయి చాల తక్కువ. పార్టీ రాజకీయ పాలసీని, నినాదాలను ప్రజల్లో ప్రచారం చేయడానికి ధైర్యం, చొరవ వీరిలో వున్నాయి; పార్టీపాలసీ యొక్కటే నిజమైన దేశభక్తియుతమైన పాలసీ అని గట్టిగా మొండిగా పోట్లాడగల్గుతారు కాని అంతకన్నా దీర్ఘంగా వాటినిగూర్చి తెలియదు. రాజకీయ నినాదాలు, పోరాటపద్ధతులు పై కమిటీలు నిర్ణయించి పంపితే వాటిని పట్టుకుని యెంత తీవ్రంగానైనా, మొండిగానైనా చివరివరకూ పోరాడుతారు. వీరికిగాని, యిదివరకునుండి పార్టీలోవున్న పాత సభ్యులకుగాని మార్క్సిస్టు సిద్ధాంత పరిజ్ఞానం చాల తక్కువ. వాస్తవిక రాజకీయ పరిస్థితులను మార్క్సిస్టు దృక్పథంతో అర్థం చేసుకోవడం వలననే రోజురోజూ నినాదాలను పై కమిటీలు యివ్వగల్గుతున్నాయని, అలాగే తమకుగూడ మార్క్సిస్టు మూల సిద్ధాంతాలగూర్చి తెలిసివున్న పరిస్థితుల కనుగుణ్యంగా యెప్పటికప్పుడు తామే స్వయంగా రాజకీయ నినాదాలను యేర్పరచుకోగల్గుతామని వార్కి తెలియదు. తాము నిత్యం గావించే కార్యకలాపాలను మార్క్సిస్టు దృక్పథంతో యెలా అర్థంచేసుకోవాలో వారికి తెలియదు. వారు పై కమిటీలు యిచ్చే పనులుచేసే బంటులుగా తయారయ్యారేగాని వారు తమంతటతామే పనులు నిర్ణయించుకుని వాటిని స్వయంగా నిర్ణయించుకునే శక్తిని పెంపొందించుకోలేదు. అందుచేత పార్టీయిచ్చే రాజకీయ నినాదాలను ఆచరణలోపెట్టగల్గారేగాని తమంతటతామే అట్టినినాదాలను ఏర్పరచుకోగల్గిన మార్క్సిస్టు దృక్పథాన్ని అలవర్చుకోలేదు.

కమ్యూనిస్టుగా, మార్క్సిస్టుగా తనంతట తానే యే పార్టీసభ్యుడూ అభివృద్ధిగాలేడు. పార్టీ అభివృద్ధి చెయ్యాలి. సభ్యుడు యెలా అభివృద్ధి అయ్యేది, యెట్టివాడయ్యేది ఆ పార్టీయూనిట్ పైన, దాన్ని నడిపే నాయకుని పైన ఆధారపడి వుంటుంది. తర్ఫీతులేకుండా, శిక్షణపొందిన పార్టీ ఆర్గనైజర్లు తయారు గాకుండా యే కమ్యూనిస్టు పార్టీగూడ నిర్మింపబడలేదు అందుచేత పార్టీ ఆర్గనైజర్ల, నాయకుల పార్టీసభ్యుల సిద్ధాంత పరిజ్ఞానాన్ని పెంపొందింపచేయడానికి పార్టీ నిరంతరం కృషి జేస్తూవుండాలి. ఇందుకు పార్టీ ఈ క్రింది కర్తవ్యాలను నిర్వహించాలి. కేంద్రకమిటీ ఇంగ్లీషులో వున్న ప్రధాన మార్క్సిస్టు, లెనినిస్టు మూల గ్రంథాలను పునర్ముద్రణ చేసి పార్టీసభ్యులందరికీ అందచేయాలి: రాష్ట్రకమిటీలు వాటి తర్జుమాలను యెప్పటికప్పుడు వాటి దేశభాషల్లో చేస్తూవుండాలి. ప్రతి

పార్టీ సెల్లుకు యీ గ్రంథాలను అందజేయాలి. ఇంగ్లీషులోని మూల గ్రంథాలను తర్జుమా చేయడమే గాకుండా, సులభశైలిలో మార్క్సిస్టు, లెనినిస్టు మూల సూత్రాలను విశదపరుస్తూ చిన్నచిన్న కరపత్రాలను పార్టీసభ్యులకు అందజెయ్యాలి. వీటి నాధారంగా గొని పార్టీ ఆర్గనైజర్లు పార్టీసభ్యులకు మార్క్సిస్టు మూలసిద్ధాంతాలగూర్చి బోధించుతారు. తాము మూలగ్రంథాలను అధ్యయనం చేస్తారు.

అంతేగాకుండా పార్టీ పత్రికలను, పార్టీ తదితరడాక్యుమెంట్లను పార్టీసభ్యులందరూ వ్యక్తిగతంగాను, సమిష్టిగాను అధ్యయనం చేస్తూవుండాలి. వాటి నాధారంగా చేసుకొని తమలోవున్న తప్పు ధోరణులను పోగొట్టుకోవాలి. రోజురోజూ మారుతుండే పరిస్థితులగూర్చి పార్టీ దృక్పధాన్ని యెప్పటికప్పుడు పార్టీపత్రికలద్వారా పార్టీ డాక్యుమెంట్లద్వారా తెలుసుకుంటూ వుండకపోతే మార్క్సిస్టు మూలసిద్ధాంతాల గూర్చి యెంత తెలుసుకున్నా ప్రయోజనంలేదు. మార్క్సిస్టు సిద్ధాంతాలు మంత్రాలు గాదు; పరిస్థితులను మార్క్సిస్టు దృక్పధంతో పరిశీలించి సరియైన రాజకీయ నినాదాలను, కార్యక్రమాన్ని నిర్ణయించుకోడానికి తోడ్పడే సాధనాలు. అందుచేత పార్టీపత్రికలు, పార్టీ డాక్యుమెంట్లు తప్పనిసరిగా ప్రతిపార్టీసభ్యుడూ అధ్యయనంచేస్తూవుండాలి. ముఖ్యంగా పార్టీ హోల్‌టైమర్లు, నాయకులు పార్టీ నినాదాలగూర్చి, పార్టీ పాలసీగూర్చి పార్టీ పత్రికలను డాక్యుమెంట్లను తరచు అధ్యయనంచేస్తూవుండాలి. ప్రస్తుత నూతన పరిస్థితులలో యెప్పటికప్పుడు కల్గుతూవుండే సూక్ష్మమైన మార్పులను యెదుర్కోవాలంటే యిది చాల అవసరం.

## కార్మికవర్గంనుండి పార్టీని నిర్మించాలి :

మనపార్టీ కార్మికవర్గ రాజకీయ పార్టీ. కార్మికవర్గంనుండి యెంత హెచ్చుగా పార్టీని నిర్మించితే అంత హెచ్చుగా పార్టీ స్వతంత్ర ప్రజాపార్టీగా స్వతంత్ర రాజకీయ పలుకుబడితో పనిజేస్తుంది. పార్టీలో సంపూర్ణమైన రాజకీయైక్యత వుంటుంది. ప్రస్తుతం యేర్పడ్డ జాతీయ సంక్షోభంలాంటి క్లిష్ట పరిస్థితుల్లో స్వతంత్రంగా నిలబడి పనిచేయగలశక్తి పార్టీకుంటేనే పార్టీ పనిజేయగల్గుతుంది. అందుచేత కార్మికవర్గంలో చురుకుగా పనిచేస్తున్న కార్మికవర్కర్లను పార్టీలో జేర్చుకోవాలి; వారిని పార్టీ నాయకులుగను, ట్రేడ్‌యూనియన్ నాయకులుగను తయారుచెయ్యాలి.

కార్మికవర్గంనుండి పార్టీని అభివృద్ధి జేయడమంటే కార్మిక పార్టీసభ్యుల సంఖ్యను హెచ్చు జేయడంమాత్రమేగాదు; వారిస్థాయి మధ్యతరగతి ప్రజల, మేధావంతులనుండి వచ్చే పార్టీసభ్యుల కంటె చాల తక్కువగా వుంటుంది. అందుచే వారిస్థాయిని, రాజకీయ చైతన్యాన్ని హెచ్చించడానికి కృషిజేయకుండా కార్మికసభ్యుల సంఖ్యనుమాత్రం హెచ్చించితే పార్టీ నిజమైన కార్మికవర్గ రాజకీయ పార్టీ కానేరదు. మధ్యతరగతి, మేధావంతుల కల్చరల్ స్థాయినిపొందుతూ, రాజకీయ చైతన్యాన్ని అలవర్చుకుంటూవున్న కార్మికుడే నిజమైన పార్టీసభ్యుడుగా అభివృద్ధి అవడానికి అవకాశంవుంటుంది. అప్పుడే పార్టీలో నిజమైన రాజకీయైక్యత యేర్పడుతుంది. లేకపోతే కార్మిక సభ్యత్వానికి, మధ్యతరగతి, మేధావంతుల పార్టీసభ్యత్వానికి అఘాతం యేర్పడుతుంది. కాన కార్మిక పార్టీసభ్యత్వసంఖ్యను పెంచడమేగాకుండా వారిని కల్చరల్‌గానూ, రాజకీయంగాను పూర్తిగా అభివృద్ధి చేయాలి. అలాగే మధ్యతరగతి, మేధావంతులనుండి వచ్చే పార్టీసభ్యులు నిజమైన కార్మిక లక్షణాలను అలవర్చుకోవాలి. పెటీబూర్జువా లక్షణాలను (వ్యక్తి అహంభావం; క్రమశిక్షణకు కట్టుబడివుండకుండుట; తప్పులను అంగీకరించకపోవుట వగయిరా) విసర్జించేటట్లు చేయాలి.



పార్టీలో చాలకాలమునుండీ సభ్యులుగా వుంటూన్న కార్మికవర్గ నాయకులలో చాలమంది కర్రపెత్తందార్లుగా మాత్రమే వుండిపోయారు. పార్టీపంధాలో పార్టీ నాయకులుగా అభివృద్ధిగాలేదు. అట్టివారిలో ఉత్తమమైనవారిని, పార్టీ పంథాను అభివృద్ధి అయ్యేవారిని యెన్ని వారికి కార్మికవర్గంలో పార్టీ పంథాను పనిజేయడం యెలాగో శిక్షణయివ్వాలి.

* * * *

ప్రజా యుద్ధకాలంలో పార్టీ నిర్మాణపు కర్తవ్యాలనుగూర్చి పైనజెప్పాము. క్లుప్తంగా జెప్పాలంటే అవి యివి: (1) ప్రజాపార్టీని నిర్మించాలి (2) పార్టీ పద్ధతుల్లో పార్టీసంతా పనిజేయించాలి. (3) పార్టీ ఫంక్షనరీలకు, పార్టీ సభ్యులకు శిక్షణయివ్వాలి. (4) పార్టీ కార్మికవర్గ మూలాన్ని విస్తృతము గావించాలి.

ఈ కర్తవ్యాలను నిర్వహిస్తూ పార్టీ యీకాలంలో యెలా అభివృద్ధి అయిందీ పరిశీలించుదాం:-

# ప్రజా యుద్ధకాలంలో పార్టీని నిర్మించడానికి గావించిన ప్రయత్నాలు

## జాతీయ సంక్షోభానికి ముందు :

ప్రజాయుద్ధంగా మారాక ఆరునెలలకు పార్టీ పాలసీని మార్చుకోవడంవలన పార్టీ సభ్యులకు పార్టీ పాలసీని అందజేయడంలో మరింత ఆలస్యమయింది. పార్టీ సభ్యులందరూ పార్టీ పాలసీని సరిగా అర్ధంజేసుకొని ప్రజల్లో ప్రచారం గావించడానికి యింకా కొంతకాలం పట్టింది. ఈ విధంగా పార్టీ అంతా నూతన పంధాను కదిలేప్పటికి దాదాపు 1942 వ సంవత్సరం ఆరంభమయింది. 1940 వ సంవత్సరారంభం వరకూ స్థానికంగా పార్టీ సభ్యులు యుద్ధ వ్యతిరేక ప్రచారం జేస్తునేవున్నారు: యుద్ధ ఫండులు వగైరా యుద్ధ కృషిని వ్యతిరేకిస్తునే వున్నారు.

'ఫార్వర్డు టు ఫ్రీడం' (ప్రపంచ ప్రజా స్వాతంత్ర్య యుద్ధమే భారత స్వాతంత్ర్య యుద్ధం) అనే పుస్తకం సెంటరు ప్రకటించిన తరువాత దాని నాధారంగా గొని పార్టీ సభ్యులలోను, సానుభూతిపరులలోను ప్రజాయుద్ధ పాలసీగూర్చి బాగా ప్రచారం చేయ్యబడింది; పార్టీ సభ్యులకు ప్రజాయుద్ధ పాలసీని విశదపర్చగల్గేశక్తి వచ్చింది, పార్టీ పాలసీగూర్చి పార్టీ సభ్యులలో అదివరకున్న సందేహాలు, తప్పుడు పోకడలూ అంతమయ్యాయి. పార్టీ సభ్యులలో నూతన వుత్సాహం కల్గింది. ప్రజల్లో పార్టీ పాలసీగూర్చి ప్రచారం జేయడం ప్రారంభించారు. మన పార్టీ పాలసీగూర్చి ప్రజలకు విశదపర్చడమే గాక, దేశ సరిహద్దులలో పొంచివున్న జపాను ఫాసిస్టు మూకలను ప్రజలందరూ కలసి యెదుర్కోవలసిన అవసరాన్ని గూర్చి, జపాన్ ఫాసిస్టుల క్రూరకృత్యాలగూర్చి ప్రజల్లో ప్రచారం సాగించారు. జపాను వ్యతిరేక ప్రచారం గావించడానికి నూతన ప్రచార పద్ధతులు అవలంబించబడ్డాయి. కల్చరల్ ప్రచారక పద్ధతులద్వారా తీవ్ర జపాను వ్యతిరేక ప్రచారం ప్రజల్లో గావించారు. ప్రజల్లో, తత్ఫలితంగా జపాను ఫాసిజమంటే ప్రజలు అసహ్యించుకొనేటట్లు తీవ్రప్రచారం జరుపబడింది.

పార్టీ యింకా అప్పటికి రహస్యంగానే పనిజేస్తోంది. కాని పార్టీ ముఖ్యులుతప్ప తతిమా పార్టీ సభ్యులందరు పార్టీ పేరుతో బహిరంగంగా ప్రజాయుద్ధ పాలసీగూర్చి, జపాన్ వ్యతిరేక ప్రచారాన్ని గూర్చి ప్రచారం సాగిస్తూ వున్నారు. పార్టీకిబహిరంగంగా పనిజేసే అవకాశాలు బాగా వచ్చాయి. పార్టీ

సభ్యులందరూ గావించిన జపాను వ్యతిరేక ప్రచారం వలననూ, యుద్ధం యెడల పార్టీ వైఖరి మార్చుకోవడం వలననూ పార్టీపై నిషేధం తొలగించబడింది. (1942 జులై 23వ తేదీ) పార్టీపై నిషేధంతొలగించడంతో పార్టీ నిర్మాణములో నూతనశకం ఆరంభమయింది. పార్టీకి బహిరంగంగా పనిజేసే అవకాశాలు పూర్తిగా లభించాయి. రహస్యంగావుండే ముఖ్య కామ్రేడ్సు అందరూ బహిరంగంగావచ్చి పనిజేసే అవకాశం యేర్పడింది. సామ్రాజ్యవాదయుద్ధ కాలంలో జైళ్ళలో నిర్బంధింపబడిన పార్టీ ముఖ్య కామ్రేడ్స్ అందరూ విడుదల చేయబడ్డారు. దీనితో పార్టీ కేంద్రంలోను, రాష్ట్రాలలోను లీగల్ ఆఫీసులుపెట్టి బహిరంగంగా పనిజేయడం ప్రారంభమయింది. కేంద్ర పార్టీ లీగల్ పత్రిక 'పీపుల్సువార్' దాని హిందీ, గుజరాతీ, మరాటీ, ఉర్దూ పత్రికలు స్థాపించబడ్డాయి (1942 జులై నెలలో), రాష్ట్రాల్లోగూడ ముఖ్యంగా బెంగాలు, ఆంధ్ర, మలబారు, తమిళనాడు, పంజాబు, ఒరిస్సా, రాష్ట్రాల్లో పార్టీ లీగల్‌పత్రికలు ఆయారాష్ట్రభాషల్లో ప్రకటించబడ్డాయి. ఆంధ్రరాష్ట్రంలో 'ప్రజాశక్తి' పార్టీ పత్రిక ప్రధమసంచిక 1942 జూన్ 17వ తేదీన వెలువడింది. పార్టీ పాలసీగూర్చి పార్టీసభ్యులకు, ప్రజలకు యెప్పటికప్పుడు విశదపర్చుటకు పార్టీ లీగల్‌పత్రికలు స్థాపించడం అవసరమయింది. ఈ విధంగా పార్టీలీగల్ పత్రికలను స్థాపించే యేర్పాట్లే అప్పుడు చేయకున్నయెడల ఆగస్టు సంఘటనలతో యేర్పడిన జాతీయసంక్షోభకాలంలో ప్రజలను,ముఖ్యంగా పార్టీ సభ్యులను సరియైన పార్టీపంథాను పనిజేయించడం కష్టమైపోయేది క్లిష్టపరిస్థితుల్లో సరియైన రాజకీయ పంథాను యెప్పటి కప్పుడు పార్టీసభ్యులకు చూపెట్టుతూ, పార్టీలో రాజకీయైక్యతను నెలకొల్పడానికి, పార్టీని ముందుకు తీసుకుపోవడానికి పార్టీ పత్రికలు యెంతో తోడ్పడ్డాయి.

ఆ రోజుల్లో పార్టీ నిర్మాణం అంతగా జరుగలేదు. పార్టీ లీగల్ ఆఫీసులు తెరువబడ్డాయి: పార్టీ పత్రికలు కేంద్రంనుండి, ముఖ్య రాష్ట్రాలనుండి వెలువడ్డాయి. పార్టీ ఆఫీసులను సక్రమముగా పనిజేయించుట, పార్టీ పంక్షనరీలను, పార్టీసభ్యులను పార్టీ నూతననిర్మాణపు బాధ్యతలను నిర్వహించడానికి తర్ఫీదుచేయుట తరువాత కాలంలో జరిగాయి. పార్టీ ముఖ్యంగా యీ కాలంలో గడించింది పార్టీనుండి పార్టీసభ్యులు యెవరూ బయటకుపోకుండా కాపాడగల్గింది; ప్రజాయుద్ధ పాలసీగూర్చి, జపాన్ వ్యతిరేక ప్రచారం ప్రజల్లో గావించబడింది.

జాతీయ సంక్షోభకాలం :

ఈ కాలంలో పార్టీ యెన్నో క్లిష్టపరిస్థితులను యెదుర్కొనవలసివచ్చింది. ఆగష్టు సంఘటనలు తరువాత పార్టీపైగూడ నిర్బంధం తీవ్రపర్చబడింది. పార్టీ ముఖ్యులు చాలమంది జిల్లాలలో అరెస్టు గావించబడ్డారు. రాజకీయంగా కాంగ్రెసువాదులలో ప్రతివారు మనలను యెదుర్కొన్నారు. పెద్ద మొదలు చిన్నవరకు మనం బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో చేరిపోయామని, ప్రభుత్వంవద్ద డబ్బు తీసుకున్నామని అపవాదులువేసి ప్రచారం సాగించారు.

కాని యిన్ని క్లిష్టపరిస్థితులు పార్టీ నెదుర్కొన్నప్పటికిని పార్టీ నిర్మాణము యీ కాలంలో చాల అభివృద్ధి అయింది. పార్టీ రాజకీయపంథా ఒక్కటే దేశభక్తియుతమైన పంథా అవడంవలన పార్టీ నిర్మాణము ముందుకుపోయింది. మనపార్టీ పై దాడులవలన బలహీనపడకపోవడమేగాక మరింత బలపడింది గూడాను. పదిసంవత్సరాలక్రితం ఒకచిన్న ముఠాగావున్న మనపార్టీ నేడు తన రాజకీయ పాలసీపైన, దేశభక్తులైన ప్రజల సహకారంపైన ఆధారపడి భారతప్రజల్లో స్థిరమైన పునాదిగల ఒక పెద్ద రాజకీయ పార్టీగా అభివృద్ధి అయింది.



సెంట్రల్‌కమిటీ సెప్టెంబరు (1942), ఫిబ్రవరి (1943) ప్లీనం సమావేశాలు :

పార్టీపై నిషేధం తొలగించబడిన తరువాత పార్టీ బహిరంగంగా సమావేశమవడం యీ సమావేశమప్పుడే. 1942 సెప్టెంబరు 26వ తేదీన సెంట్రలుకమిటీ సమావేశం జరిగింది. దానికి రాష్ట్ర కమిటీల కార్యదర్శులుగూడ ఆహ్వానించబడ్డారు. ఆగస్టు సంఘటనల తరువాత దేశంలో యేర్పడ్డ క్లిష్టపరిస్థితులను సమీక్షచేసి పార్టీ రాజకీయ, నిర్మాణపు కర్తవ్యాలను నిర్ణయించడం యీ సమావేశ ముఖ్యోద్దేశ్యము.

ఆగస్టు సంఘటనలతో ప్రారంభమైన జాతీయ సంక్షోభాన్నుండి దేశాన్ని రక్షించడానికి తక్షణమే పార్టీ సభ్యులందరూ రాజకీయంగాను, నిర్మాణరీత్యా యేమిచెయ్యాలో స్పష్టమైన కార్యక్రమము యివ్వబడింది. రాజకీయంగా యీ కార్యక్రమము యివ్వబడింది.

(1) ప్రజలు పురెక్కులై విధ్వంసక చర్యలకు, అరాచకచర్యలకుదిగకుండా సకాలంలో పార్టీ సభ్యులు జోక్యంకలుగ జేసుకొని పనిజేయాలి.

(2) ప్రభుత్వ నిర్బంధ విధానం జరుగకుండా ప్రభుత్వానికి, ప్రజలకు మధ్య పార్టీ సభ్యులు నిలబడి పనిజేయాలి. జాతీయ నాయకుల విడుదలకు తీవ్ర ఆందోళన గావించాలి.

(3) పార్టీ సభ్యులెవ్వరూ గాభరాపడి యిది సర్వనాశనానికి దారితీసే జూదమని 'ఉద్యమాన్ని' తిట్టుతూ కూర్చోరాదు.

(4) జాతీయ రక్షణకు జాతీయైక్యతను సాధించడానికి కృషిజేయడంద్వారానే స్వాతంత్ర్యమును యెలా యీ నూతన పరిస్థితుల్లో సంపాదించగల్గుతామో ధైర్యంగా, ఆత్మవిశ్వాసంతో, ఓపికతో ప్రజలలోను, జాతీయవాదులలోను తీవ్ర ప్రచారం సాగించుతూ వుండాలి. జాతీయైక్యతకు మూలం కాంగ్రెసు-లీగ్ ఐక్యత అనియు, దాన్ని సాధించేందుకు కాంగ్రెసువాదులు ముస్లిముజాతుల స్వయం నిర్ణయహక్కును అంగీకరించాలని కాంగ్రెసు వాదుల్లో తీవ్ర ప్రచారం సాగించాలి. ముస్లిమ్‌లీగ్ కాంగ్రెసు నాయకులను బయటకు తెచ్చుటకు పూనుకొని పనిజేయాలనే ప్రచారం ముస్లిము ప్రజా సామాన్యం మధ్య సాగించాలి.

ఈ కార్యక్రమముతో పార్టీ సభ్యులు దేశమంతటా పనిజేశారు. జాతీయైక్యతా వుద్యమాన్ని ప్రారంభించారు. దీని ఫలితంగా ఆగస్టు సంఘటనల ప్రారంభదశలో, తాత్కాలికోద్రేకపు దశలో పార్టీ పాలసీ వినడానికే నిరాకరించి మనలను బ్రిటిష్ సామ్రాజ్యవాద యేజెంట్లని దుమ్మెత్తిపోసిన దేశభక్తులు పార్టీ పాలసీగూర్చి, కార్యక్రమముగూర్చి వినడం ప్రారంభించారు; కాంగ్రెసు దేశభక్తులు తిరిగి ఆలోచించడం ప్రారంభించారు.

సెప్టెంబరు ప్లీనం పార్టీ నిర్మాణరీత్యా యెలా అభివృద్ధి అవ్వాలో స్పష్టమైన నినాదాలు యిచ్చింది. కామ్రేడ్ జోషి ఆర్గనైజేషనల్ రిపోర్టులో పార్టీని యీ కాలంలో యెలా నిర్మించాలో విశదపర్చాడు. పార్టీని నిర్మించడానికి, పార్టీ పద్ధతుల్లో పనిజేయించడానికి పార్టీ కార్యకర్తలను, నాయకులను తర్ఫీదు జేయడం ప్రధాన నిర్మాణపు కర్తవ్యం. అందుచేత అక్టోబరునుండి పార్టీకేంద్రం స్కూళ్ళు పెట్టింది : రాష్ట్రకమిటీ సభ్యులను, రాష్ట్ర ఆర్గనైజర్లను, జిల్లా పార్టీ నాయకులను, ప్రజా

రంగాలలో పనిజేసే పార్టీనాయకులను యీస్కూళ్ళకు పిలిపించి పార్టీ పాలసీపైన, పార్టీ నిర్మాణపు కర్తవ్యాలను గూర్చి శిక్షణ యిచ్చింది. సెంటరు పార్టీ స్కూళ్ళు రాష్ట్ర, జిల్లా పార్టీ నాయకుల రాజకీయపు, నిర్మాణపు స్థాయిని హెచ్చించాయి. పార్టీ నాయకత్వం అంతా సెంట్రలు కమిటీనుండి, జిల్లా కమిటీవరకు రాజకీయంగాను, నిర్మాణయుక్తంగాను ఒకటీములాగపనిజేయడానికి తోడ్పడ్డాయి. అగస్టు సంఘటనల అనంతరం పార్టీ రాజకీయ, నిర్మాణపు ఐక్యతను చెక్కుచెదరకుండా నిలుపుటకేగాక యింకా యెన్నోరెట్లు వృద్ధిచేయడానికి యీస్కూళ్ళు తోడ్పడ్డాయి.

సెంటరు స్కూళ్ళ మాదిరే రాష్ట్రాల్లోగూడ పార్టీ స్కూళ్ళు స్థాపించబడ్డాయి. ముఖ్య జిల్లా, తాలూకా, ఫిర్కా ఆర్గనైజర్లకు సెంటరుస్కూళ్లలో చెప్పిన పాఠాలను రాష్ట్రపరిస్థితుల కన్వయింపజేసి చెప్పబడ్డాయి. ముఖ్యరాష్ట్రాలైన బెంగాలు, ఆంధ్ర, మలబారు రాష్ట్రాల్లో బాగా పార్టీ ఆర్గనైజర్లందరకూ శిక్షణ యివ్వబడింది. తదితర రాష్ట్రాల్లో గూడ తమిళనాడు, బొంబాయి, మహారాష్ట్ర, పంజాబు, గుజరాతు రాష్ట్రాలలో గూడ యిట్టి స్కూళ్ళు పెట్టబడ్డాయి.

పార్టీఆర్గనైజర్ల, నాయకుల రాజకీయ, నిర్మాణపుస్థాయి హెచ్చడమే గాకుండా పార్టీనిర్మాణములో అతిముఖ్యమైన మార్పులు వచ్చాయి. పార్టీహోల్‌టైమర్ల సంఖ్య భారతదేశం మొత్తంమీద 1943 లెనిన్‌డే నాటికి 2015 కు, మేడే నాటికి 2637 వరకూ పెరిగింది. పార్టీకొరకు తమ యావత్కాలాన్ని వినియోగించి పని జేయడానికి తయారవడమే గాకుండా తమకున్న యావదాస్తిని పార్టీకి యిచ్చివేసి పార్టీ భృతులమీద పనిచేయడానికి చాలమంది తయారైనారు. భారతదేశంలో యింతవరకు యే రాజకీయపార్టీలో లేని సాంప్రదాయాన్ని మన పార్టీలో నెలకొల్పారు. దీనితో పార్టీసభ్యుల మొత్తం చైతన్యం, త్యాగప్రమాణం చాల హెచ్చాయి.

పార్టీ హోల్‌టైమర్లసంఖ్య పెరగడమే గాకుండా పార్టీసభ్యత్వం కూడ చాల వేగంగా పెరిగింది. జాతీయ సంక్షోభానికి ముందు పార్టీసభ్యత్వం 4466, 1943 లెనిన్ డే నాటికి 9207 వరకు పెరిగింది. 1943 మే డే నాటికి దాదాపు 16000 వరకూ పెరిగింది. పార్టీసభ్యత్వం పెరగడమే గాకుండా పార్టీ సభ్యుల గుణంకూడ పెరిగింది. సెంట్రల్‌కమిటీ ప్లీనం సమావేశంలో ప్రతి పార్టీసభ్యునకు తాను చేయాల్సిన పనికి కోటాపద్ధతి నిర్ణయింపబడింది. ప్రతి సభ్యుడు ప్రతి రంగానికి నిర్ణీతకోటాలను యేర్పరచి నిర్ణీతకాలంలో వాటిని పూర్తిచేయాలనే పద్ధతి అవలంబించబడింది. దాని ఫలితంగా ప్రతి పార్టీసభ్యుడు బోల్షివిక్‌పోటీతో చురుకుగా పనిజేసేవాడుగా తయారు అవడానికి అవకాశం యేర్పడింది. ఈ పద్ధతి ప్రవేశపెట్టినప్పటినుండే పార్టీ పార్టీగా పనిజేయడం ప్రారంభించింది. పార్టీసభ్యులు అందరూ చురుకుగా పనిచేయడం మొదలుపెట్టారు.

పార్టీకి ప్రజాసంఘాల్లో వున్న నిర్మాణపుబలం గూడ పెంపొందింది. పార్టీపలుకుబడి క్రింద పనిజేసే ప్రజాసంఘాల సభ్యత్వం యీ విధంగా పెంపొందింది.

| ప్రజాసంఘాలు | 1943 లెనిన్‌డే | 1943 మేడే |
| --- | --- | --- |
| కార్మికసంఘసభ్యత్వం | 197620 | 301400 |
| రైతుసంఘ సభ్యత్వం | 295000 | 385370 |
| విద్యార్థిసంఘ సభ్యత్వం | 26822 | 301?5 |
| మహిళాసంఘ సభ్యత్వం | 22400 | 41100 |
| వాలంటీర్లు | 24610 | 32166 |



పార్టీపత్రికల అభివృద్ధిగూడ జరిగింది. 'పీపుల్స్‌వార్' అమ్మకం ప్రారంభించినప్పుడు (1942 జూలైలో) 5000 వుంటే 1943 మేడేకి 16000 వరకూ పెరిగింది. హిందీ, ఉర్దూ, మరాఠీ ప్రచురణలు 2000 లో ప్రారంభమై దాదాపు 4 రెట్లు పెరిగాయి. రాష్ట్రపత్రికలు గూడ బాగా అభివృద్ధి అయ్యాయి: 'జనయుద్ధం' (బెంగాలీ) ఐదు వేలతో ప్రారంభమై 12500కు వెళ్ళింది. 'ప్రజాశక్తి' (తెలుగు) 2580తో ప్రారంభమై 9500 వరకూ పెరిగింది. 'దేశాభిమాని' (మళయాళం) 2500 తో ప్రారంభమై 5000 వరకూ పెరిగింది. 'జనశక్తి' (తమిళం) రెండువేలతో ప్రారంభమై 5000 కు పెరిగింది. అలాగే 'ముక్తియుద్ధం' (ఒరియా), జంగేఆజాదీ (పంజాబీ) గూడ పెరిగాయి. పార్టీపత్రికల రాజకీయస్థాయి చాలరెట్లు హెచ్చింది.

ముఖ్యమైన అన్నిరాష్ట్రాల్లో రాష్ట్ర, జిల్లా, తాలూకా పార్టీఆఫీసులు యేర్పడి పార్టీపద్ధతుల్లో పనిజేయడం ప్రథమపర్యాయంగా ప్రారంభించాయి. రాష్ట్రకమిటీలు, జిల్లాకమిటీలు పెట్టిన ఆర్గనైజరు స్కూళ్ళద్వారా, సెల్లు కార్యదర్శుల స్కూళ్లద్వారా తర్ఫీతు అయిన పార్టీ ఆర్గనైజర్లు స్థానికపార్టీ యూనిట్ కార్యదర్శులు చాలమంది తయారు అయ్యారు. వీరిద్వారా ప్రథమపర్యాయంగా స్థానికపార్టీ సెల్లులలో దాదాపు సగంభాగం పార్టీపద్ధతుల్లో పనిజేయడంప్రారంభించాయి. సెప్టెంబరులో జరుపబడ్డ సెంట్రలుకమిటీ ప్లీనం తరువాత పార్టీ దేశమంతటా పై విధంగా అభివృద్ధి అయింది.

ఫిబ్రవరిలో (1943) మరొక పర్యాయం సెంట్రలుకమిటీ సమావేశం జరిగింది. అప్పటికి రాజకీయ ప్రతిష్టంభనంతోటు ఆహారసమస్యగూడ దేశాన్ని ఆవరించింది. ఆహారసమస్య తీవ్రమవడంతో దేశంలోని అన్ని వర్గాలకు, అన్ని రంగాలకు ప్రతిష్టంభన వ్యాపించింది. ఆహారసమస్యా పరిష్కారమే ప్రథమ రాజకీయ కర్తవ్యం అయింది. పార్టీ శక్తినంతా యీ సమస్యపై కేంద్రీకరించి పనిజేయాలనియు, తద్వారా జాతీయైక్యతను నిర్మించాలనియు కార్యక్రమము యివ్వబడింది. ఆహారసమస్య మీదపార్టీ జనరల్‌నినాదాలనుగూర్చి ప్రచారంజేయడంతోనే పార్టీసభ్యులు తృప్తిపడితే ఆహారసమస్య పరిష్కరింపబడదు. ప్రతి గ్రామములోను, పట్టణంలోను వున్న ఆహారసమస్యలను ప్రాతిపదికగా తీసుకుని ప్రజాసంస్థలద్వారా వాటిని పరిష్కరించడానికి పనిజేయాలి; ప్రజలనందరిని సమీకరించి ఐక్యపర్చాలి. ఇలా చెయడమే జాతీయైక్యతా వుద్యమాన్ని నిర్మించడమని స్పష్టపర్చింది.

ఉత్పత్తిని హెచ్చుజేయందే దేశ ప్రజల అవసరాలు, దేశరక్షణ అవసరాలు తీరవనియు, అందుకుగాను కార్మికులు వుత్పత్తిని హెచ్చుజేయడానికి దేశభక్తితో ముందుకు రావాలనియు స్పష్టపర్చుతూ కార్మికుల వుత్పత్తిపంథా గూర్చి ప్రథమ పర్యాయంగా ఫిబ్రవరి ప్లీనం విశదపర్చింది. ఆదేవిధంగా రైతులు, వ్యవసాయకూలీలు ఆహారసమస్యను పరిష్కరించడానికి అధికాహారోత్పత్తి గావించడానికి దేశభక్తితో ముందుకు రావాలనియు, అందుకు వారిని సమీకరించి ఐక్యపర్చాలనియు స్పష్టపర్చింది.

ఈ రాజకీయ కర్తవ్యాలను పార్టీయొక్కటే ఒంటరిగా సాధించడం పార్టీకి మించినపని అనియు అందుచేత దేశభక్తులందరూ యీ కార్యక్రమాన్ని అంగీకరించి పనిజేయడానికి పూనుకొనేటట్లు చేయాలి. ఈ కార్యక్రమాన్ని అంగీకరించి పార్టీలో పనిజేయడానికి దేశభక్తులందరికి అవకాశం కలుగజేయడానికి పార్టీ నిర్మాణములో మార్పులు గొనిరాబడ్డాయి. పార్టీ సభ్యుల అర్హతలు కొంతవరకు సడలించబడ్డాయి. పార్టీ కార్యక్రమాన్ని అంగీకరించి, పార్టీక్రమశిక్షణకు కట్టుబడి దానిప్రకారం యేదో ఒక ప్రజాసంఘంలో పనిజేస్తున్నవాళ్ళందరనూ పార్టీలో జేర్చి ప్రజా పార్టీగా తయారుజేయాలని

ఫిబ్రవరి ప్లీనం నిర్ణయించింది. అంతేగాకుండా యిదివరకు పార్టీ సానుభూతిపరులుగావున్న వారినంద రినీ పార్టీలో జేర్చి వారిచేత పనిజేయించాలనియు. పార్టీ సభ్యులకు, పార్టీ మిలిటెంట్సుకు మధ్య అంతస్థులులేకుండా చేయాలని నిర్ణయించింది. దీనితో పార్టీ సభ్యత్వం యింకా పెరిగింది. పార్టీ కార్యక్రమాన్ని అంగీకరించే దేశభక్తులందరినీ పార్టీలో జేర్చుకోడానికి అవకాశం వచ్చింది. పార్టీ ప్రజాపార్టీగా మారడం ప్రారంభమయింది.

పార్టీ నిర్మాణములో యింకొక ముఖ్య మార్పు యేమంటే ప్రతినెలా పార్టీ జనరల్‌బాడీ సమావేశాలు జరపాలనే నిర్ణయం. జనరల్‌బాడీ సమావేశాలు జరపమనడంలో రెండు వుద్దేశ్యాలున్నాయి. జనరల్‌బాడీ సమావేశాలు పార్టీ సభ్యులందరి రాజకీయ స్థాయిని అభివృద్ధిజేయడానికి తోడ్పడతాయని సభ్యులు ప్రతినెలా గావించే పనిని సమీక్షజేసి ముందునెలకు కోటాలను తీసుకొని కార్యక్రమము వేసుకోవడానికి, జనరల్‌బాడీ సమావేశాలు వుపయోగపడతాయని ఫిబ్రవరి ప్లీనం భావించింది. అంతే గాకుండా పార్టీ ఆయా ప్రాంతాలలో గావించిన వివిధ రంగాల పనిని గూర్చి రిపోర్టు విన్నప్పుడు పార్టీ సభ్యులు బాగా వుత్తేజవంతులు అవుతారు; బాగా పనిజేసిన పార్టీ సభ్యులను ఆదర్శంగా తీసు కుని బోల్షివిక్ పోటీతో పనిజేయాలని నిశ్చయించుకుంటారు. తమ స్థానికపార్టీ వ్యవహారాలగూర్చే గాక జిల్లా, రాష్ట్రమంతటా, దేశమంతటా పార్టీ యెలా అభివృద్ధి అవుతోందో తెలుసుకొనుటచేత విశాలమైన దృక్పధం యేర్పడుతుంది; ప్రతినెలా జాతీయ అంతర్జాతీయ రాజకీయాలగూర్చి రాజకీయ రిపోర్టింగు వినుటచేత రాజకీయ స్థాయి బాగా హెచ్చుతుంది.

ఈవిధంగా జనరల్‌బాడీ సమావేశాలు పార్టీ పనికి యెంతో తోడ్పడుచున్నాయి. ప్రతినెలా పార్టీ సభ్యులు తాము గావించిన పనిని గూర్చి రిపోర్టుయివ్వడం, ముందు కార్యక్రమాన్ని నిర్ణయించు కోవడం- వీటివలన పార్టీ సభ్యులలో ఒక సన్నిహిత సంబంధం యేర్పడుతోంది. తామంతా ఒక విప్లవ సంస్థకు చెందిన సైనికులమని, ఒకే కమ్యూనిస్టుకుటుంబంలోని సోదరులమనే చైతన్యం కల్గుతూవుంది.

ఫిబ్రవరి సెంట్రలు కమిటీ ప్లీనంలో నిర్ణయించిన పార్టీ నిర్మాణపు మార్పులు ప్రతిరాష్ట్రంలో అమలు జరుపబడ్డాయి పార్టీ సభ్యత్వం దాదాపు అన్నిరాష్ట్రాలల్లో రెట్టింపు అయింది. బెంగాలు, మలబారు, ఆంధ్ర రాష్ట్రాల్లో కొన్ని జిల్లాలల్లో పార్టీ ప్రజాపార్టీగా తయారయింది. మే డే నాటికి (1943) దేశంమొత్తంమీద పార్టీ సభ్యత్వం దాదాపు 16000 కు పెరిగింది. జాతీయ సంక్షోభానికి ముందున్న సభ్యత్వానికన్నా దాదాపు నాల్గురెట్లు పెరిగింది. 1944 లెనిన్ డే నాటికి దాదాపు దానికి రెట్టింపు సభ్యత్వం పెరుగుతుంది.

## పార్టీ కాంగ్రెసు ప్రధమ సమావేశం :-

పార్టీ కాంగ్రెసు ప్రధమ సమావేశం 1943 సంవత్సరం మే 26 వ తేదీనుండి జూన్ 2 వ తేదీ వరకు జరిగింది. వివిధ రాష్ట్రాలనుండి 139 మంది ప్రతినిధులు హాజరయ్యారు. వీరిలో 86 గురు మేధావుల్లోనుంచి వచ్చారు. వీరందరు ప్రజావుద్యమాల్లో పనిజేసి ప్రజా బాహుళ్యానికి మార్క్సిజాన్ని బోధించారు. పార్టీ యిప్పుడీవిధంగా అభివృద్ధిదశకు రావడానికి బాధ్యులయ్యారు.

22 మంది కార్మికులనుండి వచ్చారు : పార్టీలోని కార్మికసభ్యులలో వుత్తమమైనవారు; కార్మిక ప్రజానీకానికి నాయకత్వం వహించి పార్టీ పంథాను నడుపుచున్నవారు. ఇంకా ప్రతినిధులలో 13 గురు



ముస్లిములు, 8 గురు సిక్కులు, 3 గురు హరిజనులు, ఇద్దరు పార్శీలు, ఒక క్రిష్టియన్, ఒక జైన మతస్థుడు గూడ వున్నారు. ఈవిధంగా వివిధ వర్గాలకు, జాతులకు జెందినవారు ప్రతినిధులలో వున్నారు. శ్రమజీవులైనవారు యింత అధిక సఖ్యాకంగా మరేపార్టీయొక్క అగ్రస్థానాల్లోనూ లేరు. ప్రజలకు పార్టీకున్న సన్నిహిత సంబంధం మరే యితర పార్టీకి లేదు. ప్రతినిధులలో 13 గురు మహిళా ప్రతినిధులుగూడ వున్నారు. ఇంకే రాజకీయ సమావేశానికి యింతమంది మహిళాప్రతినిధులు రావడం ఎరుగం.

10 సంవత్సరాలక్రితం 1933 నవంబరులో అప్పటి తాత్కాలిక సెంట్రలు కమిటీ దేశంలోని వివిధ కమ్యూనిస్టు గ్రూపులను ఐక్యంజేసి ప్రధమ పార్టీ సమావేశం జరుపుటకు తీర్మానించింది. కాని ఆతీర్మానం 1943 సంవత్సరం మేలో అమలు జరిగింది. ఈ 10 సంవత్సరాలల్లో పార్టీగడించిన రాజకీ యైక్యత, నిర్మాణపు ఐక్యత యీ ప్రధమ పార్టీ కాంగ్రెసులో ప్రతిబింబించాయి. ఈ సమావేశం ద్వారా పార్టీలో సంపూర్ణ రాజకీయైక్యత యేర్పడింది.

పార్టీ కాంగ్రెసు జాతీయైక్యతా వుద్యమాన్ని సాగించడానికి యింకా స్పష్టమైన కార్యక్రమాన్ని యిచ్చింది. వివిధ రంగాలలో దేశరక్షణ నినాదం అన్వయింపజేసి ఆరంగంలో ప్రజాఐక్యతను, తద్వారా జాతీయైక్యతను యెలా నిర్మించాలో స్పష్టపర్చబడింది. నాయకుల విడుదలకోసం, ఆహార సమస్యను పరిష్కరించడానికి ప్రజలనందరినీ యెలా ఐక్యపర్చాల్సింది. ఉత్పత్తిని హెచ్చుచేయ డానికి కార్మికులను యెలా ఐక్యపర్చవలసింది. అధికాహారోత్పత్తికిగాను రైతుల-కూలీలనందరినీ యెలా ఐక్యపర్చవలసింది. విద్యార్థులందరూ దేశరక్షణ, పౌరరక్షణ కార్యాలల్లో పాల్గొనేందుకు వారి విద్యార్థి జీవితాన్ని రక్షించుకొనేందుకు యెలా ఐక్యమవ్వాల్సింది- స్పష్టంగా విశదీకరించబడ్డాయి. ఈ విధంగా ప్రతిరంగంలోను జాతీయరక్షణ కొరకు జాతీయైక్యతావుద్యమాలను నిరంతరం కొనసాగించ డానికి కార్యక్రమము యివ్వబడింది. జాతీయైక్యతను సాధించడానికి యీవుద్యమాలను వివిధరంగాల్లో జోరుగాను, ఒకే సమయాన సాగించినప్పుడే జాతీయసంక్షోభం తీవ్రమవ్వకుండాను, ఇంకా విస్తరించ కుండాను చేసి దేశాన్ని దానినుండి రక్షించగల్గుతామని పార్టీ సభ్యులందరికీ హెచ్చరించబడింది. ఈ వుద్యమాలద్వారానే 'ఏమీ చేయలేమని' నిస్పృహతో కూర్చున్న దేశభక్తులను కార్యాచరణకు దించ గల్గుతామని, వారినుండి పంచమాంగదళాన్ని పూర్తిగా వేరుజేసి రూపుమాపగల్గుతామని స్పష్టపర్చింది. ఈ వుద్యమాలకు కార్మికవర్గం నాయకత్వంవహించి ప్రజలందరినీ ముందుండి నడిపించాలని కార్మిక వర్గాన్ని పార్టీ కాంగ్రెసు హెచ్చరించింది.

ఈ వుద్యమాలన్నిటిని జయప్రదంగా సాగించాలంటే పార్టీ నిర్మాణయుక్తంగా యింకా బలంగా వుండాలి. ప్రజాకమ్యూనిస్టుపార్టీ లేకుండా యీ బ్రహ్మాండమైన కర్తవ్యాలను నెరవేర్చడం సాధ్యం గాదు. మన ప్రజావుద్యమాల వలన కదిలిన ప్రజాసామాన్యం అంతా ప్రజాసంస్థలలో సంఘటిత పర్చబడాలి. ప్రజాసంస్థలలోవి వుత్సాహవంతులైన వారినందరినీ పార్టీలోనికి తీసుకుని వార్కి తగిన శిక్షణయివ్వాలి. ప్రజాయుద్ధకాలంలో పార్టీ నిర్మాణపు కర్తవ్యాలనే మరల పార్టీకాంగ్రెసు పునరుల్లే ఖించింది.

పార్టీకాంగ్రెసులో డెలిగేట్లు ఈక్రింది వారిని సెంట్రల్‌కమిటీ సభ్యులుగా ఏకగ్రీవంగా యెన్ను కున్నారు: కామ్రేడ్లు పి. సి. జోషి, జి. అధికారి, బి. టి. రణదివే, ఎస్. వి. ఘాటే, అజయకుమార్ ఘోష్, భరద్వాజ్, సజ్జద్‌జహీర్, యస్. ఎ. డాంగే, సర్దేశాయి, పి. సుందరయ్య, యస్. కె.

కృష్ణన్, భవానిసేన్, విశ్వనాథముఖర్జీ, సోమనాథలహరి, శంకరన్‌నంబూద్రిపాద్, రణేన్‌సేన్. ఈ క్రిందివారు సెంట్రల్‌కమిటీకి క్యాండిడేట్సుగా ఎన్నుకోబడ్డారు: కామ్రేడ్స్ ఇక్బల్‌సింగ్; బాట్లీవాలా; అరుణబోస్, మోహన్‌కుమార్‌మంగళం, మంజర్. కామ్రేడ్ జోషి పార్టీకార్యదర్శిగా ఏకగ్రీవంగా ఎన్నుకోబడ్డాడు.

## ప్రజాయుద్ధకాలంలో పార్టీ సాధించిన విజయాలు :

(1) ఈ కాలంలో యేర్పడ్డ నూతనపరిస్థితుల్లో భారతదేశానికి స్వాతంత్ర్యాన్ని సాధించేమార్గం చూపెట్టింది పార్టీ ఒక్కటే. దేశాన్ని జపాను ఫాసిస్టుప్రమాదాన్నుండి రక్షించడానికి, దేశస్వాతంత్ర్యం గడించడానికి యింక యితర రాజకీయపార్టీలేవీ సరియైన కార్యక్రమము యివ్వజాలకపోయాయి.

(2) దేశరక్షణను జయప్రదంగా సాగించడానికి, దేశస్వాతంత్ర్యం గడించడానికిగాను జాతీయైక్యతను నిర్మించడానికి కమ్యూనిస్టుపార్టీ ఒక్కటే జాతీయైక్యతావుద్యమాన్ని సాగించుతోంది. జాతీయైక్యతకు పునాదియైన కాంగ్రెసు-లీగ్ ఐక్యతకొరకు స్పష్టమైన కార్యక్రమముతో కృషిజేస్తోంది. తత్ఫలితంగా కాంగ్రెసువాదుల్లోను, ముస్లిమ్ ప్రజాసామాన్యంలోను జాతీయైక్యతావసరాన్ని గుర్తింపజేయగల్గింది.

(3) ఆగస్టు సంఘటనలతో యేర్పడ్డ జాతీయసంక్షోభం దేశాన్నంతా సర్వనాశనం గానీయకుండా, తత్ఫలితంగా భారతదేశంపై జపాన్ ఫాసిస్టుదాడి జరుపబడకుండా పార్టీ యింతవరకు ఆపగల్గింది. జాతీయసంక్షోభాన్నుండి దేశాన్ని రక్షించడానికి, రాజకీయ ప్రతిష్టంభనను తొలగించడానికి ప్రజలముందు స్పష్టమైన కార్యక్రమము పెట్టింది. ఆ కార్యక్రమముపై ప్రజలను ఐక్యపరచడానికి కృషిజేస్తోంది.

(4) జాతీయసంక్షోభం ఫలితంగా ఉత్పన్నమై, దేశభక్తి ముసుగుతో దేశద్రోహచర్యలు గావిస్తున్న పంచమాంగదళ చర్యలను ప్రజలందరికి, దేశభక్తులకు బట్టబయలు జేయగల్గింది. దేశరక్షణ సాధనాలను విధ్వంసంగావించే విధ్వంసకచర్యలు దేశస్వాతంత్ర్యానికి యెలా హానికరమో, దేశపరిహద్దుల పొంచి కూర్చున్న జపాను ఫాసిస్టుదురాక్రమణకు తోడ్పడి భారతప్రజలు జపాన్ ఫాసిస్టు బానిసత్వానికి యెలా గురిఅయ్యే పరిస్థితులేర్పడతాయో స్పష్టపర్చింది. పార్టీ గావించిన తీవ్రప్రచారంవలన విధ్వంసకచర్యలు కొనసాగకుండా పార్టీ ఆపగల్గింది. విధ్వంసకచర్యలు కొనసాగించడానికి, జపాను సైన్యాలు భారతదేశంపై దాడి సల్పడానికి తోడ్పడుతున్న పంగమాంగదళ ముఠాలను పూర్తిగా బట్టబయలు చేయగల్గింది. దేశభక్తులు విధ్వంసకచర్యలనుండి విరమించేటట్లు చేయగల్గింది.

(5) యుద్ధం మనదేశ పరిహద్దులలోకి రావడంతో దేశంలో వస్తువులకు, ఆహారానికి యేర్పడ్డ కరువుపరిస్థితులనుండి ప్రజలను రక్షించడానికి అధికోత్పత్తి, అధికాహారోత్పత్తి కార్మికులు, రైతులు, వ్యవసాయకూలీలు దేశభక్తితో గావించేందుకు పార్టీ తీవ్రకృషి గావించింది. తత్ఫలితంగా అధికంగా వుత్పత్తి అవుచున్న బట్ట వగైరా వస్తువులు, ఆహారపదార్థాలు ప్రజలకు సక్రమముగా, తిండిదొంగల బారి పడకుండా, దొంగమార్కెట్టులలోకి పోకుండా, అందేందుకు పార్టీ ఆహారకమిటీలద్వారా, ప్రజారక్షణదళాలద్వారా తీవ్రకృషి జేస్తోంది.



(6) రాజకీయసంక్షోభానికి తోడై దేశం నలుమూలలకు, ప్రతిరంగానికి వ్యాపిస్తున్న ఆహారసమస్యను పరిష్కరించడానికి పార్టీ ప్రధానకర్తవ్యంగా పెట్టుకుని పనిజేసింది. తత్ఫలితంగా ఆహారసమస్య దేశాన్ని దగ్ధంచేయకుండాను, దేశానికంతకు తీవ్రముప్పు తెచ్చే భయానకతుపానుగా మార[illegible] పార్టీ కృషిద్వారా అరికట్టగల్గుతోంది. ఆహారసమస్యా పరిష్కారానికి ప్రజలను, దేశభక్తులను [illegible]పర్చడానికి తీవ్రకృషి జేస్తోంది.

(7) పార్టీ నిర్మాణయుక్తంగా చాల జయాలను సాధించింది. ప్రజాపార్టీగా పార్టీని నిర్మించడా[illegible]్రకృషిజేస్తోంది. పార్టీ సభ్యుల సంఖ్య యీ కాలంలో పూర్వంకంటె ఐదురెట్లు పెరిగింది. పార్టీ [illegible]న్యం, రాజకీయ చైతన్యం పార్టీ సభ్యులలో యెన్నోరెట్లు అభివృద్ధి అయింది. పార్టీ సభ్యులు, [illegible]యూనిట్లు పార్టీ పద్ధతుల్లో నిర్మాణయుక్తంగా పనిజేయడం నేర్చుకున్నారు. పార్టీ నిర్మాణ[illegible]క్తంగా అనేకరెట్లు అభివృద్ధి అయింది.

రాజకీయంగా, నిర్మాణయుక్తంగా పార్టీ యీకాలంలో గడించిన విజయాల ఫలితంగా పార్టీ [illegible]డు దేశంలో మూడవరాజకీయపార్టీగాను, ఏయితర రాజకీయపార్టీకంటె గూడ నిర్మాణయుక్తంగా పనిజేయగల పార్టీగాను తయారయింది. తత్ఫలితంగా దేశంలో ఒక ప్రధానరాజకీయశక్తిగా తయారయింది. తదితరరాజకీయపార్టీలను, ప్రజలను ఐక్యపర్చడానికి కృషిజేసే ఐక్యనిర్మాతగా పార్టీ నేడు [illegible]వరిస్తోంది.

[illegible]ంపు :

ప్రజాయుద్ధకాలంలో పార్టీ యెన్నో రాజకీయపు నిర్మాణపు విజయాలను సాధించినా, యెంతో [illegible]ద్ధిఅయినా దేశాన్ని ఆవరించిన జాతీయసంక్షోభం యింకా అలాగేవుంది; జాతీయైక్యత యింకా [illegible]బడనేలేదు. జపాన్‌ఫాసిస్టుల ముప్పు దేశానికి యింకా తొలగలేదు. విధ్వంసకచర్యల నుండి [illegible]లారేగాని దేశభక్తులు యింకా మన పార్టీకార్యక్రమము దేశస్వాతంత్ర్యాన్ని సాధించే కార్యక్రమ[illegible]గా యింకా అంగీకరించడంలేదు. నిస్పృహ, నిరాశలతో కూర్చొనివున్నారు. ఈ పరిస్థితులలో పార్టీని రోజురోజుకు క్లిష్టపరిస్థితులు యెదుర్కొంటున్నాయి. పార్టీ యిదివరకు జేసిన కృషికంటె యెన్నోరెట్లు అధికమైన కృషిజేస్తేనేగాని, యిదివరకంటె అనేకరెట్లు బోల్షివిక్‌దీక్ష, ఓపికలతో పనిజేస్తేనేగాని పార్టీపై నేడున్న భారమైన బాధ్యతలు నిర్వహింపబడవు. పార్టీ యింతవరకు సాధించిన విజయాల నాధారంజేసుకొని బోల్షివిక్ ఆత్మవిశ్వాసంతో ముందుకు పోవాలి. పార్టీ ప్రయత్నాలు, కృషి యేమాత్రం సడలించడమన్నా యీరోజు పార్టీని ధ్వంసంజేయడమేగాక దేశాన్ని సర్వనాశనం జేయడం, నేడు పార్టీకార్యక్రమం ఒక్కటే దేశాన్ని రక్షించేది; దేశస్వాతంత్ర్యాన్ని సాధించేది. పార్టీకార్యక్రమాన్ని దేశభక్తులందరూ ముందుముందు తప్పక అంగీకరిస్తారు. వారు అంగీకరించి కార్యాచరణకు దిగేంతవరకూ ప్రతిక్షణం వృధాపోకుండా పార్టీనిరంతరకృషి జేయాలి. పార్టీపై నేడున్న భారమైన బాధ్యతలను ప్రతిపార్టీసభ్యుడూ గ్రహించి వాటిని జయప్రదంగా నిర్వహించుటకు యిదివరకన్న అనేకరెట్లు బోల్షివిక్ పట్టుదల, ఆత్మవిశ్వాసంతో పనిజేయాలి. తాత్కాలికంగా యెన్నికష్టాలను యెదుర్కొవలసివచ్చినా అంతిమవిజయాన్ని పార్టీ సాధించగల్గుతుంది. భారతదేశాన్ని ఫాసిస్టు వుపద్రవాన్నుండి, సామ్రాజ్యవాదుల బానిసత్వంనుండి విముక్తిగావించి దేశస్వాతంత్ర్యాన్ని సాధిస్తుంది.

